హరిః ఓం

శ్రీమతే రామానుజాయ నమః

# శ్రీమదాంధ్ర
# శ్రీనివాస రామాయణము

## యుద్ధకాండము




ర చ న :

శ్రీమాన్ శేషభట్టరు వేంకట శ్రీనివాసాచార్యులు

హరిః ఓం

శ్రీమతే రామానుజాయనమః

# శ్రీమదాంధ్ర
# శ్రీనివాస రామాయణము
## యుద్ధకాండము

రచన:

శ్రీమాన్ శేషభట్టరు వేంకట శ్రీనివాసాచార్యులు

తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో
యుద్ధకాండము ముద్రింపబడినది.



# శ్రీ వేంకటేశ్వరస్తుతి

సీ. శ్రీ శేషశైలాగ్ర శిఖరిపై వెలుఁగొందు తిరుమలనా దివ్య దేశమందు
వెంచేసియున్న శ్రీ వేంకటేశ ప్రభూ పరమార్థ చింతనాపరు సుధీయ
జన్మసార్థకముగా సఫలత్వమొంద శ్రీ రామాయణం బతిరమ్యముగను
రచియించియుంటి ముద్రణ కార్యమునకు నిమ్మర్థించి యుష్మత్సహాయమునను
తివిరి యుద్ధాఖ్యకాండ ముద్రించినాఁడ
మాన్యతములైన విబుధుల మన్ననలకు
పర్హాత ఘటింపజేయు దయార్ద్రహృదయ
శ్రియ సుహృద్దానవహృద్ధ్వాస శ్రీనివాస!

---

తిరుమల తిరుపతి దేవస్థానములవారి ఆర్థిక సహాయమున
ఈ గ్రంథము ముద్రింపబడినది.

# కవివంశావళి

సీ. కౌండిన్యగోత్ర సత్కవి శేషభట్టరు వేంకటాచార్య సద్విబుధవర్యు
పౌత్రుండ, కృష్ణార్య పండితవర్యుల దత్తాత్మజుండ, విద్వత్సఖుండ
ప్రబలపాండిత్య సంపన్నుండు శ్రీ నృసింహాచార్యవర్యు ప్రియాత్మజుండ
శ్రీరామ పదపద్మ సేవ్యుండ వేంకట శ్రీనివాస శుభాభిధానకవిని
ఘనతరామాయణోత్తమకావ్యములను రచనగావించి శ్రీరఘురామవిభున
కర్పణమొనర్చితిని జన్మసార్థకతకు కవి వరేణ్యుల మన్నన గాంతుగాక.

# పరిచయము

శ్రీరామచంద్రుని ప్రభుత్వకాలమున బ్రహ్మానుమతంబున వాల్మీకిమహర్షి తొలుత సంస్కృతభాషయందు యిరువది నాలుగువేల శ్లోకములతో శ్రీరామ చరిత్రమును రచించెను. దానిని వాల్మీకి యనుమతంబున శ్రీరామచంద్రుని పుత్రులగు కుశలవులు శ్రీరామచంద్రుడు పేరోలగంబున నుండ సభాస్థులెల్లరు హర్షానందములతో వినుచుండ గానమొనరించిరి.

శ్రీరామాయణమును ముముక్షుజనోపాధేయ గ్రంథముగ భారతీయులు పరిగ్రహించి పఠన, పారాయణ, పురాణ శ్రవణములను వివిధరూపముల నారాధించుచు తరించుచున్నారు. శ్రీరామాయణమున సుందరకాండము మిగుల రమ్యమై సుందరమై ప్రభావవంతమై పారాయణయోగమై భక్తులను యానంద పారవశ్యమున తమ్మునుతాము మరచునట్లు చేయుచూ, జీవాత్మ పరమాత్మ సంబంధములను చాటిచెప్పుచూ, జీవాత్మను పరమాత్మ యందైక్యమగుటకు మార్గము నేర్పరచుచున్నది. ఆధ్యాత్మచింతనాపరులకు సుందరకాండ పారాయణము మిక్కిలి శుభప్రదమై, కరతలామలకమై పారాయణ కాలముననే పారాయణ ప్రభావమును కనపరచుచు భక్తులకు భగవదనుభూతిని గలిగించు చున్నది.

శ్రీమదాంధ్ర శ్రీనివాసరామాయణ గ్రంథకర్తగారగు శేషభట్టరు వేంకట శ్రీనివాసాచార్యులవారి పూర్వీకులందరూ సంస్కృతాంధ్రములందు మహాపండితులగుటచే వారిది పండితవంశము. తండ్రిగారగు శ్రీనృసింహాచార్యుల వారు కుమారునకు చిన్నతనముననే శ్రీరామమంత్ర ముపదేశించి, శ్రీరామకథా ప్రాశస్త్యమును విపులముగా బోధించిరి. ఆ కారణమున శ్రీరామ కథయందు భక్త్యాదరములు దినదిన ప్రవర్ధమానములై వాల్మీకి విరచిత సంస్కృత రామాయణము ననేకపర్యాయములు చదివి హృద్గతమొనర్చుకొన్న కారణమున చిన్నతనమునుండియు రామాయణ పద్యరచన ప్రారంభమై శ్రీవాల్మీకి విరచితంబగు శ్రీరామాయణ ఘట్టములు మనోఫలకమందు ప్రతిబింబించుచుండ దానిననుసరించి యందందు స్వతంత్ర భావములు ప్రకటించుచూ కావ్యరచనయందు సాధ్యమైనంత వరకు దోషములురాకుండ శక్తివంచన లేకుండ శ్రీరామచరిత్రరచనవలననే తనకు ముక్తిలభించగలదను దృఢనిశ్చయముతో రచనను పూర్తి గావించిరి.

ఇట్టి మహా గ్రంథముల విషయమున మన యనుభవములతో పరిశీలించినచో కవియెచ్చటను ప్రచురణకర్తయైనట్లు గోచరించదు. నూటికోటికి ఒకరుండిన యుండవచ్చును.

శేషభట్టరు వేంకట శ్రీనివాసాచార్యులుగారు నాకు ఆత్మబంధువులగుటయే గాక, వారి యాధ్యాత్మిక చింతన, నిరంతర 'హరేరామ'స్మరణ నన్నెంతయో యలరించి వారి పాదసన్నిధికి చేర్చినది.

శ్రీరామాయణమును ముద్రించి, శాశ్వతమొనర్చి, ధన్యుడను కావలెనను తలంపుతో బాల, అయోధ్య కాండలను స్వయముగ అచ్చువేయించి, ఆంధ్రదేశ వ్యాప్తి గావించితిని. కారణాంతరములచే తక్కిన గ్రంథము ఆ సమయమున ముద్రణ జరుగలేదు.

కాలము గడచిపోవుచున్నది. శ్రీనివాసాచార్యులవారు శ్రీతిరుమల తిరుపతి దేవస్థానమువారి యార్థిక సహాయముతో సుందరకాండ ముద్రణ ప్రారంభింప సంకల్పించిరి. ముద్రణ కార్యక్రమము శ్రద్ధాసక్తులతోనూ, దీక్షతోడనూ నిర్వహించినగాని ఫలప్రదము కానేరదు. సుందరకాండ ముఖ్యనాయకుడైన శ్రీరామభక్త హనుమాన్ తమ కృపాకటాక్షములను నా పూర్వజన్మ సుకృత ఫలితముగా నాపై ప్రసరింపజేసి, శ్రీరామకార్యమును నిమిత్తమాత్రముగ నన్నుంచి వారే పూర్తిగావించుకొనిరి.

ఈ విధముగ సుందరకాండను శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారి ఆర్థిక సహాయముతో ముద్రించుట పూర్తియైనది.

అప్పటికి యీ మహాప్రబంధమున బాల, అయోధ్య, సుందరకాండములు ముద్రణ పూర్తి గావింపబడినది.

తదుపరి విజయవాడ నివాసియు, ఆధ్యాత్మికచింతనాపరుడును, శ్రీరామ చంద్రప్రభుభక్తులును అగు శ్రీకనమర్లపూడి సత్యనారాయణమూర్తియు, వారి కుటుంబసభ్యులును అత్యంత శ్రద్ధాసక్తులతో యీ మహాప్రబంధ ముద్రణమును

తమ జీవితధ్యేయముగ విశ్వసించి భక్తులనుండి విరాళములను శ్రద్ధాభక్తులతో ప్రోగుచేయుటయేగాక, తామును భూరివిరాళమొసంగి బాల, అయోధ్య, అరణ్య కిష్కింధ, సుందరకాండములను ద్వితీయముద్రణకార్యమును నిర్వహించుటకు నాకు అన్నివిధముల సహాయపడిరి ముద్రణకార్యక్రమము అంతవరకు పూర్తిగావింప బడినది

మిగిలినది యుద్ధకాండము. ఆర్థిక సహాయసంపద ఆగిపోయినది.

తిరుమల తిరుపతి దేవస్థానమువారిని యుద్ధకాండముద్రణార్థము ఆర్థిక సహాయమును అడుగగా వారందులకంగీకరించి 5000 రూపాయలు మంజూరు చేసిరి. అంతలో మా గురుదేవులు భౌతికకాయమును వదలి వైకుంఠమును అలంక రించిరి.

ఆచార్యదేవుల మనోరథమును పూర్తిగావింప నేనును, శ్రీ కనమర్లపూడి సత్యనారాయణమూర్తిగారును, ఆచార్యదేవుల దత్తపుత్రుడును శ్రీ తిరుమల తిరుపతి దేవస్థానమువారిని యర్థించితిమి.

వారు ఉదారబుద్ధితో గ్రాంటును విడుదలగావించిరి. దానితో మహా ప్రబంధమున యుద్ధకాండము ముద్రణ పూర్తిగావింపబడి పుస్తకరూపమునంది, ఆచార్యదేవులు మనోవాంఛితార్థము నెరవేరినది.

నాకీ యవకాశమును కలిగించి నా జన్మసాఫల్యమునందించిన శ్రీతిరుమల తిరుపతి వేంకటేశ్వరస్వామివారికి అనేక సహస్రప్రణామము లర్పించుచున్నాను.

కరుణాసముద్రులును, భక్తజనాభీష్ట ప్రదాతయునగు ప్రగడవరమంతు వేంచేసియున్న శ్రీరామచంద్రునకును, జగన్మాతయగు సీతమ్మతల్లికిని, శ్రీరామ భక్తహనుమాన్ వారికిని, మా ఆచార్యదేవులకును నా ప్రణామము లర్పించు చున్నాను.

యుద్ధకాండ ముద్రణార్థము ఆర్థికసహాయము నొసంగిన శ్రీతిరుమల తిరుపతి దేవస్థానముల నిర్వాహణాధికారులకు మరల కృతజ్ఞతాభివందనము లర్పించుకొను చున్నాము.

ఇట్లు
దూపాటి సీతారామానుజాచార్యులు
కనమర్లపూడి సత్యనారాయణ

శ్రీసీతారామచంద్రప్రభవేనమః

# శ్రీమదాంధ్ర శ్రీనివాస రామాయణము

## యుద్ధకాండము

శా. శ్రీరామాశుభనామ శ్రీరఘుకులక్షీరాబ్ధిసోమా మహా
కారుణ్యాదిగుణాభిరామ త్రిజగత్కళ్యాణధామా సునా
శీరాదిప్రముఖాఖిలామరజనస్తోమాభయోద్రిక్త దు
ర్వారోదగ్రనిశాచరప్రకరగర్వధ్వంస సంగ్రామ సీ
తారామా క్షితిభృల్లలామ తులసీదామా నమస్తే నమః.

క. శ్రీమద్రవివంశాంబుధిసోమా సీతాభిరామ శుభగుణధామా
కోమలమేఘశ్యామా రామా రాక్షసవిరామ రాజలలామా.

గీ. అవధరింపుము కుశలవులంత రామవిభుని పేరోలగంబున వేలజనులు
కౌతుకంబునవిన యుద్ధకాండకథను గానమొనరించిరధిక ధీకౌశలమున.

గీ. జనకజనుగనివచ్చిన చరితమును వచించుపవనజు నుడుల కచ్చెరువుదోప
వినిరఘూత్తము డెంతయు మనములోన హర్షమిగురొత్త మఱియు నిట్లని
వచించె.

—: సీతను గాంచివచ్చిన హనుమంతుని శ్రీరాముడు శ్లాఘించుట :—

గీ. వసుధ నేరికి సాధింపవశముగాని ప్రబలదుష్కరకార్యమిా పవనసుతుడు
బుద్ధిబలమున సాధింపబూనుటరయ నితనికీడగు సుగుణాఢ్యు డెందుగలడు.

గీ. వైనతేయుడు మరియునీవాయుసుతుడు గంధవహుడును ముప్వురేకంధిదాట
కడుసమర్థులు ధ్రువమిది కాకయొరులకలవియే వార్ధిలంఘింప నలతికెందు.

చ. అనుపమశౌర్యవీర్య మహిమాన్వితు డీహనుమంతుడుద్ధతిన్
వనధిదరించి దైత్యకులవల్లభుడేలు పురంబులోనికిం
జని సురసిద్ధసాధ్యసురసంతతికేని జయింపరాని దు
ర్దనుజుల జీరికింగొనక ధైర్యమునన్ విహరించె నేర్పునన్.

క. విలసత్పౌరుషమున భుజబలమున తేజోవిశేషప్రజ్ఞాధైర్యా
ద్యలఘు సుగుణముల పావనితులయగు మేటికార్యధుర్యుడుగలడే.

వ. అని పెక్కుతెరంగుల గీర్తించుచు శ్రీరామచంద్రుడు లక్ష్మణునితో నిట్లనియె. లక్ష్మణా వాయుభట్టారకున కౌరసపుత్రుండైన హనుమంతునితో సమాన బలవిక్రమతేజోవిశిష్టుండొక్కరుడు లేడని నాయాశయము. ఏలనన శతయోజన విస్తీర్ణంబైన సముద్రమును లంఘించి దుష్టరాక్షసభూయిష్టంబగు లంకలో నిర్భయుండై సంచరించి సీతను సందర్శించి మనక్షేమాదులామె కెరిగించి ధైర్యోక్తులతో నామెనూరడించి రక్షోవీరుల ననేకులహతమార్చి లంకదహించి విజయోత్సాహముతో నేతెంచి మనకీశుభవార్త నెరింగింపగలిగె గావున నిజముగా సుగ్రీవునకితడుత్తమభృత్యుండని ఖ్యాతిగడించె.

గీ. స్వామిచేతనియుక్తుడై సర్వగతుల నధికదుష్కరమైనకార్యముల బలిమి
నిర్వహించెడు భృత్యుని నీతివిదులు పేర్మినుడువుదురుత్తమ భృత్యుడనుచు.

చ. కరమతిదుష్కరంబైన కార్యమునం బతిచేనియుక్తుడై
స్థిరమతి నేర్పునన్ మిగుల ధీరతదీర్చెడు ధీరుడుత్తముం
డరుదుగ నిర్ణయించుపని నల్లనదీర్చెడువాడు మధ్యముం
డురువడిదీర్పలేని నరుడుర్వర దానధముండనాబడున్.

క. పరమోపకారియగు యీహరివీరునివలననగాదె యంతరమును సు
స్థిరముగ బ్రతుకంగలిగితి మిరవొందగ నితనిఋణము నెవ్విధిదీర్తున్.

వ. ఇట్లుదాశరథి వానరసభామధ్యమున హనుమంతుని ప్రభావమును బహువిధముల గొనియాడి ధైర్యోత్సాహములు మనంబున బెనగొన హనుమంతుని చెంగటికిచేరందిగిచి నిజహస్తాబ్జంబును యతనియంసతలంబున నునిచి మెల్లన నతనితో నిట్లనియె. వాయునందనా నీవొనర్చిన మహోపకారమున కీధరాతలంబునకంతటికి పట్టభద్రునిగావించినను నీఋణమునుండి విముక్తుడను కాజాలను, రిక్తుడనగు నేనియ్యెడ నాచరింపదగు బహుమానంబిదియేసుమా యనినుడువుచు సకలలోకరక్షణీయంబులగు బాహుదండంబులుసాచి

గీ. హర్షపులకిత సర్వాంగుండగుచు రామచంద్రుడతిలోకబహుధైర్యసాహసమున
నేగుదెంచిన హనుమంతు నెలమిగాఢముగ సమాలింగన మొనర్చె
జగములుబ్బ.

వ. అనంతరంబ సుగ్రీవప్రముఖులైన సకలవానరవర్యులత్యంతహర్షస్వాంతులైరి వారలసంభాషణంబులాలకించుచుండ నంత శ్రీరామచంద్రుడు సుగ్రీవుని ముఖంబవలోకించి వెండియు తనమనంబున నుదయించిన సంశయవిచారములతో నిట్లనియె.

ఉ. సీతను గాంచివచ్చుట విశేషముదావహమయ్యెగాని యే
రీతిగ సీకవిక్రమముఖులెవ్విధి వార్ధిదరింతురంచు మ
చ్చేతమునందు తీవ్రమగు చింతరగుల్కొనెగాన నింకనీ
వేతగుభంగి యుక్తముగ నెంతయుయోచన జేయుమిత్తరిన్.

— సీతావియోగ ఖిన దుఃఖించు శ్రీరాముని సుగ్రీవుడూరడించుట —

వ. ఇట్లుమిగుల దుఃఖవ్యాకులితచిత్తుండై శ్రీరాముడు భాషించుటయు మిత్ర
గుణసంపన్నుండగు సుగ్రీవుడు శ్రీరామునకు దుఃఖోపశమన వాక్యముల
నిట్లనియె.

శా. ఏలా మీరిటులం దపించెదరు మీహృత్పంకజంబందుం
జాలుంజాలును మీపరాక్రమము దోస్సామర్థ్యమల్పంబొకో
మేలయ్యెంబగవానిజాడ తెలసెన్ మిత్రాన్వయగ్రామణీ
కాలాతిక్రమమేల దెత్తుమిక మీకాంతాశిరోరత్నమున్.

వ. శ్రీరామచంద్రా నీవింకదైన్యమునువిడనాడి ధైర్యోత్సాహయుతవై నిలిచినచో
సర్వకార్యములు మేమే నిర్వహింపగలము. విచారమునకిది సమయముకాదు
ఏలనన అవధరింపుడు.

గీ. అధికశోకపరీతాత్ముడైనవాని కరయ నుత్సాహరహితున కమితదీను
డైనపురుషున కెల్లెడనాపదలును బొరయు సర్వార్థములు చెడిపోవుగాన.

ఉ. శ్రీరఘురామచంద్ర మదిజింతిలనేల భవాదృశుల్ కడున్
ధీరతనిల్చి శాత్రవతతిన్ భయదాహవరంగమందు దు
ర్వార పరాక్రమస్ఫురణ పౌరుషమొప్పవధించి సద్యశో
దారుడవై ప్రకాశిలెదు తద్దయునీకొరులీడె ధారుణిన్.

గీ. సర్వశాస్త్రార్థ తత్వవిశారదుడవు ప్రబలప్రజ్ఞాన్వితుండవు పార్థివేంద్ర
విక్లబంబేల వనచరవిరవరుల సాయమున జంపుదుఖలనిశాచరులను.

వ. ఈ ప్లవంగముఖ్యులు మిగులసమర్థులు కామరూపధరులు నీకుప్రీతిగలిగించుచు
నుత్సాహముతో నగ్నిలోనైన దుముకుటకు సహితము సంసిద్ధముగానున్నారు
గావున సముద్రముపై సేతునిర్మాణాది కార్యకలాపములతో సముద్రమును
లంఘించి సురాసురులడ్డగించినను లంకనుజయించిరాగలుగుదురు గావుననీవు
ధైర్యమవలంబించి వానరసహాయముతో లంకజొచ్చి శత్రుసంహారమొనరి,

సీతను పరిగ్రహింపగలవు సర్వప్రకారముల మనకు విజయసూచకములైన శుభశకునంబులనేకములు గోచరించుచున్నవి గావున మనమింక ప్రయాణసన్నాహం బొనరించుటుచితంబని పలుకుసుగ్రీవుని భావణంబుల నంగీకరించి శ్రీరామచంద్రుడు హనుమంతునిదిక్కు మొగంబై యిట్లనియె. వాయునందనా సముద్రలంఘనమునకు నాకుతోచినయుపాయమును వచించెద నాకర్ణింపుము.

గీ. తపముచేసైన సేతుబంధనమునైన సింధుజలముల నింకింపజేసియైన
సర్వవిధముల మనకపిసైన్యములును జలనిధిదరింపగలవని తలతునాత్మ.

వ. అని వచించి వెండియుహనుమంతునితో నిట్లనియె.

—. శ్రీరాముడు హనుమంతుని లంకాపుర వృత్తాంతమడుగుట .—

ఉ. వానరవర్య దైత్యకులవల్లభుడేలెడు లంకలోపలన్
సైనికవర్గమెంత బలసంపదలెట్టివి దుర్గగోపుర
స్థానములేక్రియందనరు తత్పురిఖేయము లెట్లుచొప్పడున్
వానినిసర్వమున్ దెలియబల్కుము నేవినవుత్సహించితిన్.

గీ. అనుచుబల్కుచు సూర్యకులాబ్ధిచంద్రుడైన శ్రీరామవిభునితో ననిలతనయు
డంజలిఘటించి లంకాపురావతంస విషయములనెల్ల నిట్లనివిన్నవించె.

ఉ. ఆ లంకానగరీవిశేషములవిూరాలింపుడో రామభూ
పాలాగ్రేసర తుష్టపుష్టజనసంబాధంబు హేమజ్వల
చ్ఛైలాభోన్నతరత్నచిత్రిత విశిష్టస్యందనాందోళికా
జాలంబుద్ధతగంధసింధుర ఖరాశ్వవ్యాఘ్రభూయిష్టమున్.

సీ. కాంచనబహురత్న ఖచితమహోన్నత ప్రాసాదసౌధ వప్రప్రశస్త
మందిరసుందర మంటపదివ్యవిమాన విచిత్రహర్మ్యప్రచయము
వరచమూనికేతన పటుదృఢప్రాకార బంధురదుర్గమద్వారసమితి
పురరక్షణకు కోటబురుజులస్థిరముగా నిల్పియుంచిన శతఘ్నీప్రకరము
గలిగిపురినలుగడల నక్రగ్రహాదివివిధజలజంతుసహితగంభీరవారి
పూరితవిశాలపరిఖాప్రపూర్ణ మగుచు దనరుదశకంధరుని రాజధానిలంక.

వ. శ్రీరామచంద్రా! ఆ లంకాపట్టణసౌందర్యమును కనులారచూచితీరవలయును గానివర్ణింపనలవిగాదు. సముద్రమధ్యమున నారోహణమునకు దుస్సాధ్యమగు త్రికూటాచలశిఖరమున విశాలముగా దేవదానవులకునసాతము దుష్ప్రవేశంబైన దేవతానగరముతో తుల్యంబైన తత్పురవరమునకు నలువైపుల గునాలుద్వారములుగలవు పూర్వద్వారమున భీమవిక్రములగుపదివేలరాక్షసు

లును దక్షిణద్వారమున మహాబలపరాక్రమోపేతులగు లక్షసైనికులును పశ్చిమద్వారమున రెండు లక్షల సైనికులును ఉత్తరద్వారమున దుర్వార పరాక్రమోపేతులగు కోట్లసంఖ్యగల దుర్జయులగు రాక్షససైనికులును పురమధ్యమున నధికశూరులగు కోట్లకొలది రాక్షసులు రథగజాశ్వారోహకులై శతఘ్నిప్రముఖనానావిధయంత్రాది వివిధశస్త్రాస్త్రసాధనోపేతులై కాపాడుచుండుదురు. అట్టిదుస్సాధ్యంబగు లంకాపట్టణమునను నే ననాయాసముగా జొచ్చి.

చ. పరిఘులమీాదిమార్గముల భగ్న మొనర్చితి గుండ్లతోడ త
త్పరిఘులపూడ్చివైచితి ధ్వజంబునవాల్గిటనొక్కపాలు భీ
కరులగు దైత్యసైనికుల కౌతుకమొప్పవధించి దైత్యరా
ట్పురవరమున్ దహించితి నప్రూర్వవుకోటల నుగ్గుజేసితిన్.

గీ. ఏయుపాయంబుచేనైన నీపయోధి నతులితపరాక్రమోపేతు లైనసకల
కపివరేణ్యులు లంఘింపగలరుగాన చిత్తమునసంశయంబిట్లు చెందనేల.

చ. అతిబలశాలులైన ద్వివిదాంగదమైందనలాది వానర
ప్రతతి పయోధినీది చని పర్వతకాననవప్రగోపురా
న్వితమగులంక నెల్లకడునేర్పుమెయిం బెకలించితెత్తు ర
ద్భుతముగ సైన్యనాథులకు బొల్పుగనాజ్ఞనొసంగుడిమ్ములన్.

వ. మహాత్మా! యింకప్రయాణమునకు సుముహూర్తమును నిశ్చయించి దండయాత్రసాగింపనాజ్ఞనొసంగుడనుటయు శ్రీరాముడు సుగ్రీవాదులతోనిట్లనియె. సుగ్రీవా మనప్రయాణమునకిది మంచిసమయమే ఏలనన సూర్యుడిప్పుడు సూటిగా మధ్యంగతుడై యున్నవాడు గావుననిదియభిజిన్ముహూర్తము విజయ యను యీ ముహూర్తమున మనముప్రయాణమొనర్చినచో నవస్యము మనకుకార్యసిద్ధికాగలదు. నేడుత్తరాఫల్గునీనక్షత్రము ప్రయాణమున కెంతయో యోగ్యమైయున్నది. కావున రావణుడు సీతనుగొనిపోయియెచట డాగినను జీవింపనేరడు దీనికనుగుణ్యముగా నుత్తమమైనశకునములెన్నియో పొడసూపుచున్నవి అందుచే రావణుని రణరంగమున హతమార్చి సీతనుగొని వచ్చెదము మరియు నా కుడికన్నుపైభాగము యదురుచున్నది ఈ కారణముల వలనను మనకువిజయముసమీాపమునను న్నట్లు స్ఫురించుచున్నదని యిట్లు భాషించు శ్రీరామునిభాషణములనెల్లరు శ్లాఘించిరనంతరంబ తమదండయాత్రాప్రయాణవిధానమునుగురించిశ్రీరాముడు సుగ్రీవాదిప్రధానపురుషునతో నిట్లనియె. మనకిప్పుడుమార్గమందు యాహారవస్తువులు నీరు, మొదలగు

వానియందు శత్రువులవలనవివ్రయోగాది యుక్తవాదులుగలుగకుండు విధమున మార్గాన్వేషణసేయుచు కొంతిసైన్యముతో నిలుడుముందుగాజను చుండవలయు పల్లములయందును జలదుర్గములయందును శత్రువులుపొంచి యుందురు గాన నాయా స్థలముల బరిశోధించుచు కొందరరుగవలయు మరియును.

సీ. సారవిహీనమౌ స్వల్పసేనను పురసంరక్షణార్థ ముంచంగవలయు
బలయుతులగు చమూపతులు మహాసంఖ్య సైన్యాళితోముందు జనగవలయు
జెలువొప్ప సేన దక్షిణపార్శ్వమును ఋషభుడుకాపాడుచుపోవవలయు
గంధేభసదృశుడీగంధమాదనుడు సైన్యమునుత్తరాగ్రిశగాచు చరుగవలయు
జిష్ణుడైరానతముసధిష్టించి చనెడుకరణి నేవాయుసుతుభుజస్కంధ మెక్కి
కపికులశ్రేష్ఠులకుప్రీతిగడలుకొనగ సైన్యమధ్యంబునందుండి చనెదగాక.

గీ. అంతక సమానబలవిక్రమాఢ్యుడైన నాయనుగుతమ్ముడీ వాలినందనుని భు
జంబుపైనధిష్టించి చనెడుగాక సామజమునెక్కిచను ధనేశ్వరునిపగిది.

గీ. సత్వసంతులైన జాంబవంతసుషేణ వేగదర్శియును కపిత్రయంబు
నీకువెనుకనిల్చి నిపుణత రక్షణసేయవలయు కుక్షి క్షేమముగను.

వ. అని శ్రీరామచంద్రుడు నిర్ణయింప తదాజ్ఞానుసారముగా.

—: శ్రీరాముడు వానరులతో లంకకు ప్రయాణమగుట :—

గీ. ఆహరిప్రవీరు లాహవోత్సాహులై శైలములకు వృక్షశాఖలకును
బరువులిడుచుజనిరి బలదర్పితాంగులై సింహగర్జనములు సేయుచెలమి.

సీ. పవనజుభుజపీఠిపైనెక్కి శ్రీరామభద్రుండు ముందుగా పయనమయ్యె
మించిసుగ్రీవసౌమిత్రులిర్వురు నిరుగడలందు కడువడినడచుచుండ
జయజయధ్వానముల్ సలుపుచుసంతోషభరితులై సైన్యముల్ పరువులిడుచు
వినువీధికెగురుచు వృక్షముల్ బ్రాకుచు తేనియల్ద్రావుచు తృప్తిచీర
బహువిధాత్యంత మాధుర్యఫలచయమును దినుచు నదులసరోవర తీర్థములను
గ్రోలుచు నదీజలంబుల గ్రుంకులిడుచు కోట్లకపిసేన శ్రీరాముగొలిచినడువ.

వ. వానరవాహిని ధైర్యోత్సాహములతో యథేచ్ఛగా దక్షిణదిశాభిముఖులై మహావేగముగా బోవుచున్న సమయమున శ్రీరాముని సన్నిధానమున నొండొరులు మిగిలి సగర్వముగా నిట్లనిరి.

గీ. రావణునిజంపివైతుము రక్కసులను హతముగావింతుమేనుసేనసుచు ప్లవగ
సత్తములు శౌర్యమున రామచంద్రునికడ బీరములనాడుచుండిరి పౌరుషముల.

సీ. బహువానరులతోడ పథముశోధించుచు పొందుగానీలుండు ముందునడువ
పదికోట్లసేనతో ప్లవగవాహినినల్ల చక్కగానరయుచు శతవలిజన
శతకోటివాహినీసహితుడై పనసుండు పార్శ్వభాగమునుకాపాడుచరుగ
జాంబవంతుడు ఋక్షసైన్యాళితోడ సుగ్రీవునిపిరుదరక్షించుచేగ
రామలక్ష్మణులును కపిరాజసింహు డమ్మహాకపిసైన్యమధ్యమునసరుగ
దధిముఖాదులు పురికొల్పదక్షిణాభిముఖముగా జనుచుండిరమోఘశక్తి.

వ. శకునశాస్త్రప్రపండితుండగు లక్ష్మణుడు అంగదుబుజస్కంధ మధిష్ఠించి జనుచు పురోభాగంబున దృశ్యంబగుశకునముల వీక్షించుచు శ్రీరామచంద్రునితో నిట్లనియె. రామచంద్రా మార్గమున మనకనేక శుభశకునములు పొడసూపుచున్నవి గావున వీటికిఫలితాంశము మనకుముఖ్యముగా విజయము సంప్రాప్తింపగలదు యెట్లనగా.

ఉ. జానకినిన్ హరించిన నిశాచరుబట్టి హతంబొనర్చి నీ
పూనికనిర్వహించి వెసబోయెదవంగనతో నయోధ్యకున్
భానుకులావతంసము సభస్థలి దిక్తటులన్ వసుంధరన్
గానగనయ్యె పెక్కుజయకారణభూతములౌ నిమిత్తముల్.

సీ. పరిమళశీతల పవనాంకురంబులు వీచుచున్నవి సైన్యవితతిపైన
మంజులవిస్పష్ట మధురస్వనంబుల కూయదొడంగె పక్షులుమృగములు
కడుప్రసన్నంబులై గాలుచున్నవిదిశల్ దినమణిచక్కగా దీప్తినలరె
విమలప్రదీప్తితో వెలుగుచుభార్గవుం డెలమినీకుపిరుంద నలరుచుండె
పరమతేజస్వులైన సప్తర్షులోనర ధ్రువునిమండలమునుజుట్టి మార్గమునను
వచ్చుచున్నాడు రాజర్షివర్యుడౌ త్రిశంకుడు పురోహితునితోడ చపలనొప్పి.

వ. శ్రీరామచంద్రా మనకవశ్యము విజయము సంప్రాప్తించగలదు యేలనన ఇక్ష్వాకుకులప్రసూతులమగు మనకుముఖ్యమగు విశాఖానక్షత్రము క్రూరగ్రహసంబంధములేక నిర్మలముగా ప్రకాశించుచున్నది రాక్షసవీరులకుముఖ్యమగు నైరుతిదేవతాత్మకమైన మూలానక్షత్రము దుష్టగ్రహమగు ధూమకేతువుచే నాక్రమింపబడి మిగుల తపించుచున్నది కావున రాక్షసగణమున

కెల్ల వినాశముత్పదు యేలనన మృత్యుసన్నిహితులగు వారినక్షత్రము క్రూరగ్రహములచే పీడింపబడుచుండును అదియునుంగాక సరోవరముల జలములు ప్రసన్నములై మధురములగానున్నవి. వనములు ఫలకుసుమభరితములై మనోహరముగా ప్రకాశించుచున్నవి ఋతుసమయానుకూలములై వృక్షములం చక్కగాపుష్పించి పరిమళముల వెదజల్లుచున్నవి తారకాసురసంహార కాలమున దేవసేన ప్రకాశించినటుల మనవానర ఋక్ష గోలాంగూల సైన్యములత్యుత్సాహముతో తేజరిల్లుచున్నవిగావున మనకన్ని విధముల శుభచిహ్నములే సూచించుచున్నవి తత్కారణమున నీవిప్పుడు సంతోషముతో నుండవలయునని హెచ్చరించుచుండె తత్సమయమున.

క. సునిశితనఖదంష్ట్రాయుధు లనుపమబలవిక్రమాఢ్యులగు హరివీరుల్
చనునెడ జరణోద్ధిత రజమెనసె నభోపథమునెల్ల నినమండలమున్.

చ. అతులవిచిత్రనగాగతుల నామహనీయప్లవంగవాహినుల్
చతురతతో స్వకీయబల శౌర్యవిశేషములుగ్గడించుచుం
గుతుకమెలర్ప శైలములకున్ వడిబ్రాకుచు నార్చుచున్ మహో
ద్ధతి జనుచుండిరాకసము ధారుణినెల్లెడ నాక్రమించుచున్.

వ. ఇట్లు కపిసైన్యంబులు రెండవ సముద్రఘోషంబుననుకరించుచు గిరిగుహాలు మార్మోయ బిట్టార్చుచు క్రూరమృగముల బ్రహరించుచు వృక్షంబుల బెరుకుచు ద్రోణప్రమాణంబులైన తేనెపెరల దుల్చి దావుచు సరోవరంబుల నీదుచు నొండొరులు కలహించుచు నానావిధఫలంబుల భుజించుచు కిలకిలారావంబులుసేయుచురాత్రింబవళ్ళుబహుయోజనంబుల దూరముప్రయాణము సేయుచు నందందు విశ్రమించుచు సహ్యపర్వత ప్రాంతకాంతారములజొచ్చి యటనుండి మెల్లన మలయపర్వతారణ్యమున వివిధఫలభరిత తరులతామండపంబుల విశ్రమించుచు నానావిధ పుష్పసౌరభభరిత శీతలవాతపోత సుఖస్పర్శంబుననుభవించుచు మకరందరసాస్వాదనానంద ఝుంకృతపుష్పంధయ ఝుంకారంబులాకర్ణించుచు వివిధవిచిత్ర ధాతుమండిత శైలసానువుల విహరించుచు మెల్లన మహేంద్రనగంబునకుచేరిన శ్రీరామచంద్రుడు భయంకర ధ్వనులతో నుత్తుంగతరంగసంఘర్షణ సమాకులంబై కమఠకచ్ఛప భుజంగ మహామీన నక్రగ్రహాది మహోగ్ర జలజంతు సంతతులతో భూమ్యంతరిక్షములపర్యంతము వ్యాప్తంబై గంభీరవారిపూరిత జలార్ణవంబునుగని సుగ్రీవునితో నిట్లనియె.

—. శ్రీరామాదులు సముద్రతీరమునకు చేరుట :—

మ. అవలీలంజను దేరగల్గితిమి యీయాయంభోనిధీతీరమున్
దివికింభూమికి నేకమై కడుభయోద్విగ్నంబుగా నొప్పెనో
ప్లవగాధీశ్వర యింకదీని తరణోపాయంబు చింతింపగా
తవిలెంబూర్వపుచింత వెండియును కర్తవ్యంబునూహింపుమా.

క. జలనిధితటమున సేనల నిలిపి ప్రియంబెసగ వారినిధిలంఘనకున్
సులభోపాయంబరయుడు జలమునశత్రువులనెరిగి చరియింపుడికన్.

వ. సుగ్రీవుడు రామానుమతంబున సైన్యముల వేర్వేరవిభజించి నాలుగుపక్కల
నిలువుమనుటయు రెండవసముద్రమోయన సల్లకిల్లుసేనల నీలుడు తత్తదు
చితస్థలంబుల నిలువనియమించె నయ్యవసరంబున.

సీ. వనచరవీరు లావనరాశియొద్దకడుసంభ్రమంబున గాంచిరంత
యుప్పరమంటు మహోర్మిమాలలతోడ ప్రవిమలశీకర ప్రతతితోడ
పెరిగిదిబ్బలుదేరు ఫేనరాసులతోడ సైకతవేదికాస్థలులతోడ
నత్యంతభయద మహావర్తములతోడ పొగడొందుపవడంపుపొదలతోడ
కమఠకచ్ఛపభుజగనక్రప్రముఖ్య జలచరావళితోనిండి సంతతప్ర
చండవేగంబుతోడరసాతలమున కంటిగంభీరవాఃపూర్ణమై వెలుంగ.

వ. అంతశ్రీరామచంద్రుడు సీతస్మరణకువచ్చి భార్యావియోగదుఃఖమున చింతిం
చుచు లక్ష్మణునితో నిట్లనియె.

శా. హానాథా యనుదుష్టదైత్యుడతిధైర్యస్ఫూర్తి గొంపోవగా
బూనెన్ పీనివధించి ప్రోవమనుచేభూపుత్రి వాపోయెనా
దీనాలాపములస్మదీయమదిలో తెల్లంబుగా దుర్విషా
పానుం డార్తిదపించువాని విధమత్యంతార్తితో ప్రుగ్గితిన్.

గీ. ప్రియవియోగంధనముతోడ పెచ్చుపెరిగి ప్రబలచింతార్చిమాలతో పవలురేయి
యెడతెరపిలేక మదనాగ్ని యేచి కడుదహించె సౌమిత్రి తతనువునేనేమిసేతు.

ఉ. చందనగంధి చారురద చంపకపుష్పవర్ణ పూ
ర్ణేందునిభాస్య నాదుహృదయేశ్వరి బింబఫలాధరోష్ఠి యిం
దిందిరవేణి దివ్యమణిదీపితకుండలగండభాగ యే
చందమునం గృశించుచు విషాదపరంపరలందపించెనో.

సీ. ననుగోరివరియించి జనకజ క్రూరదానవులమధ్యమున ననాథవోలె
రక్షకుఁగానక రాత్రింబవళ్ళు యేతెన్నున గడుపుచు నున్నదో కో
శరదభ్రమాలికా సమితిమధ్యమునుండి వెలికరుదెంచు రేవెల్గుకరణి
కర్కశులైన రక్కసిమూకలోనుండివై దేహియిటకెట్లువచ్చునో కో
చతుర సహజకృశాంగియౌ జనకతనయ దేశకాలవిపర్యయ స్థితులవలన
మరియు ననశనదీక్షల మహితదుఃఖభారమున జిక్కిపోవకెవ్వగిదినలరు.

సీ. రావణాసురునియురంబల్ల నంజీల్చి యెవుడు దెత్తునో సీతనింపుగదుర
నాకంఠసీమజానకికౌఁగలించియానందబాష్పంబులేనాడువిడుచు
మలినాంశుకముబాయుమాడ్కిమత్ప్రేయసివిప్రయోగవ్యథ విడుచు నెపుడో
ప్రబలాత్రిగుండు సద్భార్యనురక్షించి హర్షాబ్ధిలోనోలలాడు నెన్న
డనుచు శ్రీరామచంద్రుఁ డయ్యంబునిధితటంబునందున నతివనటందపింప
భానుబింబంబురుచిమాసి పశ్చిమాబ్ధిగ్రుంకె శ్రీరామువగగాంచి ఖిన్నుఁడగుచు.

వ. ఇట్లుదుఃఖాకులితచిత్తుండగు శ్రీరాముని సౌమిత్రి సాంత్వనవచనంబుల నోదార్చననంతరంబ వారలుసాయంసంధ్యోపాసనాదుల సమాప్తినొందించి స్కంధావారముననత్యంతజాగ్రత్తగా నిల్చియుండిరి. అటలంకాపురంబున రావణుడు సభామండపంబునకేతెంచి కొలువుండి హనుమంతుడొనర్చినయద్భుతకర్మంబున కచ్చెరువొంది సభాసదులనెల్లర నవలోకించి యిట్లనియె.

—: రావణుఁడు రాక్షసులతో యోచించుట :—

ఉ. అక్కట గాంచినారలె నిరాయుధుఁడై కడుసాహసంబుతో
నొక్కవనాటమాత్రుడు మహోదధినే డ్డరదాటి లంకలో
రక్కసులన్ వధించి రఘురామునిభార్యనుగాంచి లంకపే
రుక్కునగాల్చిపోవుట మహాకడుయద్భుతమై దనర్చెడున్.

ఉ. ఇట్టివిపత్తు చేకూరిన హేతువునన్ మనకెల్ల భంగులం
బట్టణముం బటిష్ఠమగు పద్ధతి రక్షణసేయుఁడిమ్ములన్
జెట్టిదులైన భీషణకపిప్రముఖావళితోడ రాముఁ డి
ప్పట్టున దండయాత్రనలుపన్ మనపైకరుదేరజాలెడున్.

వ. అనివచింప రాక్షసులలోముఖ్యులుకొందరు రావణునితోనిట్లనిరి. రాక్షసరాజా నీవుమహేంద్ర వరుణ కుబేరాది దిక్పతులనెల్ల నకుంఠితసామర్థ్యమున నిర్జింప గలిగితివి తక్కినదేవతాప్రముఖులతో గూడినసమస్తలోకములు నీ పరాక్రమాతిశయమునకు భయాకులత జెందుచున్నవి. అట్టికారణమున మనుష్య

మాత్రులగు రామలక్ష్మణులుగాని పశుప్రాయులగువానరులుగాని నీకొక లెక్కలోనివాండ్రుకారు గావున నీవంతగా నంతాప మొందనేల మనరాక్షస సైన్యములు మహాపరాక్రమోపేతులు అదియట్లుండ నీపుత్రుండగుఇంద్రజిత్తుని ప్రభావమును నుగ్గడింపశక్యమా మహేశ్వరుని గురించి గొప్పయాగ మొనర్చిలోకమున నెవ్వరుపొందలేని వరములసాధింపగలిగె దేవేంద్రునికట్టి లంకకుగొనివచ్చి బ్రహ్మానుమతంబున నతనినివిడిచిపుచ్చె అట్టిశూరశిఖామణి యగు యింద్రజిత్తు నీకునహాయుండై యుండ నిన్నుధిక్కరింప నెవ్వడోపు నీవిప్పుడతని కనుజ్ఞ నొసంగితివేని నిముసమాత్రమున వానరసైన్యములతో శ్రీరాముని లక్ష్మణుని హతమార్చి రాగలడు అని ప్రసంగించుచుండ నంత ప్రహస్తుండను సేనానాయకుండంజలిబద్ధుండై రావణునితో నిట్లనియె.

గీ. దానవపతంగయక్షగంధర్వనాగదేవతాముఖ్యులేనిన్నుధిక్కరింప
జాలరనభీషణంబగు నమరతలము లందువనచరులెంత నీకసురనాథా.

వ. అంతదుర్ముఖుండిట్లనియె.

ఉ. ఓరువవచ్చునే ప్లవగుడొక్కరు డుక్కివు డిందుజొచ్చి దు
ర్వారమనోద్ధతిం బురవరంబుదహించి దురాశయంబుతో
బోరవధించెగొందరిని భూస్థలిడాగిన మింటికేగినం
గ్రూరుని వానిద్రుంతునిక గొంకక సేనొకరుండ ధీరతన్.

వ. అంత వజ్రదంష్ట్రుండుద్రేకముతో నిట్లనియె.

క. రామునిసుగ్రీవునినుఱి సౌమిత్రినినకలప్లవగసత్తములన్ సం
గ్రామమున సేనొకండనె భీమబలోన్నతి వధించి వేగమవత్తున్.

వ. పదంపడి కుంభకర్ణపుత్రుండైన నికుంభవజ్రహనుప్రహస్తసుప్తఘ్న మహాపార్శ్వ మహోదర విరూపాక్ష ధూమ్రాక్ష యింద్రజిత్ప్రముఖులు కొందరు తమ తమప్రభావములుగ్గడించుచు ప్రగల్భములప్రసంగించుచుండ విని విభీషణుండు వినయపూర్వకముగా రావణునితో నిట్లనియె.

— విభీషణుడు రావణునకు హితంబుపదేశించుట —

వ. సహోదరా ! నా విన్నపంబవధరింపుడు.

గీ. సామ దాన భేదంబుల సాధ్యపడని కార్యసాధనమునకు విక్రమముజూపు
వలయు ననుచు వచింతురు ప్రాజ్ఞులెందు గానశూరతకిదితరిగాదు సుమ్ము.

క. దైవోపహతుని మత్తుని వావిరిబలహీనుడగుచు వచ్చినవైరిన్
భావమున పరీక్షించియు కేవల విక్రమము జూప గెలుచుంబగరన్.

గీ. అప్రమత్తుని జయశీలు నతులశౌర్యు విజితరోషు దురాధర్షు విక్రమాఢ్యు
రాముధీరత మెరసితిరస్కరింప దలచుచున్నారలిది వెర్రితనముగాదే.

గీ. నదనదీభర్తయగు మహార్ణవము నొక్కప్లవగమాత్రుండు లంఘించి
పటుపరాక్రమమున
దుష్కరమైన కర్మమునొనర్చె గాననూహింప నిదియు నక్కజముగాదె.

వ. సహోదరా ! నాహికంబొకటవధరింపుము లోకమునందెట్టి బలాధికుడైనను స్వీయపరకీయ తేజోబలపరాక్రమాదుల యోచింపక స్వేచ్ఛగా ప్రసంగించు టంత యుచితముగాదు. యేలనన శ్రీరాముని ప్రభావము బాల్యాత్ప్రభృతి మిగుల నద్భుతముగా ప్రకాశించె ననుటయు లోకవిదితమే. శ్రీరాముడు బాల్యముననే విశ్వామిత్రుయజ్ఞ విధ్వంసకులగు సుబాహుప్రముఖులగు రాక్షసుల నెందరినో హతమార్చె. దండకారణ్యవాసులైన ఖరదూషణాది పదునాలుగువేల రాక్షసుల నొక్కడే ముహూర్తకాలమున సంహరింపగలిగె మాయామృగరూపియగు మారీచుని బరిమార్చె. వాలి పరాక్రమము మన కనుభవమేగదా. అట్టి వాలినొక్కమ్మున నంతమొందించె వానర సామ్రాజ్యమునకు సుగ్రీవుని పట్టభద్రుని గావించె. అతని యనుచరులగు కోట్ల కొలది వానరుల సహాయముతో మనపైకి దండెత్తివచ్చి శ్రీరాముడు లంకను నాశనముగావింపనున్నవాడు హనుమయను వానరుడొక్కడే. లంకలో నిరంకుశముగా వేలసంఖ్య శూరులబిల్కుమార్చిన విషయము మనకెల్లర కనుభవమే యిట్టి కారణములబట్టి శ్రీరాముని ప్రభావ మమోఘమని విదితమగుచున్నది. అట్టి శ్రీరాముని భార్యను జనస్థానమునుండి చౌర్యవృత్తితో నపహరించి కొనితెచ్చుట చాలా ప్రమాదకరమైన విషయము సీతమహాపతివ్రతాశిరోమణి అట్టి పరమపావని తత్ప్రభావమున మనకు శ్రేయము కలుగనేరదు. అదియునుగాక.

గీ. ఆయువుక్షయించు పరదారాభిగమన కారణంబున నత్యంతకలుషమబ్బు
నర్థము నశించు నద్యశంబడగిపోవు నవనిబహుబాధలకు హేతువగునుసూవే.

ఉత్సాహావృత్తము :

వినుము దానవేంద్రమనకు నెక్కసంపుభీతిత
జ్జనకపుత్రిమూలమునను సంభవించె నేడు గా

వున పరిత్యజింపవలయు పుణ్యశీల నింకనిం
దునిచికొంటకాదు కలహ మెుప్ప దెంత మాత్రమున్.

వ. విభీషణుండిట్లు అంతరవిన సుపన్యసించి వెండియు రావణుని దిక్కు మొగంబై యిట్లనియె.

ఉ. చాలునుదైత్యనాథ కడుశౌర్యధనుండగు రాఘవుండు నీ
కేలవిరోధమాతనికి నీజనకాత్మజనిచ్చి వేయుమా
మేలుఘటిల్లు నిక్కముగ నుంచిమహావిభవాభిరాముడై
గ్రాలెడులంక రాముడులుకన్ హతమార్చకమున్న చెచ్చెరన్.

ఉ. శ్రీరఘురామచంద్రునకు సీతనొసంగవయేని ధీరతం
గ్రూరనిశాతభల్లతతి గూల్చడెఘోర నిశాటకోటులన్
దారుణభంగి వానరులు దాడియొనర్చకమున్న జానకిం
గూరిమితోడనిమ్ము నమకూరు నమస్తశుభమ్ములిమ్ములన్.

సీ. బాంధవుండవుకాన భక్తిపూర్వకముగా కడుహితంబును పథ్యకరములైన
మద్వచనంబుల మన్నించిచేకొమ్ము శ్రీరామవిభునకు సీతనిమ్ము
సుదృఢంబులై శరత్సూర్యమరీచి సంకాశంబులగు విశిఖములనిన్ను
ద్రుంపరాముడు ప్రయోగింపకపూర్వమేదాశరథికిధరాతనయనిమ్ము
సౌఖ్యమునశించుగాన రోషమునువిడిచి ప్రబలనత్కీర్తి నొనగు ధర్మమున జనుము
బ్రతుకుదుముగాక హితపుత్రబాంధవముగ రామునకు సీత నొనగుము రాక్షసేంద్ర.

వ. అదియునుంగాక యిందొకరహస్యముకలదు సావధానమనస్కుండవై వినుము.

ఉ. క్రూరనిశాటకోటి ననిగూల్చి జగంబుల బ్రోవుమంచు బృం
దారకముఖ్యులార్తిగొని దైత్యహరున్ శరణంబువేడ ల
క్ష్మీరమణుండుదుష్టజన శిక్షణజేయునిమిత్త మిద్ధరన్
శ్రీరఘువంశమందు నవిజేయుడుగా జనియించెరాముడై.

గీ. మత్రియోక్తులవినుము సామాన్యమనుజ మాత్రుడని శ్రీరఘూత్తము మానసమున
దలచుచుంటివి కాబోలు దైత్యవధకు నవతరించిన శ్రీవిష్ణుడగుట నిజము.

వ. అనివచించు విభీషణుని హితవచనంబుల నంగీకరించక కొలువుచాలించి రావణుడు నిజాంతఃపురంబుసొచ్చె. మరునాడు మంత్రిప్రముఖులతో గ్రమ్మఱ

కొలువుకూటంబున నున్న రావణుని కభిముఖుండై నెల్లరువిన విభీషణుడు పూర్వకముగా నిట్లనియె. సహోదరా !

క. జనకతనయ లంకకువచ్చినదాదిగ మనకు బెక్కుచెడుశకునంబుల్
గనుపట్టదొడగె నల్లెడ దనుజేశ్వర వినుముకొన్నితగవచియింతున్.

సీ. హోమగుండంబులు ధూమాకులంబులై విస్ఫులింగస్ఫూర్తి వెలుగవయ్యె
వహ్నిమందిరముల ననధ్యయనస్థానములలోన మేటిపాములు చరించె
హవ్యపదార్థంబులందు చీమలుదోచె కదుపుల బలితంపు పొదువులెండె
మదసింధురంబుల మదమెల్ల దిగజారెవాజులముఖముల తేజమెడలె
మరియు నుష్ట్రశిఖరాళి రోమములురాలె కాకములు గృధ్రములు
గుమిగావిమాన
గోపురంబులవికృతిగా గూడదొడగె నగరువాకిళ్ళ పవళులే నక్కలరచె.

వ. ఇట్టి దుర్నిమిత్తంబులనేకంబులు లంకాపురంబునందెల్లెడ గనుపట్టుచున్న కారణమున నగరవాసులెల్లరకు మిగులననర్థసూచకంబులుగా దోచుచున్నవికావున తన్నివారణోపాయముగా సీతను శ్రీరామునకర్పించి యతనిచెల్మి సంపాదించుట శ్రేయస్కరమని నాయభిప్రాయము. నేనపరాధినని దలంపవలదు న్యాయమాతిక్రమము కాకుండెడువిధమున చక్కగాయోచించి కర్తవ్యమును నిర్ణయింపుమని ప్రబోధింప క్రోధోద్రిక్తుండై రావణుడు విభీషణునితో నిట్లనియె.

ఉ. ఏలవృథాప్రసంగమిక నెవ్వరికేనుభయంబునొంద చాల్
చాలును రాముడెన్నటికి జానకినింగొనిపోవలేడు పే
రాలమునన్ దివస్పతిముఖామర వర్గసహాయుడయ్యు నా
ప్రోలనిమేషమేని రఘుముఖ్యుడు నిల్వగనేర్చునే ధృతిన్.

వ. అనితిరస్కారపూర్వకముగా విభీషణుని వచనముల పాటింపక కొలువుసాలించి గృహంబునకరిగె మరునాడు రావణుడు కాలచోదితుండై సీతయెడ కామమోహాభిమానుండుగావున మంత్రిసుహృత్సోదర ప్రధానులతో శ్రీరామాదుల యుద్ధమున జయింపనిశ్చయించి మంత్రాలోచనమునకు తగు ప్రయత్నముతో కొలువుకూటంబునకు పయనంబై.

గీ. ప్రవిమలానర్ఘ నవరత్న భర్మరమ్య రజతదాంత విచిత్రిత రథమునకును
ధవళహయముల బూన్పించి దశముఖుండు చెలువముగ దానిపై నధిష్ఠించివెడలె.

సీ. అసిచర్మ ముసల గదాద్యాయుధములూని కొందరుయోధులు ముందునడువ
రథములపై మహారథులు పిరుందన నిరుగెలంకుల గొల్చియేగుదేర

భీమనాకారులై వీరులుకొందరు సామజారూఢులై సరసనడువ
ఘోటకములనెక్కి కొందరురక్కసులత్యంతరయమున నరుగుదేర
వెలదుకలు చామరములూని వీచుచుండ బట్టుగొడుగులు కొందరుపట్టికొలువ
ప్రబలతూర్యధ్వనులు మ్రోయ ప్రజలు మ్రొక్క నసురపతి తత్సభాస్థలి
కరుగుదెంచె.

వ. పట్టణమున రాజవీధులవెంట ప్రజలెల్లరు పెక్కువిధంబుల స్తుతించుచుండ నానావిధదివ్యమణిభూషణ సుగంధచందనపుష్పమాలికానర్ఘ్య దివ్యాంబరాలంకృతుండై సర్వాలంకారశోభితంబై యనేకరాక్షసపరివృతంబైన సభామంటపంబున సర్వదేవతాపరివేష్టితుండగు దేవేంద్రునిచందంబున రావణుడు దివ్యరత్నసింహాసనాసీనుండై మంత్రిప్రధాన సుహృత్సోదర బాంధవ పుత్రపౌర జనంబులు తత్తదుచితాసనంబుల నుపవిష్టులైయుండ మంత్రిసత్తముండగు ప్రహస్తునితో నిట్లనియె.

ఉ. పూర్వముకంటె నిప్పుడతిపూనికతో చతురంగసేనలన్
సర్వవిధంబులన్ నగరుచక్కగ రక్షణకర్తృకృత్యముల్
నిర్వహణంబుసేయుమన నేర్పున నట్లొనరించివచ్చి త
త్సర్వమువిన్నవించుటయు దానవనాథుడు హర్షచిత్తుడై.

గీ. ఆలకింపుడు ధర్మకామార్థములన బరగుపురుషార్థములు మూట బ్రకృతమందు
దేనినొనరింతునంచు సందియముదోచె హితము యోచింప మీరలే
చతురమతులు.

వ. హితాహితములు లాభాలాభములు ప్రియాప్రియములు సుఖదుఃఖములు సంప్రాప్తించు కాలములయందు మీతో మంత్రాలోచనమొనర్చుటచేత నే సఫలీకృతమనోరథుండనైతి. సర్వశస్త్రధరుండునుమహాబలపరాక్రమోపేతుండగు కుంభకర్ణుడు దీర్ఘకాలము నిద్రాసక్తుండై యుండి నేడే నిదురనుండి మేల్కాంచుటచేత నతడు ముఖ్యముగా యీ విషయమున మనకు యుక్తమగు సలహా యివ్వదగియున్నవాడు. దండకారణ్యమునుండి గొనితెచ్చిన సీత నాశయ్య నధిష్ఠింపకున్నది. ఆమె మిగుల సౌందర్యవతియగుటచే విడువజాలకున్నాడ.

గీ. సఖియసౌందర్య లావణ్య సౌకుమార్య మద్భుతము దానిసోయగంబరయ పుష్ప
శరుడు సుమసాయకముల నిచ్చలు తపింపజేయుచున్నాడు నను యేమి
సేయువాడ.

గీ. మనుజమాత్రులు రామలక్ష్మణులు ప్లవగవరవరూథినితోడ నీవనధినెట్లు
దాటిరాగలరంచు జిత్తమునసెంతు నైననొకసందియముదోచె నదియువినుడు.

వ. హనుమంతుండను వానరమాత్రు డీ సముద్రలంఘనంబొనర్చి యనేకరాక్షస ప్రముఖులతో యుద్ధంబొనర్చి నిర్భయుండైయరిగె గావున కార్యగతి నిర్ణయించుట దుర్లభము. మనుష్యమాత్రులవలన నాకేమాత్రము భయములేదు. అట్లైనను దీని విషయమున మీతో ముఖ్యముగా నాలోచించుటత్యవసరము యేలనన మున్ను మీ సలహా సహాయములతో దేవాసురయుద్ధమున విజయమును సాధించితిని. నేడట్లే మీ సలహా సంపదలతో శత్రువుల జయింపగలనని నమ్ముచున్నాను. అయినను రామునకు వెఱచి సీతనర్పించుట మాత్రము కల్ల. మీమీ బుద్ధిచాతుర్యమున చక్కగా యోచించి యుక్తవిధానమును నిర్ణయించుడనుటయు కుంభకర్ణుండిట్లనియె.

ఉ. ఆకర్ణింపుముదైత్యవల్లభ స్వకీయాలోచనా పద్ధతిన్
నీకుం దోచినభంగి రాఘవుని పత్నింం దెచ్చియున్నాడ వ
ట్లాకాలంబున నన్మదాదులను సమ్యగ్రీతి యోచించినం
గాకుస్థాన్వయు నయ్యెడందునిమి తత్కాంతామణిందేమొకో.

చ. హితులగువారితోగలసి యెంతయుయోచనచేసియున్నచో
నతినిపుణత్వమేర్పడు ప్రియంబెవుడోసనమకూరియుండదే
గతజలసేతుబంధనము గావున జాలివహింపనేల నే
హతమొనరించివత్తు రిపులందర ధైర్యముతోడ నుండుమా.

చ. అసురకులేశ నీకు పగరైన సురేశ్వర యక్షరాడ్విభా
వసు వరుణాగ్నిముఖ్య సురవర్యుల ఘోరరణాంగణంబులం
దసదృశబాహుశక్తిమెరయం బరిఘాయుధధారచేత నే
నెసగ మెసంగ ద్రుంతు గనుమిపుడె నిదునమక్షమందునన్.

సీ. ఏల చింతించెద విదిస్వల్పవిషయంబు నేనహాయుండనై నిల్చియుండ
నాటంబులోనొక్క కోలరాముడునైచి వెండియు శరమొండు నేయులోన
రామలక్ష్మణుల శౌర్యమునసిద్ధరగూల్చి త్రదక్రమును వేడ్కద్రావువాడ
పర్వతాకృతి మహాభయద దంష్ట్రికరాళుండనై నా మోల భండనమున
బలరిపుముఖాద్యమర్త్యులు నిలువగలరె సకలవానరసేనల సంగరమున
గూల్చి నీకు ప్రమోదంబు గూర్చువాడ నమ్ముముమదీయమగు
భావణంబులింక.

గీ. సకలకపులను రామలక్ష్మణుల ద్రుంచి దృప్తివీర భుజించెద దిగులువిడిచి
సురరసాస్వాదనంబున జొక్కి రామపత్నితో గూడి భోగానుభవము
గొనుము.

వ. అనుటయు మహాపార్శ్వుండంజలిబద్ధుండై ప్రభో! చేజిక్కిన మధువును ద్రావ లేని మూఢుని విధమున నింత ప్రయత్నపూర్వకముగా గొనితెచ్చిన సీతను విడుచుటకంటె వేరొండు అవివేకముకలదా? మనమిప్పుడు మానవమాత్రు లకు వెరచి సీతను మరల నొప్పగించుట నాకెంతమాత్రము సమ్మతముకాదు అదియునుంగాక.

గీ. దైత్యనాయక లోకమంతటికి నీవుప్రభుడవై యుండనికొక్కప్రభుడుగలడె
సకలశాత్రవకోటుల సంహరించి సీతతో సర్వసౌఖ్యానుభూతి గొనుము.

ఉ. ఒకటివిన్ము దానవకులేశ్వర మాటలికేల బల్మిమై
కుక్కుటమట్లు పైగవిసి కోరికదీరగ సీతతోధృతిం
జక్కెర విల్తుకేళి బలుసౌఖ్యములొందుము మిాదనెద్దియేన్
వెక్కసమైన భీతియొకవేళ లభించిన జూతమవ్వలన్.

గీ. అనిమహాపార్శ్వుడు వచింప నంతరావణాసురుండు తదీయవాక్యములమిగుల
శ్లాఘనీయంబులనుచు ప్రసన్నదృష్టి నతనితోనిట్లు బల్కెసమాదరమున.

గీ. సచివవర నీనుడులకేను సంతసించినాడ పూర్వమొకప్పుడు నాకు లభ్య
మైన విషయంబు కలదారహస్యమొకటిదెలిపెదను సావధానబుద్ధిని వినుండు.

—: రావణుడు తన శాపకారణమును వచించుట :—

సీ. అతులిత సౌందర్యచతురయా పుంజికస్థలయను వేలుపుపొలతిమిన్న
జలజసంభవుగొల్వ జనుచుండ దానిసోయగమునకెంతయు నాత్మమెచ్చి
బల్మిమైబట్టి పుష్పశరాసనునికేళి చెలగివివస్త్రనుజేసి విడువ
నదికడునలిగిన యబ్జకాండమువోలె పసచెడి చతురాస్యు పాలికరుగ
మత్కృతమహాపరాధంబు మదినెరింగి నల్వకోపించి శపియించె నన్నుగూర్చి
పూనివరకాంతలను బల్మిబొందితేని నీ శిరము వేయివ్రక్కలౌ నిశిచరేంద్రా.

క. ఆ పరమేష్టియొసంగిన శాపమునకు వెరచి జనకజాతనుబలిమిం
బ్రాపించిగవయ తగమికి నేపూనిక సేయనైతి నిక్కమునచివా.

చ. అదియటులుండెవిన్ము మనుజాధము డారఘురాముడేచి దు
ర్మదమున మద్భుజాబల పరాక్రమేమి యెరుంగకున్కి దా

కవనమెునర్ప మర్కటనికాయముతో జనుదెంచునంట నా
యెదురుగనిల్వ నేర్చునె గృహీతధనుర్ధరుడై రణస్థలిన్.

చ. గిరిగుహనుండి వెల్వడెడు గేసరిచందమునన్ పరాక్రమ
స్ఫురణముచేత నెంతయును శోభిలుసృత్యునముండనైన నా
సరసననిల్చి పోరుటకు శక్తుడె రాముడు మంత్రినత్తమా
దురమునవానినీక్షణమె దోర్బలిమిన్ హతమార్చివచ్చెదన్.

గీ. అధికభీమణ విమజిహ్వాలలరు సర్పసదృశనిశిత మదీయాస్త్ర జాలమెపుడు
రణమునంగాంచియెరుగని రాముడిటకు వచ్చుచున్నాడు భూరిగర్వమునజేసి.

కవిరాజవిరాజితము :

కనుగొనుడింక మదీయసముజ్వల కార్ముకము క్త నిశాతమహా
శనితులితాస్త్రనికాయముచే భుజశౌర్యమెలర్పగ ఘోరరణా
వని నలరాఘవునిం దరుమంగలవాడ నలాతమ్ముగ్రకొని దు
ర్వనకరిసుద్ధతి దోలెడుకైవడి రాక్షసయోధులు మెచ్చవడిన్.

వ. ఉదయభాస్కరుడు నిజతేజోవిశేషమున చంద్రకాంతిని హరింపజేయువిధమున
మదీయబాహువిక్రమంబున రామలక్ష్మణుల సకలవానరసైన్యములతో క్షణ
కాలమున నంతమెుందించెద. మహేంద్ర వరుణ కుబేర ప్రముఖ దేవతా
వర్యులే నాముందర నిలువజాలరన నీయల్పమానవుల జెప్పెడిదేమియని
ప్రసంగించు రావణకుంభకర్ణుల జల్పములనహింపక విభీషణుడు రావణునకు
హితంబుపదేశింప దలంచి యిట్లనియె. రావణా సీతయనగా నేమోగ్రహింప
జాలకున్నావు నే జెప్పెద వినుము.

మ. ఘనబాహ్వాంతరసీతయేపడగ తత్కాంతామనశ్చింతయే
పెనువేంద్రదంష్ట్రవిషంబు సుస్మితము లాభీలోగ్రదంష్ట్రల్ దశా
వన మేల్వంచశిరంబులంగుళులు విన్యాసంశయంబేల త
జ్జనకక్ష్మాపతిపుత్రికామణి మహాసర్పంబు గన్గొంటివే

క. నగనన్నిభవిగ్రహు లత్యగణితదంష్ట్రోజ్వలన్నఖాయుధులగు త
న్నగచరులు రాకము న్నింపుగ రామునకిమ్ము జనకభూవరుతనయన్.

క. అశనినదృశవిశిఖంబుల నిశిచరయూథముల దునుమనిగుడకమునుపే
దశకంధరనముచితముగ దశరథపుత్రునకు జనకతనయనొసగుమా.

వ. అని ప్రబోధించుచు ప్రహస్తునిదిక్కుమెుగంబై యతనితో నిట్లనియె.

శా. కాలాగ్నిప్రతిమానభీషణ మహాస్త్రాంశావళిన్ రాముఁడా
భీలప్రక్రియ నీశరీరమును నిర్భేదింపమింగాదె నీ
వేలా ప్రేలెదవో ప్రహస్త వినువేయేలా రఘూత్తంసు పే
రాలంబందు కుంభకర్ణముఖ దైత్యానీకముల్ నిల్తురే.

మ. దివికిం బ్రాకిన సూర్యునందడగినన్ దేవేంద్రునిండాసినన్
భువిలోఁ దూరిన నబ్ధిఁ గుంగినను సంపూర్ణాగ్రహాగ్రస్తుఁడౌ
రవివంశోద్భవుఁడైన రాఘవుడు నిన్ బ్రాణంబుతోఁ వీడ డి
ట్లవివేకంబున బ్రేలెదేటికి ప్రహస్తా చాలు నీ బీరముల్.

వ. అనుటయు విభీషణునితోఁ బ్రహస్తుం డిట్లనియె.

గీ. గరుడ గంధర్వ యక్ష రాక్షసులవలన నాలమున సమానుఁ వెరవు లేదనిననింక
పోరరామునితోడ నెవ్వడునుభయము గలుగనేరదు వ్యర్థంబుపలుకు లేల.

వ. అనిపలుకవిని స్వామిహితాభిలాషియగు విభీషణుండు వెండియునిట్లనియె.

ఉ. ఓయి ప్రహస్త రామవిభు నోర్వగనీకును నాకు శక్యమే
వేయననేల మీరిటుల వేదురులై యొనరించు యోచనల్
శ్రేయమొసర్పజాలవవి చేటుకు మూలము బల్కఁ గింక నో
ర్న్యాయము ఘోరపాపునకు మోక్షము లభ్యముకానికైవడిన్.

వ. ప్రహస్తా! నీవు ప్రగల్భప్రసంగముల కట్టిపెట్టుము. శ్రీరాముని జయించెదమని తలంచుట నావలేక చేతితో సముద్రమును యీదవలంచుటని గ్రహించుము. నిరుపమాన ధర్మప్రధానుండును మహారథులలో నుత్తముండని ప్రఖ్యాతితో నిక్ష్వాకువంశసంభవుండగు శ్రీరాముడు జన్మప్రభృతి నిరతిశయపరాక్రమోపేతుండై సుబాహు మారీచ విరాధ కబంధ ఖరప్రముఖులైన భయంకరరాక్షసులనెల్ల వధించినకార్యదక్షుండు. సకలలోకరంజకుండగు శ్రీరామునితో పోరాడ దేవేంద్రాదులకు సాధ్యపడదన మనబోట్లమాట లెక్కలోనిది కాదు. మరియు రావణ కుంభకర్ణ త్రిశీషన్ నికుంభ దేవరాత నరాంతక యతికాయ మహాకాయ యింద్రజిత్ప్రముఖులు శ్రీరాముని రణరంగంబున జయింపజాలరు నామమాత్ర మిత్రులుగా నుండి కార్యావసరముల క్రూరశత్రుత్వమును జూపు నీవంటి దుష్టులసాంగత్యమున దుష్కార్యాచరణశీలుండగు రావణుడు సకల రాక్షస వినాశనమునకే మీ సలహానపేక్షించుచున్నాడు. సహస్రఫణ

ములు గలిగి మహా భయంకరమగు శేషభోగిచే చుట్టబడిన రావణుని బలాత్కారముగా తొలగించి రక్షింపవలయు

క. వినుభూతోన్మాదుండగు మనుజుని దప్పింపజూచు మాడ్కి నృపుసుహృజ్జనులెల్ల కావదగు పగతునిచే శిగచిక్కకుండతొలగించివడిన్.

గీ. బాంధవ సుహృద్భటామాత్య భరితమైన యీ పురవరంబునకు రాక్షసేశ్వరునకు
నెంతయునుమేలొనర్చు నాహితవచనము తెలమివినిరామునకు సీతనిచ్చుటొప్పు

గీ. శాత్రువులవిక్రమము స్వీయసైన్యబలము స్వపరవృద్ధిక్షయంబులు స్థానబలము
నముచితముగవిమర్శించి సచివవరులు స్వామికి హితంబు బోధింపవలయుసూవె.

వ. అని పెక్కుతెరంగుల బుద్ధిశాలియగు విభీషణుడు ధర్మోపదేశంబొనర్చుటయు నింద్రజిత్తు తదీయ సంభాషణంబులకు సహింపక రోషముతో విభీషణునితో నిట్లనియె.

సీ. పినతండ్రి నీవిట్లు పిరికితనంబున వ్యర్థభాషణముల బల్కెదేల
రణశూరులైన వారలకివి గర్హితములు కానవినరు నీపలుకులెవరు
తెలియనామనలోన తెలివిహీనుండైన జంపును రామలక్ష్మణులబల్మి
పాకవిద్వేషిని బంధించివైచితి త్రిదశులదోలితి దిక్తటులకు
కేవలపరాక్రమమున నైరావతమును కూయిడుచునేలపై బడగొట్టినాడ
హీనసత్త్వులసామాన్యమానవులను బిలుకుమార్చుటలెక్కయే పలుకులేల.

వ. అని పలుకుచు ఇంద్రజిత్తు తండ్రితో నిట్లనియె.

శా. ఆకర్ణింపుము తండ్రి మత్కులజులీయత్యుగ్రులౌ రాక్షసా
నీకంబద్భుతబాహు విక్రమకళా నిష్ణాతునందున్ మదో
ద్రేకప్రాభవశూన్యుడారయ ధరిత్రిన్ యీతడొక్కండె పో
నీకుందమ్ముడటంచువాకొనుటలున్ నీచంబటంచెంచెదన్.

వ. అని కఠినముగా భాషించుచున్న మేఘనాదునితో విభీషణుండిట్లనియె. వత్సా! నీవు కేవలబాల్యావస్థయందుండుటచే నీ బుద్ధి పరిపక్వస్థితి నొందదయ్యె గావున నీకు నిశ్చయ జ్ఞానము కుదరక యవివేకప్రసంగముల జేయుచుంటివి. అందువలన నీవు రావణుని గర్భమున బుత్రరూపమున నుదయించిన శత్రుడవు. శ్రీరాముని ప్రభావమును చక్కగా నెరింగిన నా వలన ముందురాబోవు యనర్థకమును వినియు దుర్మంత్రుల దురాలోచనముల కనుకూలించుచుంటివి.

ఇది శ్రేయోమార్గము కాజాలదని వచించి రావణునితో నిట్లనియె. సహోదరా నా నిశ్చయాభిప్రాయము నవధరింపుము. కొంచెము దీర్ఘముగా యోచించి యిప్పటికైనా నీ పొరపాటును సర్దుకొనుట మంచిది యెట్లనగా.

చ. మణుల ననర్ఘ్యవస్తువుల మంజులనూత్నవిచిత్రరత్నభూ
షణముల మేల్పసిండి జిగిశాలువలన్ మిథిలేశకన్యకా
మణిని రఘుప్రవీరునకు మన్ననతోడ నొసంగితేని రా
వణ మనకెల్ల భంగుల శుభంబులుగల్గి సుఖింతుమెంతయున్.

— రావణుడు విభీషణుని కఠినముగా నిందించుట :—

చ. అనుచు విభీషణుండు వినయంబెసయన్ వచియింపుచుండ తా
వినివిని దైత్యవల్లభుడు వెక్కసమైన రుషాభియోగ లో
చనముల విస్ఫులింగకణజాలము బర్వగ నుగ్రమూర్తియై
యనియె యనుప్రవాదిత దురాశయ దుస్సహ కర్కశోక్తులన్.

గీ. ఘోరసర్పంబుతో నైన కుటిలవైరితోడనైనను స్నేహంబుదొడరిసేయ
వచ్చు మిత్రుడనని చెప్పి వైరిపక్షమూను కుమతులతో జెల్మి పూనతగదు.

క. జ్ఞాతులశీలంబెరుగుదు జ్ఞాతులకాపదలుగలుగు నమయములందుం
బ్రీతి వహింతురు జ్ఞాతులు జ్ఞాతికినైజమిది సకలజగములయందున్.

వ. లోకమున జాతిశ్రేష్ఠుడుగను కార్యసాధకుడుగను శాస్త్రజ్ఞుడుగను శూరుడుగానుండెనేని యసూయాగ్రస్తులై జ్ఞాతులు బాహ్యస్నేహమును ప్రదర్శించుచు వ్యసనకాలముల పరిత్యజింపజూతురు. పద్మవనమున యేనుగులు గజగ్రహణ పురుషులనుగాంచి చెప్పినవిషయమొకటి కలదు. పాశములవలనను శస్త్రాదుల వలనను యగ్నివలనను మాకుభయములేదుగాని గజగ్రహణులకు పాయము జెప్పి మమ్ములబట్టించిన జ్ఞాతిగజములవలన మాకుభయోత్పాతము గలుగుచున్నదని వచించె గావున.

గీ. ధనముబెంపొందు గోనముదాయమునను విప్రవరులందు దమమభివృద్ధినొందు
స్త్రీలచాపల్యగుణము సుస్థిరతనెగడు జ్ఞాతివలన భయంబునిశ్చయముజగతి.

వ. ఇట్లే జ్ఞాతివలన సంప్రాప్తించు భయమే గొప్పదిగా శాస్త్రములు బోధించుచున్నవి.

మాలినీవృత్తము :

నన్ను జగంబులలోన నమస్తజనంబనిశంబు ముదంబెసగన్
నన్నుతిజేయుటయున్ దృఢభక్తియు నత్కృతి జేయుటయుంగడు శౌ

రోయ్సన్నతి శత్రుశిరంబులు దన్నుటయున్ విభవాతి శయంబున పెన్
వన్నకు నెక్కుట నీవు సహింపక వాకొనెదిట్టుల మూఢమతీ.

వ. శరత్కాలమందు గర్జిల్లు మేఘము లెట్లు వర్షమును గలుగజేయవో యట్లే యయోగ్యుల సాహచర్యము నిరర్థకమగుచుండును. నీవు నాయుచ్ఛ్రాయస్థితినిజూచి సహింపజాలక నసూయాగ్రస్తుండవై దుష్టస్వభావమున వచించుభాషణములు నేవినన్నొల్ల.

గీ. ఈవిధిదురుక్తు లింకొక్కడెవ్వడేని యాడియుండినచో వాని నాక్షణంబ
చంపియుండుదు నీవునాసరసనిలువ తగవుకులపాంసనా వేగతరలిపొమ్ము.

చ. అనుచువచించు రావణునమర్షకరినోక్తులు వించుతద్విభీ
షణుడు హృదంతరంగమున సైపక నొక్కగదాయుధంబు గ్ర
స్సనగొని మంత్రిసత్తములు నల్వురు వేముడి తన్నుగొల్వ రి
వ్వనగగనంబుపైకెగసి భూరిరుషోక్తుల బల్కెనిట్టులన్.

వ. రావణా నీవునన్ను కరిసముగా దూషించినను పితృసమోజ్యేష్టః అను న్యాయ ప్రకారమునసీయెడగలభక్త్యతిశయమునసీకు ప్రత్యుత్తరమొసంగనొల్లదనీవిట్లు ధర్మప్రవర్తకుండవైయొనర్చునీయకృత్యములసహించి నీసమక్షమమందుండజాల నీక్షేమ మపేక్షించి పథ్యకరములైన హితంబులు దేశించితి. ఆత్మజ్ఞానవిహీనులై యమునకు వశులైన భవాదృశులు యిట్టి యప్రియోక్తుల నంగీకరింపజాల రేలనన.

గీ సంతతప్రియవాదులౌ జనులుధాత్రి సులభముగ లభ్యమగుదురు క్షోణినాథ
యప్రియకరంబు పథ్యమైయలరు పలుకువక్తయును శ్రోతయును
దుర్లభంబుసూవె.

గీ. అగ్నిచేగాల్పబడెడు గృహంబువదలి జనమనసురాని విధమున జమునికాల
పాశబంధనములజిక్కి నాశమొందు నినువిడిచిపోవుటకు నాకుమనసురాదు.

సీ. మనుజేంద్ర నాహితంబును వినవైతివి నినుసంస్కరించెడు ఘనుడెవండు
శ్రీరాముబాణాగ్ని శిఖలలోమ్రగ్గి నాశమునొందునిను గాంచజాలసుమ్ము
శౌర్యాధికుండైన జమునిచేచెడియెదు సికతావినిర్మితసేతువట్లు
భ్రాతవాకతన సీభావుకమర్థించి విహితంబుబోధింప వెగటుదోచె
తప్పులక్షమింపు మఖిలదైత్యప్రవపూర్ణమైన లంకాపురమును సౌఖ్యముగనీవు
కడగియెవ్విధమునసైన గాచికొన్ము సీతనర్పించుటెంతయు శ్రేయమగును.

—: విభీషణుడు శ్రీరామాదుల సన్నిధికరిగి శరణాగతుడగుట .—

గీ. రావణునితోడ నీప్రకారముగ తద్విభీషణుండతి కఠినసంభాషణముల
బలికి తత్క్షణమున రఘుప్రవరులిర్వురెచట నివసించి రచ్చోటికరుగుదెంచె.

వ. వివిధసాధనోపేతులును భయంకరపరాక్రమసంపన్నులగు నల్వురు మంత్రులతో సముద్రోత్తరతీరమున కేతెంచుచుండ వారియాగమనంబెరింగి సుగ్రీవుడు హనుమత్ప్రభృతులైన వానరులతో నిట్లనియె.

మ. అవలోకింపుడు బంధులార దివిఘోరాకారులౌ రాక్షస
ప్రవరుల్ నల్వురుగొల్వ శస్త్రధరుడై వైరంబునన్ నేటికా
హవభూమిన్ మనలన్ జయించుటకుగా నత్యంత శీఘ్రంబునన్
దివిషద్వేషి యొకండిదే యిటకు నుద్వేగంబుతో వచ్చెడున్.

చ. అనుటయు వానరప్రవరులాగ్రహముల్ పెనుపొంద సాలముల్
పెనుశిలలన్ జెకల్చుకొని వేగమె వానరనాథ వీరలం
దునుమననుజ్ఞనిమ్ము బటుదోర్బలిమిన్ మనపైకివచ్చు దు
ర్దనుజుల నీక్షణంబె సమరస్థలి నుక్కడగింపగక్కునన్.

మ. అని వాక్రుచ్చెడు వానరోత్తముల వాక్యంబుల్ సమగ్రంబుగా
విని ప్రాజ్ఞుండగు తద్విభీషణుడు నిశ్చితిన్ సముద్రోత్తరం
బున నాకాశపథంబునన్ నిలిచి సంపూర్ణాదరంబొప్ప ని
ట్లనియె వానరవీరులంగని ప్రదీప్తానల్పవాగ్గుంభనన్.

వ. మహనీయులారా నావిన్నపంబొక్కటవధరింపుడు.

సీ. రావణుండను దుష్టరాక్షసనాయకుండొప్పు నాతనికి సహోదరుండ
బిలుతురునన్ను విభీషణుండనుపేర తద్రావణుడు జనస్థానమందు
నుద్ధతుడై జటాయువును పోరవధించి సీతనుగొనివచ్చి చెరలనుంచె
రాక్షసవనితలారామామణిని కడుమన్ననతో బ్రోచుచున్నవారు
ఏను న్యాయపథంబున హేతువాక్యముల వృథంబుగ నారఘుకులవిభునకు
ప్రీతితో జానకిని సమర్పింపుమనుచు తేటతెల్లముగా ప్రబోధించినాడ.

వ. ఆసన్నమరణావసిష్టుండగు రోగియౌషధమును గ్రహింపజాలని విధమున కాలచోదితుండై రావణుడు మదీయ హితవచనంబుల నాదరింపక నన్నుమిగుల కఠినముగా నిందించి పరిభవించె తత్కారణమున.

క. దారాపుత్రాదుల పరివారముతో సకలవస్తు బాంధవుల నిజా
గారములు నెల్ల విడిచియు శ్రీరామునిగొల్వ నేడు చేరితినిటకున్.

వ. గావున నా విజ్ఞప్తి నవధరింపుడు.

గీ. సర్వలోకశరణ్యు నిక్ష్వాకువంశభూషణుండగు శ్రీరామభూమిపాలు
శరణమర్థింపవచ్చితి సత్యమిదియు విన్నవింపుడు మీరు మద్విషయమెల్ల.

వ. అంత సుగ్రీవుడు తద్వృత్తాంతమును శ్రీరాముని సన్నిధిలో నిట్లని విన్నవించె.

గీ. రఘుకులాధీశ వింటివే రావణునకు ననుగుడమ్ముండట విభీషణాఖ్య నొప్పు
దైత్యుడసురులు నల్వురుతన్నుగొల్వ వచ్చి శరణార్థి ననుచు వాకుచ్చుచుండె.

వ. శ్రీరామచంద్రా! కామరూపధరులును భూమ్యంతరిక్షచరులగు రాక్షసులు బహుమాయలు బన్నుచుండుదురు. లోకమున గుడ్లగూబలు పగలెల్ల కొండ గుహాలలోడాగి రాత్రులలో నొడలెరుంగక నిదించు పక్షుల కులాయముల జొచ్చి వాటిని హతమార్చుచుండును గావున అట్లే యీరక్కసులు మాయ మాటలువచించి మనలనమ్మించి మనలోజొచ్చి వంచనతో మనలపరిమార్చ తలంపున నేతెంచిరి. వీడు పరమకిరాతుడగు రావణుని సోదరుడనని వచించు చుండె. గావున వీడు నిశ్చయముగా సోదరుండుగాని గూఢచారుడుగాగాని కానగు అందువలన వీనిని వీనిసహచరులను గట్టిగాదండించి పంపుట ముఖ్యము మనము ప్రకృతము మంత్రాలోచన మొనర్చుటకును సైన్యముల వ్యూహముల బన్నుటకును శత్రువీరుల నమాలోచనములు గుర్తించుటకును యత్యంత జాగరూకులమై ప్రవర్తింపవలయు యని దూరదర్శియు కార్యకోవిదుండును నగు సుగ్రీవుడు వచింప శ్రీరాముడు విని హనుమత్ప్రముఖులనెల్లర సంప్ర దింపదలచి వారలతో నిట్లనియె.

క. శ్రేయస్కాములు గదుప్రజ్ఞాయుతులేనియును కార్యసంకటములలో
ధీయుతులగు సుహృదయుల యుపాయాలోచనము లెలమి బడయగవలయున్.

ఉ. నావచనంబనన్యము వినందగు మీరు వనాటులార త
ద్రావణుసోదరుండితడు రాక్షసవీరుడు వీనిగూర్చి సు
గ్రీవుని యోచనంబు పరికించితి రెంతయు నేర్పుతోడ మీ
భావము లెల్ల తేటపడ బల్కుడు నాహితమర్థిగోరుచున్.

క. అని ప్రశ్నించుటయును తద్వనచరవరులెల్లరును ముదమునన్మరి శ్రీరా
మునకు హితమభిలషించుచు నసువుగ స్తుతిపూర్వకముగ ననిరివ్విధిగన్.

సీ. శ్రీమదార్కాన్వయ క్షీరపారావార రాకాసుధాకర రామచంద్ర
నీప్రభావంబు వర్ణింపనల్వకుసాధ్య పడదన మేమెంతవారమరయ
త్రిభువనముల నీకు తెలియని విషయమొక్కటియును లేదునిక్కము మహాత్మ
శ్రీరఘుపతి కపిస్నేహితుండనుకీర్తి నిఖిలజగంబుల నిలుపదలచి
మాయెడల పూర్ణమైన ప్రేమమున నిట్టులడుగుచున్నాడ వతులధర్మాన్వితుండ
వాత్మయొప్పింతువు సుహృజ్జనాళిపట్ల ననయము పరీక్షతో జేతు వన్నిపనులు.

గీ. భాస్కరకులావతంస మీ ప్రశ్నములకు సంశయచ్ఛేదమొనరింప జాలుకడు స
మర్థులును ప్రాజ్ఞులైన నీమంత్రివర్యు లొక్కరొకరు నిజాభీష్టముగ్గడింత్రు.

చ. అనికవిపీరులెల్ల రన నద్భుతనీతినిధాను డంగదుం
డను రఘువంశవర్ధన యుదాశయమెనున వీడుశాత్రవుం
డనుటకు సందియంబె కలుషాత్మకుడౌ దశకంఠు సోదరుం
డని వచియించెగావున దురాత్మకు నీతని నమ్మవచ్చునే.

క. దేవాశరబుద్ధులు తమ భావంబులు గప్పిపుచ్చి పరిపరిగతులం
గేవలమనవహితాత్ముల వేవిధముల ద్రోహమెంచి వెడలుదురవనిన్.

గీ. వీని గుణదోషములనెల్ల వివిధగతుల జక్కగ పరీక్షజేసి నిస్సంశయముగ
సుజనుడైన గ్రహించి దోషుడగునేని బహువిధంబుల దండించి పంపవలయు.

గీ. గొప్పగా దోషయుక్తుడై గుణములల్పమున్నచో వానిజేర్పగా నొప్పదెందు
సుగుణసంపన్నుడై దోషసూక్ష్ముడైన నతనినునలోన జేర్చుటర్హమనిదలతు.

వ. పదంపడి శరభుం డిట్లనియె.

చ. అనఘ విభీషణుండు శరణాగతినంచు వచించుమాత్ర యీ
దనుజుని విశ్వసించుట హితంబగునే పరికింపుడీతనిం
జనవుఘటిల్ల నమ్మి మనసంఘములోపల జేర్చబోల దీ
తని విషయంబునన్ బహువిధంబుల జాగ్రతబూనుటొప్పగున్.

వ. అనంతరంబ జాంబవంతుండు నిజాభిప్రాయమిట్లని విన్నవించె. శ్రీరామచంద్రా
నా విజ్ఞప్తి నవధరింపుడు.

గీ. ప్రబలవిద్వేషియును మహాపాపియైన రాక్షసేంద్రునివిడిచియీరక్కసుండు
దేశకాలములందరుదెంచె గాన సంశయింపదగు వీని సర్వగతుల.

వ. అంత మైందుండిట్లనియె. శ్రీరామచంద్రా! నాయభిప్రాయమవధరింపుడు ఈ రక్కసుని రావించి యితని బలాబలముల గుర్తించి రావణుని యభిప్రాయం బెరింగి పిమ్మట తత్కాలోచితముగా మనము ప్రవర్తించుట సముచితమని తలంతుననుటయు.

గీ. అంత సంస్కారసంపన్నుడైన హనుమ రామచంద్రునితో మధురముగ నముచి తార్థయుక్తంబులైన వాక్యముల నధికభక్తి తాత్పర్యములతోడ బలికెనిట్లు.

గీ. నాహితోక్తుల సావధానముగ వినుడు శ్రీరఘూత్తమ పాదరాజీవయుగళ మందునాకున్నయట్టి భక్త్యతిశయమున తద్దయువచింతు నీయదార్థమును తెగువ.

వ. లోకమున వ్యక్తులలో సాధారణముగా హర్షామర్షములు శోకమోహములు గలిగినప్పుడు లోనిముడక బహిర్గతములగుచుండును. కావున వారివారి భాషణాదులవలన సుముఖ వికాసాది లక్షణములనుబట్టి వారివారి యభిప్రాయముల నిర్ణయింపవచ్చును. ఇప్పుడీతని ముఖవైలక్షణ్య భాషణాదులను బట్టి యితం డొక సాధుస్వభావముకలవాడనియే తోచుచున్నది. దుష్టరాక్షస భూయిష్ట మగు లంకాపట్టణమున సత్స్వభావులుగూడా కలరని నా నమ్మకము. నాపై యింద్రజిత్తు ప్రయోగించిన బ్రహ్మాస్త్రమూలమున బద్ధుడైన నన్ను రావణుని సముఖమునకు గొనిపోయిన రక్కసులతో రావణుడు నన్ను వధించి రమ్మని యుత్తర్వొసంగె తత్సమయమున నీ విభీషణుడు దూతల వధింపరాద నియు యేదేని దండన జేసి పంపుమని పెక్కువిధముల బోధించె. గావున నితండొక నిర్దోషి కావచ్చుననియు, నితండొక యుద్దేశ్యముతో నేతెంచెనని తలంచుచున్నాడ యది యెద్దియన నాకర్ణింపుడు.

మాలినీవృత్తము :

దేవదశాస్యుని దుర్ణయమోర్వక ధీరతనాతనిద్రుంచుటకై
నీవరుదెంచుటయున్ మునువాలిని నేర్పునద్రుంచి ప్రియంబున సు
గ్రీవునకుం గపిరాజ్యమొసంగిన కీర్తిని విన్నకతంబున నీ
సేవకువచ్చె విభీషణుడిత్తరి జెచ్చెరరాజ్యకుతూహలియై.

వ. కావున కార్యావసరమును బట్టి మీరామీరా బుద్ధికౌశలమున యోచించి కర్తవ్యమును నిర్ణయింపుడనుటయు శ్రీరామచంద్రుడు యించుక యోచించి యిట్లనియె.

గీ. ఈ విభీషణువిషయమై యేనుకొంత చెప్పదగియున్నదిపుడు నాక్షేమమరసి సాధ్యవిషయంబులన్నియు సావధాన చిత్తులై మీరువినుడు నాశ్రేయమునకు.

గీ. అతులదోషనమా క్రాంతుఁడయ్యు మిత్రభావమున నేగుదెంచిన వానినవ్వి
ధమునఁగైననను పీడగాఁతగదు సజ్జనావళివచింతు రిదిధర్మమనుచుఁ బేర్మి.

వ. ఇట్లు సంభాషించు శ్రీరాముని సౌహార్ద్రవచనములాలించి సుగ్రీవుఁడు కొంచెము దీర్ఘముగా యోచించి నీతిశాస్త్రరహస్యమునకు మూలముగను స్వామియైన శ్రీరాముని విషయమున తనకు గల ఆదరాతిశయమున వెండియు నిట్లనియె.

మంజరి :

వీఁడుదుష్టుఁడైనను కాకున్నను విరోధికనుజుఁడుగాన
వీడవలయుఁగాని చేర్చఁదగదిక వీనినిపుడు మనలోన
యన్నమవిడనాడివచ్చె నీతండాపత్కాలములోన
నెన్నఁగనిటువంటివాఁడు పరులకు హితమెంచునె ధరలోన.

గీ. అనుఁడు సుగ్రీవువచనంబులాలకించి సత్యవిక్రముఁడగు రామచంద్రుఁడంత
నానినంబున లేనగవంకురింప బలికె నందరు వినుచుండ బ్రమదమొనగ.

ఉ. వేయననేలయాకొనుఁడు విశ్వమునందొక ధర్మసూక్ష్మము
న్యాయతయుక్తితో నలరునయ్యది నే వివరింతుఁజక్కఁగా
దాయలువేచి యాపదలు దారొకనువేళనఁదంత్రు నేడితం
డీయెడ కేగుదెంచె నిదిహేతువు జ్ఞాతివధాప్రభీతుఁడై.

చ. అరయుములక్ష్మణా యొకరహస్యము యోచననేసి చూచినన్
భరతుని సాటిచెప్పఁదగు భ్రాతయు తండ్రిహితంబుగోరు నా
నరియగు పుత్రకుండును నిజంబుగ నీకునమానుఁడౌ సుహృ
ద్వరుఁడును గల్గరెందు నిదితథ్యము మాటలువేయునేటికిన్.

వ. శ్రీరాముండిట్లు వచించుటయు మహాప్రాజ్ఞుండైన సుగ్రీవుఁడంతరంగంబున శాంతికుదరమి లేచి వినయవినమితోత్తమాంగుండై యిట్లనియె.

శా. నా విజ్ఞప్తిని సావధానముగ విన్మా రాఘవా యద్భుల
ప్రాపీణ్యాదులెరుంగ రావణుఁడు బంపన్వచ్చుచున్నాఁడు మీ
భావంబందు సమీక్షఁజేయుఁడిపుడే ప్రత్యర్థులన్ ద్రుంపఁగా
వేవేగన్ సెలవిండు సైన్యములకున్ విఖ్యాతతేజోనిధీ.

క. అనవుఁడు తనయెడ ప్రేమంబున రవిసుతుఁడిటులఁబలుకఁ బోలు నటంచున్
మనమున నెంచుచు రఘువరుఁడనియె నిటుల సువిహితోక్తులాతనితోడన్.

శా. సుగ్రీవా భయమేల సీతదతి దుష్టుండైన గాకున్న నా
యగ్రంబందేపు దస్మదీయులకు సత్యంతార్తి గల్గింపశే
దుగ్రకూరపిశాచ యక్ష దనుజవ్యూహాంబునెల్లన్ మహో
దగ్రక్రోధదవాగ్ని కీలదృటిలో దగ్ధంబు గావింపనే

వ. అదియట్లుండె వినుము. ఇతడు శరణాగతిచేయుచున్నవాడు. గావున ప్రీని నవ
శ్యము రక్షింపవలయు శరణాగతుడగువానిని విడుచుట ధర్మముగాదు దీని
కొక తార్కాణము వినుము.

మాలినీవృత్తము :

వానరనాయక వింటివిగాదె కృపామతి నొక్కకపోతమమ్ముం
గాననమందు కపోతినిద్రుంచిన కర్కశుడైనవిషాదుని దు
ర్మానసుడంచుదలంపక దీనుశరణ్యు నిజాంగమొనంగియు త
త్ప్రాణముగావదె మద్విధమర్త్యులవార్తలవేరడుగన్ వలెనే.

వ. కండుడను మహర్షి బోధించిన శరణాగతరక్షణావిషయమున గలధర్మోక్తుల విశ
రించెద నాకర్ణింపుడు.

సీ. అధికదైన్యమున బద్ధాంజలుండై శరణార్థియైవచ్చు ఘోరారియైన
సుకృతకర్ముడు జంపజూడదప్పరుసున ప్రాణమైనత్యజించి పరమకరుణ
యార్తుడైనను దృప్తుడైనను శరణంబు వేడుశత్రువును కాపాడదగును
భయముచేగాని దుర్భరమోహముసగాని కామవశంబునగాని జనుడు
శక్తికొలదిగ నతన్నిబనన్నబుద్ధి బ్రోవకుండిన యెడల తత్పురుషు డధిక
లోకగర్హితుడగు పాపలోకమందు బడినశించును సందేహపడగనేల.

క. శరణార్థిననుచువచ్చిన నరుడరిచేజూచుచుండనరుకబడిన త
త్పురుషుండువానిసుకృతము హరియించుసువిఖ్యాతమువంబుహరివరవింటే.

వ. కావున నేను కండుమహర్షి వాక్యానుసారము ప్రవర్తించెద. ఇయ్యది ధర్మ
యుక్తముగను యశస్కరముగను స్వర్గఫలసాధనముగానున్నది. కావున
సుగ్రీవా నాప్రతిజ్ఞ వినుము.

గీ. సకృతుగానైన నాయెడ శ్రద్ధతో ప్రపన్నుడకుటిలభక్తి నీవాడననుచు
నర్థి బ్రార్థించు సర్వభూతాళి కభయదాన మొనగెద నిదిమద్వ్రతంబు సుమ్ము.

వ. అందువలన వీరాలుమదాజ్ఞానుసారముగా

ఉ. వానిని తోడితెండిటకు పైళము నేనభయంబొసంగితిన్
వానరరాజ సత్యమనవద్యభుజాబలశౌర్యసంపదం
బూనికనీవిభీషణుని బ్రోచుట జెప్పెడిదేమి రావణుం
డైననువచ్చి నాకుశరణాగతుడైన క్షమించి బ్రోచెదన్.

వ. అనియుపన్యసించుటయు సుగ్రీవుడు శ్రీరామునివచనంబులాలకించి శత్రు పక్షమునుండి వచ్చినవానిదోషముల పాటింపక మిత్రవర్గమునెల్ల సమాధాన పరచి రావణుడువచ్చినను రక్షించెదనని చెప్పిన శ్రీరాముని సౌహార్ద్రాతి శయంబునకెంతయు పరమాశ్చర్యభరితుండై శ్రీరామునితో నిట్లనియె.

సీ. శ్రీరామ రఘుకులక్షీరాంబునిధిసోమ సౌహార్ద్రగుణధామ సమరభీమ
నీప్రభావంబెన్న నేనెంతవాడను పరధర్మసూక్ష్మ తత్వజ్ఞమూర్తి
సౌశీల్యవాత్సల్య శౌర్య ధైర్యావ్యసంఖ్యాక కళ్యాణ గుణాశయుడవు
సమధికమాధుర్య సత్యభాషణుడవు స్వాశ్రితసకలజనావనుడవు
తద్దయు పరార్థచింతనా తత్పరుడవు విబుధజనసేవ్యమాన పవిత్ర దివ్య
చరితుడవు సద్యశజ్యోత్స్న సకలదిశల వెలయజేయు జగత్రయ విభుడవీవు.

గీ. అలవిభీషణుడంపగా వలయుననివచించియుండిననాకు యోచించిచూడ
నతడు పరిశుద్ధుడనితోచె వానుమనుడువు ముఖవికాసాది లక్షణములనుబట్టి.

వ. మహాత్మా! నీయనుగ్రహావాప్తికర్హుండగు విభీషణుండు మాతో సఖ్యంబు వడసి కలసిమెలసి సుఖియైవర్తిల్లుగాకయని వచించె నంత శ్రీరామచంద్రుడు విభీషణుని తోడ్కొనిరండని వానరులకు నాజ్ఞనొసంగుటయు తదాజ్ఞాను సారము గగనతలంబునుండి సచివసహితుండై తక్షణంబ దిగివచ్చి విభీషణుండు తానింతకుమున్ను వినియున్నదానికన్న మిన్నగా నత్యద్భుతముగాప్రకా శించు శ్రీరాముని దివ్యమంగళవిగ్రహ సౌందర్య సౌశీల్య లావణ్య గాంభీర్యౌ దార్యాది గుణగణంబుల కెంతయు సంతసించి విస్మయావిష్టుడై సంతోషపార వశ్యమున శ్రీరాముని పాదారవిందములపై సాష్టాంగదండప్రణామమర్పించిన శ్రీరామచంద్రుడు నిజబాహుద్వయంబున నతనిగుచ్చియెత్తి పరిగ్రహించిన విభీషణుండంజలిబద్ధుండై నిలిచి శ్రీరామునితో వినయపూర్వకముగా నిట్లనియె శ్రీరామచంద్రా మదీయ విజ్ఞాపనంబవధరింపుడు.

ఉ. రావణు సోదరుండను పరాభవమొందితి వానిచేత రా
మావనినాథ మిత్రుల ధనాదుల లంకను వీడినేడు నా
జీవితమున్ భవద్గతముజేసితి రాజ్యము సౌఖ్యమెల్ల స
ద్భావముతోడ జేకొనుము దాసుడ సర్వశరణ్య సత్కృపన్.

గీ. అనిభరన్యాస మొనరించి యంజలిఘటించి పలుకువిభీషణు నంచితోక్తు
ఉలర వెసనాదరించి దయార్ద్రబుద్ధి నతనితో శ్రీరఘూత్తముడనియె నిట్లు.

— శ్రీరాముడు విభీషణుని లంకా విశేషముల నడుగుట —

క. తెలుపుము రాక్షసులబలాబలములను సవిస్తరముగ పగతునిశక్తిం
దెలసెద విభీషణాయన కలరూపెల్లన్ వచింపగాదొడగెనిటుల్.

ఉ. రామనృపాలవర్య మును రావణు భూరితపంబు పెంపువం
దామరసోద్భవుండు మదితద్దయు మెచ్చి వరంబులివ్వ ను
ద్దామ పరాక్రమస్ఫురణ తద్వరగర్వముచే నవధ్యుడై
యీమున దేవదానవ దిశాధిపులన్ గణియింపడాజిలోన్.

చ. అతులిత వీర్యశాలి భయదాహవభూముల సత్యుదగ్రుడ
ప్రతిముడు కుంభకర్ణుడనువాడు దశాస్యునిసోదరుండు నా
కితడును సోదరుండలమహోనగ సన్నిభవిగ్రహుండు దీ
ర్ఘతర నిశాతదంష్ట్రుడు నిరంతరదారుణ సుప్తశీలుడున్.

గీ. అద్భుతబలోన్నతుండు బ్రహస్తుడనెడు సైన్యనాథుండు కైలాసశైలమందు
గెలిచె మునుమాణిభద్రుని గిన్నరేశు వాహినీనాథు ప్రబలాహవంబులోన.

చ. అతికుశలుండు భీమణమహాహవ కోవిదుడింద్రజిత్తు ధీ
రత రిపువర్గమున్ శరపరంపరలన్ హతమార్చు హోమమును
జతురతదీర్చి దీర్ఘమగు జాపముతోడ నదృశ్యుడై సము
ద్ధతి విజయంబుగాంచు వివిధంబుల మాయలుబన్ని గ్రిమ్మరున్.

వ. మరియు మహోదర మహాపార్శ్వ యతికాయ దుర్ముఖ ప్రముఖ వాహినీ
పతులు దిక్పాలసదృశులు కామరూపధరులు మాంసశోణితభక్షులు యట్టివది
కోట్ల సైనికులు లంకాపట్టణమును కాపాడుచుండుదురు. వారలసహాయమున
రావణుడు సకల దిశాధినాథులతో గూడిన దేవతావర్యుల నందర నోడించి
విజయమును సాధించె ననివచించుచున్న విభీషణుని వాక్యముల నాకర్ణించి
శ్రీరామచంద్రుడు విభీషణునితో నిట్లనియె.

చ. వినుము విభీషణా తెలసె వింటిభవద్వచనంబులింక నీ
వననిధిజొచ్చినన్ దివిజువల్లభుడానీన సైనరావణుం
దనయు సుహృత్సహోదర యుతంబుగనాజివధించిదిన్ను నా
యనుజానిసాక్షిగా కడుప్రియంబున రాజ్యపదస్థుజేసెదన్.

గీ. బవరనుందున పుత్రులసబాంధవముగ రావణునిద్రుంపకేను మద్రాజధాని
యైన శ్రీమదయోధ్యకు నరుగసుమ్ము తథ్యమిది యొట్టుమత్సహోదరులపైన.

గీ. ఇటులవచియించు రామభూమీశసుతుల నాలకించి విభీషణుం డతిముదమున
ప్రాంజలిఘటించి కడువిధేయత రఘుప్రవీర గనుగొని యిట్లని విన్నవించె.

గీ. రఘుకులాధీశ నేనుసురణములోన శక్తికొలదిగ పోరాడి సర్వగతుల
లంకపై దాడివెడలి బలంబుమెరయ సాయమొనరింతునీకు నిస్సంశయముగ.

కవిరాజవిరాజితము :

అనుచువచింప రఘూద్వహుడెంతయు హర్షమెలర్ప విభీషణునిం
దనివిసనంగ కవుంగిటజేరిచి తద్దయులక్ష్మణునింగని యి
ట్లనియె సహోదర నీవురయంబున సంబుధితోయము దెమ్మిపుడీ
తనిసభిషేక మొనర్పగ నిమ్ముగ దానవరాజ్యరమాపతిగాన్.

వ. అని యాజ్ఞాపించుటయు తత్క్షణంబ లక్ష్మణుండు కపిప్రముఖులచే కలశంబులతో
సముద్రోదకంబుల దెప్పించుటయు, నంత

సీ. అభిషేకమొనరించి రసురరాజ్యమునకు నలవిభీషణు సాగరాంబువులను
పరిసుళశీతల పవనముల్ వీతెంచె దివిదుందుభిధ్వనుల్ దీటుకొనగ
పుష్పవర్షంబు వేల్పులవీఁడువర్షించె వానరజయజయ ధ్వానములర
రవితనూజుడును శ్రీరామచంద్రుండును సౌమిత్రితోగూడి సకలకపులు
తత్సముద్రోత్తర తటస్థిత ప్రశస్త పర్వతోపాంత తతశిలాభాగమందు
నతులవైభమున ప్రహర్షాంతరంగు లగుచు సభిజిన్మహాత్రంబునందుపేర్మి.

వ. అయ్యవసరంబున వానరులెల్లరు శ్రీరాముని వాత్సల్యోదార్యాది గుణంబుల
కెంతయు పరమానందభరితులై జయజయధ్వానములొనర్చిరనంతరంబ హను
మత్సుగ్రీవులు విభీషణునితో మిత్రమా! యీ వానరవాహిని సముద్రము
ను తరించుటకు సులభోపాయంబు నెరింగింపుమనుటయు నతండిట్లనియె
శ్రీరామచంద్రుండీ సముద్రు నుపాసించి తదనుగ్రహంబువడయునేని సముద్ర
తరణంబు సులభసాధ్యంబని వచింప శ్రీరామచంద్రుండందులకంగీకరించి
తోయనిధితటంబున కుశాస్తరణంబేర్పరించి దానిపై వేదికాంతరవర్తియగు
పావకుచందంబున నదనదీభర్తయగు రత్నాకరు నుపాసించుచు శయనించె.
అట్టియెడ రావణప్రేరితుండై శార్దూలుండను రక్కసుడొకం డయ్యెడ

కేతెంచి ఋక్ష వానరచమూసమూహంబుల నవలోకించి సత్వరంబున లంకకరిగి
రావణునకు బ్రణమిల్లి యిట్లని చెప్పందొడంగె

సీ. ఏమి చెప్పుదుదానవేశ్వర హర్యృక్షవాహిని రెండవవార్ధి బోలె
దర్పించి లంకపై దండెత్తివచ్చి యీరైదామడలదూరమాక్రమించె
రామలక్ష్మణు లపూర్వమహాస్త్రములదాల్చి వార్ధితీరమునకువచ్చియుండి
రేగొంతవిషయమే యెరిగియుండితిగాన నీవు దూతలనంపి నిఖిలవార్త
లరయుదగుదింక నాలస్యమాచరింప జనదు సీతనొసంగుటో సాంత్వనములు
బల్కుటయో లేకభేదాద్యుపాయములను మెలపుమీరఁ బ్రయోగింప
వలయుసూవె.

—: రావణుడు శుకుడనువానిని సుగ్రీవాదులకడ కనుపుట :—

క. అని నుడువ దశముఖుడు శుకుడను వానిని బిలిచి పలికె నసురవరాగ్ర
క్కున నీవుబోయి సుగ్రీవునికడ నా మాటలుగ ప్రబోధింపుమిటుల్.

సీ. హరియూథనాథ నీవాలింపుమొకమాట సత్కులీనుడవు ప్రసన్నమతివి
రామాశ్రయమున సార్థకమును మరినిరాశ్రయమున పెనునిరర్థకము లేదు
తలపోయ నీవు సోదరతుల్యుడవు నాకు యేలవైరము మనకిరువురకును
రఘుకులేశ్వరుని భార్యను నేహరించితి దాననీకొదవిన హానియేమి
చనుము కిష్కింధకెంతయు సౌఖ్యముగను సుమనసులకేని లంకలో జొరనశక్య
మనిన నరవానరులమాట లడుగవలెనె మానవులతోడ చెలిమినిమానుమింక.

వ. అని సందేశమంప శుకుండు పక్షిరూపమున సుగ్రీవాదుల సముఖమునకేతెంచి
గగనభాగంబున నిలిచి సుగ్రీవునితో రావణుని సందేశమును వినుపించుచుండ
వానరలెల్లరు వానిని చుట్టిముట్టి వివిధవిధంబుల హింసింప తత్పీడనంబోర్వక
వాడు రామునితో మొరబెట్టుకొనుటయు శ్రీరాముడాతనియెడ కరుణించి విడి
పింప వాడంతరిక్షముననిలిచి సుగ్రీవా రావణునకేమి సమాధానమని
యడుగ సుగ్రీవుడు రావణునితో నా మాటలుగా నిట్లనుమని వాకొన
దొడంగె.

సీ. నీవు నాకెటువంటి స్నేహితుండవుకావు నీయెడ ననరుంచ నీతిగాదు
నాకుపకార మెన్నడు నీవొనర్పలే దొవర నాకీవు ప్రియుడవునుకావు
రామభూవిభుని భార్యను తెచ్చితివిగాన క్రూరుడౌ వాలిని గూల్చినటుల
నినుసతీసుత సుహృన్నివహంబుతోడుత బలుశౌర్యమున గూల్ప
వలయుసుమ్ము

గీ. భాస్కరుని ప్రక్కకొదిగిన పాకశాసనాది దివ్యులమాటున నణగియున్న
వేగపాతాళమున జొచ్చి డాగియున్న దాశరథి నిన్ను విడువడుదైత్యనాథా.

వ. అని పల్కుచున్న నంత నంగదుడు రోషముతో

ఉ. ఆరయపీడు దౌత్యమునకై చనుదేరగలేదు గూఢుడౌ
చారుడటంచు దోచె మనసైన్యములోపలి లోటుపాటులన్
ధీరతగుర్తెరుంగ నరుదెంచెను సందియమేలసంక నీ
క్రూరునిబట్టి కట్టుడిటకున్ జననీయకు డిన్నిభంగులన్.

వ. అని నుడువుటయు వానరప్రముఖులు కొందరు వానిని త్రాళ్ళతో బంధించి రంత.

—: శ్రీరాముడు సముద్రుని శరణాగతి చేయుట :—

గీ. శత్రుహరుడగు శ్రీరామచంద్రుడంత జలనిధితటంబునన్ దర్భశయ్యయందు
ప్రాఙ్ముఖంబుగ శయనించి పరమనిష్ట దగనుపాసించె తత్సరిత్పతినిగూర్చి.

వ. నదనదీనాయకా! నిన్ను శరణంబర్థించునాయెడ ప్రసన్నుండవై నా సైన్యము లకును నాకును లంకానగర ప్రవేశమునకు మార్గమొసంగుమని త్రికరణశుద్ధిగా మూడురాత్రులు నియతుండనై యుపాసించితి. మూఢచిత్తుండగు సాగరుండు ప్రసన్నుండుగాకున్న శ్రీరాముండత్యుత్కట క్రోధావేశంబున కన్నుంగవ కెంపుగదుర శుభలక్షణుండగు లక్ష్మణునితో డిట్లనియె.

ఉ. కాంచితివే సహోదర సగౌరవభావముతోడ నేను ప్రా
ర్థించుకొలంది తోయనిధి తెంపునదర్పనవివాక గర్వియై
యుంచుకలెక్కసేయ డిల హీనులు సత్పురుషాళిపట్ల ని
ట్లుంచిత సద్గుణంబులు నిరర్థకపద్ధతినెంతురెంతయున్.

గీ. సజ్జనులపట్ల చెలువొందు శమదమంబు లార్జవము ప్రియభాషణమాదిగాగ
సద్గుణంబులసామర్థ్య గరణి నెంతు రవనినల్లెడకడుదుష్టులైనజనులు.

గీ. లక్ష్మణా! విశ్వమందు దలంచిచూడ సమరరంగస్థలంబున సామమునను
జయముసాధింపగాలేరు సామమునను యశమునార్జింపగాలేరు న్యాయముగను.

వ. గావున నితనినిదండోపాయమునసాధించితీరెద.

శా. చాపంబున్ గొనితెమ్ములక్ష్మణ మహాసర్పప్రతీకాశమై
దీపింపన్ విలసచ్ఛరప్రతతితో తీవ్రంబుగానిప్పుడే
యీపాథోనిధితోయమెల్లం దృటిలోనింకింతుతజ్జంతు సం
తాపాటోపముతో కపుల్ నడచియుత్సాహంబుతో నేగెడున్.

శా. సౌమిత్రీ గనుగొంటివే జలధివైషమ్యంబునన్ నేడు మ
త్సామర్థ్యంబునెరుంగజాలకనలక్ష్య స్వాభిమానంబుతో
భీమంబై ఘనఘుంఘుమధ్వనుల గంభీరాంభసంరంభయై
వ్యోమంబంటుమహోర్మిమాలికలతో నుప్పొంగెగర్వోన్నతిన్.

వ. ఇంక నుపేక్షించిన ప్రయోజనము లేదు మదీయక్షమాగుణంబితని కసమర్థతగా తోచుచున్నది కాబోలునని తక్షణంబ.

శా. కాలాగ్నిప్రతిమాన తేజమున దీర్ఘంబైన కోదండముం
గేలందాల్చి రఘూద్వహుండు భుజశక్తిన్ నారిసారించు చా
భీలప్రోజ్జ్వల వజ్రతుల్యశరముం బేర్మిం బ్రయోగింప న
వ్వేళన్ వార్ధిమహోగ్రసత్త్వములతో భీతిల్లి ఘూర్ణిల్లగన్.

వ. అయ్యవసరంబున లక్ష్మణుండు శ్రీరాముతో సుహాత్మా! నీకిట్టిజగత్ప్రళయ హేతుకంబైన యాగ్రహంబు తగదు శాంతింపవలయునని విన్నవించుచున్నను క్రోధంబుడుగక శ్రీరాముడు వెండియు సముద్రునితో.

శా. ఔరావారిధి దోసిలొగ్గి బహుగా ప్రార్థించుచున్నన్ మహా
ఘోరాకారముదాల్చి మూర్ఖముగ మాకున్ మార్గముంజూపవా
క్రూరా మత్కరినోగ్ర దివ్యశరపంక్తుల్ నీపయిం గుప్పి పెన్
నీరంబున్ జలజంతుసంతతులతో నిర్మూలముంజేసెదన్.

చ. సరళమనంబునన్ మిగులసంస్తుతిజేసిన సుప్రసన్నతం
గరుణవహింపవించుకయు గర్వమ తుళ్ళుడగింతు నింక మ
చ్ఛరతతి సేతుబంధనముసల్పెద మద్భుజశౌర్యసారమీ
వెరుగవు కాంచుమాప్లవగులేగెడుకాల్నడలన్ హుటాహుటిన్.

వ. అంత నిలువక.

శా. అంతన్ రామవిభుండు చాపమున బ్రహ్మాస్త్రంబుసంధించి క
ల్పాంతాగ్నిప్రతిమానతేజమున వేయంబూన లోకంబు ల
త్యంతంబాకులమందె చీకటులుభూమ్యాకాశముల్గప్పె వి
భ్రాంతిం బ్రోవలుదప్పిరిందుతపనుల్ వ్రాలెన్ మహోల్కాతతుల్.

క. పిడుగులుబడె గడగడమనివడకె మహాగిరులు ప్రళయవాయువువీచెం
జెడమిడియును ష్టదలుబ్రిదిలెం దొడితొడిజంతువులుభయముతోనార్చెకడున్.

వ. అట్టి ప్రళయకాల సంరంభ విజృంభణంబెరింగి సముద్రుడు స్వాభావికమహోత్తుంగ తరంగసంఘర్షణ ఘోషణాది జలవేగంబుపసంహరించుకొని కొంత దవ్వులోనికరిగి అమ్మహాజలాంతర్భాగంబునందుండి.

—: శ్రీరామునకు సముద్రుడు ప్రత్యక్షమగుట .—

సీ. స్నిగ్ధమై దూర్వ సన్నిభశరీరమువాడు కమలపత్రాభ నేత్రములవాడు
మణిమయోజ్జ్వల హిరణ్మయవిభూషధరుం డనుపమరక్త మాల్యాంబరుండు
దివ్యపుష్పస్రజోద్దీప్త శిరస్కుండు గండమండిత రత్నకుండలుండు
మహనీయకౌస్తుభ మణిసహోదర రత్నకలిత హారైక వక్షస్థలుండు
మేరుశిఖరాగ్రమునసుండి మించురుచుల వెల్వడెడు బాలభాస్కరునివిధమునఁ జలాంతరమునుండి వచ్చి రత్నాకరుండు ప్రాంజలిఘటించి రఘుపతికనియెనిట్లు.

సీ. రక్షింపుమోజగద్రక్షక మహనీయ రఘువంశవర్ధనా రామచంద్ర
భువనావనార్థమై భువిమానవాకృతి నవతరించిన విభుండవుమహాత్మ
భవదాజ్ఞ చేతదిక్పతులును సూర్యచంద్రమరుత్కృశానుభూతములుసహజ
విధుల నిర్వర్తించి వెలయుదురదితప్పి చనగనెవ్వరికిని సాధ్యపడదు
గాన నేనును మరియీయగాధ తోయపూరితుడనై ప్రసిద్ధినొప్పుటయె నైజ
మందుకువిరుద్ధముగ నుంటనర్హ మగునె వినుముశ్రీరామచంద్ర మద్విన్నపంబు.

వ. మహాత్మా ! నా తప్పు మన్నింపుము. నాయందు గల కమఠ కచ్ఛప మకరాది మహాసత్వ సమాకీర్ణంబైన జలంబుల స్తంభింపజేయ వలనుపడదు. కావున నేనొక్క యుపాయంబాలోచించితి. సావధానమనస్కుండవై యాకర్ణింపుము. ఈ కపిసైన్యంబబ్ధితరించుపర్యంతము మకరాది జలజంతువులవలని యుపద్రవంబు గలుగకుండువిధంబున నొనరించి సేతుబంధనమునకు మార్గబొనంగెద గావున.

చ. నలుడనువానరోత్తముని నావయి సేతువుగట్టనిమ్ముల
నిలువననుజ్ఞ సేయుమతి నేర్పరి పీరుడు విశ్వకర్మతో
తులయగు నమ్మహాత్ముని సుతుండిత డట్లొనరింపనేనతో
జలనిధిను త్తరింపనగు సౌఖ్యకరంబుగ శ్రీరఘూత్తమా.

చ. అనవుడు శ్రీరఘుప్రవరు డాగ్రహమున్ విడనాడి మెల్లనన్
వననిధితోడ నిట్లనియె వ్యర్థముకాని మదీయసాయకం

బును విడువంగ యోగ్యమగు భూస్థలమెచ్చటనో వచింపు మం
చన మునమంది రామునకు నంబుధి వెండియుబల్కె నీక్రియన్.

ఉ. శ్రీరఘువంశవర్ధన వచించెద విన్నపమాలకింపుమా
వారిధిలోన నుత్తరపు భాగమునన్ ద్రుమకుల్యనాగ నొ
ప్పారెడి పుణ్యభూమి కలదందు వసింత్రు మహోగ్రకర్ములా
భీరులు పాపవర్తనులు పెక్కురు వారలనేయుడిమ్ములన్.

వ. అని విన్నవించుటయు శ్రీరామచంద్రుండు వల్లెయని తచ్ఛరంబును తత్ప్రదేశ
మునఁ బ్రయోగించె నబ్బాణపాతంబునకు రసాతలపర్యంతమచ్చోట భూమి
బ్రద్దలై వ్రణంబై యటనుండి భయంకర ధ్వనితో జలంబాకసపర్యంతమెగసె
నట్టియెడ తత్ప్రదేశంబెల్ల దహింపబడి నిర్జలంబై మరుకాంతారంబునా
ప్రసిద్ధికెక్కెనంత శ్రీరామచంద్రుడా ప్రదేశమునకొక్క వరంబు ప్రసా
దించె. తద్వరప్రభావంబున పశుసంతతికి హితకరమగు కసవుగలిగి రోగరహిత
మగు ఫలమూల సమృద్ధంబై నేయి తేనె పాలు పరిమళయుక్తమగు నానా
విధపదార్థలతో ప్రసిద్ధి వహించె తదనంతరంబ సముద్రుడు శ్రీరామ
చంద్రునితో నిట్లనియె శ్రీరామచంద్రా!

గీ. భవదభీష్టార్థమెల్ల సాఫల్యమగును సెలవొసంగుము రఘుకులశ్రేష్ఠ యని ప్ర
ణామమర్పించుచును తదర్హ వవరేణ్య డచట నంతర్హితుండయ్యె నాక్షణంబ.

గీ. వదపడి నలుండనంబడు ప్లవగవంశ శేఖరుండతిధీరుండు శ్రీరఘువరు
చరణముల వ్రాలి మ్రొక్కి సాంజలిఘటించి ప్రమదమున నివ్విధంబున
బలుకదొడగె.

సీ. రఘుకులాంభోనిధి రాకాసుధాకర వినుడు మద్విజ్ఞప్తి విశ్వకర్మ
కౌరసపుత్రుండ నతని సమానుండ నత్యంబుపల్కె నీసాగరుండు
మందరాచలమున మజ్జననికి విశ్వకర్మవరంబిచ్చెఁ గరుణవెలయ
నితని భావణముల నిప్పుడన్మచ్ఛక్తి స్మరణకు వచ్చె నిస్సంశయముగ
నధికమగు పితృసామర్థ్య మాశ్రయించి ప్రబలవిస్తీర్ణనుగుపయోరాశిపైన
మించి సేతువు నేను నిర్మించువాడ ప్లవగవరులెల్ల నాకు తోడ్పడగవలయు.

—: వానరులు సముద్రముపై సేతువు నిర్మించుట :—

వ. అని విన్నవించె. అనంతరంబ శ్రీరాముని యాదేశానుసారము పర్వతాకారు
లైన వానరభల్లూక ప్రముఖులు సకలదిగ్భాగములకు పరుగులువారుచు
మిగులనున్నతములైన గిరిశృంగంబులఁ గొప్ప గొప్ప గండశిలల నత్యున్నత

ములగు నానావిధవృక్షసముదయంబునుఁ గొనివచ్చి సాగరంబున బ్రడవైచు చుండి రట్టియెడ తత్పతనకారణంబున భయంకరధ్వనులతో జలంబాకస పర్యంతమెగురుచుండె. ఇట్లు వానరవాహిని నలుకెలంకులకురికి శిలావృక్షాదులచే సముద్రంబును మిగుఁగలచుచుండి రయ్యవసరంబున.

కవిరాజవిరాజితము :

వనచరవీరులు కొందరు సేతువుపై నిరుప్రక్కల నేర్పున యో
జనశతమాత్ర దృఢంబగు త్రాళ్ళను చక్కగకట్టిన దండములన్
గొనినిలువంబడ కొందరు కొండల కొందరు వృక్షలతాదుల త
ద్వననిధిలో బ్రడవైచుచు కట్టిరి కుర్వులువారుచు నుద్ధతులై.

వ. ఇట్లత్యంతోత్సాహంబున నెడతెరపిలేక కొంద రెదురందుకొనుచుండ కొందరు సేతువుపై కంకర యిసుకతో నింపి సమతలంబేర్పరచుచుండిరిట్లు ప్రథమ వానరంబున పదునాల్గు యోజనంబులును - రెండవదినంబున నిరువది యోజనంబులును-మూడవదినంబున నిరువదియొక్క యోజనంబులును-నాల్గవదినంబున నిరువదిరెండు యోజనంబులును-ఐదవరోజు సువేలాచలంబంట నిరువది మూడు యోజనంబులును - క్రమాభివృద్ధిగా సముద్రమున పది యోజనంబుల విస్తృతంబును గల్గి శతయోజన ప్రమాణదూరమగు సేతువును మిట్ట పల్లములులేక నెంతయు శోభాయమానంబైన పథంబును జలనిధిలోన పావట దీర్చిన విధంబున నిర్విఘ్నకరముగా సమాప్తినొందించి రట్టియెడ గరుడ గంధర్వ కిన్నర చారణ విద్యాధర ప్రముఖ దేవతావర్యులు నభోభాగంబున నిల్చి యమ్మహాత్కార్య నిర్వహణంబున కెంతయు విభ్రాంతచిత్తులై శ్రీరాముని వేనోళ్ళ స్తుతించిరి. స్వాతీనక్షత్రవీధికైవడి మిగుల ప్రకాశమానముగా నలువొందు సేతువుపై కోట్లకొలది వానరవీరులు కిలకిలారావములుసేయుచు గంతులువైచుచు నొండొరులు పైకురవడించుచు వివిధప్రకారముల సేతువుపై ప్రయాణము సేయుచుండిరానమయంబున.

గీ. పదపడి విభీషణుడు గదాపాణియగుచు జలధిదక్షిణతటమున సచివవరులు బలసిగొలువంగ వైరులబొలియఁజేయు యత్నమున సిద్ధమైనిల్చె నంతలోన.

వ. సుగ్రీవుడు శ్రీరాముని సన్నిధికేతెంచి వానరుల సేతునిర్మాణకార్యక్రమంబును విన్నవింప తన్నిర్మాణచాతుర్యమునకెంతయు సంతసించె నట్టియెడ శ్రీరామునితో సుగ్రీవుండిట్లనియె.

శా. స్వామీ మీరు సమీరనందను భుజాస్కంధంబధిష్ఠింపుడీ
సౌమిత్రిన్ మనవాలిసూనుడు భుజాస్తంభంబునన్ దాల్చియున్
సామర్థ్యంబుల నిర్వ్వరభ్రగతులై సంద్రంబుదాటింతు రి
క్షేమున్ మీ వెనువెంటవత్తుమనిరన్ హృష్టాత్ములై రెల్లరున్.

వ. శ్రీరామచంద్రుడు కోదండధరుండై హనుమ భుజాస్కంధమధిష్ఠించె లక్ష్మణుం డంగదు భుజపీఠంబలంకరించె సుగ్రీవప్రముఖులు బాసటయై ముందు వెనుక ప్రక్కల జనుచు వానరులు కోలాహలధ్వనులుజేయుచు ఫలమూల సమృద్ధం బైన సముద్రదక్షిణతటంబునకు జేరి యట సముచితప్రదేశంబుల సైన్యంబుల విడిచిరట్టియెడ శ్రీరాముని ప్రభావంబును నలసేతునిర్మాణంబును గనుంగొని దేవ గంధర్వ ప్రముఖులు శ్రీరాముని సన్నిధికేతెంచి మంగళతోయంబుల నభిషేకించి యిట్లని స్తుతించిరి.

సీ. శ్రీరామచంద్ర నిస్సీమదయాసాంద్ర నీప్రభావంబు వర్ణింపవశమె
ఖరదూషణాది రక్కసులనొక్కరుడవే కదనరంగమున జక్కడచినావు
వాలినొక్కమ్మున గూలిచి కపిరాజ్య మర్కసూతికొసంగి తధికకూర్మి
కడలిపై చక్కగా కపివరేణ్యులచేత సేతునిర్మాణంబు జేసినావు
సంగరస్థలి ఘోరరాక్షసులనెల్ల నుక్కడచి వేడ్క శ్రీమదయోధ్యకరిగి
సర్వసామ్రాజ్య వైభవైశ్వర్యగరిమ నుల్లసిల్లుము చిరకాలముర్వియందు.

వ. అని బహుప్రకారముల పొగడుచుండి రనంతరంబ శకునశాస్త్రపండితుండైన శ్రీరామచంద్రుడు భూమ్యంతరిక్షముల నెల్లెడల ప్రళయహేతుకంబులైన కొన్నిదుర్నిమిత్తంబులు వెలువడుట గనుంగొని లక్ష్మణునితో నిట్లనియె. లక్ష్మణా ! ప్రజానాశహేతుకంబులైన దుర్నిమిత్తంబులెన్నియో వెలువడు చున్నవి గనుగొంటివే.

సీ. విపరీతమగుగాడ్పు వీతెంచి కెంధూళు లఖిలదిక్తటముల నలముకొనియె
కువలయంబల్లాడె కులగిరుల్ కంపించె కుజములు ప్రేళ్ళతో గూలె ధాత్రి
క్రవ్యాదనిభములై కాదంబినులు భయంకరగర్జలిడుచు రక్తమునుగురిసె
కుంకుమారుణదీప్తి కొమరొందెసంధ్యలు నర్కునిలోననుండగ్నిపడియె
శశి కడుతపింపజేసె నిష్ప్రభలనొలసి సూర్యమండలమున నల్లచుక్కదోచె
దారకలు కాంతిచెడె జగత్ప్రళయ హేతుచిహ్నములుపెక్కుగతుల
సూచించుచుండె.

వ. కావున ఘోరమగు సంగ్రామరంగంబున దైత్య దానవ వానర భల్లూక ప్రముఖుల మాంస శోణిత సిక్తంబై ధరాతలంబెల్ల పంకిలంబుకాగలదు.

మనమింక నిచటనాలస్యంబు సేయంజనదు లంకముట్టడిచేయవలయు మీరెల్లరు మీమీ సైన్యములతో సిద్ధముకావలయునని యుద్బోధించి తాను ధనుర్ధారియై లంకకభిముఖముగా నడచె లంకానగరంబులోని భేరీమృదంగాది తూర్యధ్వనులాలించి సుగ్రీవ విభీషణ ప్రభృతులు వానరసైన్యంబులతో శత్రువుల జయించుకుతుకంబున సింహనాదంబులు గావించిరంత శ్రీరామచంద్రుడు లంకానగర సౌభాగ్యంబునకచ్చెరువందుచు లక్ష్మణునితో నిట్లనియె.

సీ. లక్ష్మణా గంటివే లంకాపురీవర శృంగారమెంతయు చెలువమలర
కడుయత్నమున విశ్వకర్మనిర్మించె వేడ్కం ద్రికూటాచలాగ్రమున గగన
తలమునకంటి చిత్రముగ ప్రకాశించు మణిమయ దివ్యవిమానచయము
కాంచనోజ్జ్వల రత్నఘటిత గోపుర రమ్యహర్మ్య పంక్తులు దేవతాలయములు
రాజనగరులు బహువిధ రత్నతోరణములు చక్కని పుష్పవనంబు లమల
తోయపరిపూర్ణ పరిఖలతోడ మిగుల నద్భుతావహమైయొప్పె నతులదీప్తి.

వ. వానరప్రముఖులెల్లరు గొప్పశైలముల మ్రాకుల బెరికి ధరించి లంకాపుర విధ్వంసమునకు సంసిద్ధంబై నిల్చియుండి రాసమయంబున శ్రీరాముడు సుగ్రీవునితో నిట్లనియె. రవినందనా! సేనలనెల్ల విభజించి నిల్పితిమి యింక రావణుని దూతయగు శుకుని విడిచివుచ్చుండనవుడు వానరులతనిని విడిచివుచ్చిన నతండు రావణునిపాలికరిగి నమస్కరించి నిలిచిన వానితో రావణుం డిట్లనియె.

క. రక్కసిగమికాడా నీ రెక్కలుతునియబడ వైపరీత్యంబుగ నీ
వక్కట కపివర్యులచే జిక్కితివాయనుడు వాడు జేమోడ్చియనున్.

ఉ. ఏమనివిన్నవింతు దనుజేశ్వర యుష్మదనుజ్ఞ చొప్పునన్
రామునియొద్దకేగి కపిరాజుసమక్షమమున నీవచ
స్తోమము నుగ్గడించు ననుజుట్టి వనచరయూధముల్ కడు
బాములబెట్టి కట్టి బహుభంగుల జంపగజూచిరుగ్రులై.

వ. రాక్షసరాజా! నాకు మాటలాడుట కవకాశమే చిక్కనదికాదు. నాకు ప్రత్యుత్తరమొసంగువాడును లేకుండిరి. మరియు శ్రీరాముడు సముద్రముపై వానరులచేత సేతువునిర్మాణమొనర్చి సముద్రమును దాటి వచ్చి లంకముట్టడించిరి. పర్వతాకారులైన వానరసేనలు నేల యీనినచందంబున భూభాగంబంతయు వ్యాపించియుండిరి. కావున

శా. ప్రాకారంబుల కెక్కి వానరచమూవర్ణంబు లింకనౌ మదో
ద్రేకస్ఫూర్తి గలంచకుండమునుపే ధీరత్వమేపార నే
డేకార్యంబొనరింపజూడు మటుకాదేనిన్ వడిన్ జానకిం
గాకుత్స్థాగ్రణికిచ్చివేయు మదియుంగాదేని పోరాడుమా.

వ. అని విన్నవింప రావణుడత్యంత క్రోధారుణిత లోచనుండై శుకునితో నిట్లనియె.

సీ. దేవగంధర్వ దైతేయ వర్గములకు వెరవని జగదేకవీరుడనగు
యేనీవనాటుల కీనరాధములకు భయమొందుదునె శుకా భండనమున
చేవాడితనమున జెండెద వైరుల జనకరాట్తనయ నొసంగనుమ్ము
కొరవులగొని దొడ్డకరులందొలెడుపోల్కి కరకుటమ్ముల రామంబొరిగొనగల
సూర్యబింబంబు సకలవస్తువుల కాంతి గోరి హరియించుపోలిక క్రూరుడైన
రామలక్ష్మణులను ఘోరరణములోన నిముషమాత్రంబున హరింతు
నిశ్చయముగ

సీ. కదనరంగమున మద్గమనవేగము మహోగ్రవళయాబ్ధిరయమునుపరిహసించు
శత్రువాహినులపై జనుమదీయోద్ధతి జంఝానిలమును నీచముగనెంచు
పోరంగడంగు నాపొదిలోని బాణముల్ ప్రబలవిషోరగ ప్రతిభనడరు
సమరేచ్ఛనరుగ సన్నద్ధను క్షేప్యంబు శక్రచాపమునైన సక్కమాడు
యిట్టి నాశౌర్యతేజంబు నెరుగకునికి రాముడిప్పుడు నాతోడ రణమొనర్ప
దలచికాబోలు కోతులదండుతోడ వచ్చుచున్నాడు ప్రబలగర్వమునజేసి.

గీ. శమన వాసవ వరుణ వైశ్రవణ ముఖ్య సర్వగీర్వాణ వరులు మత్సముఖమందు
నిలిచి సమరాంగణంబున నేర్పుమీర విజయమొందంగగలరె దోర్విక్రమమున.

వ. అని వెండియు నిట్లనియె. దుస్సాధ్యమగు సముద్రముపై శ్రీరాముడు మున్నెన్నడు కనివిని యెరుంగని సేతువు నిర్మించెననుట నమ్మతగినదికాదు, మీరు వానరాకారములతో గూఢచారులుగా వానరసేనలోజొచ్చి యచ్చటి విశేషములనెల్ల గ్రహించి సత్వరంబున రండని యాదేశింప తత్క్షణంబ శుకసారణు లిర్వురు వానరాకారములతో వానరసేనలోజొచ్చి సైన్యముల పరికించుచుండునంత,

శా. శైలాగ్రంబుల కందరంబుల వనప్రాంతంబులన్ వార్ధి రా
డ్వేలోపాంతములన్ గుహాప్రతతులన్ వృక్షాగ్రభాగంబులన్
నేలన్ సేతువుపైన నెల్లెడల వర్ణింపంగ దుస్సాధ్యమై
గోలాంగూల ప్లవంగ ఋక్షగణముల్ కోటానుకోట్లైతగన్.

గీ. కాంచివిస్మితులైన తత్కపటకపుల గ్రక్కున విభీషణుడును తద్రాక్షసులను
బట్టికొనివచ్చి రాజుభూవరుని మ్రోల నిలుప శుకసారణులు
భయాన్వితులునగుచు.

శా. ఆకర్ణింపుము రామచంద్ర భవదీయంబౌ బలాధిక్యమున్
సాకల్యంబుగ గాంచిరండనుచు రక్షస్స్వామిబంపంగ క
ప్యాకారంబులతోడ జొచ్చితిమి సైన్యంబందునన్ నావుడుం
గాకుత్స్థాన్వయభూషణుండునగి వేడ్కన్ వారితో నిట్లనున్.

ఉ. ఓరినిశాటులార భయమొందకుడిందు విభీషణుండు మ
ద్భూరివరూథినీచయము బూర్తిగజూపును చూచి మీ విభుం
జేరి మదద్భుత ప్రతిభ జెప్పుడు రావణు నీక్షణంబునం
బోర సపుత్ర మిత్రముగ భూస్తలికిం బలినిత్తు గాంచుడీ.

వ. అని వచించి వారలతో రక్కసులార మీరలు లంకకరిగి నా మాటలుగా
రావణునితో నిట్లు వచింపుడు.

సీ. ఏబల్మితోడ నాయిల్లాలిని హరించి తాబలంబిపుడు నాకగబరపుము
యెల్లి నీనగరున నేజొచ్చి శరవహ్ని గాల్చు మద్భుజశక్తిఁ గాంచగలవు
వజ్రిదైత్యులపైన వజ్రాయుధము బ్రయోగించినవిధమున మించునాదు
క్రోధాగ్నిశిఖలలోఁ గూలుటసత్యంబు కాచికొమ్మిక దుష్టకష్టశీల
యనివచించితినని తెల్పుడనిన రామునుడుల నాలించి శుకసారణులు రయమున
రావణుని పాలికరుదెంచి ప్రణతులాచరించి మెల్లన నిట్లు వచించిరేలమి.

వ. ప్రభో! మేము వానరాకారములతో సుగ్రీవుని సేనాసమూహమున ప్రవే
శించినతోడనే విభీషణుడు మమ్ములఁగుర్తించి శ్రీరాముని కొప్పగించె నంత
దయార్ద్రచిత్తుండగు శ్రీరాముడు మమ్ము హింసింపవలదని యాజ్ఞాపించి మీ
కొక్క సందేశమును దెలుపుమని వచించె. వారిలో శ్రీరామలక్ష్మణసుగ్రీవ
విభీషణులు నల్వురు సర్వశస్త్రాస్త్రధారులై దిక్పతులతో సమానమగు బల
పరాక్రమములతో లంకవిధ్వంసమొనర్ప నేకాభిప్రాయముతో కృతనిశ్చ
యులై యున్నవారు. తక్కుంగల వానరుల పరాక్రమములెట్టున్నను శ్రీరాము
డొక్కడే లంకాపురంబెల్ల విధ్వంసం బొనర్పగలడని తోచెడి కావున
నీవిప్పుడు శ్రీరామునితో పగవీడి సీతను సమర్పించిన మనకెల్లరకు శ్రేయ
మని మాయాశయము యింక దేవరచిత్తమని విన్నవించు శుకసారణులతో
రావణుం డిట్లనియె.

చ. దివిషదనీకినిం గలన ధీరత గెల్వఁగనోపు నట్టి నం
బవరమునన్ జయింపఁగల బాహుబలాఢ్యుఁడొకండు కల్గునే
ప్లవగులచే పరాభవము ప్రాప్తిలుటన్ భయవిహ్వలాత్ములై
వివరమెరుంగకిట్లు లవివేకముగా వచియించుచుంటిరే.

గీ. అని మహారోషమున బల్కి యసురవిభుడు విమలహిమపాండురచ్ఛవి వెలయురమ్య
భర్మహర్మ్యాగ్రమున కెక్కి పర్వతాబ్ధి కాననాంతర పూర్ణులౌ కపులఁగాంచె.

వ. ఇట్లు రెండవ సముద్రంబుకరణి వ్యాపించియున్న యసంఖ్యాకులగు వానర భల్లూక వాహినులం గలయంగనుంగొని రావణుడు సారణునితో నిట్లనియె. మిత్రమా! యీ వానరవాహినియందు యధికబలోత్సాహములతో నలు ప్రక్కల యుద్ధసన్నద్ధులగు వారెవ్వరు. సుగ్రీవుండెవ్వనితో యాలోచించు చుండును. మరియు యూధపతులకెల్ల రకు నాయకుండెవ్వడు మరియు నిందు ప్రధానులైన వారెవ్వరు సకల విషయములు తేటగా నెరింగింపుమనుటయు సారణుండిట్లనియె.

సీ. అవధరింపుము ప్రభూ ప్లవగనాధులభుజబలశౌర్య విషయముక దెలుపఁగలము
నలుండనెడువాడు నిఖిలవానరయూధముఖ్యుండు నీసకుముందునిలిచె
వాలిసుతుండు దుర్వారపరాక్రముం డద్రిరాట్ప్రతిమాను డంగదుండు
నీలుడనుపేరి వానరనాయకుడు వార్ధి విరాధ సేతువును నిర్మించిమించె
హనుమయనువాని దోర్బలాదులెల్ల మున్నుమన పెల్లరము గాంచియున్న దెగద
సేతువనుమర్కటాన్వయ శేఖరుండు మున్నగు ననాటులనిసేయ మొనసియుండె.

వ. వారిమధ్య హనుమయను వాని భుజాగ్రంబున నీలమేఘ నిభశరీరుండగు వాడే శ్రీరాముడు.

మ. అతడిక్ష్వాకులలో మహారథుడు దివ్యాస్త్రప్రవీణుండు నం
తతమున్ నిశ్చలధర్మతత్పరుడు దోర్దర్పంబునన్ దేవతా
పతికిన్ దీటగువాడు మృత్యునమ కోపస్ఫూర్తితో విష్టప
ప్రతతిన్ యొక్కట వేగ జక్కడచు దుర్వార ప్రభావుండనిన్.

క. రాముసకు దక్షిణంబున హేమాభ శరీరుడంబుజేక్షణుడతడే
సౌమిత్రియనగ నొప్పును రాముని ప్రియసోదరుండు రణకౌశలుడున్.

వ. అతడు మిక్కిలి నీతిమంతుడు. సకలశాస్త్రవిశారదుండు రణదుర్జయుడు మహాశౌర్యమూర్తి అట్టి మహాగుణసంపన్నుడగు లక్ష్మణుడు శ్రీరామునకు కుడి భుజముగా నిలిచి యున్నవాడు.

ఉ. రాముని వామభాగమున ప్రాభవమొప్ప విభీషణుండు దు
స్తామసమూని నిన్నిప్పుడు సంగరమందు జయింపగా నమ
ద్భూమినినిల్చె గంటివె ప్రభూ రఘురాముడు పట్టభద్రునిం
గా మనలంకకున్ సలిపె గౌరవమొప్పగ తద్విభీషణున్.

ఉ. రావణ కాంచుమా వనచరప్రకరంబుల మధ్యలో మహా
గ్రావమసంగనొప్పె బలుకాంతి యశో బల శౌర్యధీ విశే
షావహు డత్యుదగ్రు డతులాహవభూముల దుర్జయుండు సు
గ్రీవుడనన్ ప్రసిద్ధుడల కీశకుల ప్రభుడాతడే సుమీ.

వ. దైత్యనాథా ఘోరాకారులగు వానరసైన్యములవలన మనకు పరాజయము సంభవించుబోవుచున్నది. గావున మీరు తగువిధంబున తప్పుకొను ప్రయత్నమందుండుట యుక్తమని పలుకు సారణ శుకులపై క్రోధమినుమడింప వారలతో నిట్లనియె.

ఉ. చాలును నోరుమూయుడు నిశాచరులార భయంబుదక్కి నా
మ్రోల విరోధివర్గమును మూర్ఖముగా గొనియాడుచుంటిరే
బాలిశవృత్తి వాతెరచి బల్కిన మిమ్మిప్పుడే వధింతు మీ
శీలము సర్వముం దెలిసె శీఘ్రమె మీరిటనుండిపొండికన్.

వ. అని కోపగించుటయు శుకసారణులు భయసంభ్రమంబులతో లజ్జావనతశిరస్కులై రావణునకు జయంబగుగాకయని పలుకుచు యటనుండి వెడలిపోయిరి. తదనంతరంబు నీతిశాస్త్రకోవిదులగు మిత్రులకొందర రావించి రావణుండు వారలతో నిట్లనియె.

మ. అతిశీఘ్రంబున మీరలేగి రఘువంశాధీశు సంచారప
ద్ధతులెల్లన్ గనిపెట్టిరావలయు నాతండెందు నిద్రించునో
హితులెల్లన్ దనుగొల్వ మేలుకొనునో యేరీతివర్తించునో
చతురత్వంబున గూఢమార్గచరులై సర్వంబతిశ్రద్ధతోన్.

గీ. పండితోత్తములగు జనపతులు మిగుల ప్రజ్ఞగల గూఢచారులవలన వైరి వీరుల సమర్థత నెరింగి పోరులందు స్వల్పయత్నంబుతోడనే జయముగాంత్రు.

వ. ఇట్లాజ్ఞాపితులై శార్దూలుడను వాని మున్నిడుకొని చని సువేలాచలమందొక రహస్యస్థలంబున దాగి సుగ్రీవ విభీషణాంగదాది ప్రముఖుల శౌర్య తేజో విశేషంబులకు భయభ్రాంతులై యుండ విభీషణుండా విషయమును గ్రహించి వారలబట్టి శ్రీరామునకొప్పించిన శ్రీరాముడు వారిలకనికరించి విడువవారలు చని రావణున కాయుధంతమంతయు విన్నవించిరట్టియెడ రావణుండంతర గృహంబులకనిచి యంతఃపురంబుజొచ్చి విద్యుజ్జిహ్వుండను మాయావిశారదు నొక్కని రావించి వానితో రహస్యముగా నిట్లనియె. మంత్రివర మనమిప్పు డొక చిత్రమగు కార్యక్రమంబును నడుపుట యత్యవసరము. గావున నీవు మాయామంత్రబలంబున శ్రీరామునిశిరమువంటి శిరంబును శరయుక్తంబగు చాపంబును సృష్టించుకొని సిద్ధముగానుండుము. నేనిప్పుడు సీతసమీపమున కరిగి యామెను స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నించి నీకు వర్తమానమంపిన తోడనే నీవు వానినచ్చటికి గొనిరావలయునని చెప్పి పంపి రావణుడు సర్వా లంకారశోభితుండై యశోకవనమున సీతసమీపమున కేతెంచి ధీరత్వముగా నామెతో నిట్లనియె.

సీ. రాఘవుండే తెంచి రక్షింపగలడంచు నాశించుచుంటివచ్చాయతాక్షి
హతుడయ్యె నీవిభుండాలంబులోపల నామాటలేశంబు నమ్మవైతి
వాశలు నేటితో నడుగంటె గంటివే నేనుగాకిక దిక్కు నీకుగలదె
విహితభావనముల వినవైతి విటనుండి యెందుబోగలవు పూర్ణేందువదన
యేలయింతటి యాయాస మింకనైన మాథ్యమునుపీడి భావంబు
మార్చుకొనుము
మామకీయ నితంబినీమణులలోన నగ్రమహిషీపదల్లివై యలరుమిపుడు.

వ. జనకపుత్రీ! నీపెంకెతనంబును విడిచి నాయంకస్థలంబలంకరింపుము. శ్రీరాముని వధావిధానంబెరింగించెద నవధరింపుము. వానరసైన్యంబులతో శ్రీరాముడు సూర్యాస్తమయ సమయమునకు సముద్రోత్తర తీరమునకుజేరి మార్గాయాసముచే నొడలెరుంగక గాఢనిద్రావశులై పడియుండ నా సేనాపతియగు ప్రహస్తుడు సైన్యయుక్తముగాజని సైన్యములనెల్ల చీకాకుపరచి శ్రీరాముని శిరమును ఖడ్గముతో నరికివైచె. సుగ్రీవాదివానరులు కొందరు హతులైరి. లక్ష్మణుడు మొదలగువారు కొందరు పలాయితులైరి. హనుమజ్జాంబవదాదులు వికలాంగులైరి. రక్తశిక్తాంగుండై నిహతుండగు శ్రీరాముని శిరంబును గొనితెచ్చితి గనుంగొనదవుగాక యని విద్యుజ్జిహ్వునకు వర్తమానమంప వాడు ధనుస్సహితముగా శ్రీరాముని మాయాశిరంబును గొనితెచ్చి సీత చెంగట నునుచిన రావణుడామెతో నిట్లనియె.

చ. జలజదళాక్షి నీమగనిచాపమిదే గనుగొమ్ము మేటి దో
ర్బలయుతుఁడౌ ప్రహస్తుఁడు రాఘవు నద్దమురేయి బాకుతో
తలఁదెగవేసి తెచ్చెనిదె తథ్యము చాలువృథాప్రయాసతో
సలుపుటఁబొందనేటికి దయానుతి నన్ను పరిగ్రహింపుమా.

వ. అని పలుక సీత శ్రీరాముని శిరంబును శరాసనంబును హఠాత్తుగా గనుంగొని శ్రీరాముని ముఖ నయన శిరోలలాట మూర్ధజాద్యవయవ వైలక్ష్యంబుల సర్వము సుస్పష్టముగా ప్రత్యక్షగోచరములగుటచే రావణుని సంభాషణము లనుబట్టి యథార్థముగా జరిగియుండనోపునని పట్టరాని శోకవేగమున కురరి పక్షిచందంబున వాపోవుచు

గీ. హా మనోనాథ నీవిట్లు హతుఁడవైతె యిట్టివిపరీత మిప్పుడు నీకేల గలిగె
కోమలాకారుఁడీలీల గూలిపోయె కుటిలశీలి ఫలించె నీకోర్కె నేఁడు.

వ. అయ్యయో నేఁడింతటి వైపరీత్యమునకు పాల్పడితివి. నేను కొండంత యాశతో జీవింపగల్గితి జీవితేశ్వరా! నీకకాలమృత్యువెట్లు ప్రాప్తించె. మనకిర్వురకట్టి యకాలమృత్యువును దైవము ఘటింపజేయునే? కేకయరాజపుత్రీ! నిర్దయాస్వాంతవై జగత్పూజ్యుండైన శ్రీరామచంద్రుని నారచీరలతో ఘోరారణ్యములకు తరిమితివి. భయంకర విపత్తుల పాలై మేమిట్లు నాశమొందుచుండ పరమానందభరితురాలవై రాజ్యభోగముల ననుభవించుచుంటివి. దైవమా నాకింక దిక్కెయ్యది. ప్రాణేశ్వరా! నేనంత నిర్భాగ్యురాలనని వాపోవుచు మూర్ఛాక్రాంతయై పడి కొంతవడికి స్మృతికి వచ్చి లేచి అమ్మాయాశిరంబాఘ్రాణించి యిట్లని విలపించె

ఉ. ఇంతవిపత్తు నేఁడు హృదయేశ్వర నీకిటులేల కల్గె దు
ర్దాంత దురంత దుఃఖజలరాశి మునింగితి హా విధాత మ
త్కాంతున కిట్లకాలమృతి గల్గఘటించె కటా యికెట్లు జీ
వింతును ప్రాణనాథ నను వీడి దివంబున కేగనాయమే.

సీ. వ్యసనాపనోదనోపాయజ్ఞుఁడవు నీవు ప్రాణేశ మృత్యువుపాలఁబడితె
కడుదుష్టురాలైన కాళరాత్రికి నేఁడు కృపణునిగతి వశీకృతుఁడవైతె
బహుళదుస్సహదుఃఖ భాజనానను బాసి క్ష్మాదేవి కౌఁగిలి మరిగినావె
యేప్రొద్దు కడుభక్తి నేను పూజలొనర్చు పసిఁడిపువ్వులవిల్లు బట్టవేల
మీజనకుఁడైన దశరథనృపవరేణ్యుఁ డాదిగాగల పితృదేవతాళితోడ
స్వర్గలోకసుఖానుభవంబునొందుచున్న వాఁడవు కాబోలు నో మహాత్మ.

మ. భరియింపన్ వశమౌనె దుర్భర మహాపద్భారమున్ నాథ సుం
దరమౌ నీకనుదోయివిచ్చి ననుమోదంబార వీక్షింపవే
సరసంబౌ మధురోక్తులం బలుకవే సద్ధర్మమార్గంబునన్
నిరతంబున్ నినుగొల్చుసాధ్విని ననున్వీడంగ నీకర్హమే.

వ. పుణ్యపురుషా! నీ ప్రాణప్రియయగు నన్నువిడిచి నీవొక్కరుండవు దివంబునకెట్లరిగితివి. ప్రశస్తచందన భూషణాద్యలంకృతమైన నాకౌగిటిలో ప్రకాశించు నీపవిత్రమగు దేహమును క్రవ్యాదులీడ్చుచున్నవి కాబోలు! నాథా సంపూర్ణదక్షిణలతో నగ్నిష్టోమాశ్వమేధాది క్రతువులొనర్చి యట్టిపరిశుద్ధాగ్నిచే సంస్కారమొందు భాగ్యమేలపడయవైతివి వనవాస చరిష్ణులమగు మనమువ్వురిలో లక్ష్మణుండొక్కడయోధ్యగరిగి నిశీథికాలమున దుష్టరాక్షసులచే శ్రీరాముడు హతుండయ్యెననియు సీతను రాక్షసులే హరించిరనియు వచించిన తోడనే కౌసల్య గుండెలవిసి మృతినందకుండునే. అక్కటా దౌర్భాగ్యురాలనగు నా మూలమున సముద్రలంఘనంబాచరించి వచ్చిన ధీరోదాత్తుండగు శ్రీరామచంద్రుడల్పులైన రక్కసులచే హతుండగునే శ్రీరాముడు తన వంశచ్ఛేదమునకు గొడ్డలినై మృత్యురూపముననున్న నన్ను మోహవశమున పరిణీతుండై యింతటి దుర్దశకు పాల్పడియె కాబోలు నేను తొల్లిటిపుట్టువున నేయుత్తమకన్యాదాతల నడ్డగించితినో తత్కారణమున సర్వరక్షకుండైన మహారాజునకు ధర్మపత్నినయ్యు నింతటిదుఃఖసాగరమున మునిగి నాశమొందుచున్నదాన. రావణా! నా దేహమును శ్రీరాముని దేహముతో జేర్చి అగ్నిసంస్కారమొనర్పుమని బహుప్రకారముల నాక్రోశించుచు మాయాశరీరమును ధనువును మాటిమాటికివిలోకించుచు పొరలిపొరలి వాపోవుచుండ నింతలో చారుండొకడేతెంచి రావణునితో ప్రభో సేనాపతియగు ప్రహస్తుడు మంత్రులతో నేతెంచి మీ దర్శనకాంక్ష వేచియున్నవాడని విన్నవింప నంత రావణుడు సత్వరంబునఁజనియె. అంత శ్రీరాముని మాయాశిరంబంతర్ధానంబొందె ననంతరంబ రావణుడు మంత్రులతో యోచించి రణంబునకు సైన్యంబుల సిద్ధపరచి భేరీప్రముఖ వాద్యంబుల మ్రోగింప సెలవొసంగె పదంపడి యిట సీతచెంత కాపున్న స్త్రీలలో సరమయనునది మిగుల దయాశాలిగను సుగుణవతిగా నుండి దుఃఖోపశమనవాక్యముల బోధించి సీతననునయించుచుండుకతన సీత కామెయెడ విశ్వాసముకలిగి చెల్మితో ప్రవర్తించుచుండె తత్కారణమున శ్రీరామునియెడ సీతకుగలిగిన విపరీతజ్ఞానజనకమగు దుఃఖమును వారింప దలంచి యామెచెంతకేతెంచి శాంతవచనముల నూరడించుచు నిట్లనియె.

— సరమ సీతకు శ్రీరాముని క్షేమమెఱింగించి యూరడించుట —

శా. అమ్మా జానకి యూరడిల్లుము రహస్యంబేనెఱింగింతు నీ
విమ్మాడ్కిన్ విలపింపనేల వినుమా హీనాత్ముడౌ రావణున్
నమ్మంబోకుము మాయగొల్పెసుమి నీ నాథుండు సేమంబుగా
నమ్మోదమ్మున నున్నవాడు కపిరాట్సైన్యంబు సేవింపగన్.

వ. జనకరాజపుత్రీ! నీవు దుఃఖింపవలదు. జగత్కంటకుండైన రావణుడు నిజ మాయాబలంబున శ్రీరాముని మాయాశిరంబును నిర్మించి నిన్ను భ్రమింపజేసె నంతియే కాని వేరొండు లేదు. మహాత్ముండైన శ్రీరాముని విషయమున నిట్టి వైపరీత్యములు గలుగనేరవు గావున నామాటలు నమ్మి దుఃఖమును బాయుము శ్రీరాముని యుద్ధరంగమున జయింప నింద్రాదులకే శక్యముకాదన నీముక్కిడి రక్కసులెంత అదియ నుంగాక.

శా. ధీరోదాత్తుడు బాహువిక్రమకళా తేజోబలాధిక్యుడౌ
శ్రీరాముండు సహోదరాప్తయుతుడై క్షేమంబుగా నున్న వా
డో రాజీవదళాక్షి సత్యమిది నీయుల్లంబునన్ దుర్వ్యథా
భారంబూనగనేల నూరడిలుమా భద్రంబు నీకయ్యెడున్.

గీ. దివిషత్సేవ్యుడగు వాసవునివిధంబునను ప్లవగసైన్యయుతుండై
రవిదీప్తి రామవిభు డర్ణవతీరమునందు నిల్చె రణసిద్ధుండై.

గీ. శుభములొందగలవు శోకింపవలదు నీ సరసకిపుడు లక్ష్మియరుగుదెంచె
వేయిపలుకులేల వినుము నా విజ్ఞప్తి నందియుంబుమాని జనకపుత్రి.

శా. భేరుల్ మ్రోసె కరీంద్రబృంహితములున్ భీమంబులై యొప్పె దు
ర్వారక్రూర భటాట్టహాసములు భాస్వద్వాజిహేషాధ్వనుల్
మీఱెన్ స్యందనఘంటికారవములున్ మిన్నంటె నానావరి
ష్కారస్ఫూర్తి వెలింగె సేనలు రణోత్సాహంబునన్ మైథిలీ.

ఉ. ఇంద్రుడుపేంద్రయుక్తుడయి యుద్ధతలంబున శాత్రవాళి ని
స్తంద్రత బిల్కుమార్చుగతి దప్పక లక్ష్మణుగూడి రామ భూ
పేంద్రుడు రావణుందునిమి యెంతయు సంభ్రమదంబుతో దయా
సాంద్రుడు నీమనఃప్రియుడు చయ్యన నిన్ గొనిపోవు పీటికిన్.

వ. వైదేహీ ! నావచన మొక్కటాకర్ణింపుము. శత్రుసంహారణానంతరమున నీ సమీపమున కరుదెంచిన శ్రీరామచంద్రుని యంకపీఠమున సంపూర్ణమనోరథురాలవై కనుదామరల నానందబాష్పములు విడుచుచు సుఖించుచుండ నిన్ను నేను శీఘ్రకాలమున కనుంగొనియెద మంచివర్షసంప్రాప్తమున సంతోషించు సస్యమువిధమున మీరా దంపతులు సమాగమనంబున సంతోషభరితులయ్యెదరుగాక యని ప్రియవచనముల సంభాషించి వెండియు నిట్లనియె. జానకీ నా శక్తిసామర్థ్యముల నీ వెరుంగవు. నేనంతరిక్షమున కామరూపధారినై శ్రీరాముని చెంతకేగి నీ క్షేమోదంతమును నీ సందేశమును నివేదించి క్రమ్మర నీ సమీపమున కేతెంచెద గాన నీవింక చింతవిడిచి శాంతముగా నుండుమనుటయు సీత సరమవాక్యములచే నించుక తెలివొంది సరమతో నిట్లనియె.

మ. పడతీ నీవు రసాతలంబున నభోభాగంబునం ద్రిమ్మఱన్
కడుసామర్థ్యము గల్గియుంటివదిగాకన్ నాఁడుగానేరికిన్
పుడమిన్ సాధ్యముగాని కృత్యమును నైపుణ్యంబునన్ దీర్తువం
చెడదన్ నేదలపోయుచుంటి మరి నాయిష్టార్థ మాలింపుమా.

ఉ. నాకు ప్రియంబొనర్పగ మనంబున సుస్థిరమైన కోర్కెయే
నీకు జనించెనేని గడునేర్పున రావణుచెంతకేగి వా
డేకపట ప్రయత్నముల నేమినొనర్ప దలంచుచుండె నో
తేకువ నత్తెఱంగెఱిగి తీవ్రగతిం జనుదెమ్ము మానినీ.

గీ. అధిక దుర్నీతుడగు రావణుడు పెక్కుగతుల మోసగించి కఠినభాష
ణములబల్కి మిగుల నాహృదయంబెల్ల వగలబొగుల గలచివైచె నిటుల.

వ. కావున.

క. రామాశిరోమణీ శ్రీరాముడు సౌమిత్రితోడ రణరంగమునన్
క్షేమముగనున్న వార్తన్ ప్రాముఖ్యముగా వినంగ భావింతుమదిన్.

వ. అని వచించుటయు సరమ సత్వరంబ చని తద్విషయముల నెరింగివచ్చి సీతతో నిట్లనియె. మైథిలీ! శ్రీరామలక్ష్మణులు సుఖంబుగానున్నవారు. రావణుని తల్లియగు కైకసి రావణునితో పుత్రకా పురుషోత్తముండగు శ్రీరామునకు బహుమానపురస్సరముగా సీతను సమర్పింపుము. అట్లొనర్పక పోతివేని ఖరదూషణాదులగతి మనకు వాటిల్లునని పెక్కుగతుల బోధించె. తదనంతరంబ వృద్ధమంత్రియగు అవిద్ధుండనువాడును బహువిధముల బోధించెగాని ఆసన్నమరణావస్థుండగు రావణుడు నిన్ను విడువ సంగీకరింపడయ్యె.

గీ. కాన శ్రీరఘురాముడు కదనభూమి భిదురసదృశమహాస్త్ర ప్రదరముల దు
రాశయుండగు రావణు ననివధించి విసుగొని యయోధ్యకరుగు తన్వీలలామ

వ. ఇట్లు సంభాషించుచునంతలో వానరసైన్యములలో శంఖభేరీ నినాదంబులు రోదోంతరాళంబులు నిండి మ్రోయుచుండె నంత లంకలో సైనికవర్గంబు లాధ్వని వినుచుండ రావణుడు మంత్రివర్గముతో నాలోచించి సైన్యంబుల పురికొల్పి యుద్ధసన్నద్ధులగుచుండి రంతలో మాల్యవంతుండు రావణునికడకరుదెంచి యతనితో నిట్లనియె

— మాల్యవంతుడు రావణునకు హితంబుపదేశించుట —

సీ. రావణా విహితమా నా వచనమువిన్ము కీడుగల్గించు దుష్కృత్యమునను
యేరాజున్నృపనీతి నెరిగి ప్రవర్తించు ధరనతండరినోర్చి సిరులనొందు
తన బలసంపద తరిగినతరి వైరిసమితితో దనసంధినలుపమేలు
తనబల్మి పెరుగ శాత్రవవీరులను రణస్థలమున బరిమార్ప దగునుసూవె
రాక్షసాధీశ వేయేల రామవిభుని తోడ సంధియొనర్చి సంతోషమునను
కుజనులువచించు చెడుగుపల్కులనువినక మైథిలినొసంగి సుఖముగా
మనగదయ్య.

వ. దైత్యనాథా! శ్రీరాముని ప్రభావమత్యద్భుతముగా గన్పించుచున్నది మరియు లోకమున ధర్మమునకభివృద్ధియు నధర్మమునకు వినాశమును గల్గించుచున్నవి. స్థిరవ్రతులగు దేవతలు పుణ్యక్షేత్రములయందుజేయు యుగ్రమైనతపస్సు రాక్షసుల తపింపజేయుచున్నవి. నీవు దేవదానవాదులవలన మృత్యువులేని వరంబులొంది గర్వించుచుంటివి. నీవు దుర్బలులని తలంచిన నర వానర భల్లూక ప్రముఖ సైన్యములు స్థిరమైన బలపరాక్రమములతో మనపైకి దండెత్తివచ్చి లంకాపట్టణమును ముట్టడించి సింహనాదములొనర్చుచు కయ్యమునకు కాలుదువ్వుచుండె రిదియట్లుండ సకలప్రజానాశమును సూచించు మహోత్పాతములు పెక్కు గాన్పించుచున్నవి యెట్లన.

సీ. కడుభీషణముగ మేఘములుగర్జిల్లుచు క్రొన్నెత్తురులవాన గురియదొడగె
హయగజోష్ట్రాది వాహనవర్గమేడ్చుచు కనుబాష్పాంబువుల్ గార్చుచుండె
ఘోరగృధ్రవ్యాళ గోమాయుసంతతుల్ గుమిగూడి లంకలో గూయదొడగె
భషకంబు లిండ్లలోపలజొచ్చి పరిశుద్ధ బలిపిండములదిని పరువులెత్తె
కాంతలకు స్వప్నములలో వికారరూపములుగలుగు నీచశక్తులు మ్రోలనిలిచి
పరిహసించుచు ప్రతికూలభాషణముల నాడుచున్నవి నగుచుభయంకరముగ.

వ. మరియును.

మ. జననంబందె ఖరంబులావులకు మార్జారాళితో గోల్పుల్
శునకవ్రాతము సూకరప్రతతితో జోద్యంబుగా మూషికా
గణమెల్ల నకులాళితో మరియు రక్షశ్శేణితో కిన్నరుల్
పెనుసన్తంబున సంచరింపదొడగెన్ స్వేచ్ఛావిహారంబులన్.

గీ. ప్రబల భీషణ దంష్ట్రాకరాళ వక్త్ర దసితపింగళ దేహు డత్యంత కరిను
డైన కాలుడు యుదయ సాయంత్రములను రాక్షసాగారముల
ద్రిమ్మరంగజొచ్చె.

వ. ఇట్లు ప్రబల మహోత్పాతంబుల బయల్వెడలుచుండు కారణమున మనము
రణరంగమున జయించుట దుర్లభమని దలంచెద.

గీ. రాఘవుడు భూరితేజోవిరాజితుండు ధ్రువము సామాన్యమనుజ
మాత్రుండుకాడు
మానవాకారమును దాల్చి మహికిదిగిన విష్ణుదేవుండటంచు భావించువాడ.

మంజరి :

పారావారంబుపైని సేతువు పరమాశ్చర్యకరముగన్
నేరుపునన్ రాముడతిదృఢంబుగ నిర్మించెన్ రుచిరముగన్
రావణ తత్కారణములచే శ్రీరఘురామప్రవరునితోడ
వేవిధముల సంధిజేసుకొనుమిది విహితము సంగడికాడా.

వ. నీవీవిషయములనెల్ల చక్కగాపరామర్శించి యుత్తరోత్తర మనకెల్ల విధంబుల
మేలుగలుగ సముచితాలోచనంబులతో కార్యనిర్ణయమును యోచింపుమను
టయు రావణుడది సహింపక క్రోధారుణితలోచనుండై మాల్యవంతునితో
నిట్లనియె.

సీ. మెచ్చగాదగు బోటుమేటిబంటువెనుమా జేలతనంబున ప్రేలెదేల
వాలిశవృత్తితో వైరులపక్షంబు జేరిహితుండట్లు జెప్పెదిటుల
జాల్పాలునిలువుము శౌర్యవిహీనుని మానవమాత్రు సమర్థుడనుచు
నెట్లెరింగితివి దేవేంద్రాది దిక్పాలముఖ్యుల బేరాలమున జయింప
గలుగు నన్న సమర్థునిగా దలంచ విరికిమాటలు నాప్రెమోలభీతిలేక
వాగెదవె యిట్టిరాములు పదుగురైన కడగినాతోడ బోరాడగలరె పోర.

క. మనజాతిలోన నింతటి పెనుధీరుండుండెనెనెడు ద్వేషంబుననో
మునుకొని శత్రుప్రేరణముననో యీరీతి పరుషములు బల్కెదవే.

వ. మిక్కిలి పరాక్రమవంతుడనగు నేను రామునకు వెరచి సీతనర్పింతునని కలలో నైన తలంపకుము. కోట్లకొలది సైన్యములుండినను సుగ్రీవాది వానరసైన్య సమేతుండగు శ్రీరాముని నిమిషమాత్రంబున పాతంబొనరించుట కనుంగొన గలవు. మచ్చిరంబును దేహంబును రెండుగా విభజింపఁబడినను నేనొరులకు లోబడుటకల్ల యియ్యది నాస్వాభావికమైనదోషము లోకమున నైజగుణ మెవ్వరును విడువజాలరు అదియునుంగాక—

చ. బలుశ్రమలొంది రాము డొకపట్టున వార్నిధిపైని సేతువున్
మెలపున గట్టెనంచు మదిమిక్కిలి భీతివహించి నీవిటుల్
బలికెద వేమిచిత్రమిది వానరసైన్యముతోడ రాముడీ
జలనిధి దాటివచ్చియు నిజంబుగ ప్రాణముతోడ బోవునే.

వ. ఇట్లు సగర్వముగా ధిక్కరించి పలుక మాల్యవంతుడతని కఠిన సంభాష ణంబులకడలి ప్రత్యుత్తరమీజాలక సిగ్గువడి యథోచితాశీర్వచన మొనర్చి మెల్లన నిజగృహంబున కరిగె. యనంతరంబ రావణుడు మంత్రులతో మంత నంబులొనర్చి లంకానగరరక్షణార్థము తూర్పుద్వారమున ప్రహస్తుని, దక్షిణ ద్వారమున మహోదరమహాపార్శ్వుల, పశ్చిమద్వారమున మాయావియగు యింద్రజిత్తును, ఉత్తరద్వారమున శుకసారణుల నిలువనియమించి తానును యుత్తరద్వారమున నిలువనిశ్చయించె. విరూపాక్షుని నగరమధ్యమున నిలువ బంచి యమాత్యపరివృతుండై తానుకృతార్థుడైనటుల నెంచి యందరబనిచి కొలువు చాలించి నిజాంతఃపురంబుజొచ్చె ననంతరంబ.

చ. రవితనయుండు లక్ష్మణుడు రాముడు కేసరియున్ సుషేణుడున్
పవనజు డంగదుండును గవాక్షుడు నీలుడు జాంబవంతుడున్
ద్వివిదుడు మైందుడున్ మరివిభీషణుడాదిగగల్గు ముఖ్యులా
హావవిజయార్థమై తగురహస్యవిచారణజేసి రొక్కెడన్.

వ. తత్సమయంబున విభీషణుండిట్లనియె "నాసచివులు గూఢవర్తనమున లంకలోని ద్వారసంవిధానమెరింగి వచ్చిరని" తద్విధానంబెల్ల నెరిగించె నింక దురాసదుండగు రావణునియెడ మనమప్రమత్తులమై పోరాడవలయునని విన్న వింప శ్రీరాముడెల్లరు విననిట్లనియె.

—. శ్రీరాముడు వానరుల యుద్ధమునకు నిర్ణయించుట :—

సీ. బహుసైన్యయుక్తుడై ప్రాగ్ద్వారమున నీలుడల ప్రహస్తునిమీది కడరవలయు
దక్షిణద్వారస్థ దండనాథులనోర్వ నంగదాదులుకొంద రరుగవలయు
ప్రబలసైన్యాళితో పడమటి కనిలజుం డింద్రజిత్తునిమీది కేగవలయు
క్రూరుడౌ రావణుగూల్ప సౌమిత్రితో నుత్తరద్వారమందుందు నేను
జాంబవంతుండు మరివిభీషణుడు సూర్యసుతుడు మొదలైన కొందరుశూరవరులు
బళ్ళిమోత్తరములమధ్య భాగమందునిల్చి పోరాడవలయును నేర్పుమీర.

క. వనచరులు సమరతలమున మనుజాకృతులొందదగదు మనకెల్ల రకుం
గనుగొన సాంకేతికముగ దనరవలయు స్వస్వరూప ధర్మంబులతోన్.

వ. "నేనును లక్ష్మణుండును విభీషణుండును యాతనిమంత్రులునల్వురును మనుష్యా
కారములతోడనే శత్రువులతో పోరాడెదము అనివచించి" సువేలాచలం బెక్కి
లంకాపురంబెల్లఁ గనుంగొనంగోరి సైన్యములనెల్ల నిలువనాజ్ఞాపించి శర
చాపాసిధరుండై లక్ష్మణసుగ్రీవులువెంటరా హనుమదంగదవిభీషణ ప్రముఖు
లతో మెల్లన సువేలాచలం బారోహించి మిన్నంటుకొని ప్రవేలాడుచుండు
నటుల త్రికూటశైలశిఖరమున నుండి లంకాపురసౌందర్యమును, పురినలువంకల
నానావిధాయుధ ధారులై నిండియున్న రాక్షససైనికుల సముదయంబెల్ల నవ
లోకించుచుండె నంత.

గీ. అపుడుసంధ్యాసమయమగుట నర్కబింబమరుణరుచిమించి మెల్లనన స్తమించె
పూర్ణచంద్రునితోడ నక్షత్రమలర్ప రాత్రివెలుగొందె నధికతరప్రదీప్తి.

వ. వారలారాత్రి యటగడపి ప్రాతఃకాలమున క్రమ్మర లంకాపురసౌందర్యమును
వీక్షించి విస్మితచిత్తులై రట్టియెడ.

సీ. కాంచె సౌధాగ్రభాగమునందు జెలువొందు రావణాసురుని శ్రీరామవిభుడు
నవరత్నఖచిత నానాభూషణవిభూషు కాలజీమూత సంకాశవపుషు
ఎలిపిశాంబసిడి పువ్వుల జలతారు దువ్వల్వకటిస్థలినరలువాని
కమ్మతావులు గమగమలాడు రక్తచందనపంకచర్చ నైదనరువాని
రమణులిరుగడలం జామరములువీవ పట్టుగొడుగులు జెలువలుపట్టినిలున
జాళువాజిగిశాల్వ భుజమున మెరయ తరళదంష్ట్రాకరాళాస్యు దశశిరస్కు—

—: సుగ్రీవుడు రావణుని మేడకరిగి యుద్ధమొనర్చుట :—

ఉ. వావిరి తద్రఘూత్తముడు వానరముఖ్యులు జూచుచుండ త
ద్రావణుగాంచు కోర్కి మదిదార్కొన నందర నేమరించి సు
గ్రీవుడు మింటిపై కెగసి రిప్పునగోపురమందు ద్రావలి త
ద్రావణుతోడ నిట్లనియె రాజసమేర్పడ నిర్భయంబునన్.

గీ. అఖిలలోకనాథుడైన శ్రీరాముని దాసుడను ధ్రువంబు దైత్యనాథ
హాతుడవగుదు విప్పుడమ్మహాత్ముని సముద్దీప్తమై వెలుంగు తేజమునను.

కవిరాజ విరాజితము :

అనుచు వచించి కపిప్రభుడట్టి వియద్గతుడై కడువేగ దశా
ననుని పయింబడి రోషముతోడ ననర్ఘ మణిస్థగితోన్నత కాం
చనమకుటంబు ధరాస్థలి గూలగ సాహసమొప్పగ ద్రోయుటయున్
దనుజకులేశ్వరు డోర్వక నెంతయు దర్పమెల్పగ నిట్లనియెన్.

శా. సుగ్రీవుండవు మత్పరోక్షమున, నీచున్ నిన్నిదే నేడు హీ
నగ్రీవుండగునట్లు నొక్కత్రుటిలో నాశంబుగావింతు నం
చుగ్రాకారముతోడ రావణుడు గర్వోద్రేకియై పట్టి త
చ్ఛుగ్రీవుం బడగొట్టె భీషణగతిన్ దోశ్శక్తియై పర్వునన్.

వ. అంత సుగ్రీవుడు నేలపై మోదిన బంతికైవడి రివ్వున పైకెగసి రావణునిపై కురవ
డించిన నొండొరుల కత్యంతభయావహంబైన మల్లయుద్ధంబయ్యె నిట్లొక్క
ముహూర్తకాలము జరుగ.

గీ. ఒండొరుల కాయములు స్వేదము బికిచెదర
నొండొరుల దేహములు నెత్తురొలుకుచుండ
నొండొరుల కౌగిళుల చేష్టలుడిగి నిల్చి
రెలమి శాల్మలి కింశుకముల విధమున.

సీ. వానరనాథుండు దానవాధీశుండు పోరదొడంగిరి దారుణముగ
మీరియొండొరు లేచి మేను మేన్గదియంగ పౌరుషంబులు హెచ్చి పైకినదరి
సారెకు వెనుకకు జని మల్ల జరచుచు తరిమిపట్టుచు భయోదగ్రులగుచు
ఘోరంబుగా బట్టి గ్రుద్దుచు బదములదన్నుచు నార్చుచు దర్పమెసగ
భీషణమ్మృగేంద్రయుగళంబు పెచ్చుపెరిగి పెనగుకైవడి నిర్వురు పెనుమదమున
విక్రమించుచు ధాత్రికివిసరికొట్ట బంతికైవడి నెగచి దోర్బలమెలర్ప.

సీ. వెనుకకునరుగుచు వేగపైకురుకుచు నడ్డంబుజనుచు సవ్యాపసవ్య
గతులజరించుచు కడగిచక్రాకృతి తిరుగుచు మొదరించి కెరలియొడిసి
పట్టబో నత్తరి పట్టుతప్పించుక నురవడించుచు నిట్టులొకరినొకరు
నెంతయుగెలుపొందు నిచ్చతో బోరాడ నంతరావణుడు మాయాబలమున
నన్నితావుల గాన్పింప యత్నపడుట నెరిగి సుగ్రీవుడసురేంద్రు నేమరించి
ఆకసంబునకెగసి మహారయమున వచ్చి శ్రీరామవిభుసేనజొచ్చెనంత.

వ. ఇట్లురావణునితో బోరాడి వచ్చిన సుగ్రీవుని దేహమంతయు రక్తసిక్తమై యుద్ధపరిశ్రాంతుండై యుండుటెరింగి శ్రీరాముండతని గౌగిటగదించి యిట్లనియె మిత్రమా నీవునాతోనాలోచింపక యొక్కరుండ విట్టిసాహసకృత్యమునకుఁ దలపడితివి ఇదిమాకెంతయు సంశయాస్పదంబయ్యె మాకెల్లరకు ప్రధానుండవగు నీకెద్దియేని యాపదఘటిల్లెనేని మనప్రయత్నమంతయు నిరర్థకమే గదా! గావున నీవెప్పుడిట్టి సాహసకృతమునకు గడంగవలదనిన శ్రీరామునితో సుగ్రీవుండిట్లనియె.

క. వీరాగ్రేసర నేపౌరుషమున నలరి నీదు పట్టపు దేవిన్
క్రూరముగ నపహరించిన వైరినిగనియెట్టులోర్తు పంచవిధమునన్.

వ. అనిప్రసంగించు సుగ్రీవునిసంభాషణంబుల మిగులశ్లాఘించుచు సువేలాచలంబు నుండి దిగివచ్చి యుద్ధమునకు సైన్యములఁ బురికొల్పుటయు వానరులెల్లరు ధైర్యోత్సాహములతో గొప్పపర్వతములను వృక్షంబులను ధరించి లంకనలు వంకల ముట్టడించిరట్టియెడ చెలియలికట్ట తెగివచ్చిన రెండవసముద్రంబు విధంబున విజృంభించు వానరులఘోషణంబు లంకాపురంబెల్ల మారుమ్రోయుచుండె నట్టియెడ శ్రీరామచంద్రుడు రాజనీతినాలోచించి రావణునికడ కంగదుని రాయబారమంపదలచి యిట్లనియె.

—: అంగద రాయబారము :—

గీ. సౌమ్యుడా! భీతివర్జించి సత్వరమున నీవులంకానగరికేగి నిశిచరేశ్వ
రుండు వినునట్లు నేనువాక్రుచ్చినటుల వాకొనుమటంచు నీరీతి బలికెనెలమి.

ఉ. ఓరినిశాట మూర్ఖ దివిజోరగ కిన్నర సిద్ధ సాధ్య బృం
దారక ముఖ్యులన్ బహువిధంబుల బాధలనొంచుచుంటి నం
భోరుహజన్ము దత్తవర భూరిమదోద్ధతి నంతబోక మ
ద్దారనుబట్టి తెచ్చితివి దాగిన నూరకబోవనిత్తునే.

సీ. రాక్షసాధమ నిను రణరంగమునబట్టి శిక్షింతు విడువ న క్షీణశక్తి
నెందేనిడాగ నూహించిన నాదృష్టిపథగోచరుండవౌ పాపశీల
యమునిమందిరమున కతిథిగాబనిచెద సకలజనంబులు సంతసింప
శూరత్వమిక సాగనేరదు నీభుజ శౌర్యంబుజూపగ జక్కనిలుము
భీషణ వనాట ఋక్ష సమేతముగను నీపురద్వారసీమన నిలిచియుంటి
తడవునేయకరమ్ము యుద్ధమునకిప్డె కుటిలచిత్త! క్షణంబులో గూల్తునిన్ను.

వ. ధర్మాత్ముండైన విభీషణుండీ యకంటకమైన రాజ్యమును శాశ్వతముగా బడయంగలవాడు మహాపాపివగు నీవుక్షణకాలంబైన ప్రభుత్వమునేయ నర్హుండవుగావు. ధైర్యముతో నాతో రణంబొనర్పరమ్ము తీక్ష్ణములగు వచ్ఛిలీముఖంబుల కెరయై పరిశుద్ధుండవుకాగలవు. నీవింతటనైన జ్ఞానమును తెచ్చుకుని లంకారాజ్యమును రక్షించుకొనుము. నీ ప్రాణములు నాచేజిక్కి యున్నవి. సీతనర్పించి శరణాగతిజేయుము. అట్లుకాదేని నీలోకంబరాక్షసం బొనర్తునని డెల్పు మని శ్రీరాముడు సందేశమునుబంప సువర్ణాంగదములతో బ్రకాశించు అంగదుడు తక్షణంబ నభంబునకెగసి చని రావణుని కొలువు కూటంబుక నిలిచి రావణునితో నిట్లనియె రావణావినుము!

క. కోసలదేశప్రభువల కౌసల్యాతనయుడైన కాకుత్సకులో
ద్భానుండగు శ్రీరాముని దాసుడ యెరుగుమవె వాలితనయుడ సుమ్మా.

వ. అని అంగదుండు శ్రీరాముని సందేశముపన్యసింపుచుండ వినిరావణుండది సహింపక రోషముచే కనుంగవ కెంపుగదుర మంత్రులంగని వీనినింబట్టి వధించిరండని యాజ్ఞాపింప తదాజ్ఞానుసారమున నత్యంతపరాక్రమోపేతులగు నల్వురు రక్కసులతనిపైగవిసిన వారిచేతులలో చిక్కినటుల మెలంగి తక్షణంబ.

ఉ. రాక్షసవీరులన్ నలువురన్ వడివాలిసుతుండు చంకలం
బక్షులలాగిముడ్చుకొని పైకిహుటాహుటినేగి బల్మిమై
దక్షతతోడుతన్ విసరి ధారుణిపైబడద్రోయ తక్షణం
బాక్షణదాచరుల్ సమసిరంతట తద్బలమూర్తిగుండగన్.

వ. అంతనిలువక.

మ. క్షణమాత్రంబున నంగదుండు విలసత్సౌర్యంబు దీపింప రా
వణుడుం గన్గొనుచుండ శీఘ్రమున తత్ప్రాసాద శృంగంబు ధా

రుణిపైఁడొల్లి పడంగ బాదనిహతిన్ రోషంబునం దన్నె దా
రుణవజ్రాహతి నద్రిరాట్శిఖరి నింద్రుండొంచు చందంబునన్.

—: వానర రాక్షస యుద్ధ ప్రారంభము :—

వ. ఇట్లుపడఁగూల్చి నిజప్రభావంబుగ్గడించుచు యార్చి సత్వరంబ నేతెంచి శ్రీరాముని ప్రక్కననిలిచె ననంతరంబ రాక్షసయోధులు వివిధాయుధ వృక్ష శిలాధారులై ప్రళయకాల ఝంఝూనిలంబుచందంబున విజృంభించుటయు.

మంజరి :

శ్రీరాముండాజ్ఞ జేసినంతన సేనలుసరభస మెసగన్
మీరి యొకరికంటె యొకరుడు మించియార్చి రుగ్రముగన్
భూరిపౌరుషంబులతో లంకాపురివిధ్వంసము సేయన్
గోరిమహావృక్షచయము శిలలం గొనివిద్వేషులడాయన్.

సీ. రాక్షసాధీశుండు వీక్షించుచుండ గుంపులుగుంపులుగ వృద్ధిబొంది తామ్ర
వదనముల్ కాంచనవర్ణముల్ గల కపిసేనలాతని లెక్కసేయకపుడు
శ్రీరాఘవార్థంబు జీవంబులర్పింప దలచిలంకాపుర ద్వారములకు
గోపురాగ్రములకు కోటగోడలపైకి ప్రాకారముల కెగఁబ్రాకి పాద
ఘట్టనంబుల పెనుముష్టి ఘాతముల శిలాప్రహారంబుల భుజాబలములు మెరయ
పెళపెళారావములతోడ విరిగిపడగ ధ్వంస మొనరించి రతులితోత్సాహగరిమ.

వ. మరియును.

సీ. పరిశుద్ధజలపూర్ణ పరిఖల దృణకాష్ట పాషాణముల పూడ్చివైచువారు
తపనీయమయ పురద్వారశాఖలబట్టి చెలగుచు పొడిపొడి చేయువారు
కైలాసశిఖరి శృంగములకీడగు మేటి గోపురంబులఁ బడఁగూల్చువారు
మింటికినొరయుచు మిగులదృఢంబులౌకోట పైబురుజులఁగూల్చువారు
పెక్కు తెరగుల నీరీతి వెక్కసముగ వేలు లక్షలు కోట్లుగా వెలయుకపులు
లంకనలువంకలంజుట్టి శంకలేక పరువులిడుచుండి రతులితోర్బాటులు సెలగ.

వ. ఇట్లు వానరభల్లూక వర్గంబు జయజయధ్వానములు సేయుచు.

క. జయము శ్రీరామవిభునకు జయము సుమిత్రాత్మజునకు సకలకపులకున్
జయము సుగ్రీవవిభునకు జయ మేప్రాప్తమగు రామచంద్రునిమహిమన్.

వ. వానర భల్లూక సైన్యంబులిట్లు విజృంభించి లంకానగరంబును విధ్వంసంబొన రించుట గనుంగొని సహింపజాలక రావణుడు క్రోధోన్మత్తుండై రాక్షస సైన్యంబుల కాజ్ఞ నొసంగిన నంతసమరసన్నాహంబున.

ఉ. వీరరసంబులుట్టిపడ వేడ్క భయంకర సింహనాదముల్
మీరి నిశాటసైన్యములు మేలగు శంఖములొత్తి యార్చుచున్
పోరికిసిద్ధమై నడువ వొల్చె మహాప్రళయంబునం దకూ
పారము పొంగిపొర్లి ధరపై ప్రవహించెననంగ నెంతయున్.

మ. ఇభరాట్బృంహితముల్ హయోత్తమ మహాహేషావిరావంబులున్
సుభటప్రస్ఫుట సింహనాదములు నాస్ఫోటధ్వనుల్ స్యందన
ప్రభవోదంచిత ఘంటికాధ్వనులు భాస్వచ్ఛంఖ భేరీరవం
బభిసంయోగముజెంది మ్రోసె గిరిభూమ్యాకాశముల్ నిండగన్.

ఉ. అంతట దేవదానవ మహాహవ మెప్పగిదిన్ రహించె న
ట్లింతయు పోరుఘోరముగ నేర్పడె వానర దానవాళికిన్
వింతగ దానవుల్ ప్లవగవీరుల మోదిరి శస్త్రపాళి న
త్యంతశిలాప్రవర్షమున నయ్యసురాళిని ద్రుంచిరాకపుల్.

ఉ. అత్తరి క్రొత్తగా బవరమయ్యె వనౌకస దైత్యకోటికిం
గ త్తిళవుల్ దళత్తళలు కత్తులదీధితులున్ మణిమయో
త్ప్యుత్తమ కాంచనాంచిత మహోజ్జ్వల దివ్యవిభూషణద్యుతుల్
మొత్తములై దిశావలయముల్ విడిసెన్ రవిరశ్మికుద్దియై.

గీ. జయమగునుగాక శ్రీరామచంద్రునకును జయముప్రాపించుగాక లక్ష్మణునకెపుడు
జయముసిద్ధించు కపికులసార్వభౌము డైన సుగ్రీవునకుమహాహవమునందు

మ. అనిబిట్టార్చుచు స్వస్వనామ కథలుద్యత్పౌరుషావాప్తితో
వినఁబేర్కొంచు మహాగిరిప్రతిములై వెల్గొందు తద్వానరుల్
పెనువృక్షంబులతో శిలాప్రతతితో పెల్లేయుచున్ తీక్ష్ణ దం
ష్ట్రి నఖాళిన్ విదళించిచీల్చి రసురవ్రాతంబు నత్యుగ్రతన్.

వ. ప్రాకారంబులపై కోటబురుజులపై కాపుండు రాక్షససైనికులు నేలపైనిలిచి యుండు వానరులపై ముసల ముద్గర తోమర, భిండివాలాది సాధనంబుల విసరివిసరి చెండాడుచుండ భూగతులగు వానర భల్లూక గోలాంగూల ప్రముఖులు యోర్వక క్రోధోన్మాదంబున ప్రాకారంబుల కెగబ్రాకి

యందుండు రాక్షసులాక్రోశించుచుండ క్రిందికిపడద్రోయుచు ఘోరముగా మర్దించుచుండిరి. అట్టియెడ నిరువాగుల సైన్యములకు ఘోరసంగ్రామంబై తత్సమరస్థలంబెల్ల మాంస శోణిత కర్దమంబై యొప్పె. అప్పుడు రావణుని విజయకాంక్షులగు కొందరురాక్షసులు రథగజహయాది వాహనారూఢులై కవచ ఖడ్గాది సాధనసమేతులై రణరంగమునకేతెంచి.

గీ. అంగదునితోడ గదిసె నింద్రారితోడరి త్ర్యంబకునిపైకి వెడలుకృతాంతుడట్లు అంతలోన ప్రజంఘూహ్వాయాసురుండు బవరమొనరింపఁదొడగె సంపాతితోడ.

గీ. హనుమతో జంబుమాలి ధైర్యమునదాకె నలుక మిత్రఘ్నుడనెడు మ దాసురుడు విభీషణునిపైకి లంఘించె భీషణముగ నీలుడు నికుంభునిందాకె నిర్భయముగ.

గీ. తపనుడనురాక్షసుడు మదాఢ్యముగను గజునితోదాక నంత ప్రఘసుడనెడు దానవుడు సూర్యసుతునితో దాకుటయును మిత్రజుండు విరూపాక్షు మించిగదిసె.

వ. మహావీరులైన అగ్నికేతు రశ్మికేతు సుప్తఘ్న యజ్ఞకోపుడను రాక్షసులు శ్రీరామునెదుర్కొనిన భయంకరులైన వజ్రముష్టి యశనిప్రభుండను దానవులు కపిశ్రేష్టులగు మైంద ద్వివిదులతో మార్కొనిరి. ప్రతపనుండను నిశాచరుడు నలుండను కపికులోత్తముని దాకె బలవంతుండైన సుషేణుడు విద్యున్మాలితో దలపడియె. యిట్లనేకవానరప్రముఖులు భయంకర రాక్షసుల నెదుర్కొని వివిధప్రకారముల విజృంభించి పోరాడుసమయమున.

గీ. గిరినదులభంగి దైతేయ కీశపతుల తనువులందుండి వెడలు రక్తప్రవాహ మందు వీనుంగులును కట్టెలట్లు దేల శాద్వలస్థలిబోలి కేశములుదనరె.

మ. పవిధారాహతి నింద్రుడోర్చుగతి కోపస్ఫూర్తి శక్రారి త త్ప్లవగాధీశ్వరు వాలిపుత్రు గదచేభంజింప దోర్దోడ త త్ప్లవగేంద్రుం డతిరోషవేగమున నింద్రద్వేషి తేరున్ మహా జవమొప్పన్ బడగూల్చె రథ్యములతో సాదిన్ ధరామండలిన్.

సీ. శౌర్యధుర్యుండౌ ప్రజంఘుండు మూడు వాలమ్ముల సంపాతి నమరమోదె నంత వాడలుకమై యశ్వకర్ణంబను శరమున మరలప్రజంఘునడచె మదయుతుడగు జంబుమాలి రథస్థుడై శక్తితో హనుమ వక్షముననడచె నాప్రహారముసైపక ననిలజుండాతని తేరెక్కి యరచేతిదెబ్బతోడ

నరదమును నాళ మొందించె సరభసమున ప్రతవనుడునుశీఘ్రమున నీలుపైకినడర నట్టిక్రోధంబుతో నీలుం డసురకనుల బెరికిధారుణిపైబడ వేసెనంత.

వ. మిగుల నుద్ధతుండగు ప్రఘసుండను రక్కసుని సుగ్రీవుడు సప్తపర్ణమను వృక్షముతో గట్టిగానడచె వదంపడి అగ్ని కేతు రశ్మి కేతులను రాక్షసుల శిరంబుల శ్రీరాముడునరికివైచె. మైందుడు వజ్రముష్టియను వానిని పిడికిడితో పొడిచిన నతండశ్వ రథంబులతో ధరాతలంబునగూలి చచ్చె నంత నీలుడు నికుంభుం డను వానిని రథరథ్యసారథులతో ఛేదించియార్చె. అయ్యవసరంబున

గీ. అశనిసముడగు ద్వివిదు డయ్యసురులెల్ల గాంచుచుండగ శైలశృంగంబునొండు బెరికి యశనిప్రభుండను పేరిదైత్యవరుని మీదికి విసరిన వాడుగినిసి.

వ. దానినడుమన ఖండించి అశనితుల్యంబైన భల్లంబును బ్రయోగించుటయు సహింపక ద్వివిదుడు సాలవృక్షంబొండు బెకలించి తక్షణంబ అశనిప్రభుండను వానిరథంబును రథ్యంబులతో నొంచె నాసమయంబున

శా. విద్యుద్దీధితినొప్పు తేరుపయినన్ వెల్గొందు శౌర్యాఢ్యుడా
విద్యున్మాలి సువర్ణపుంఖ కవితాభీలాంబకశ్రేణితో
నుద్యద్దోర్బలిమిన్ సుషేణుని మహోయుత్సాహియై మోది సం
పద్యుక్తిం జెలువొంది యార్చి బెలుచన్ ప్రావీణ్యమేపారగన్.

శా. విద్యుద్దీప్తివెలుంగు దద్రథముపై వేగంబునన్ వచ్చు త
ద్విద్యున్మాలి పయిన్ సుషేణుడు మహావేగంబ గండోపలం
బుద్యుక్తుండగుచున్ వడిన్విసరినన్ యుద్ధోన్మదుండైన త
ద్విద్యున్మాలి రథంబువీడి గదతో పెల్లార్చుచున్ వచ్చినన్.

సీ. కడువేగమున సుషేణుడు పెనుశిలనొండు గైకొనివచ్చుట గాంచిమిగుల నుద్ధతితోడ విద్యున్మాలి గదతో సుషేణుని యురములక్షించివైచె దానికినోడక దక్షవీంద్రుం డమ్మహాశిలనెత్తి యయ్యసురవరుని యురముపైవేయ విద్యున్మాలి ధాత్రిపై వ్రాలి ప్రాణంబుల వాసెనంత శూరులగువానరోత్తముల్ వీరులైన రాక్షస సమూహమును వైరమునద్రొల్లి త్రిదశముఖ్యులు దైత్యుల ద్రుంచినటుల హతముగావించి రమ్మహాహవమునందు

వ. అట్టియెడ.

సీ. కడువిస్మయంబుగా కదనరంగంబొప్పె మిడుతలగమి పచ్చి బడినరీతి
మిలిమీరి ధరగూలు మృతకళేబరరాసు లత్యంత భీభత్సమై వెలుంగ
విరిగిన తేరులు విచ్చినగొరులు వసుధపైడొల్లెడు వారణములు
మడిసినజోదులు మ్రగ్గినరథికులు ఛేదింపబడి డొల్లుశీర్షములును
యెగిరిపడెడు కబంధముల్ తెగినచరణ కరములెంతయు ప్రస్సిన కవచములును
ఖండితములైన సంధులు కడగిముసరు కంకగృధ్ర సృగాలాది గణముతోడ.

## —: రాత్రి యుద్ధ ప్రారంభము :—

వ. అంత సూర్యుండ స్తంగతుడగుటయు రాత్రిప్రవర్తిల్లె. ఇట్లు పరస్పరద్వేష పూరితులై జిగీషాపరులగు వానర రాక్షసులు నిశాయుద్ధమునకు తలపడి భయంకరంబైన మహాంధకారంబున నొండొరులు తమతమ నామధేయంబుల బేర్కొంచు ఘాతంబొనరించుచుండ మిగుల బలపరాక్రమసంపన్నులగు వానరులు క్రోధోన్మత్తులై రథ గజ హయ పదాతి కంబులపైబడి జమురుచు రదనంబులతో కొరుకుచు నఖంబులతో జీల్చుచు రాక్షససైన్యంబుల ఘాతం బొనరించుచుండిరి. రామలక్ష్మణులిర్వురు మహోరగ సన్నిభంబులైన భల్లంబులతో నించుకించుక నయనగోచరులగు నిశిచరవర్గంబును నాశమొందించుచుండిరి. చతురంగసైన్య పదఘట్టనంబులచే రేగు పరాగము భూమ్యాకాశములనెల్ల వ్యాప్తంబై మరియు నంధకారబంధురంబై యొప్పె. పిమ్మట శంఖభేరీ ప్రముఖ వాద్యధ్వనులును రాక్షస వానరుల కోలాహలధ్వనులును మొత్తంబై ప్రళయకాల పయోనిధిచందంబున ఘోషించుచుండె. దురతిక్రమంబై ప్రాణికోట్ల నాశంబొనర్చు కాళరాత్రిచందంబున వానరరాక్షస ప్రాణాపహారకమై యారాత్రి మిగుల భీభత్సంబైయొప్పె.

ఉ. అంతట రామచంద్రుడు మహాభయదంబగు తన్నిశీధి యం
దెంతయు గోపవేగమున నేచి నిశాచర వర్గమార్చుచుం
బంతముతోడ పైనడరి బాణచయంబుల గుప్పినన్ నిమే
షాంతరమందు రక్కసుల నారుశరంబుల గూల్చెనార్వురన్.

వ. తదనంతరంబ శ్రీరామచంద్రుడు మహాపార్శ్వ మహోదర మహాకాయ శుక సారణ వజ్రదంష్ట్రి ప్రముఖులైన రాక్షసవీరుల ననేకుల సుపర్ణపుంఖములుగల తీక్ష్ణభల్లంబుల మర్మస్థానంబుల గాఢముగనేయ వారెల్లరు యుద్ధరంగమున

నిలువజాలక నలువంకలకు బారిపోవుచుండ వహ్నిజ్వాలల గ్రక్కు బాణవరం పరల శ్రీరాముడు ప్రయోగింప నవి సకలదిశానకాశంబుల నిండి మిణుగురులతో గూడిన రాత్రివిధంబున ప్రకాశించుచుండె. రాము బొరింబడిన రక్కసులు పావకజ్వాలలపడిన మిడుతలట్లు హతులగుచుండిరి. తదీయసైనిక ఘోషణముచే త్రికూటాచల గుహలనుండి ప్రతిధ్వనులు వెడలుచుండె కాటుకకొండలవంటి కొండముచ్చులు రక్కసిమూకలపైబడి మట్టగించుచుండిరట్టిసమయంబున.

మానినీవృత్తము :

ఆలమునన్ రిపునోర్వదలంపున నంగదుడెంతయు రోషమునన్
శైలమునొండు పెకల్చియదల్చుచు శక్రవిరోధి పయిన్ విసరన్
కూలెహయంబులతో రథసారథి ఘోరముగా వసుధాస్థలిపై
వైళమదృష్టికగోచరుడై చనె వాసవవైరి పరాజితుడై.

వ. ఇంద్రజిత్తు ప్రభావంబెరింగిన దేవ సిద్ధ మహర్షి గణంబులు యతనిపరాజయము నకు మెచ్చుకొని అంగదుని మిగుల శ్లాఘించిరి. తత్సమయంబున సుగ్రీవ విభీషణాదులును సంతోషముతో సింహనాదములుగావించి రాసమయంబున శ్రీరాముడు వానరులనందర చేరంబిలచి యిట్లనియె.

సీ. కపులార మీరెల్ల గడగిసుగ్రీవుని యొద్దన గుంపుగా నుండవలయు
యీయింద్రజిత్తు లోకేశద త్తవరాప్తి త్రిభువనంబులను బాధించుచుండె
రాక్షసనమితికి రాత్రులబల మెక్కు డగుట మిమ్ముజయింప నగుగు దెంచె
గావున నందరు కడునప్రమత్తులై నిలువుడాలమునకు నిర్భయముగ
ననుచుబోధించుచుండ మాయాబలమున నెంతయు నదృశ్యమూర్తియైయింద్రజిత్తు
భీషణాశని సదృశాస్త్ర వితతి రామ లక్ష్మణులపై ప్రయోగించె లాఘవమున.

వ. ఇంద్రజిత్తం డంతర్ధానుండై మాయాయుద్ధమునకు గడంగి సకలవానరులు గనుంగొనుచుండ రామలక్ష్మణుల మోహితులజేయుటయు వాని నివాసం బెరుంగజాలక నీలాంగదజాంబవత్ప్రముఖులకొందగ వానిజాడ కనిపెట్టి రావలయునని యాజ్ఞాపింప వారలువివిధ వృక్షశిలాధారులై యంతరిక్షంబున కెగసి సకలదిశలనెనుకి యెందునుంగానక తిరుగుడుబడుచుండి రయ్యవసరంబున.

గీ. అస్త్రవేదియైన యసురేంద్రసూనుండు బాణవేగమునను ప్లవగవరుల
నడ్డగించుటయు మహాంధకారంబున నసురుగాంచజాలరైరి కపులు.

గీ. సమరతలమున క్రుద్ధుడై శక్రవైరి శౌర్యధనులైన రామలక్ష్మణుల సర్వ
గాత్రముల సంధిసంధుల గడగి ఘోర సర్పమయ బాణములనింపె సత్వరమున.

వ. రామలక్ష్మణులు రక్తసిక్తాంగులై పుష్పించిన మోదుగుచెట్ల విధంబున నొప్పుచుండి రయ్యవసరంబున కాటుకకొండవంటి శరీరముగల యింద్రజిత్తు వియత్పథంబున నంతర్ధానుండై శ్రీరామలక్ష్మణులతో నిట్లనియె.

—: ఇంద్రజిత్తు నాగాస్త్రములచే రామలక్ష్మణుల బంధించుట :—

చ. ననుగెలువంగశక్యమె రణస్థలి మానవమాత్రులార! నే
కనులకు గానుపింపక నఖండపరాక్రమ శౌర్యసంపదం
గనుగొన దేవనాథునకు గాదన మీకెటుసాధ్యమహా మహా
శని సదృశాంబకప్రతతి జయ్యన మిమ్ముహతంబొనర్చెదన్.

మహాస్రగ్ధర :

అనిరోషస్ఫూర్తితో నయ్యసురపతిసుతుం డార్చి వహార్వినినాదం
బనివార్యంబై సెలంగన్ హాళిహాళిక నమోఘాగ్రహంబొప్ప దీప్తా
శనితుల్యంబైన నాగాస్త్రముల దొడిగి దోశ్శక్తిమైవ్రేయ నిశ్చే
తనులై సంభ్రాంతితోడన్ దశరథతనయుల్ ధాత్రిపై వ్రాలిరంతన్.

క. శరపాతవిద్ధులగు దాశరథులు కనులెత్తిచూడ జాలక పీడా
భరమున వణకుచు కృశులై ధరణింబడిరధిక రక్తధారలుదొరుగన్.

వ. లోకనాథులైన రామలక్ష్మణులిర్వురొక్కమొగి చాపంబులు మెరయ త్రాడు తెగిన యింద్రధ్వజములోయన మర్మభేదనంబులగుటచే మిగులదుఃఖాక్రాంతులై వీరశయ్యల బరుండియుండిరమ్మహాత్ముల శరీరంబరంగుళప్రమాణంబైనను గాయంబులేని ప్రదేశంబులేక చేతివ్రేలికొనపర్యంతము నాగపాశబంధములచే నిండి చలనరహితులై పడియుండ శ్రీరాముని గనుంగొని లక్ష్మణుడు ప్రాణములపై నాశవిడిచి మిగుల దుఃఖించె నయ్యవసరంబున వారల దురవస్థనెరింగి హనుమత్ప్రముఖులైన వానరులు గుములై చుట్టుకొని భయోద్విగ్న హృదయులై వగచుచుండి రట్టియెడ.

గీ. మిగులవర్షించి నిలిచిన మేఘమనగ గోత్రభిద్వైరి శరవృష్టిగురిసినిలుప
నతిరయంబున నచ్చోటికర్కసుతుడు నలవిభీషణుడేతెంచి యార్తుడగుచు.

వ. అంత వానరులెల్లరు విషణ్ణహృదయులైయుండ విభీషణుండు మాయాబలంబున నింద్రజిత్తునెరింగె, నంతయింద్రజిత్తు స్మృతిలేక పడియున్న రామలక్ష్మణుల గనుంగొని ప్రహర్ష చిత్తుండై దైత్యులతో నిట్లనియె.

గీ. దనుజవరులార మద్భుజాదర్పమెల్ల గాంచితిరె మున్ను రణమున ఖరముఖాది
రాక్షసుల హతమార్చిన రామలక్ష్మణుల వధించితి క్షణమున నలఘుశక్తి

మ. అనిభాషించుచు నింద్రజిత్తు సమరవ్యాపార పారీణతం
గొనయంబాశ్రవణాంతముందిగిచి దిక్కుల్ మారు మ్రోయంగ సిం
హనినాదంబొనరించి ఘోరముగ తీక్ష్ణాస్త్రంబులన్ తత్ప్లవం
గ నికాయంబులపైని గుచ్చుచు సమగ్ర క్రోధ విక్రాంతుడై.

సీ. నీలుని తొమ్మిదివాలుతూపుల నొంచి, మైందద్వివిదుల మర్మార్గముల
సంతాపమొందించి, జాంబవంతుని పృథువక్షంబునం దొక్కబాణమేసి
పవనసంభవునిపై పదియమ్ములడరించి శరయుగళంబున శరభునడచి
వాలిసూనుని పెక్కువాలుతూపులగొట్టి భండనమున నిట్లు ప్లవగవరుల
ననలశిఖవోలె వెలుగు దివ్యాంబకముల మిగులబడలంగజేసి యమ్మేఘనాధు
డార్చి నవ్వుచు నత్యంత హర్ష మెసగ బలికె నీరీతి దైతేయవరులతోడ.

వ. రణరంగంబున రామలక్ష్మణులు మొదలుగాగల వానరులనెల్లర పడగూల్చితి
గాన నింక మీరెల్లరు భయంబుదక్కి యుండుడన, వారెల్ల జయజయ
ధ్వానములతో నింద్రజిత్తునభినందించుచుండ హర్షస్వాంతుండై యింద్రజిత్తు
లంకజొచ్చె నంత నిట నాగపాశబద్ధులై వ్యథాభరంబున పడియున్న రామ
లక్ష్మణుల గనుంగొని భయభ్రాంతుండై కన్నీరువిడుచుచు మిగులవాపోవు
చున్న సుగ్రీవునితో విభీషణుండోదార్చుచు నిట్లనియె,

చ. భయమునువీడుమయ్య! మనభాగ్యవశంబున రాఘవుల్ నిరా
మయులగుచున్ సుఖించెదరు, భానుతనూభవ సంగరస్థలిన్
జయమెటునిశ్చయింపదగు! శాంతమునన్ ధృతిబూనుమిం క సం
శయమునుమాని యత్నమును సల్పెదమవ్వలదైవమాగడున్.

గీ. సత్యధర్మైకనిష్ఠులౌ సజ్జనులకు మేలుచేకూరు. రాదపమృత్యు వెపుడు
నీవుదృఢచిత్తమున నిందునిల్చి మాకు ధృతిదలిర్పగ మధురోక్తి దేర్పుమనఘా.

వ. అనినచించి కొంచెము జలమును గ్రహించి విభీషణుడు రాక్షసమాయలు
గ్రహింపహేతువగు మంత్రములచే నభిమంత్రించి తజ్జలంబుల సుగ్రీవుని
ముఖమును నేత్రములను తుడిచి కాలోచితముగా ధైర్యోక్తులనిట్లనియె.

గీ. అఖిలకార్యవినాశకంబైన యీయధైర్యమున కిదితరిగాదు సూర్యతనయ
రాముని శరణ్యుడని నమ్మి రాజసమున సేనలకునెల్ల హితము బోధింపుమనఘ.

వ. శ్రీరాముడు మూర్ఛదేరు వరకు మనము ప్రమత్తులమై రక్షింపవలయు పిమ్మట రామలక్ష్మణులు మన భయనివారణ మొనరింపగలరు. శ్రీరాముని ముఖము తేజోవంతముగానున్నది గావున యీనాగాస్త్రబంధము శ్రీరాముని కెట్టి యుపాయమును గలిగింపనేరదని సైనికులనెల్లర విభీషణుడు సమాధానపరచె. నింద్రజిత్తు తండ్రికడకరిగి నమస్కరించి యిట్లనియె.

ఉ. రాముని లక్ష్మణున్ సమరరంగమునన్ దునుమాడివచ్చితిన్
క్షేమముగా సుఖింపుమిక చిత్తమునన్ వ్యథమాని తండ్రి! సు
త్రామముఖామరాదుల మదంబడగించి జయంబుగొన్న నా
కీమనుజాధమాధములు హీనబలుల్ దలపోయ లెక్కయే.

కవిరాజ విరాజితము :

అనుచు సగర్వముగా వచియించు నిజాత్మజువల్కులకుబ్బి కన
త్కనకమయాసనమున్ డిగి చెంగున గంతులువైచుచు రావణుడున్
తనయుని కౌగిటజేర్చి శిరంబును దద్దయుమూర్కొని హర్షముతో
ననియె తదీయవిచిత్రచరిత్రము నంతయు దెల్పుమటంచు వడిన్.

వ. అనుగుటయు తద్వృత్తాంతంబెల్ల నెరింగింప రావణుడెంతయు సంతసించి పిమ్మట సీతయొద్ద కావలిగాయుచున్న త్రిజటమున్నగు దైత్యాంగనలకొందర రావించి వారితో నిట్లనియె.

—: నాగపాశబద్ధులగు రామలక్ష్మణులను సీతకు జూపుట :—

సీ. రాక్షసాంగనలార రామలక్ష్మణులను సమరమందింద్రజిచ్చంపె నదుచు
జనకజ కెరిగించి పరగనామెను పుష్పకముపైన గొనిచని కదనభూమి
జచ్చినరామలక్ష్మణుల గాన్పింపుడు బలిసమాగమున గర్వమున జేసి
నన్ను గాంక్షింపకున్నది సుమా! నేడింక విభుసమాగమకాంక్షవిడిచి నిర్వి
చారముగ దివ్యభాస్వద్విచిత్రరత్న భూషణాంబరధారియై పొలుపుమీర
స్వాయముగా నేగుదెంచుమత్సముఖమునకు వేరుగత్యంతరము లేదు వేయునేల.

వ. అని యాజ్ఞాపింప.

మ. దనుజాధీశ్వరునాజ్ఞ చే నసురకాంతల్ గొందరెం దేవడిన్
జనకక్ష్మావిభు పుత్రికామణిని భాస్వత్పుష్పకంబందు గ్ర
క్కునఁ నెక్కించుకపోయి భీమణరణక్షోణిస్థలిన్ రామ ల
క్ష్మణులెచ్చో పడియుండి రయ్యెడ నభస్థానంబునన్ నిల్పినన్.

సీ. కాంచెనంతట జనకక్షితీశతనూజ రామలక్ష్మణుల ధరాతలంబున
శరతల్పగతుల తీక్ష్ణశరాభితప్తుల నసల తేజస్ఫూర్తి నలరువారి
కనకమయోజ్వల కవచముల్ తెగి రక్తసిక్తులై కడు వగకెందువారి
హస్తాబ్జములనుండి యల్లనచాపంబు లుర్విపై జారిపోనున్న వారి
నసితవిశిఖాంబుజేక్షణమైన సీత ప్రాకృతుంబోలె ధాత్రిపై పాంసులిప్త
కాయులై పడియుండిన ఘనుల రామలక్ష్మణులఁగాంచి యేడ్చె నుల్లముకలంగ.

గీ. భువనమోహన! రఘుకులభూషణా! మహా పరాక్రమోపేతుడవు రణరంగమందు
నిట్లు హతమైతివింక నేనేమిసేతు ఘోరవిపదబ్ధిమున్గి క్రుంగిపోతి.

ఉ. ఇంతటి దుర్విపత్తు నిటులేటికి సంభవమయ్యె! నయ్యయో!
యెంతటి మందభాగ్యనో మహేంద్రసమానులు రామలక్ష్మణుల్
వింతగ నేలపైనొరగి వేదనకై రి మహాస్త్రవేదు ల
త్యంతపరాక్రమాఢ్యులిటు లల్పులచే హతులైరి హావిధీ!

క. అనిలో రాముని దృక్పధమునబడి ప్రబలారియైన మొనసి బ్రతికిపో
డనతిక్రమంబు కాలంబనివార్యము దైవయోగ మఖిలాత్మలకున్.

వ. ప్రాణేశ్వరుడు దుష్టసంహారమొనర్చి నన్ను దురాత్ముల బారినుండి రక్షింతురని పేరాసతో బ్రతికితి నింకనాజీవితము నిరర్థకము. మహాత్ముండైన శ్రీరామ చంద్రుని కిట్టియకాలమృత్యువాసన్నంబగునా! అదియునుంగాక.

సీ. సాముద్రికాదిశాస్త్రజ్ఞు లస్మచ్ఛరీరాంగ లక్షణములనరసి సత్కు-
మారుల గనెదు సుమంగలీత్వముబాయ దశ్వమేధాది మహావిశిష్ట
మఖములొనర్చెదు మండలేశ్వరు పట్టమహిషివయ్యెదవు సమ్మదమెలర్ప
వీరపార్థివ పత్నివై రహించెదవు ధన్యాత్ముఁరాలవటంచు ననిరి నేడు
దాశరథి హతుడగుట తత్త్వాజ్ఞులనృత వచనులైరింక నేమనవచ్చు మామ
కాంఘ్రి యుగమున నలరు పద్మాద్యనేక భాగ్యరేఖలు యెట్లునిష్ఫలములయ్యె.

వ. స్త్రీలకు వైధవ్యప్రాప్తికిదగిన దౌర్భాగ్యలక్షణములు నాశరీరమందు గనపట్టుట లేదు కన్యాలక్షణములెరింగిన శాస్త్రజ్ఞులు నాశరీరావయవ లక్షణములు

పరీక్షించి నాకుభర్తతో నధిరాజ్యపట్టాభిషేకమగుననియు వచించి రిది యంతయు నిరర్థకమగునే! శ్రీరామలక్ష్మణులు నానిమిత్త మరణ్యములలో బహువిధశ్రమలొంది దుస్సాధ్యమగు సముద్రమును తరించి వచ్చి కడకింద్ర జిత్తుమాయలలో జిక్కి రక్కటా విధి నేమనవలయునని పెక్కుతెరంగుల వగచు సీతతో త్రిజట సాంత్వనవచనంబులనిట్లనియె.

ఉ. చింతిలకమ్మజానకి వచించెద నానుడినమ్ముమమ్మ నీ
కాంతుడు నీమరందియు సుఖంబుగ ప్రాణములొంది యున్నవా
రెంతయు సందియంబు వలదేమన సంగరరంగమందు భూ
కాంతుడు ద్రెళ్ళినన్ భటనికాయము ధీరతనిల్చియుండురే.

సీ. వినుమదిగాక నీవిభుడే హతుండైన నీ పుష్పకము నిన్వహింపదెపుడు
కర్ణధారుడులేని కలము పయోనిధి మధ్యలోనల్లాడు మాడ్కిసమర
తలమునందెపుడు ప్రధాననాయకుడు హతుండగుచో సేన తొలగిచనును
కావున నిపుడట్లు గాక వానరసైన్య మధికధైర్యోత్సాహులగుచు నిలిచి
రఘువరేణ్యుల నిర్వర రక్షణంబు సేయుచున్నారు కాన సజీవులగుచు
నున్నవారని గుర్తించి యుల్లమందు చింతవిడనాడి ధైర్యంబు జెందుమబల.

వ. జానకీ! నీవుమహాపతివ్రతాశిరోమణివి గావున నీయందు ప్రేమభావమున యధార్థమును వచించుచున్నాను. శ్రీరామలక్ష్మణుల జయింప మహేంద్రాది దిక్పాలకులకైన వశముగాదని నాయాశయము. మరియొక విషయ మవధరింపుము.

గీ. రామలక్ష్మణులిటుల మూర్ఛలమునింగి యుండియును వీరిముఖకాంతు లొప్పియుండె
నరయు మొకటి గతాయుష్కులైన కుట్టి వారిముఖముల దొడ్డ వికారమొదవు.

వ. కావున రామలక్ష్మణుల విషయమున నీకుదయించిన విపరీతబుద్ధిని విడువు మనవుడు దేవతాకన్యకవిధంబున నొప్పుజానకి కృతాంజలిబంధురయై తల్లీ! నీవాక్యానుసారమట్టి శుభోదయమగుగాక, యని యూరడిల్లె నంతమనోవేగమున పుష్పకము యథాస్థానమున వాగలడించె. అనంతరంబ సీత తానుకనుగొనివచ్చిన యాపద్విషయములను మాటిమాటికి తలంచి చింతించుచుండె నిటసంగ్రామ రంగస్థలంబున సుగ్రీవాదులెల్లరు చుట్టుకొనియుండ శ్రీరాముడించుక తెలివొంది కనులువిచ్చిచూచి రక్తసిక్తాంగుండై పడియున్న లక్ష్మణుని గురించి మిగుల వగచుచు నిట్లనియె.

గీ. జానకీదేవికెనయగు జలజగంధి సద్గుణగరిష్ఠుఁడైన లక్ష్మణునితోడ
సదృశుఁడగు భ్రాత సచివుఁడు సాంపరాయి వెదకి చూచిన లేరు పృథ్వీస్థలమున.

క. నాసోదరుండు బ్రతుకనిచో సీతయు నేల కపులుఁజూచుచునుండన్
వాసెడ ప్రాణంబుల నిలనా సరిదౌర్భాగ్యుఁడెందు మనన్ లేఁడుసుమా.

క. నామదినెరింగి నడచెడు సౌమిత్రిని బాసిపురికిఁజని యమ్మలకే
నేమని వచింపగలుగుదు నీమహానీయాపదబ్ధి నెట్లుత్తరింతున్.

ఉ. జీవములం దృజింతు యిటు జేద్పడియుండె సహోదరుండు నా
జీవితమేటికి నీక్రియ విచిత్రమహాపదలంగతించె మ
ద్భావమెరింగివర్తిలెడు ప్రాణసమానుఁడు లక్ష్మణుండు హా
దైవనియుక్తి నింతటివ్యథాభరపీడితుఁడయ్యె నక్కటా!

గీ. వచ్చెనాతోడ సౌమిత్రివనములకును యతనివిడనాడి నేనయోధ్యాపురమున
కరిగిన సుమిత్ర నాయెడ నలిగి నిందనేయ నెట్లుంగి భరియింతు జింతవాసి.

గీ. ప్రియవియోగవ్యథాభార పీడితుండనైన నాచెంత నిలిచి భక్త్యతిశయమున
తగుహితాలాపముల సమాధానపరచు తమ్ముఁడా! నీవులేని యీతనువికేలా.

వ. అక్కటా! సర్వవిధముల ననుగాచియుండు నాబహిఃప్రాణముగానున్న లక్ష్మణుఁడు దౌర్భాగ్యుఁడనగు నామూలమున నిట్టిదుర్దశపాలయ్యె, నేనెంతటి దురాగ్రహగ్రస్తుండనైనను మారుబలుకని శాంతమూర్తి, సహస్రబాహుండగు కార్తవీర్యునికంటె రెండుబాహువులతో లక్ష్మణుఁడు పెక్కుబాణముల ప్రయోగింపగలఁడు. యుద్ధరంగముల దేవదానవులసహితము, లెక్కనేయని పటుపరాక్రమశాలి లక్ష్మణుఁడు నేఁడు నిశితశరతల్పమున రక్తసిక్తాంగుండై మహాభయంకరముగా పడియున్నవాఁడు. అక్కటా! విభీషణుని రాక్షస రాజ్యమునకు పట్టాభిషేకమొనర్పఁజాలనైతి. నాయసత్యప్రలాపములు నన్ను మిక్కిలిదహింపఁజొచ్చె ననిపలుమరు వగచుచు నిట్టూర్పులువిడుచుచు కదలలేక నేత్రములనుండి బాష్పములు వెడలుచుండ సుగ్రీవునిముఖమును లక్షించి యిట్లనియె మిత్రమా!

ఉ. నీవుచమూసమేతముగ నీరనిధిన్ వడిగాతరించి సు
గ్రీవ పురంబుకేగుమిక కేవలమద్రహితుండవౌ నినున్

రావణుడెత్తివచ్చి రణరంగమునం బరిమార్చ జూచెమం
గావున నాహితోక్తులను గైకొనుమెంతయు మేలుచేకూరున్.

వ. సుగ్రీవా! దైవఘటనము నతిక్రమించుట కెవ్వరికిని సాధ్యముగాదు. ధర్మాసక్తుండవగు నీవు నావిషయమున నన్నియు నిర్వర్తింపగలిగితివి. హనుమదంగదప్రముఖవానరవర్యులారా! మీరెల్లరు నాకొరకుగా ప్రాణేచ్ఛలవిడిచి సమరతలంబున భయంకర కార్యములనొనర్పగలిగితిరి. గావున మీకెంతయు కృతజ్ఞుడ మీరొనర్చిన కార్యము ఘోఘము యింక మీకనుజ్ఞనొసంగుచున్నాడ మీయిష్టానుసారముగా మీమీనిలయంబులకు పుగుడని ప్రసంగించుచు పరిదేవనంబొనర్చుచుండె అంతశ్రీరాముని దీనాలాపముల విని వానరులు కనులెఱ్ఱవార నత్యంతదుఃఖమున నశ్రుధారలువిడిచిరి. తత్సమయమున విభీషణుడు జలములచే శ్రీరామలక్ష్మణుల నేత్రములతుడిచి గొప్పకంఠధ్వనితో విలపించుచు నిట్లనియె.

సీ. కడుసుప్రసిద్ధులై గ్రాలుశ్రీరామలక్ష్మణులను కపటసంగరమునందు
శక్రవిద్వేషి వంచనజేసె వీరిట్లు బాణభగ్నాంగులై శోణితమున
తడిసిన నేలపై బడి ముళ్ళపందుల తెన్నున నగపడుచున్న వారు
రామలక్ష్మణుల పరాక్రమములనమ్మి యాశ్రయించితి పురుషార్థమనుచు
వీరలుశరీరములుబాయ వీరశయ్యలందు శయనించి రస్మదీయాశయము ని
రర్థకంబయ్యె నేనింక నవనియందు బ్రతికియుండుట జీవచ్ఛవంబుగాదె.

మ. అతిదుష్టుండగు రావణాసురుని యిష్టార్థంబుసిద్ధించెను
వ్రతులౌవారికి మాత్రమారయగ సౌభాగ్యంబుచేకూరు బ
ద్ధతికిం గాలముగాదు సత్యమిది కర్తవ్యార్థమేమంచు దు
స్థితికింగుందు విభీషణుంగని దరస్మేరాననుండై పడిన్.

వ. సుగ్రీవుం డాతనినాలింగనమొనర్చుకొని యతనితో నిట్లనియె.

గీ. ప్రబల లంకాధిరాజ్య సంపద లభింపగలవు నిస్సంశయంబిది తెలియుమనఘ
తనయ బాంధవ సహితుడై దశముఖుండు కడగి నిజవాంఛితార్థంబు బడయ లేడు.

వ. రామలక్ష్మణులుగాఢమగు మూర్ఛాక్రాంతులై యుండిరి. కొలదికాలమున మూర్ఛనుండి తేరుకుని రావణుని సపరివారముగా వధించి లంకారాజ్యమునకు నిన్నుబట్టభద్రునిగావింపగలరు. గావున నీవింక భయరహితుండవై ధైర్యము నొందవలయునని యోదార్చి, మామగారైన సుషేణునిరావించి యిట్లనియె.

ఉ. విన్నపమో మహాత్మ రఘువీరులు మెల్లనమూర్ఛదేరి సా
ఖ్యోన్నతినున్న నీప్లవగయోధులతో గొనిపొండు పీటికిన్
సన్నుతిమీర రావణుని సంగరభూమి సబాంధవంబుగా
గ్రన్ననద్రుంచి జానకిని గైకొనివచ్చెద నిశ్చయంబుగన్.

వ. అనవుడు సుషేణుండిట్లనియె. తొల్లి దేవాసురయుద్ధమున రాక్షసబాణ బాధితులై తెలివి దప్పిప్రాణావసిష్టులైయున్న దివౌకసుల బృహస్పతి మంత్రయుక్తముగా మృతసంజీవి మొదలగు యోషధులచే సజీవితులంగావించె. అట్టిదివ్యౌషధలతలు క్షీరసముద్రమధ్యమున దేవదానవులమృతముకొరకు మథించిన ప్రదేశమున చంద్రద్రోణములను పర్వతముల పై సంజీవకరణి విశల్యకరణి యను దివ్యౌషధుల దేవతలతిజాగరూకతతో రక్షించుచుండిరి. కాన మనలో సమర్థులగు హనుమత్ప్రముఖులు కొందరు త్వరితగమనంబున జని యయ్యోషధులదెచ్చి రామలక్ష్మణులకుపయోగించిన సజీవులయ్యెదరని వచించుచుండ నంతలో.

మ. గురుదంచత్పవనాహతిం జెదరి మేఘవ్రాతముల్ బారగా
ధరణీచక్రముసంచలింపగ సముద్రంబల్లకల్లోలమై
తరువుల్ కూకటివ్రేళ్ళతో ఫెళఫెళధ్వానంబునంగూలగా
నరుదెంచన్ వినతాతనూజుడవుడుద్యద్వాయువేగంబునన్.

చ. పులుగులరేనిగాంచి పెనుపుట్టలకున్ వడిబారెసర్పముల్
జలచరముల్ భయాకులత సాగరతోయములందు దాగెను
జ్వలదహనుండితండన సభస్థలివెల్గు ఖగేంద్రుగాంచి దో
ర్బలమున మించువానరులు భ్రాంతివహించిరి విస్మితాత్ములై.

గీ. పురుషోత్తములగు శ్రీరఘువరులను బాణములరీతి బంధించిన భీ
కరసర్పజాలమెల్లన్ గరుడునిదూరమునగాంచి గ్రక్కునబారెన్.

వ. అంతనఖగేంద్రుడు శ్రీరామలక్ష్మణులను సందర్శించి సంతోషపూర్వకముగా చంద్రబింబసదృశముఖులగు వారిముఖపంకజంబుల నిజహస్తాబ్జములతో తుడిచినంతమాత్రమున రామలక్ష్మణుల శరీరములయందలి వ్రణంబులన్నియు నివారణంబై దేదీప్యమానముగా ప్రకాశించుచుండె అప్పుడామహాత్ములయుత్సాహ వీర్య తేజోబలవిశేషంబులు, పౌరుష మేధావిజ్ఞానాది

సద్గుణంబులెల్ల ద్విగుణీకృతంబై పెంపొందె, పదంపడి రామలక్ష్మణులు గాఢముగానాతనినాలింగన మొనరించుకొన గరుడునితో శ్రీరాముండిట్లనియె.

ఉ. ఆపదను త్తరించితివి యార్య భవత్కృపచేత మాకు సం
తాపమువాసె దేహమున ధైర్యముల్ తేజము పెంపునొందె నీ
ప్రాపున ప్రాణముల్ మరల ప్రాప్తిలె ధన్యులమైతిమెంతయున్
మాపితృదేవతానరుల మాడ్కి మిమున్ గన హర్షమయ్యెడిన్.

చ. వలిపెపహారంగు క్రొంబసిడివన్నియ మేల్ జలతారుపుట్టముల్
విలసదనర్ఘ్యభూషణ నవీనమనోజ్ఞ సుమస్రజంబులన్
బొలువలవున్ దనర్చు కలపంబునలంది మనోహరాకృతిం
జెలగు మహాపరాక్రమవిశిష్టుడ పీవెవరార్యసత్తమా!

వ. అనిప్రియపూర్వకంబుగా ప్రశ్నించు శ్రీరామునితో గరుత్మంతుండిట్లనియె.

ఉ. శ్రీరఘువంశపావన వచించెద విన్ముభవత్సఖుండ నా
పేరుజగంబులందలరు విశ్రుతమైగరుడుండనంగ నిం
పారగ మీకునియ్యెడ సహాయమొనర్పగనెంచి వచ్చితిన్
వారక ప్రాణతుల్యుడగు బంధువుగా ననుగుర్తిరుంగుమా!

వ. శ్రీరామచంద్రా! క్రూరకర్ముడగు యింద్రజిత్తు నిజ మాయాబలంబున విషానలంబు గ్రక్కు తీక్ష్ణదంష్ట్రా భీలంబులైన వాసుకి ప్రముఖ సర్పములను శరంబులసంధించి మిమ్ములబంధించె. వీనినివిడిపింప నెవ్వరికిని సాధ్యము కాదు. ఈవార్తనాకర్ణ గోచరంబై మిమ్ములబంధవిముక్తులగావింప నేతెంచితి నన్ను దూరముగా గనుగొనినంతనే నాగపాశబంధములు మిమ్ములవిడిచి పలాయనం బయ్యె. మీరింకమీద నప్రమత్తులై వర్తింపవలయు. మీకు జయంబగుగాక యని గాఢముగా శ్రీరామలక్ష్మణుల నాలింగనమొనరించి మీరింక రావణ ప్రభృతుల వధించి సీతాసమేతముగా సుఖముగా నయోధ్యకరుగగలరని ప్రియవచనముల నాశ్వాసించి తదనుమతంబువడసి ప్రదక్షిణపూర్వకముగా వచ్చివాయు వేగమున నాకాశపథంబున జనియె. ననంతరంబ వానర భల్లూక నాయకులు సుఖస్థితులై యున్న శ్రీరామలక్ష్మల గనుంగొని ససంభ్రమ మానసులై క్రమ్మఱ యుద్ధసన్నద్ధులైరంత సూర్యోదయంబయ్యె తత్సమ యంబున వానరులుకోలాహలధ్వనులతో పెచ్చు పెరిగి

ఉ. వాలములెత్తి త్రిప్పుచు నవార్యమదస్ఫురణన్ వడిన్ భుజా
స్ఫాలనమాచరించుచు విశాలమహీరుహముల్ బెకల్చుచున్
శైలములెక్కి యార్చుచును శంఖములొత్తుచు క్రూరదైత్యజి
ల్లాలసులై వనౌకసులు లంకను క్రమ్మఱముట్టడించినన్.

—: ధూమ్రాక్ష యుద్ధము :—

వ. రామలక్ష్మణులు నాగపాశవిముక్తులైరని తెలిసి రావణుడు మనకింక విజయము దుర్లభమని శంకించి క్రోధమినుమడింప ధూమ్రాక్షుండను దొడ్డసేనాపతిని రావించి సైన్యసమేతుండవై చతురంగసైనికులతో జని రాముని వధించిరమ్మని సెలవొసంగ వాడు సమరోత్సాహమున హనుమత్ప్రముఖులు నిలిచియున్న పశ్చిమద్వారదేశమున కేతెంచుచుండె నాసమయమున.

సీ. దురమొనర్పగవచ్చు ధూమ్రాక్షురథముపై గవిసిమాంసాసియౌ గ్రద్ద వాలె
కడుసుందరంబుగా గాలుకేతనముపై కుణపముల్ తిను గ్రద్దగుంపుముసరె
రక్తసిక్తముగ ఘోరకబంధమొండు ధూమ్రాక్షునియెదుట కోయనుచుబడియె
వారిదములు రక్తవర్షంబువర్షించె పృథివీతలంబు కంపింపదొడగె
పిడుగుపడినట్లు పెనుగాడ్పు వీచుచుండె దిశలుచీకట్లతో నిండి తెలియకుండె
బహువిధంబుల నిట్టియుత్పాతములను గాంచి ధూమ్రాక్షుడెంతయు సంచలించె.

వ. నడగొండవిధంబున యుద్ధార్థియైవచ్చు ధూమ్రాక్షుని గనుంగొని శాఖామృగ సైన్యంబులు సింహనాదములు సేయుచు వృక్షంబులబెరికి విసరుచు గండశిలల రువ్వుచు పైకురవడించిన రక్కసులది సహింపక శూలముల బొడుచుచు ముసలముల మోదుచు ముద్గరంబుల నొంచుచు బట్టసంబుల గొట్టుచు భిండివాలంబుల జెండాడుచు కుంతంబుల మొత్తుచు కువిశంబుల బొలియించుచు కురారంబుల కఠోరంబుగా బాదుచు విజృంభించి రిట్లు భయపక్షంబులవారికి ఘోరంబైన పోరాటంబు ప్రవర్తిల్లె నప్పుడు.

చ. విరిగినతేరులుం దెగినవీరులు జచ్చినసామజంబులున్
ధరపయి గ్రెల్లి సారథులు దల్లడమందెడు మొండెముల్ భయం
కరముగ గూలుమేటితురగంబులుం, బ్రోవులుబడ్డ ప్రేవులుం
దొరగెడు రక్తవాహినులతో సమరస్థలి భీతిగొల్పగన్.

లయవిభాతి :

భూరిభుజశ క్తిమెయి పౌరుషములుల్ల శిల వీరులగు వానరులు విూరినఖపం క్తిన్
క్రూరులగు దైత్యకుల వీరులముఖంబులతి ఘోరముగ జీల్చిరరుదార వడిరక్తో
ద్గారితములై కడువికారముగ దోపగ శిరోరుహములూడగ
సురారులురుమూర్ఛన్
గూడిరటకొందరు విచారములుదక్కి కవివారమురు మోదిరి కుఠారములతోడన్.

వ. అత్తరి మిగులవేగముగావచ్చు రాక్షసులపైకి లంఘించి వానరులు ముష్టి ఘాతములగ్రుద్దియు పాదంబులదన్నియు దంతంబులగొరికియు నఖంబుల జీల్చియు శిలలరువ్వియు వృక్షంబుల మోదియు నాశమొందించుచుండ రాక్షసులు కొందరు భయకంపితులై పారిపోవుట గనుంగొని ధూమ్రాక్షుడు కోపముతో వానరులపైకురవడించి యార్చుచు శరవృష్టిగురిపించుచు భయంకరముగా ధ్వంసంబొనరించుచుండె. అంతధూమ్రాక్షునికడ నిలవజాలక పరువులిడు వానరులగనుంగొని సహింపజాలక హనుమంతుడు.

మంజరి :

పెనుశిలనొకదానిబూని రాక్షసవీరులమీదికి వడిగన్
జనిభుజబల మొప్ప తేరుపైనన్ సాగివైచె బలమెసగన్
దానింగనిబెదరి దైత్యుడిలకుం దాటెరయొక్కగదబూని
వానిరథం బశ్వసారథులతో బ్రక్కలగుచు పడెనవని.

వ. ఇట్లుధూమ్రాక్షుని, రథమును చూర్ణమొనరించి పవమాననందనుండు విక్రమించి వృక్షంబొండు బెఱికి సమీపగతులైన రాక్షసుల జక్కడంచి తోడనే నటపర్వతశృంగంబొండు బెరికి ధూమ్రాక్షునెదిరించిన నతడుమిగుల వాడియగు గదాదండంబును గిరగిరంద్రిప్పి హనుమంతునిశిరంబుపై విసరె నంత.

శా. సాక్షాన్మారుత తుల్యవేగుడగు తత్ప్రాణమీరియున్ మీరి త
ద్రక్షోవీరు గదాప్రహారమును నిర్లక్ష్యంబుగాజూచి తా
నక్షీణప్రభ నొక్కశైలశిఖరం బాక్షుద్రియన్ ద్రేయు ధూ
మ్రాక్షుండంత ధరిత్రిపైబడియె సర్వాంగంబులుం జూర్ణమై.

—: వజ్రదంష్ట్రుని యుద్ధము :—

వ. అంత హతశేషులగు రక్కసులు భయకంపితులై లంకకరిగి ధూమ్రాక్షుని మరణంబెరింగించిన రావణుండు క్రోధతామ్రాక్షుండై రణశూరుండగు వజ్ర దంష్ట్రున కనుజ్ఞనొసంగిన వాడు సర్వాలంకారశోభితుండై ఖడ్గ కవచ తూణీర శర శరాసనాది సాధనసమేతుండై రథంబధిష్ఠించి చతురంగ సైన్యంబులతో దక్షిణద్వారమును చేరంజనుచు మార్గంబున దోచుదుర్నిమిత్తంబులు సరకు సేయక సైనికుల కోలాహలంబులు సెలంగ గవిసె. అంత వానర రాక్షస బలంబులు పరస్పరజయేచ్ఛల విక్రమించి పోరుసమయంబున

గీ. శంఖభేరీమృదంగ నిస్వనము లట్ట్రహాస నిర్ఘోషణములు పాషాణవృక్ష శబ్దములు వాజి వారణ స్యందనముల ధ్వనులతో నిండెహృదయభేదనకరముగ.

వ. రక్కసిమూకలు కొందరు వివిధసాధనంబులు ప్రయోగించి యవినిశ్చేష్ట మగుచుండ బాహాబాహియుద్ధంబునకు దలపడి విజృంభించి పోరాడుటయు యుభయసైన్యములు కోలాహలంబులతో గుంపులుగుంపులుగామూగు చుండి రట్టియెడ వానరసేనలురవడించి రాక్షసుల పెక్కుగతుల నాశమొందించు చుండుట గనుంగొని వజ్రదంష్ట్రుడు సహింపక కటంబులదర కపివాహినిపై బడి వివిధసాధనంబులతో నొక్కొక్కవిధులకు నార్వుర తొమ్మండ్రుగుర బడ మొత్తుచు వీరవిహారం బొనరించుచుండ వానరులు నిలువజాలక యంగదు మరువుజొచ్చిన నతండోడకుండుడని ధైర్యమున విక్రమించె.

క. మదవారణము మృగేంద్రము గదిసివిరోధమున బెనగుకై వడి నపుడం గదుడల్ల వజ్రదంష్ట్రుడు కదనంబొనరించి రథికగర్వోన్నతులై.

మంజరి :

మగటిమితో వజ్రదంష్ట్రుడొక తోమరమున నంగదు మోదన్
బెగడొందక వాలిసుతుడు వైచెన్ వృక్షముదైత్యునిమీదన్
పైకిజను దెంచు నృక్షముంగని భయపడక నిశాచరుడున్
ఖీకన్ మధ్యమునద్రుంచె నెల్లరు విస్మయులై గనుగొనుడున్.

ఉ. అంతట రోషభీషణ ముఖాంబుజుడై వడి వాలినూను డ
త్యంత పరాక్రమంబున మహాగిరినొండల వజ్రదంష్ట్రుపై
బంతముతోడదువ్వి బహుభంగుల నార్చిన వాడుధీరతన్
గంతునదూకి నొక్కగదగైకొని తేరిలగూలె సాధితోన్.

సీ. పిదప వాలిసుతుండు భీషణంబుగ నార్చి వెండియు నొకదొడ్డ కొండ బెరికి
వజ్రదంష్ట్రునిమీద వైచిన వాడు రక్తముగ్రక్కి యొకముహూర్తంబు మూర్ఛ
బడి తెలివొంది కోపస్ఫూర్తితో తనవక్షంబుపైనున్న వాలిసుతుని
గదతోడ మోది తద్గరపారవైచి నత్యుద్ధతితో ముష్టియుద్ధమునకు
దలపడి పరస్పరజయేచ్ఛ దవిలిమిగుల దారుణంబుగ పెనురక్త ధారలొలుక
దివి బుధాంగారకులబోలి దెప్పరమున పెనగి శ్రమజెంది రసుర కపిప్రవరులు.

వ. పిమ్మట కపిశ్రేష్ఠుండైన యంగదుండు పుష్పఫలశోభితంబైన వృక్షంబొండు బెరికి వృషభచర్మముతో గప్పిన పలుకయు వాలును వరనుండిపెరికె నంత వజ్రదంష్ట్రుడును పలుకయు వాలును ధరించె. రోషావేశముతో వివిధ ప్రకారముల మండలాకారముగా దిరుగుచు నిరువురు కఠినముగా మోది కొన శరీరములు భయంకరముగా రక్తసిక్తంబులై పూచిన మోదుగుల విధంబున ప్రకాశింప రణపరిశ్రాంతులై భూమిపై మోకాళ్ళనూని నిలిచి వెండియు నుద్ధతులై కవియుటయు.

మంజరి :

కొండొకవడి కంగదుండు మిక్కిలి క్రోధోద్రేకముతోడన్
దండాహత భుజగమట్లులేచెన్ ధైర్యము మదిదొలుకాడన్
ఫళఫళమనిమెరయు ఖడ్గధారన్ వజ్రదంష్ట్రశీర్షంబున్
హాళాహళిన్ నరికివైచె కపివరు లపుడొందిరి హర్షంబులన్.

— అకంపన యుద్ధం :—

వ. అంత నద్వృత్తాంతంబెరింగి రావణాసురుడు ప్రహస్తప్రముఖులతో యోచించి సమరవిశారదుండగు అకంపనుని యుద్ధమునకు సెలవొసంగె. వాడెంతయు సంతోషముతో చతురంగసైన్యములతో రథారూఢుండై వర్షాకాల మేఘ మట్లు గర్జిల్లుచు జనుసమయంబున.

గీ. మార్గమున రథ్యముల కకస్మాత్తుగా విపర్యయంబగు దైన్యంబు ప్రాప్తమయ్యె
వామనేత్రంబు జలియించె వదనమతి విషణ్ణతవహించె గద్గద స్వరముగలిగె.

వ. ఇట్లు బెక్కుదుర్నిమిత్తంబులు పొడసూపుటయు వానిని సరకుసేయక అకంపను డనేకదైత్యవీరులతో గూడి వెడలునపుడు ఆసైనికులలో నుత్పన్నంబైన కోలాహలధ్వని రెండవసముద్రఘోషంబు ననుకరించె నంత.

ఉ. దానవవానరావళికి దారుణమైన రణంబుసెల్లె త
త్సైనిక యూథముల్ ప్రబల శౌర్యములుల్లసిలంగ నొండొరుల్
మేనులుపొంగ రక్కసులు మేటిశరావళి గుప్ప గ్రొవ్వనన్
వానరవీరులున్ విసరివైచిరి వృక్షశిలాప్రవర్షమున్.

క. కొండలుగొండలుడీకొని గండుమిగిలి పోరుకరణి గడువడి గదియం
దండోపతండముల వేదండ భట హయాళి తెగి కుతలము నిండెన్.

వ. దైత్యచమూనాయకుండైన అకంపనుడు నిజసారథిం బ్రేరేపించి తదీయ కపిసైన్యంబులపై కురవడించి పుంఖానుపుంఖంబులుగా శరపరంపరల తెంపులేక వర్షించి వానరసైన్యంబులనెల్ల నల్లకల్లోలముగా పొరిగొనుటయు కొందరు హతులగుచుండుటయు నిలువజాలక కొందరు దెసలంబారి రావిధంబెరింగి హనుమంతుండు వానినింబొదివిన నంతధైర్యముతో తక్కినయోధులు అతనికి సహాయులై నిలిచిరట్టియెడ నకంపనుడు క్రోధతామ్రాక్షుండై శరవృష్టిచే హనుమంతుని ముంచివైచె నయ్యవసరంబున.

చ. ఘనబలుడైన మారుతి యకంపను తీక్ష్ణశరాఘవృష్టికిం
దనుకక దీప్తతేజమున దైత్యుని జంపగ తెంపుజేసి మే
దిని చలియింప పైగవిసి దిట్టతనంబున నొక్కశైలముం
గొనకొని వేపెకల్చుకొని కోయనియార్చుచు నుగ్రమూర్తియై.

మంజరి :

కరమునగీలించి త్రిప్పి వేయం గమకించిన నాలోనన్
హరించె దూరమునదాని నసురుం డర్ధచంద్ర బాణమునన్
దానింగని క్రోధమూర్ఛితుండై తత్క్షణమున పవనజుడున్
మానుగ నొకయశ్వకర్ణమనియెడు మ్రానుబెరికి గైకొనుడున్.

వ. రెండవ యముడునానొప్పు హనుమంతుని గనుంగొని దైత్యులు పారిపోవుచుండి రప్పుడ కంపనుడు సునిశితములగు పదునాల్గుసాయకంబుల హనుమంతుని, తద్వృక్షమును గొట్టుటయు నతడు పూచిన యశోకంబుకరణి రక్తధారాసిక్తావయవుండై పొగలేని వహ్నిచందంబున వెలింగె నాసమయంబున.

ఉ. వెండియు మారుతాత్మజుడు వేరొక వృక్షముపెల్లగించి యు
ద్దండ పరాక్రమంబెసగ దైత్యుని మూర్ధముపైని మోదినన్

మెండుగ శోణితంబుమిసి మేదినిపైబడి నీల్గె నంతటన్
భండనభూమిబాసి వడిబాపిరి లంకకు దైత్యవాహినుల్.

## —: ప్రహస్తుని యుద్ధము :—

వ. అంత రామసుగ్రీవప్రభృతులు హనుమంతుని శౌర్యోత్సాహముల ననేకవిధంబుల గీర్తించి రనంతరంబ రావణుడు అకంపను వధకుచింతించి యుద్ధనైపుణ్యుండైన ప్రహస్తునితో "సచివవరా! నీవనేకయుద్ధములలో విజయమును సాధించితివి. ఈయల్పసత్వులగు మానవ మర్కటుల నవలీలగా జయింపగలవు కావున శత్రుసైన్యంబుల నాశమొందించి విజయమును సాధించి రమ్మని"యుత్తర్వొసంగిన సంతోషముతో ప్రగల్భవచనముల బల్కుచు చతురంగ సైన్యవాహినితో రథారూఢుండై శంఖభేరీనినాదంబులు సెలగ రక్షోవీరుల సింహనాదంబులు మిన్నుముట్ట తూర్పుద్వారమునందుండి బయల్వెడలె నాసమయంబున.

సీ. క్రవ్యాదగణము లాకసమునందు ప్రహస్తు తేరుపై గిరగిర దిరుగజొచ్చె
జంబుకప్రతతి భీషణవహ్నికీలల గ్రక్కుచు వాపోయె గర్కశముగ
గగనంబునుండి యుల్కలురాలె, మిక్కిలి వెక్కసంబుగ గాడ్పువీవదొడగె
గ్రహములొండొంటిపై కాంతిదొరంగి యుంచుకేనియు బ్రకాశింపవయ్యె
వారిదంబులు ప్రహస్తుని తేరిపైన రక్తవర్షంబు గురిసె భైరవముగాగ
కేతనాగ్రంబుపై వ్రాలె గృధ్రమొకటి చబుకు సారిధిచేనుండి జారిపడియె.

వ. ఇట్లునుర్నిమిత్తంబులు పెక్కుపొడసూపుటయు నతండవి లెక్కసేయక ననలశిఖలకురుకు శలభంబుల పోలిక రామలక్ష్మణుల నిర్జించు కుతూహలంబున సుగ్రీవుని సైన్యంబున కభిముఖుండై నడచె నప్పుడు.

క. ఈమాడ్కి నేగుదెంచెడు భీమబలుండౌ బ్రహస్తు వీక్షించుచు శ్రీ
రాముండు నగి విభీషణు సామీప్యంబునకుజేరి చతురతబలికెన్.

వ విభీషణా ఈ రాక్షసవీరుడు మహాభయంకరాకారముతో గొప్పసేనా సమేతుండై వచ్చుచున్నాడు వీనిచరిత్రం బెయ్యదియన విభీషణుం డిట్లనియె శ్రీరామచంద్రా!

క. ఈవీరుడే ప్రహస్తుడు రావణుని త్రిభాగసైన్య రక్షకుడు రణ
ప్రావీణ్యుడ నుపమాన భుజావిక్రమశాలి సర్వశస్త్రవిదుడనిన్.

వ. అనివిన్నబించుచుండ చనుదెంచు ప్రహస్తునిపై వానరవీరులు వివిధశిలావృక్షధారులై విజృంభించుటయు రాక్షసవీరులు నానావిధ వాహనసమేతులై వానరులపై శరంబుల ప్రయోగించుచుండుటయు ఇట్లు యుభయవాగులవారికి ఘోరంబగు పోరాటంబయ్యె నప్పుడు.

క. కొందరిని శూలముల మఱికొందర చక్రాయుధముల కొందర గదలన్
కొందర పరిఘలతో కపిబృందమును వధించి రసురవీరులు తెలుచన్.

క. వానరసైనికు లార్చుచు ప్రాకులతో గిరులతోడ మాత్సర్యమునన్
నానాప్రకారముల నద్దానవులం ద్రుంచి రధికదారుణభంగిన్.

వ. అయ్యవసరంబున.

మంజరి :

ప్రహస్తుడదిగుర్తెరింగి సైపక ప్రస్ఫుటమగు రోషమునన్
మహత్తర శరోగ్రవృష్టిగురిసెన్ మర్కటవీరులపైనన్
పదపడినీలుండు వానినింగని ప్రహస్తునొంప నడరినన్
మదమున నారక్కసుడును నీలుని మార్కొని తఱిమె రయమునన్.

శా. చాపంబెక్కిడి తీక్ష్ణమైన శరముల్ సంధించి దైత్యుండు దు
ష్కోపాటోపముతోడ నీలునిపయిం గ్రూరంబుగా నేయ నా
తూపుల్ వక్షమునుండి దూసిచని దోర్దర్పభూమిలోజొచ్చినన్
సైపంజాలక నీలుడొండు పెనువృక్షంబెత్తి పైచెన్ వడిన్.

వ. తత్ప్రహారంబునకు గినిసి ప్రహస్తుడు నీలుని తెంపులేని బాణవర్షముచ ముంచివైచె నప్పుడు శరద్రుతువునందు హారాత్తుగా వర్షించురాళ్ళవానకు గొప్పనృషభరాజముభంగి తద్బాణవర్షంబు నిరసింప నశక్తుండై నీలుడు కనుంగవ మూసుకొని కొంతవడి సహించి పిదప పట్టరాని యాగ్రహంబున నొకదొడ్డసాలకుజంబును బెరికి ప్రహస్తుని రథ్యంబుల మోది యతనికరంబున నున్న కోదండంబును యొడిసిపట్టి ఫెళ్ళున విరిచివైచి సింహనాదంబొనరించిన ప్రహస్తుడు ధనుర్విహీనుండై తోడన ముసలాయుధంబొందు [illegible] రథంబునుండి క్రిందికిదుమికి నీలునిపైకురవడించిన.

చ. నిరుపమశౌర్యధుర్యుడగు నీలునిపైకి ప్రహస్తుడార్చుచుం
బరుగునరాగ నొండొరులు బాహుబల స్ఫురణం బెలర్ప సం

గరమొనరించి రద్భుతముగా నతిపౌరుషముల్ సెలంగగా
కరికరి సింహసింహముల కైవడి మార్కొని రుగ్రకర్ములై.

గీ. అధికరోషంబుతోడ ప్రహస్తుడొక్క ముసలమునుగొని నీలుని నొసట మోద
రక్తసిక్తాంగుడై నృక్షరాజమొందు బెరికి నీలుండడచె దైత్యుపేరురమున.

వ. ప్రహస్తుం డాప్రహారంబునకు నోడబోక క్రమ్మర ముసలాయుధముతో నీలుని తరుముటయు.

స్రగ్ధర :

నీలుండత్యంత రోషాన్వితుడగుచు ధృతిన్ నిర్భరంబైన భాస్వ
చ్ఛైలంబొండెత్తి శౌర్యోజ్జ్వలుడగుచు వడిన్ శత్రుమూర్ధంబుపై నన్
భీలోద్రేకంబెలర్పన్ పృథుభుజబలిమిం బిట్టుమోదంగ దోడ్తో
కూలెన్ విచ్ఛిన్నమూ పెంకుజముటుల రణక్షోణి దైతేయుడంతన్.

వ. ఇట్లు ప్రహస్తుండ హతుండగుటయు కట్టతెగిన మహాప్రవాహాంబుకరణి రాక్షససేనలు భయభ్రాంతులై లంకకుబారిన నంతనీలుడు శ్రీరామాదులచే కీర్తనీయుండై మిగుల సంతసించె. తద్వృత్తాంతంబెరింగి రావణుండు క్రోధసంరక్తనయనుండై కొంతవడి యోచించి ప్రముఖులగు రాక్షసయోధులతో నిట్లనియె.

ఉ. ఏమివిచిత్రమక్కటా! మహేంద్రచమూతతినోర్చు దోర్బలో
ద్దాము బ్రహస్తు సైన్యసహితంబుగ కీశసహాయుడైన శ్రీ
రాముడు దున్మె నింకసమరంబున వారినుపేక్షసేయగా
దేమటికీ యిక్షణంబ జని యేనుస్వయంబుగ ద్రుంచివచ్చెదన్.

గీ. ఘనతరదవాగ్ని వనములగాల్చుకరణి రామలక్ష్మణులను వానరప్రవరుల
నేనుశరవహ్నిశిఖల దహించి తద్రుధిర మహాధార నిలకుసంతృప్తి జేతు.

వ. అనివచించి రావణుడు సమరసన్నాహంబొనర్చె.

—: రావణుని ప్రథమ యుద్ధం :—

సీ. రావణుడత్యంత రౌద్రంబుతోమించి దర్పోజ్జ్వలుండయి దాడి వెడలి
దేవవిమాన సదృశ రత్నకాంచన స్రగితరథంబున ధవళహారుల
బూన్పించి బహువిధ భూషణాంబర సుమస్రక్చందనాది సంస్కారణమొంది
శరశరాసనముఖ్యసాధనంబులదాల్చి రథమెక్కి తగచతురంగబలము

బలసిననుగ్రోల్వ నడువంగ బహుళ శంఖభేరికా వాద్యములు మ్రోయ భీషణముగ
వీరసుభటాట్టహాసముల్ వెలయుచుండ భూత పరివృతుడగు రుద్రుబోలియొప్పె.

వ. ఇట్లు బయనంబై లంకాద్వారంబు వెలువడి పర్వదినంబున నొప్పు సముద్రంబు దెన్నున రాక్షసవాహినితో వచ్చు రావణుని గనుంగొని శ్రీరామ చంద్రుడు విభీషణునితో నిట్లనియె.

క. నానాపతాక హయగధ నానాశస్త్రాస్త్రి సుభట నాగయుతంబై
పూనిక నేతెంచెడు యీ సేనాచయ మెవరిదో వచింపుమఖిలమున్.

వ. అనియడుగ శ్రీరామునితో విభీషణుండిట్లనియె.

గీ. మదగజేంద్రము నైనెక్కి మద మెలర్ప భీషణాకృతివచ్చు తద్వీరుడసుర
పతి కుమారుండితండకంపనుడనంగ వెలయు దానవుడతులదోర్వీర్యయుతుడు
మేటి మృగరాట్పతాకంబు మెఱయు దివ్యరథముపై దీర్ఘమా ధనుర్ధారియై మద
స్ఫురణతోడనే వచ్చునతండు రావణాసురుని పుత్రుడింద్రజిత్తనెడువాడు.

గీ. వింధ్య శైలప్రతీకాశ విగ్రహుండు స్యందనంబెక్కి భీషణ జ్యానినాద
మొనర జేయుచు నేతెంచె నుగ్రకర్ము డతిరథుం డతికాయ సమాహ్వయుండు.

క. వరఘంటా శోభిత మదకరిపై ఖరమట్లు మిగులగర్జిలెడు
మహాశోదరుడనెడువాడు రణభీకరమూర్తి నిశాచరాగ్ర గణ్యుండరయన్.

వ. వివిధమణిమయ సువర్ణభూషితుండై సంధ్యాసమయ మేఘమాలికావృత శైలంబన బ్రకాశించుచు హయోత్తమంబుపై బ్రాసాయుధమును ద్రిప్పుచు పిడుగువంటి వేగముతో వచ్చు వాడు పిశాచుడు, మెఱుపుచందంబున ధవళద్యుతులనొప్పు వృషణముపైనెక్కి గర్వోద్రేకమున నేతెంచువాడు త్రిశిరుడు, నీలజామూత సన్నిభశరీరముతో సర్పధ్వజ రథంబుపై ధనుష్టంకారము జేయుచు వచ్చువాడు కుంభుడు, పరిఘాయుధధరుండై రాక్షస సేనకెల్ల ధ్వజముగానొప్పు అల్లవాడే నికుంభుడు అని శ్రీరామచంద్రునితో రాక్షసవీరుల బేర్వేర నిరూపించి చూపుచు జెప్పి వెండియు నిట్లనియె

ఉ. ఆతడె రావణుండు వివిధాద్భుత రూపుధరుండు నిర్జర
వ్రాత మదాపహారి గజవాజిమృగోష్ట్రముఖుండు చంద్రికా

ధౌత నవాతపత్ర కలితప్రథితుండు కిరీటధారియై
భూతపరీవృతుండగుచు నొప్పెడు రుద్రుడనంగ నొప్పెడున్.

వ. అని వచించు విభీషణుని వచనముల నాకర్ణించి శ్రీరామచంద్రుడు విభీషణా! ఈ రావణుని తేజోబలశౌర్యాదులు మిగుల నాశ్చర్యకరములుగా గన్పట్టుచున్నవి ఈతని సైనికవర్గ మత్యంత బలపరాక్రమోపేతులు వివిధసాధనములతో మిగుల దుర్జయులుగా గన్పట్టుచున్నారు పాపియగు రావణుడు దైవయోగమున నాకంటబడియె పరమకిరాతుండగు వీనినిప్పుడే హతంబొనరించెద ననివచించి కోదండపాణియై యుత్తమంబగు శిలీముఖంబొండు శరాసనంబున సంధించి సౌమిత్రీసహితుండై యుద్ధమునకు సంసిద్ధుడై నిలిచె నయ్యవసరంబున రావణానుమతంబున రాక్షససైనికులు విజృంభించి వానరసేనపై గవిసి రయ్యవసరంబున.

ఉ. పావకులీలవెల్గు శరపంక్తులు జాపముదాల్చి వచ్చు త
ద్రావణునిం గనుంగొని మదస్ఫురణన్ గిరిశృంగమొండు సు
గ్రీవుడు పెల్లగించి పెనుకిన్కమెయిన్ నడిత్రిప్పివ్రేయ త
ద్గ్రావము నొక్కభల్లమున తద్దయునుస్మె సురారిమధ్యలోన్.

తరువోజ

దనుజేంద్రుడంత నుద్ధతితోడ మరల ధనువున నత్యుగ్ర దంభోళివోలె
పెనుమంటలంగ్రక్కు భీషణశరము బిరబిరనెక్కిడి పేర్చివ్రేయుటయు
ఘనశక్తితో తొల్లిస్కందుండు మొనసి క్రౌంచంబు ఛేదించుకరణి నాక్షణమ
వనచరేంద్రుని పృథువక్షంబునాట భ్రాంతుడై కూలియిడి పడియె బెన్మూర్ఛ.

వ. సుగ్రీవుడు మూర్ఛపడుటయు రాక్షసులు సంతోషించి మిగుల సింహనాదంబులు గావించిరి అట్టియెడ పర్వతాకారుడైన గజ, గవయ, గవాక్ష వజ్రదంష్ట్రి ఋషభ జ్యోతిర్ముఖ ప్రముఖవానరులు కొందరు గొప్పగొప్ప పర్వతశృంగంబుల నెత్తికొని రావణునిపై కురవడించి రయ్యవసరంబున రావణుండాకొండల నెల్ల పిండిపిండిగా నరికి సువర్ణపుంఖములుగల తీక్ష్ణనారాచ పరంపరల మర్కటసేనల కర్కశంబుగా బ్రహరించిన అతనినేలంచు కొందఱు నేలంగూలిరి కొందరు నిలువనోపక శ్రీరాముని మఱుగుజొచ్చిరి అంత శ్రీరాముడు ధనుష్టంకారమొనర్చుచు రావణునిపై కురక నుద్యమించుటయు లక్ష్మణుండిట్లనియె.

క. నా కాజ్ఞనిమ్ము రఘువర యీకుటిల నిశాచరేంద్రుడు హింసకుగడగన్
నీ కేల నుడుగుడీతని నేకదనస్థలములోన నిర్మూలింతున్.

వ. అనవుడు శ్రీరామచంద్రుడు లక్ష్మణుని వినయయుక్తములైనవాక్యముల నాకర్ణించి అతనితో నిట్లనియె.

మ అనిసేయందలతేని లక్ష్మణ! తదీయద్వేషితో మారొకనం
జనుసందర్భమునందు నీవుమిగులన్ జాగ్రత్తతో జిత్తమం
దనుమానింపక నిల్చి ధైర్యమున బోరాడందగున్ రావణుం
డెనకంజాలరు యుద్ధభూస్థలి సునాసీరాది ముఖ్యామరుల్.

వ. లక్ష్మణా! స్వకీయాలోచనంబుల వ్యక్తపడనీయక శాత్రవుల ఛిద్రంబులం జక్కగా గమనించి ధనుస్సహాయమున సమాహితచిత్తుండవై జాగ్రత్తగా ప్రవర్తిల్లుమని ప్రబోధించె నంత లక్ష్మణుడు శ్రీరాముని పూజించి నమస్కరించి రావణునిమీదికడరె నింతలో హనుమంతుడు లక్ష్మణున కడ్డమువచ్చి దక్షిణ బాహుదండంబెత్తి భీమముగా నిట్లనియె

గీ. అసుర గంధర్వ కిన్నర యక్ష రాక్షసాళిచే నీకుచావులేదసురనాథ
ప్లవగతతిచేత నీకుతప్పదు భయంబు నీల్గెదీమత్కరాహతి నిల్వుమింక

వ. అనవుడు పరాక్రమోపేతుండగు రావణాసురుడు హనుమంతుని వాక్యముల కొంతయు రోషావేశముతో నిట్లనియె

గీ. కడగినను గొట్టరమ్ము మర్కటవరేణ్యా స్థిరముగానుండు కీర్తిని జెందుమింక
నీపరాక్రమ మంతయు నేనెఱింగి నాశమొందింతునిన్నీ క్షణంబులోన.

ద్విపద :

అనినమారుతిపల్కె నసురేంద్ర పూర్వమనిలోన నీపుత్రు నక్షునిదునిమి
జయమొందితయ్యది స్మరింపుమనుడు రయమున నరచేత రావణుండపుడు
చలమూని హనుమ వక్షస్థలిమోద చలియించి క్షణముండి స్థైర్యంబుబూని
కినిసిపావని దశగ్రీవుపేరురము తునియంగ పెడకేల తోడనడచె.

ఉ. అంతట తత్ప్రహారమున నల్లటతల్లడమంది రావణుం
డెంతయు గంపమొందె నపుడెల్లమహర్షి సుపర్వముఖ్యుల

త్యంత ప్రహర్షమొంది రసురాధిపు డొయ్యన గొంతసేపు వి
భ్రాంతివహించి పల్కె కపిసత్తమ! మెచ్చితి నీదుశక్తికిన్.

వ. అనవుడు హనుమంతుండిట్లనియె.

ఉ. రావణ యేలమద్భుజ పరాక్రమమంతయు గాల్పనా! ఛీఛీ
నీవు మదీయవ్రేటునకు నిల్గక ప్రాణముతోడ నుంటివా
చేవడి నన్నుగొట్టుమిదె చెచ్చెర మద్ఘనముష్టివ్రేటునం
గావరమంతయున్ సమసి కాలునివీటికి నేగదియ్యెడన్

వ. పిమ్మట హనుమంతుని గంభీర భాషణంబుల కెంతయు గినిసి రావణుడు కన్నుంగవ కెంపుగదుర దక్షిణహస్తంబెత్తి మారుతివక్షస్థలమున గాఢముగా బొడుచుటయు నతండొల్లబోయి గడగడవణంకె నదిగని రావణుండు తనతేరు నీలునిపైకి తోలించి వాడిగల పెక్కునారాచంబు లతనిపై ప్రయోగించిన నతండొక శైలంబెత్తి రావణునిపై విసరె నంత రావణుడు మిగుల తీక్ష్ణములగు సప్తసాయకముల ప్రయోగించి తత్పర్వత మెల్లను శకలంబులుగాగొట్టె నప్పుడు సేనాపతి క్రోధంబున నశ్వకర్ణాది ప్రముఖ వృక్షంబుల గొన్నింటిని బెఱికి రావణునిపై విసరిన వానినెల్ల ఖండించి పెక్కమ్ముల నీలుని ముంచివైచె తత్సమయంబున నీలుడు నిజస్వరూపంబును సంకోచపరచుకొని రావణుని ధ్వజాగ్రమున నిలిచి సింహనాదంబొనరించి ధ్వజము నుండి ధనువునకును కిరీటమునకును చిత్రవిచిత్రగమనంబుల సంచరించుచుండుట గనుంగొని శ్రీరామలక్ష్మణులు హనుమత్ప్రముఖులును మిగుల నాశ్చర్యచకితులగుచుండి రాసమయంబున వానిదుశ్చేష్టితముల కోర్వక రావణుడు వెంటనే యాగ్నేయాస్త్రంబెత్తి ధ్వజాగ్రమున నెగురుచుండు నీలునితో నిట్లనియె

ఉ. వానరవర్య! నీవు బహుభంగుల లాఘవమొప్ప మాయలం
బూనిచరించెదింక నినుబోవగనిత్తునె శక్తి యున్నచో
దీనినిగాచికొమ్మని ప్రదీప్త మహాస్త్రము నేయ నీలుడ
బ్బాణహతిన్ ధరంబడియె ప్రాణముపోయినభంగి మూర్ఛతో.

వ. అంత దశకంఠుడటనుండి కదలి లక్ష్మణునిమీదికడరి ధనుష్టంకార మొనర్చుటయు లక్ష్మణుండతనితో నిట్లనియె

గీ. రమ్మునిశిచర నాతోడ రణమొనర్ప క్రొమ్మెరుగు తీక్ష్ణశరపంక్తి గూల్తునిన్ను
గాచికొనుమింక యెందుబోగలవు దుష్ట! ఘనుడవాదువె కపులతో గడగిపోర.

మ. అని భాషించుచు లక్ష్మణుండు భయదంబౌ నారిసారించుచున్
దనజేంద్రుం బిలువంగ నాతడు ప్రదీప్తక్రోధియై లక్ష్మణుం
గని యోరాఘువ దైవయోగమున నాకన్ గేనలో జిక్కినా
వనిలోనన్ నినుమృత్యుదేవతకు నాహారంబుగా నిచ్చెదన్.

గీ. ఉన్నత శితోగ్రదంష్ట్రిలనొప్పు రావణాసురుండిట్లు పలుక లక్ష్యంబుసేయ
కపుడు సౌమిత్రి వెండియు నతనితోడ బలికె నీరీతి నత్యంత పౌరుషమున.

గీ. పాపవర్తన దుష్ప్రలాపములతోడ ఫలముగలదె సమర్థతగలిగియున్న
స్థిరముగానిల్చి యుద్ధంబుసేయుమింక దమ్ముతా బాగడుకొంట యుత్తమగుణంబె.

మ. అనివాక్రుచ్చిన నంతరోషమున దైత్యాధీశ్వరుం డుజ్వలా
శని తుల్యాంబక సప్తకంబపుడు తత్సౌమిత్రిపైవైవ జ
య్యాన నాతండు సువర్ణపుంఖ కలితాత్యంతోగ్ర బాణంబులం
దునిమెం దోడన ఖండఖండములుగా దుర్వారగర్వోన్నతిన్.

వ. ఇట్లడతడు ప్రయోగించిన శరంబులు భగ్నంబులైన రావణుండత్యంత రోషా
వేశంబున దెంపులేని బాణపరంపరల సౌమిత్రిపై వర్షించిన నతండు వానినెల్ల
క్షురు, అర్ధచంద్ర కర్ణిభల్ల బులచే ఛేదించి చలింపకున్న రావణుడు లక్ష్మణుని
యుద్ధనైపుణ్యంబున కెంతయు విస్మయంబంది మరిమరి పుంఖానుపుంఖములుగా
బాణవృష్టి వర్షించిన, లక్ష్మణుండు పవిధారానిభంబులైన బాణసంచయంబును
దశగ్రీవుని పాతంబొనరించు ప్రయత్నంబున నిగుడించిన, దానవేంద్రుండు
వానినెల్ల నడుమన ఖండించి బ్రహ్మదత్తంబులగు కొన్నితీక్ష్ణబాణంబుల
లక్ష్మణుని ఫాలభాగంబునకు లక్షించిమోదిన.

మంజరి :

రావణు నిశితాస్త్రతాడితుండై రామానుజుడు చలించి
చేవిడివడు ధనువు మఱలదాలిచి చిత్తము తెలివిపహించి
దారుణ శరమొక్కటెట్టి దశముఖు ధనువునపుడు ఖంచించెన్
క్రూరశరత్రయముపైవ నాతడు కుంది కడువిహ్వాలించెన్.

వ. కొంతవడికి మిగుల కష్టముతో తెలివిదెచ్చుకుని రావణుడు ధనుర్విహీనుండై
యొడలెల్ల రక్తసిక్తంబగుచుండ క్రోధోన్మత్తుండై తత్క్షణంబ.

—: రావణుడు లక్ష్మణుని మూర్ఛబడగొట్టుట :—

సీ. నిర్ధూమధామ వహ్నినికాశమగుదాని నరిజన త్రాసకంబైనదాని
సజ్జభవానుగ్రహ ప్రాప్తమగుదాని విస్ఫురత్కాంతితో వెలయుదాని
శక్తిసమాఖ్య బ్రశస్తిగాంచినదాని నొక్కదివ్యాయుధం బుక్కుమిగిలి
సౌమిత్రిపైఁ దీక్ష్ణశరాళిచే నతండమ్మహాశక్తి నత్యంత వీర్య
గరిమ వారించినను మహోగ్రముగవచ్చి వక్షమునబడ సౌమిత్రి వసుధపైని
మూర్ఛిలిన నంతగని దశముఖుడు వాని శీఘ్రమున నెత్తుకొనిపోవ సిద్ధపడియె.

గీ. హేమగిరి మందరాచల హిమగిరీంద్రములను దివిమత్సమేతమహా ముజ్జగముల
బాహుబలమున నెత్తెడు బలియుడౌ దశముఖుడు లక్ష్మణుని యెత్తజాలడయ్యె.

వ. ఇట్లు శక్త్యాయుధముచే తాడితుండై లక్ష్మణుండచింత్యంబగు విష్ణుతేజముగా తన్నుఁదలంచె. ప్రపంచమున దానవగర్వ నిర్వాపణార్థం బవతరించిన విష్ణ్వంశ సంభూతుండగు లక్ష్మణుని శరీరమును బలాత్కారముగా నెత్తుకొనిపో నుద్యుక్తుండై రావణుడు వింశతిబాహువులతో గట్టిగాబట్టియు లేవనెత్తజాలకున్న నంత హనుమంతుండు వానింగనుంగొని కుపితుండై యొక్కపరుగున నేతెంచి వజ్రాయుధతుల్యంబైన ముష్టిప్రహరణమున రావణుని వక్షస్థలంబున పక్కీల్లునగుద్దె, తత్ప్రహారమున బమ్మెరవోయి మోకాళ్ళు క్రిందనూని నిలిచి రావణుడు నేత్ర కర్ణ వదనంబుల నుండి రుధిరధారలు గ్రక్కుచు చేష్టఁలుడిగి మూర్ఛాక్రాంతుడై బడి కొండొకవడికి లేచి లబ్ధసంజ్ఞుడయ్యును తొల్లిటి ధైర్యమొందజాలడయ్యె. అట్టియెడ భయంకర పరాక్రమోపేతుండైన రావణుండు మూర్ఛిలినందులకు దేవతాప్రముఖులు, మహర్షులు ప్రహర్షచిత్తులై రట్టియెడ మహాతేజస్వియగు హనుమంతుడు లక్ష్మణుని భుజాస్కంధమున నెత్తుకుని పోయి శ్రీరాముని సన్నిధానమున విడిచె నంత శక్త్యాయుధము లక్ష్మణుని శరీరమునుండి వెడలి రావణుని రథమున దానిస్థానముచక్కరిగి నిలిచె. పదంపడి కొంతవడికి లక్ష్మణుండు మూర్ఛదెలిసి వ్రణబాధావిముక్తుండై తన్ను విష్ణ్వంశ సంభూతునిగాదలంచె. అంత రావణుడు తెలివొంది శరాసనంబున శరసంధానంబొనర్చి యుద్ధసన్నద్ధుండై యుండుటయు శ్రీరాముండతని గనుంగొని సమరసన్నాహుండగుటయు హనుమంతుడు శ్రీరాముని సన్నిధానంబున కేతెంచి రామచంద్రా! మదీయభుజాస్కంధం బధిష్టించి రావణుని దండింపుమనుటయు, మహాబలియుండైన గరుత్మంతుని

మూపుపై నధిష్ఠించు శ్రీమహావిష్ణువుచందంబున శ్రీరాముడు హనుమ భుజాస్కంధంబధిష్ఠించి రావణున కభిముఖుండై అశనితుల్యంబగు గుణధ్వానం బొనరించుచు మేఘగంభీర భాషణంబుల నిట్లనియె.

సీ. నిలువుమురా క్రూర నిశిచరాధమ నేడు నిముషమాత్రంబున నినువధింతు
జపలతనాకట్టి యపరాధ మొనరించి జీవింప నేర్తువే క్షితితలమున
వరుణ వాసవ వహ్ని వైశ్రవణా ద్యమర్త్యుల మఱువున డాగి నిలిచియున్న
ధరణిజొచ్చిన దిగంతములకు బ్రాకిన జలధిజొచ్చిన నన్నుశరణుజొచ్చి
వేడినను ప్రాణములతోడ వీడనుమ్ము యమునిమందిరమునకు నిన్నతిథిగా క్ష
ణాంతరంబున బనుతు దురాశయమున జేయుదుష్పాప మనుభవించెదవు నీచ.

గీ. మును జనస్థానమున మహాసునిశితాస్త్ర ధరుల శౌర్యోన్నతుల చతుర్దశసహస్ర
సంఖ్యులగు రక్కసులనెల్ల సమరభూమి హతమొనర్చితి తెలియునా మతివిహీనా.

చ. అనవుడు రావణుండు విలయాగ్నిశిఖా ప్రతిమాన మార్గణం
బును మహనీయచాపమున బూన్చి రయంబున నత్యుదగ్రుడై
యనిలతనూజు నేయుటయు నద్భుత తేజముగల్గు వాయుజుం
డినుమడియైన తేజమున నెంతయు వెల్గె నమోఘవీర్యుడై.

మంజరి :

అంత రామచంద్రుండు రోషమున నమోఘశరముల బేర్చి
మంతుకెక్క రావణునిపైగవిసి మార్కొనె ధీరతనార్చి
సువర్ణపుంఖములనొప్పు శరముల సూతుని రథరథ్యములన్
ధవళచ్ఛత్రమును కేతనముతో ధరణిగూల్చె నవలీలన్.

వ. తదనంతరంబ.

ఉ. ఆరఘువీరుడప్పుడు మహాశనితుల్య శరంబునొంపు దు
ర్వార పరాక్రమస్ఫురణ రావణు పేరురమందు వ్రేయుచున్
దారుణవజ్రపాతమున దల్లడమందని రావణుండనిన్
శ్రీరఘురాము బాణహతి జేష్పడి చాపమువీడి నేలకున్.

గీ. అంత విహ్వలాత్ముడైన రావణుగాంచి చలముమీఱ రామచంద్రు డర్ధ
చంద్రబాణమున నిశాటు కోటీరంబు నేలపైబడంగ గూలనేసె.

వ. అంత కోరలు పెరికిన విషసర్పంబుపగిది తేజోవిహీనుండైన రావణుని గనుంగొని శ్రీరాముండిట్లనియె. ఓరీరావణా! నీవుయుద్ధరంగమున తీవ్రశరతాడితుండవై మిగుల దుఃఖమనుభవించుచుంటివి గావున నీకు నేను త్త్రాసంగుచుంటిని. నీవింక గృహంబునకరిగి యించుక శ్రమవాపుకొని రథారూఢుండవై ధను ర్ధారివై సాధనంబులతో సైన్యయుక్తముగా మరలరమ్ము. అప్పుడే మదీయ సామర్థ్యంబెరింగెదవుగాక. అని పలుకుటయు రావణుండు రణంబున నవమాని తుండై తిరోన్ముఖుండయె. అతని పరాజయంబునకు సకలలోకంబులు సంతసించె. పదంపడి రావణుడు కొలువుకూటంబున సింహాసనాసీనుండై వశిష్ఠుని బ్రహ్మదండ, బ్రహ్మాస్త్రముతో సదృశములగు శ్రీరాముని దారుణశిలీ ముఖంబుల దలంచి తలంచి దుఃఖించి మంత్రిప్రముఖులతో నిట్లనియె.

—: రావణుడు రామునిచే పరాజితుండై చింతిల్లుట :—

గీ. అలమహేంద్ర సమానుండనైనన్ను మార్కొని జయించె మానవమాత్రుండొక డందుచే నేను నేటిపర్యంతమిట్టు లర్థిజేసిన తపమెల్ల వ్యర్థమయ్యె.

చ. వనజభవుండు నన్నుగని పల్కెనొకప్పుడు క్రోధమూర్తియై
మనుజునిచేత తప్పదుసుమా భయమంచది నేటికిట్లు నా
కనుభవమయ్యె మానసమునందు బదింపదిగా వగర్పుతో
ననుకొనిలాభమేమి విధికగ్గముగా దలపోయ శక్యమే.

గీ. గరుడ గంధర్వ యక్ష రాక్షసులవలన భయములేనట్టి వరముల బడసియుంటి మనుజమాత్రుల చేతుల మరణమొంద నట్టివరమును గోరగానైతి నకటా!

సీ. చలమున నిక్ష్వాకు కులనాథు డనరణ్యుడనియెడు మేటిధరాధినాథు డొకసమయంబున నొనరనాతో ప్రతిజ్ఞనొనర్చె నిట్లు, రాక్షసకులేంద్ర రణరంగమున సపుత్రక సబాంధవముగా నినుసంహరించు మన్నిడు మామ కాన్వ వాయంబున నవతరించునటంచు, గావునమానవాకారుడైన రాఘవునిచేత సంగ్రామ రంగమందు నునువధింపగ దశరధ నరవిభునకు నవతరించెనటంచు మదాత్మలోన దలచుచున్నాడ నిప్పుడిట్లలతినగుట.

వ. అదియునుంగాక.

మంజరి :

తొల్లి వేదవతియను కన్యను నే దొడరి బలాత్కృతిజేయన్
యుల్లంబున గినిసి నను శపించెన్ హుంకరించి ధృతిబాయన్

అమ్మహాభాగయే జనకనృపాలాగ్రణికిం బుత్రికగా
క్రమ్మఱ నుదయించె సీతనా విఖ్యాతినొంది యివ్విధిగా.

వ. మరియును.

గీ. వరుణకన్యక నందికేశ్వరుఁడు రంభ గౌరి యీనల్వురును మున్ను వారివారి
స్థిరతర తపోమహత్వంబుచేత శెప్పిరటులసిద్ధించె ఋషివాక్కు లన్నృతముఁగాన.

—: కుంభకర్ణుని నిద్ర మేల్కొల్పుట :—

వ. ఈకారణములచేత మనకు గొప్ప భయహేతుకంబైన సంవిధానము చేకూరి యున్నది. కాన మనమతిప్రయత్నపూర్వకముగా గోపుర ప్రాకార ద్వారసీమలను మిగుల జాగ్రత్తతో బలిష్ఠులగు సైనికులచే రక్షించుచుండవలయు, నిరుపమాన బలపరాక్రమ శాలియగు కుంభకర్ణు డీసమయమున మేల్కొనియున్నచో హీనజాతులగు సకలవానర మానవ సముదయంబునెల్ల నొక్కపెట్ట హతంబొనరింపగలఁడు. కుంభకర్ణుఁడు మన యుద్ధప్రారంభమునకు పూర్వము తొమ్మిది దినములక్రిందట నిదురమేల్కాంచి మనతో సమాలోచనంబొనరించె ప్రస్తుత పరిస్థితులలో నేడిట్టి యుద్ధసంకటములలో చిక్కుపడి వ్యధచెందుచుండ నాసోదరుఁడు మైమరచి హాయిగా నిదురించుచున్నవాఁడు. ఈ సమయమున నాతనిసహాయ మత్యవసరము గావున కొందరతని యొద్దకరిగి నిదురమేల్కొల్పి రండని సెలవొసంగ, మదోన్మత్తులైన రాక్షసులు కొందరు భక్ష్య భోజ్య మద్య మాంస పూరిత ఘటసహస్రంబులు గొని కుంభకర్ణుని శయనాగారంబున కఱుగ నందు.

క. శరదిందుచంద్రికా ద్యుతినిరసించు విచిత్రరత్న నిర్మితిహర్మ్యం
తరసీమ కుంభకర్ణుఁడు గురవెట్టుచు నిదురగూర్కు గుహచెలువొందెన్.

వ. అమ్మందిరం బతివిశాల గవాక్ష ద్వార శోభితంబై ప్రకాశించె. తత్ప్రదేశంబున కుంభకర్ణుని నిశ్వాసపరంప రాపవనహతికి దుష్ప్రవేశంబగుటచేరక్కసు లతిప్రయాసతో నందుఁజొచ్చి

సీ. కాంచిరయ్యెడ దృఢఘట్వాంతరంబున పర్వతాకృతి తోడ పవ్వళించి
భీషణంబుంగ గురవెట్టుచుండెడువాని నొడలెరుంగక గూర్కునొందువాని

పాతాళగహ్వర ప్రతిమాన గంభీర దంష్ట్రికరాళ వక్త్రింబువాని
పెనులతాతృణగుల్మ పిహితకూపములట్లు దనరారు ముక్కురంధ్రములవాని
పలల మేదో రుధిర పంక బహుళ పూతిగంధ బంధుర నిశ్వాసకలిత ఘూర్ణి
త ప్రతిధ్వానపూర్ణ సద్మమున నొప్పు ఘోరదర్శను సముదీర్ణు కుంభకర్ణు.

వ. రాక్షసవీరులు శాంతముగా స్తుతిపూర్వకముగా ననేకవిధముల నిదుర మేల్కొల్పినను లేవకున్న నంత.

క. కొందరు శంఖములొత్తిరి కొందరు భేరీమృదంగ ఘోషణములతో
సందడిజేసిరి మరియుం గొందరు గావించిరధిక కోలాహలమున్.

వ. అంతమాత్రమున కుంభకర్ణునకు మెలకువరాక భీషణముగా గురవెట్టుటయు కొందరు రాక్షసులు

గీ. ముసలముల తోమరంబుల ముద్గరముల శైలముల వృక్షముల బహుసాధనముల
గొని సుఖస్థితి నిదురించు కుంభకర్ణు నుగ్రముగ మోదిరసురవర్యులు చెలంగి.

వ. అప్పటికిని మెలకువరాకున్న భయంకర పరాక్రమశాలులగు పదివేలరాక్షసులు ధట్టీలుబిగించి వివిధవాద్యంబు లొక్కపెట్ట మ్రోగించియు నానావిధాయుధంబులతో బ్రహరించియు గంభీరముగా సింహనాదములొనర్చియు నిదుర లేవకున్న.

మంజరి :

ఖరముల నుష్ట్రముల హయములన్ మదకరుల నతనిపైద్రోలి
బరువడి ద్రొక్కించిరద్భుతంబుగ బ్రహరించుచు దయమాలి
స్తంభంబుల దండములను గైకొని తద్దయు పైనవిసరినన్
కుంభకర్ణు డించుకైన కదలక గురవెట్టెన్ శయనమునన్.

వ. చతుర్ముఖుని శాపకారణంబున మృతుండైన వానివిధంబున నొడలెఱుంగక పడియున్న కుంభకర్ణుని నిదురలేపుటకు పెక్కుతెరంగుల బ్రయత్నించి సాధ్యపడకున్న కోపముతో.

క. కొందరు శిగబెరికిరి మఱికొందరు కర్ణములబట్టి కొరికిరి పిదపన్
కొందరు వేలకొలందిగ బిందెలతోనీరు దెచ్చి విడిచిరిచెవులన్.

వ. ఇట్లనేక కృత్యంబులొనర్చియు మేలుకొనకున్న వేయియేనుగు లొక్కుమ్మడి నతనిపై తోలి త్రొక్కించిన నించుక తెలివొంది కన్నులువిచ్చిచూచి తన శరీరముపైన పరువులెత్తు యేనుగుల గుంపును, మశక మక్షికముల మాడ్కి భావించి లేచి యొడలువిరచుకొనుచు సముద్రమందున్న బడబానల సదృశం బగు వదనగహ్వరంబు దెరచి యావులించి నీల్గి కూర్చుండె నంత రాక్షసులు కొందరు హరిణ వరాహ మహిషాది మృగమాంసంబులను, పర్వతశృంగమట్లు రాశిగా బేర్చబడిన మృదులాన్నపురాసులును నానావిధ రక్తాదులతో నింపిన ఘటంబుల దెప్పించి సమర్పించిన నవియెల్ల కుత్తుకబంటి భుజించి త్రేపుచు తన్నుచుట్టియున్న రాక్షసులనెల్ల గనుంగొని సుఖనిద్రజెందుచున్న తన్ను నిదురలేపుటకు కారణమెరుంగగోరి వారితోనిట్లనియె.

సీ. ఏకారణమున నన్నిపుడు నిద్దురలేపితిరి సేమకరమె పృథ్వీపతికిని
పగరచేనేదేని భయముప్పతిల్లెనే కాకున్న నింతశీఘ్రముగనన్ను
బోధించియుందురు బుధ్యస్తమయ్యె రావణుని భయంబేను వాపువాడ
ననలుని దండింతు నమరాధిపతినైన పెడకేలబంధించి నెడలనడతు
స్వల్పకారణములకు రావణుడునన్ను నిదురలేపడు కావున నిశ్చయముగ
దెల్పుడనుటయు నంత విధేయుడగుచు ప్రాంజలిఘటించి బలికె యూపాక్షుడంత.

వ. ప్రభూ! దైవముచేగాని దేవదానవాదులవలనగాని మనకెప్పుడు భయము కలుగదు. కాని ప్రస్తుతము సీతాపహరణ క్రోధోన్మదులగు రామలక్ష్మణులు నడగొండవలెనుండు అసంఖ్యాకులైన మర్కటసేనతో లంకాపట్టణమును ముట్టడించి రావణుని యుద్ధరంగమున మిగుల చీకాకుపరచి పరిభవించివిడిచిరి. గావున మీసహోదరుని యాజ్ఞానుసారము మిమ్ముల బలాత్కారముగా నిదురనుండి లేపవలసివచ్చినది యని విన్నవింప నా మాటలకు మిగుల క్రోధోద్రిక్తుండై కఠినముగా నిట్లనియె.

శా. ఏమీ యింత విపర్యయంబొదవెనే యేనుండగా నద్దిరా
రామున్ గీముని లక్ష్మణుం దునిమి తద్రక్తంబు నేద్రావెదన్
సామర్థ్యంబున నిప్పుడే ప్లవగులం జక్కాడి తాన్మాంస మే
దోమస్తిష్కముచేత దైత్యులకు సంతోషంబు గల్గించెదన్.

గీ. పిదప రావణు గనుగొనియెద నటంచు బలుకయూపాక్షు డంజలిబద్ధుడగుచు
రాక్షసవరేణ్య మీరలు రావణుని యభీష్టమునెరింగి నడచుట హితకరంబు.

వ. అని ప్రబోధింప వల్లెయని శయ్యనుండి లేచి స్నానంబాడి దివ్యాంబరాభరణ ప్రక్చందనాద్యలంకార శోభితుండై ప్రళయాంతకుని విధంబున భూతలంబదర నిష్క్రమాణ దేహంబుతో నడగొండవిధంబున బయల్వెడల నతనింగనుంగొని వానరులు భయకంపితులై పరువులిడుచుండి రాసమయంబున శ్రీరాము డాభీమణాకారుండైన కుంభకర్ణుని స్వరూపమున కచ్చెరువందుచు విభీషణునితో నిట్లనియె.

ఉ. ఈతడెవండు తెల్పుము మహీస్థలికంతకు నొక్కడే మహా
కేతువుగా దనర్చె బలుకెంపు కనుంగవతో తటిల్లతో
పేత వలాహకంబుక్రియ పెన్గిరిపోలికనొప్పె నిమ్మహా
భూత మదృష్టపూర్వము కపుల్ వెరవొంది రహో విభీషణా!

వ. అని ప్రశ్నించు శ్రీరామునితో విభీషణుండిట్లనియె.

ఉ. శ్రీరఘువంశపావన వచించెద వీనిచరిత్రమెల్ల దు
ర్వార పరాక్రముండు సురరాడ్యమముఖ్య దివౌకసావళిం
బోరజయించె విశ్రవసుపుత్రకుడీతడు కుంభకర్ణు డి
ద్దారుణి నిట్టిఘోరమగు దానవుడెయ్యెడలేడు చూడగన్.

వ. శ్రీరామచంద్రా! యీతని చరిత్రమును వచించెద నవధరింపుడు కుంభకర్ణుడు జననంబందిన తోడనే ప్రపంచమున కెగబడి చేజిక్కిన ప్రాణులనెల్ల బట్టి భక్షింప మొదలిడగా, దేవదానవులెల్లరు భయభ్రాంతులై యితని భయంకర కృత్యమునుగురించి దేవేంద్రునితో విన్నవింప నతడాగ్రహించి వజ్రాయుధముచేనడచె, తత్ప్రహారంబున కోర్వక సింహనాదంబొనరించి నంత మాత్రమున భూమ్యాకాశములు చలించె. వెంటనే కుంభకర్ణుడు ఐరావత విషాణంబొండు పెరికి మహేంద్రుని వక్షంబునబొడిచె, తత్ప్రహారంబుతో నింద్రుడు భయభ్రాంతుండై మహర్షులు సిద్ధులు సాధ్యులు మొదలగు దేవతాప్రముఖులతో చతురాననుని వాలికరిగి కుంభకర్ణుని దుర్నయంబెల్ల నెరింగించి వానివలన లోకముల కెట్టియుపద్రవములు జరుగకుండునట్లు తమ్ము రక్షింపవలయునని ప్రార్థింప నలువ తనసముఖంబున కతనినిరావించి యిట్లనియె.

క. త్రైలోక్య నాశనార్థము పౌలస్త్యునిచే సృజింపబడినాడవు దు
శ్శీలా నీవిక మృతకునిపోలిక బడియుండు మసురపుంగవ ధాత్రిన్.

క. అని నలువ శాపమిడ తత్క్షణమున నచ్చోటనే నిశాచరుడును చ
చ్చినవానిపగిది పడినం గనిరావణుడనియె నా_ర్తి కమలభవునితోన్.

గీ. పద్మసంభవ కేల్మోడ్చి ప్రణుతిజేతు నా ప్రియసహోదరుడు వీడు న్యాయమునను
నీకుమనుమడుగాన వీనిని కృపావలోకనంబున గావవే లోకనాథా!

వ. లోకేశ్వరా! యితనివిషయమై యనుగ్రహించి జాగ్రత్స్వప్న సుషు_ప్త్యవస్థలను
నిర్ణయింపుమని ప్రార్థించిన ప్రసన్నుండై చతురాననుండు యిట్లనియె. రావణా!
ఇతండారు యేడు యెనిమిది తొమ్మిది మాసములపర్యంతము నిదురతో
పడియుండి మేల్కాంచిన దినమున నాకలిచే లభించిన ప్రాణిలోకంబును
భక్షించుచుండుగాక యనివచించె గావున తదాదిగా గాఢనిద్రావశుండై
పడియుండు వీడిప్పుడు రావణునిచే బలాత్కృతముగా నిదురమేల్కొల్పంబడి
గృహమందుండి వెల్వలకేతెంచుచుండె వీనిభయంకరాకారమును గనుంగొని
మనసైనికులు భయభ్రాంతులై పరువులిడుచుండిరి. మనమిప్పుడొక యుపాయ
మున మనసైన్యముల కిదియొక రాక్షసాకారముగా నిర్మింపబడిన యంత్ర
ప్రతిమయేగాని నిజముగా రాక్షసుడుకాడు, గావున వీనినిగురించి భయపడ
నవసరములేదనియు నుద్బోధించి ధైర్యమున నిలువరింప జేయవలయునని
యు_క్తిగా వచింప శ్రీరాముండందుల కియ్యకొని సర్వసేనానియగు నీలునితో
నిట్లనియె.

ఉ. వీరవరేణ్య సైన్యముల వేగముగా గుమిజేర్చి గోపుర
ద్వారము లాక్రమించి రిపుదర్పమడంపగ సర్వసిద్ధమై
భూరిశిలాతరుప్రతతి ప్రోవులుగా సమకూర్చి గ్రన్ననన్
ధీరతనిల్చి పోరగ విధింపుమటంచు ననుజ్ఞనేయగన్.

వ. తదాజ్ఞానుసారమున వానరసేనలు రణకౌతుకంబున వివిధ సాల శిలా
చయంబున ప్రోవులుగాజేర్చి లంకాపుర ద్వారముల నాక్రమించి రాక్షసులపై
నురవడించుచుండె రట్టియెడ కుంభకర్ణుడనేక రాక్షస సేనాపరివృతుడై రావణుని
కొలువుకూటంబున కరిగి దివ్యరత్నసింహాసనాసీనుండైయున్న రావణున
కభివాదనంబొనర్చిన రావణుండతని గ్రుచ్చియె_త్తి గాఢాలింగనమొనరించి
పీఠంబున కూర్చుండ నియోగించిన సుఖోపవిష్టుండై కుంభకర్ణుడు రావణునితో
నిట్లనియె.

ఉ. ఆదరమొప్ప నన్నతిరయంబున నిద్దురలేపితేల నో
సోదర నీకు నేఖలుడసూయమెయిన్ భయమొందజేసె ని
ర్వేదమనంబుతో నెవడు ప్రేతతనంబున కిచ్చగించె నే
డాదురితాత్మునిం దెలుపు మంతకు చెంతకు బంపివచ్చెదన్.

వ. అనియడుగుటయు రావణుండిట్లనియె.

మంజరి :

ఏమనివచియింతు తమ్ముడా! నీవెరుగవు నిదురవశమునన్
రామునిచే ప్రాప్తమయ్యె నాకు దురంతచింత సమరమునన్
వనచర సైన్యములతోడ రాముడు వనధిదాటి ధృతిమెరయన్
మన సేనలనెల్ల దునుము చుండెన్ మాహోన్నని గుండియలవియన్.

క. వనములలోపల మరియుపవనసీమల నెల్ల యెడల వనచరవీరుల్
మనలంకజొచ్చి కలచిరి వననిధి పర్వమునపొంగి వచ్చినకరణిన్.

గీ. రాక్షసప్రముఖులనెల్ల రణములోన హతమొనర్చిరి కపిసైన్య మద్భుతముగ
భీమబలులైన వానరవీరవరులు కదనమున జచ్చినట్లునే గాంచనైతి.

ఉ ఈవిపదబ్ధినుండి మమునెల్ల రక్షక్కగ నుద్ధరింపగా
నీవెబలోన్నతుండవని నెమ్మదినమ్మితి సోదరా ప్లవం
గావళినెల్ల భీమణ రణాంగణమందు హతంబొనర్చి శో
భావహమైన లంకను రయంబున యత్నముతోడ బ్రోవుమా.

వ. అని పెక్కుభంగుల విచారగ్రస్తుండై దీనముగా వచించు రావణు నవలోకించి
కుంభకర్ణుండిట్లనియె

మంజరి :

మనమందర మపుడుచేసిన మంత్రాలోచనలోనన్
వినిశ్చయము జేయబడియె మనకున్ విపత్తువైరులవలనన్
పాపాత్ముడు నరకలోకయాతన బడికృశించు చందమునన్
ప్రాపించె స్వకీయదుష్టకర్మకు ఫలము నేటికాలమునన్.

వ. సహోదరా! నాహితంబొక్కటవధరింపుము నీవు కేవల వీర్యగర్వంబున
ననాలోచిత కృత్యంబొనరించితివి, తత్కారణమున మనకిప్పుడు భయము
సంఘటిల్లె దుర్మంత్రుల కృత్రిమాలోచనల మూలమున ధరాధీశ్వరుడు తన

సర్వస్వమును గోల్పోగలడు. నీవిప్పుడు మనవిభీషణుడు బోధించిన విధమున నొనర్చితివేని మనకెల్లర కెంతయు శ్రేయోదాయకమని నాయభిప్రాయము. నీకయ్యది సమ్మతమగుదేని రామునకు సీతనర్పించి బంధు మిత్ర సుహృత్సహోదర సమేతుండవై సుఖంపుమనవుడు దశగ్రీవుడు రోషభీషణుండై కనుబొమలుముడివడ కుంభకర్ణునితోనిట్లనియె.

గీ. మాన్యతముడైన గురువర్యు మాడ్కి నన్ను శాసనముజేతు వింతవాగ్భ్రమమదేల
గతముచింతింప లాభంబుగలదె చెపుమ తగవిధింపుము కాలోచితముగ నీవు.

గీ. మోహమునగాని కేవలమూఢబుద్ధి వలననేగాని చిత్తవిభ్రమముచేత
గాని జరిగిన యవినీతి కార్యమిపుడు పలుమరు వచించుచున్నను ఫలముగలదె.

వ. సహోదరా! గతవిషయమును గురించి నన్నధిక్షేపించి తర్కించుకొనుచు కాలహరణమొనర్చిన లాభములేదు. నీవునాకిప్పుడు ప్రతివచనమీక శత్రువుల ప్రతిఘటించి వానరసైన్యములతో రామలక్ష్మణుల హతమార్చి రమ్మని సెలవొసంగిన, కుంభకర్ణుడు రావణునితో నిట్లనియె.

క. నరవానరాధముల కిక్కరణిన్ భీతిల్ల నేల కదనస్థలి నె
ల్లర నొక్కనిముషముననే బరిమార్చెద మానసమున వగవకుమన్నా!

చ. వరుణ కుబేర వాయు యమ వహ్ని ముఖామర వర్యులెల్లరన్
దురమున బేర్చినిల్చినను దుస్సహ నేనిమిషంబులోన నా
కొరులిలసాటియే భయమునొందకు మాజికినాజ్ఞనిమ్ము చె
చ్చెరజని రాముగీము కపిసేనలతో దునుమాడి వచ్చెదన్.

వ. అనివచింప రావణుడు సింహాసనమునుండి దిగ్గనలేచి కనకరత్న దివ్యహారం బొండతని కంఠమునవైచి వివిధ సుగంధ గంధ పుష్ప మాల్యాంభరణాదుల నలంకృతుని గావింప నప్పుడు కుంభకర్ణుడు బాగుగా నాజ్యాహుతి చేయబడిన వహ్నిచందంబున ప్రకాశించె మరియు

గీ. వనధితఱచువేళ వాసుకిచేచుట్టబడిన మందరాద్రిపగిది దివ్య
కనకరత్నఖచిత కటిసూత్రధారియై కుంభకర్ణుడొప్పె దంభమునను.

వ. తదనంతరంబ కుంభకర్ణుడొక్క శూలాయుధంబును కేలంగీలించి——

గీ. మెరుపువోలె మిగులమెఱయుచు లోనికి గాలిచొరని కనకకవచమొండు
దాల్చివొల్చెనపుడు దాత్తసంధ్యాభ్ర సంవీత గిరియనంగ భీకరముగ.

వ. అంతకుంభకర్ణుడు అన్నకు ప్రదక్షిణనమస్కారములొనర్చి యతని యాశీర్వచనములంది యుద్ధసన్నద్ధుండై శంఖభేరీ మృదంగాది వాద్యంబులు మ్రోయ నాయుధపాణులై చతురంగసైన్యంబులు ముందునడువ ధనుశ్శతప్రమాణ వైశాల్యంబును షట్శతధనుఃప్రమాణోన్నతంబగు దేహంబుతో బండిచక్రముల పగిది నొప్పుకన్నులవెంట నిప్పులుగురియుచుండ జాజ్వల్యమానముగా మండుచున్న మహాపర్వతముపగిది భయంకర దంష్ట్రికరాళంబుతో కుంభకర్ణుడు రణరంగంబున కేతెంచుచు రక్కసులతో నిట్లనియె.

మానినీ వృత్తము :

దానవులార! గనుంగొను డగ్నిగదా శలభంబుల గాల్చుగతిన్
వానరసేనలలో కడుముఖ్యుల నైశము గుంపులుగుంపులుగా
నేనతిరోష మహానలకీలల నీరొనరించెద లీలమెయిన్
మానవమాత్రుల రాముని లక్ష్మణు మార్కొని దుస్సద యుద్ధమునన్.

వ. అనిప్రగల్భోక్తుల ప్రసంగించుచు రాక్షససైనికుల సింహనాదములు మిన్నుముట్ట బయల్వెడలునెడ

సీ. గార్దభద్యుతుల మేఘములుగర్జిల్లుచు పిడుగులతో పెనువృష్టిగురిసె
గోమాయుసంతతుల్ ఘోరాకృతులతోడ ననలంబుగ్రక్కుచు నరుపదొడగె
ఖగకులం బపసవ్యముగ పెనుమూకలై దివిమండలాకృతి దిరుగదొడగె
ద్రోవనేతెంచు దైత్యునిమీద నొకగ్రద్ద పూలమాలికవోలె వ్రాలెనంత
సవ్యనేత్రోరు బాహువుల్ సంచలించె భీకరధ్వనితో నొక్కతోకచుక్క
ప్రబలరుచి వానిముందట బడియె గాంతివిడిచె రవి దుష్టవాయువుల్ వీచుచుండ.

వ. ఇత్తెరంగున బయల్వెడలు దుర్నిమిత్తంబులు లెక్కసేయక కుంభకర్ణుడు సమరతలంబున కేతెంచుటయు తద్వికృతాకారంబును గనుంగొని ఋక్ష వానర చమూసమూహంబులు భయభ్రాంతులై దిశావలయంబులకు పరుగులువారుచుండ కుంభకర్ణుడు పరిఘాయుధంబొండు ధరించి వానరుల వెంటబడి విచ్చలవిడిగా జమురుచుండ సైనికులగనుంగొని వారల సమాధానపరచుచు అంగదుండిట్లనియె.

ఉ. ఓకపివీరులార! మహితోన్నత శౌర్యకులప్రసూతులై
ప్రాకృతవానరప్రతతిభంగి భయంబున బారిపోవుటల్
మీకిది పౌరుషంబగునె మేలుసుమీ పురుషస్వరూపియౌ
భీకరకృత్రిమాసురుడు వీనికి భీతివహింప నేటికిన్.

గీ. అంత నధిక ప్రయాసతో నంగదుని హితాలాపంబు లాలించి పడిసమాధానపడి ప్ల వంగముఖ్యులు తరు శిలాప్రతతిబూని కడగి ప్రహరించి రాకుంభకర్ణు నపుడు.

మంజరి :

ఆతండిసుమంత సంచలింపక నత్యంత క్రోధమునన్
క్రోతులగమిపైకి నడరి పెల్లుగ గూల్చె దవాగ్ని విధమునన్
వానరయూధములు విసరివైచెడు పర్వత తరు నిచయంబు
దానవు దేహమునసోకి పొడియై ధరణింబడియె కరంబు.

వ. అయ్యవసరంబున కుంభకర్ణునిచే బ్రహరింపంబడిన వానరులు భయభ్రాంతులై

ఉ. కొందరు తోయధింబడిరి కొందరు మింటికి బాకిరార్తులై
కొందరు పర్వతాగ్రములకుం దరుశాఖలకెక్కి- గొయ్యనం
గొందరు పెన్ గుహావళుల గూఢముగా వడిడాగి రంతటం
గొందరునీల్గియున్నటుల కుంభునిపైబడి యుండిరెంతయున్!

వ. ఇటుల మిగుల భీభత్సంబగు పెరింగి అంగదుండు వివిధప్రకారముల ధైర్యోక్తుల వారల సమాధానపరచి క్రమ్మఱ వానరుల సమరోన్ముఖులగావింప నట్టెమెడ మదోన్మాదంబున వానరులబట్టి వివిధప్రకారముల హతంబొనరించుచుండె.

గీ. కుంభకర్ణునిచే నిట్లు కొట్టబడిన ప్లవగకులసైనికులు వేలు లక్షలవని బెలుచ నఖిలాంగసంధులు విరిగి కూలిరతిభయావహమైయొప్పె నాలమపుడు

వ. మరియును

క. గరుడుండు సర్పవితతిన్ కర మొడిసినభంగి కుంభకర్ణుండని వా
నరుల నొక్కొక్కవిమతకు ఇరువదుగురబట్టి మ్రింగి యేగుచునుండెన్!

మంజరి :

ప్రళయాంతకుబోలె దైత్యరథికులు భయదసింహనాదములన్
బలిమిన్ గర్జిలుచు దున్మివైచిరి ప్లవంగకులవాహినులన్!
వానరవీరు లధికరోషవశమున బహుళమహాద్రుమశిలలన్
దానవులన్ రథగజోష్ట్రహయ సంతతులదున్మి రవలీలన్

మ. హనుమంతుండు నభంబుపైకెగసి ధైర్యస్ఫూర్తి పెన్ప్రాకులన్
గొనియుగ్రంబున కుంభకర్ణునిపయిం గుప్పించినన్ వాడు భీ
షణమౌ శూలముతోడ నన్నిటిని రోషస్ఫూర్తి ఖండించె పా
వనియున్ గ్రమ్మర నొక్కశూలమున చేవన్ దైత్యునిన్ మోదినన్.

స్రగ్ధర :

అంతన్ తత్కుంభకర్ణుం డనిలసుతు తదీయప్రహారంబుచే ని
ష్కాంతిం తోదగ్రాస్య మేదో కలుషితతనుడై సంకటంబందియు దు
ర్దాంత క్రోధోద్ధతిం దారకరిపుడెలమిం గ్రౌంచముం గూల్చునట్ల
త్యంతోద్రేకంబుతో నయ్యనిలజునెద శూలాయుధంబెత్తివైచెన్.

వ. అంత హనుమంతుండాశూలాయుధ ప్రహరణంబున వక్షస్థలంబుపగిలి రక్తప్రవాహంబువెడలి మూర్ఛిల్లె నప్పుడు రక్కసిమూకలుప్పొంగి సింహనాదంబులు గావించిరి పదంపడి ఋషభుండును శరభుండును నీలుండును గవాక్షుండును కుంభకర్ణునివెంటాడి శిలాతరుప్రహారంబుల విదారించుచు గవిసిన కుంభకర్ణుడు ఋషభుని గట్టిగాబట్టినలిపిన నతండు రక్తమునుగ్రక్కి నేలంగూలె తక్కిన వానరుల ననేకవిధంబుల పీడించిన వారెల్ల సు రక్తసిక్తాంగులై మూర్ఛల మునింగి

క. పాతాళగహ్వరంబన లోతైననిశాటు నోటిలో తక్కిపిసం
ఘాతమునుద్రోయుటయు నతిభీతిన్ముక్కులనుచెవుల వెడలిరి ప్లవగుల్!

వ. ఇట్లత్యంత భీకరంబుగా పీడితులగు ఋక్షవానర గోలాంగూల సైన్యంబులు విచ్చి దైన్యమున శ్రీరాముని మరుగుజొచ్చి రంతలో నంగదుండు వారల గనుంగొని సత్వరంబున నొక్కమహాశైలశృంగంబొండెత్తి కుంభకర్ణుని శిరంబుపైవైచిన నతండతిరోషంబున శూలాయుధంబెత్తి పొడువ నంగదుడు లాఘవంబున దప్పుకొని కరతలంబున కుంభకర్ణుని వక్షస్థలంబున మోదె తత్ప్రహారంబున కతండు మూర్ఛిలిపడి తక్షణంబె తెలివొంది యెడమచేతిపిడికిట నంగదుని బిట్టుమోదిన నతండు మూర్ఛాక్రాంతుండై పడియె, య నంతరంబ శూలాయుధంబెత్తి సుగ్రీవునిపై నడరిన నతండొక గిరిశృంగంబును గైకొని పైకెగసి కుంభకర్ణునితో నిట్లనియె.

ఉ. ఓయినిశాచరోత్తమ మహోద్ధతితోడ ప్లవంగసేన న
త్యాయతశక్తి దున్మి యశమందెదె యల్పులతోడ బోరిచన్

శ్రేయమె కాదిగొమ్ము గిరిశృంగమిదే చనుదెంచుచుండె నీ
కాయువు నేటితో తుద కృతార్థుడవయ్యెదు చక్కనిల్వుమా.

చ. అనవుడు కుంభకర్ణుడను హా! తెలిసెన్ గపివర్య బ్రహ్మకున్
మనుమడవీవు దుర్భర సమగ్ర బలుండవటంచు వింటి ర
మ్మని యెనరింప నేమిటికి నార్చెదవూరక నంచుబల్క నా
వనచరనాథుడా యసుర వక్షమునన్ విసరెన్ గిరీంద్రమున్.

గీ. వానరవరుండు వైచినపర్వతంబు కుంభకర్ణుని వెడదయక్కునకు దగిలి
తక్షణంబున వ్రక్కలై ధాత్రిబడియె కపులు హర్షించి రసురులు కలతపడిరి.

మంజరి :

పదపడి రోషమున కుంభకర్ణుడు ప్లవగాధీశునిపైనన్
సదమల శూలమును విసరివైచిన సత్వరమున నాలోనన్
హనుమంతుడు మింటికెగసి తచ్ఛూలాయుధమునున్ నేర్పమర
మొనసిపట్టి విరిచివైచె రెండుగ మోకాలన్ కపులలరన్.

వ. అమ్మహత్తరకార్యమునకువానరులెల్లరు హనుమంతునిగీర్తించినట్టియెడ కుంభ
కర్ణుడు రోషారుణితలోచనుండై సత్వరంబున

మ. చలమేపారగ కుంభకర్ణుడు మహాశౌర్యాతిరేకంబునన్
మలయమ్మాధర శృంగముం బెరికి వ్యోమంబెల్ల కంపింప ను
జ్జ్వలతేజంబున వానరేంద్రు పృథువక్షస్థానమందేయ వి
హ్వలుడై మూర్ఛమునింగె ధారుణిపయిన్ వ్రాలెంగపుల్ భీతిలన్.

ఉ. అంతట కుంభకర్ణుడు జయంబున నార్చుచు తత్ప్లవంగభూ
కాంతునిబట్టి యెత్తుకుని గ్రక్కున నేగుటగాంచి కోపసం
భ్రాంత హృదంతరంగుడగు పావని దేహమునట్టిబెంచి య
త్యంతరయంబునం జనియె నయ్యసురాధిపు ద్రుంచువాంఛతో.

వ. ముష్టిప్రహారణమున కుంభకర్ణుని మర్దించి సుగ్రీవుని గొనిరాదలంచి క్రమ్మఱ
నిట్లూహించె మహాత్ముండగు సుగ్రీవుని విడిపించితినేని యతనికి సంతోషహాని,
కీర్తినాశముయగును కావున కొంతవడి యోర్చెద నింతలో లబ్ధసంజ్ఞుండై యాతడే
తప్పించుకొని రాగలడు కాదేని యప్పుడే తత్కార్యమును నిర్వహింతునని

నిశ్చయించి చెదరిపోవు వానర సైనికుల నడ్డగించినిలిపె నంత కుంభకర్ణుడు సుగ్రీవుని యెత్తుకొని పోయి లంకజొచ్చె నయ్యవసరంబున నట సౌధాంతరస్త్రీలు పుష్పములు లాజలు సుగంధ శీతలోదకముల కుంభకర్ణునిపై వెదజల్లుచుండ తచ్ఛీతలోపచారంబులకు సుగ్రీవుడు మూర్ఛదేరి కుంభకర్ణుని చేతులనుండి తప్పించుకొని పోనెంచి

సీ. సుగ్రీవుడవుడతిసునిశిత నఖముల కడునేర్పుతో కుంభకర్ణు చెవులఁ
బెరికి తీక్ష్ణములైన భీమణదంష్ట్రల బ్రక్కల ముక్కును బట్టికొరుక
నతిబాధపడి పరిహృతకర్ణనాసుడై దారితాంగముల నత్యంతరక్త
ధారలుదొరుగ దైత్యవరుండు సైపక ప్లవగేంద్రు కరములబట్టి నలిపి
నేలపైగొట్ట నంతట నిశిచరాళిచేత నటహాస్యమానుడై శీఘ్రమున న
భస్థలంబునకెగసి ప్లవంగవిభుడు శ్రీరఘూత్తము సన్నిధిజేరెనంత.

వ. పదంపడి కుంభకర్ణుడు కర్ణనాసహీనుండై రక్తధారలుదొరుగ సెలయేళ్ళతో దొడ్డనగంబన నొప్పె తత్సమయంబున ముద్గరాయుధమొండు ధరించి క్రమ్మఱ రణాంగణంబున కేతెంచి ప్రళయకాల మృత్యువువిధంబున వానరసైన్యంబుల జొచ్చి రక్తమాంసభక్షణ లాలసుండై మైమరచి ఋక్షవానర రాక్షస పిశాచాదులనెల్ల నాశంబొనరించి భక్షించుచుండె తదీయ భయంకర కృత్యమునకు వెరచి శ్రీరాముని మరుగుఁజొచ్చి రట్టియెడ లక్ష్మణుండు కినిసి కుంభకర్ణునిపై గవిసి యుద్ధమున కుద్యుక్తుండై.

శా. చాపంబెక్కిడి సప్తసాయకములన్ సంధించి సౌమిత్రి దు
ర్వ్యాపారుండగు కుంభకర్ణుని పయిన్ వర్షించినన్ లక్ష్మణుం
గోపస్ఫూర్తి నతిక్రమించిచని రక్షోవీరుడున్ రామభా
త్రీపాలాగ్రణి మీదికింగవిసె సందీప్తోగ్ర తేజంబునన్.

శా. అంతన్ రామవిభుండు చాపమున రౌద్రాస్త్రంబు సంధించి క
ల్పాంతాగ్ని ప్రతిమాన దీధితులతో నాకుంభకర్ణోరసో
పాంతంబుచ్చెచనంగ గిన్కనదరింపన్ రాక్షసశ్రేష్ఠుడ
త్యంతభ్రాంతివహించె చేతిగదయున్ ధాత్రీస్థలిం గూలగన్.

వ. కుంభకర్ణుడు రామబాణపీడితుండై సింహనాదంబుసేయుచు నిరాయుధుండగుట వలన కరపాదఘట్టనంబులతో వానరయూధంబుల దరిమిదరిమి పొడిచి దిగ్రమింగుచు పరువునజని యొకగిరిశృంగంబెత్తి రామునిపై విసరిన.

ఉ. కాంచనరత్నపుంఖ విశిఖంబుల నేడిటి నెక్కుపెట్టి శో
భాంచితుడైన రామవిభు డప్పుడనిన్ ద్విశత ప్లవంగులం
బంచతనొంద జేయుటకు పైనరు దెంచు గిరీంద్రముబట్టి ఖం
డించె రణోమయంబుగ వడిన్ నమమన్ నిజసేనలార్వగన్

వ. తత్సమయంబున కుంభకర్ణు వధోపాయం బాలోచించి లక్ష్మణుండు శ్రీరామునితో నిట్లనియె శ్రీరామచంద్రా ఈ రక్కసుడు శోణితగంధవశంబున మత్తుండై స్వీయ పరకీయముల గుర్తింపక నందరభక్షించుచున్నవాడు వీని నుపేక్షింపజనదు నేనొక్కయుపాయంబాలోచించితి నెద్దియన వానర సేనలెల్ల నొక్కమొగి వానిపైచుట్టుముట్టి ప్రాకవలయు ముఖ్యులైన సేనాపతులెల్లరు పైపై నడరవలయు అప్పుడితండతిభారమున భూమిపైబడు పదంపడి వీనిబ్రహరింప సాధ్యమగునన వుడు తత్క్షణంబ వానర సేన గుంపులుగుంపులుగా రక్కసునిబొదివి పర్వతారోహణంబొనరించునటుల బ్రాకుటయు మదపుటేనుగు నిజదేహంబు విదిర్చి మావటివానిని క్రిందికిపడద్రోయువిధంబున కుంభకర్ణుడు కోపముతో దేహమువిదిర్చి వానరులనెల్ల క్రిందికిత్రోసిపుచ్చె అంత శ్రీరాముడతనిపై శరప్రయోగమునకు ధనుష్టంకారమొనర్చుటయు నదివిని సహింపకపైకరుదెంచు కుంభకర్ణునితో శ్రీరాముండిట్లనియె.

—: శ్రీరాముడు కుంభకర్ణునితో పోరుట :—

క. పోరునకు నిలుము నాతో ఘోరాహవభూమి నిన్ను గూల్చెదదృటిలో
శ్రీరాముడనని తెలియుము వీరుడనని మిగుల విర్రవీగెదు క్రూరా!

వ. అంత కుంభకర్ణుండితండు శ్రీరాముండనిగుర్తెరింగి వికారముగానవ్వి మేఘగంభీరభాషణంబులనిట్లనియె.

సీ. తెలియజాలవు నాదుబలశౌర్యములు రామ పోరియజేసెద నిప్పునిలువుమింక
ఖరవిరాధాది రక్కసిమూకతో సాటియని నన్ను నెంచెదే నాత్మలోన
నిలలోననాపోరు లీలామరే మహోగ్రబలాఢ్యుడగు కుంభకర్ణుడనుచు
ననుగుర్తెరుంగుము నాకంటబడితివి మేలుచేకూరె నిన్ క్రమింగి వైతు
మునురణాంగణమున శక్రముఖ్య దివిజ సముదయంబును నిర్జించి జయము యశము
గాంచిమించితి నిన్నొక్క క్షణములోన జక్కడతు నిల్వుమా మూర్ఖ
సమరమునకు.

చ. అనివచియింప శ్రీరఘుకులాభరణుం డతితీక్ష్ణమౌ మహా
శని సదృశోగ్రబాణముల నయ్యసురాగ్రణి మేనిపై నిగు
డ్చిన నిసుమంతయేని మదిజంత నహింపక ముద్గరాయుధం
బునశరజాలవేగమును బూనిక నెంతయు నడ్డగించినన్.

మంజరి :

అంతట రోషమున దాశరథి వాయువ్యాస్త్రము సంధించి
పంతంబున నరికె ముద్గరముగల పగతుకరముఖండించి
కరహీనుండగుచు కుంభకర్ణుడు కదు క్రోధంబుననార్చెన్
గిరిసదృశాయుధము క్రిందబడి యగ్గిరి కపులిటుల దనర్చెన్.

వ. పడపడి హతశేషులైన వానరులొక్కచో గుమిగూడి దుఃఖించుచు మిగుల భయంకరముగఘోరాహు రామకుంభకర్ణుల ద్వంద్వయుద్ధమును గనుంగొని గడగడ లాడుచుండి రాసమయంబున.

ఉ. ఆమనుజాసియున్ మరలనన్యకరంబున మాన్పెకల్చి శ్రీ
రామునిపైకి నుగ్రముగ రా నపుడైంద్రమహాస్త్రమెత్తి దు
స్తామసమూని దాశరథి దైత్యుని రెండవచేయిమున్నినన్
భూమిబడయున్ మహీధరముపోలిక కూలె భయంకరంబుగన్.

గీ. రెండుభుజములు తెగి నడగొండవోలె గదియనే తెంచు తత్కుంభకర్ణు గాంచి
రామవిభు డర్ధచంద్ర శరద్వయమున కడగిరక్కసుపాదయుగంబునరికె.

వ. ఇట్లుకరచరణహీనుండై కుంభకర్ణుడు బడబాగ్నిచందంబున నొప్పు భయంకర దంష్ట్రాకరాళంబు దెరచి సింహనాదంబు సేయుచు అంతరిక్షమున చంద్రుని కబళింపబోవు రాహువుచందంబున పైకి నురవడించ, వానింగనుంగొని శ్రీరాముడు సువర్ణపుంఖ చిత్రితంబులైన పెక్కుమార్గణంబుల నాముక్కడి రక్కసు వదనగహ్వరంబెల్ల నిండించె నంతచే నానిశాచరుడు ప్రలపింప నేరక నతిప్రయాసతో గురవెట్టుచు భ్రాంతుండయ్యె నాసమయంబున

శా. అంతన్ శ్రీరఘురామచంద్రుడు మహేంద్రాస్త్రంబుసంధించి య
త్యంతక్రోధ విఘూర్ణమాన నయనుండై వే ప్రయోగింప క
ల్పాంతాగ్ని జ్వాలనోపమాన రుచి భూమ్యాకాశముల్ నిండ ని
ష్క్రాంతంబై వడి కుంభకర్ణు శిరమున్ ఖండించె చిత్రంబుగన్.

వ. అతనికళేబరంబు హిమగిరిచందంబున పరిసరవర్తులగు వానరుల ననేకుల నాశంబొనరించుచు సముద్రంబున గుభాలున గొప్పధ్వనితోగూలె దేవ బ్రాహ్మణ ఘాతకుండైన కుంభకర్ణుని వధకు జగత్రయవాసులు సంతసించిరి తదనంతరంబ తద్వృత్తాంతం బంతయు రక్కసులవలనవిని రావణుఁడు వాపోవుచు మూర్ఛాక్రాంతుండై పడి కొంతవడికి తెలివొంది దీనస్వరంబున నిట్లనివిలపించె.

—: రావణుఁడు కుంభకర్ణుని వధకు చింతించుట :—

చ. నిరుపమ శౌర్యవీర్య బలనిర్జిత సర్వసుపర్వనాథ సం
గరమున శాత్రవప్రతతి గర్వమడంతువటంచు నెమ్మదిన్
స్థిరముగ నమ్మియుంటిని యిసీ తుదకున్ లఘువిక్రమాఢ్యుడౌ
నరునికరంబులంబడి వినాశమునొందితివే సహోదరా.

ఉ. అక్కట నాకుప్రాణసముడైన సహోదరుడీల్గె నింకనా
కెక్కడి రాజ్యభోగ మికనేటికి సీత దురంతచింత చే
బొక్కు మదీయజీవితము భూస్థలివ్యర్థముగాదె యిప్పుడే
జిక్కడతున్ రిపున్ భిదుర సన్నిభ సాయక వృష్టినాజిలోన్.

వ. అంత రావణుఁడు గతించిన విషయములు దలంచుచు మనంబున నిట్లని చింతింపం దొడంగె.

ఉ. పెక్కువిధంబులన్ మునువిభీషణుడర్మిలి నీతివాక్యముల్
జిక్కగబోధజేసినను జ్ఞానవిహీనుడనై గ్రహింపలే
కక్కటికంబు బోవిడిచి యారడి సోదరునిం త్యజించితిన్
నెక్కొనె తత్ఫలంబిటులనిక్కము యేమనవచ్చుచెల్ల రే.

ఆవె. అనుచు బహువిధముల నసురాధినాథుండు మిగులవగలబొగిలి వెగడుదోప
వసుధపైని మూర్ఛపడ నంతనాతని సుతుడు త్రిశిరుడనెడు శూరవరుడు

వ. స్వాంతనవచనంబుల తండ్రికి మనస్తాపోప శమనంబొనరించుచు దురాత్ములగు శత్రువీరుల నిముషమాత్రంబున నాశంబొనరించి వచ్చెదగాన యుద్ధమునకు సెలవొసంగుమని యడుగుటయు నంతలో దేవాంతక నరాంతక త్రిశిర అతికాయులను రావణుని పుత్రకులు రణోత్సాహముతో తండ్రియనుమతిగొని అహంపూర్వ మహంపూర్వమని యొకరినొకరి నతిక్రమించి సింహనాదములు సేయుచు సర్వసాధనోపేతులై బయలువెడలిరి ఆ రాక్షసవీరులు

ఉ. అందరుశూరు లస్త్రవిదులందరు జ్ఞానవిశిష్టు లాజిసం
క్రందనతుల్య విక్రములు ప్రాజ్ఞులు మేటివరప్రభావులి
ట్లంతరు దేవతాగణ మదాపహులందరు దొడ్డమాయ కాం
డ్లందరు కామరూపులు వియత్పథచారులు కీర్తివర్ధనుల్.

సీ. సూర్యవర్చసులైన సుతుల నతిప్రీతి నాలింగన మొనర్చి యసురవిభుడు
సకలభూషణముల చక్కఁగాఁ గైసేసి సేమంబుగలుగ నాశీర్వదించి
తనయుల రక్షణార్థము మహోదర మహాపార్శ్వులనగ పేర్లబరగు నిజస
హోదరులిర్వుర నొనర సహాయంబుగానుండ నియమించి కదనమునకు
జనుడనుచు నాజ్ఞసేయగా జనకునకును వలగొని నమస్కృతులొనర్చి ప్రమద మెసగ
గంధమాల్యానులేపన కలితులగుచు యుద్ధసన్నద్ధులగుచు మహోద్ధతముగ.

వ. ఖడ్గ కవచ ధను స్తూణీరాది సర్వసాధనంబులును వ్రణనివారణకు వలయు వివిధయోషధులతో రథ గజ తురంగాది వాహనారూఢులై సమరోత్సాహంబున బయల్వెడలి.

చ. రణమొనరించువాంఛ వడిరావణుపుత్రులు నల్వురుద్ధతిన్
మణిగణదీధితుల్ గగనమండలమెల్లెడ నిండిబర్వగన్
గణగణమంచు గింకిణులు గంటలు మ్రోయుచునుండ మేల్ధను
ర్గుణములు దిగ్తటాంతముల ఘోరముగా జెలువొంద నార్చుచున్.

సీ. నీలజీమూత సన్నిభ మదేభమునెక్కి యుగ్రరూపమున మహోదరుండు
మేల్మిబంగరుజిగిమించు దేరులనెక్కి ధృతిమీర నతికాయ త్రిశిరయుగము
నుచ్చైశ్రవముతోడ నుపమింపదగు ధవళాశ్వంబునెక్కి నరాంతకుండు
దర్పితులగు మహోదర మహాపార్శ్వులొప్పుగ గరీంద్రములనెక్కి భూరికోప
భీషణంబుగ నార్చుచు బెక్కుగతుల నలరు శరచాప ఖడ్గ శూలాద్యనేక
సాధనసమృద్ధితో బహుసైన్యసహితు లగుచు నేతెంచి రుత్సాహ మతిశయిల్ల.

వ. ఇట్లు మహాట్టహాసంబున రావణుపుత్రులు చతురంగ వాహినీ సమేతులై సమరోత్సాహంబున నేతెంచుట గనుంగొని వానరులు గొప్పగొప్ప పర్వత శృంగంబుల విశాలమహీరుహంబుల బెరికి పుచ్చుకొని యుద్ధార్థులై సింహ నాదంబులు సేయుచుండ, రక్కసిమూకలు క్రోధావేశంబున శరీరంబులుప్పొంగ నార్చుచు నురవడింప, నిరువాగుల సైన్యంబులకు భీషణంబగు సంగ్రామంబయ్యె వానరులు శిలాప్రవర్షంబు వర్షించుచుండిరి రాక్షసులు శరవర్షంబున వాని

నడ్డగించుచుండిరి రధ హయ గజారోహకులగు రక్కసుల నానావిధ సాధనములతో బ్రహరింపంబడి వానరులు భిన్నావయవులై కూలుచుండిరి యిట్లు ముహూర్తకాలం బతిభయావహంబైన సంగ్రామంబు ప్రవర్తిల్లుటయు విరిగిన మొండెములతో తెగిన కరచరణాద్యవయవములతో ప్రవహించు నెత్తురుకాల్వలతో ప్రోవులుబడ్డ మాంస మేదో మస్తిష్కంబులతో నిండి రణభూమి మిగుల భీభత్సంబై యొప్పె నప్పుడు.

గీ. దానవులబట్టి వానరుల్ దానవులను వానరులబట్టి రక్కసుల్ వానరులను
బట్టిప్రహరించుటొండొరుల్ భీషణముగ హతిమొనర్చిరి
యుభయసైన్యముల మిగుల

గీ. వనచరులచేత హతులైన దనుజవరుల కవచములు తెగి రక్తంబు గారెమిగుల
విరిచివైచిన శాఖలవెడలుచుండు వృక్షసాగంబుపోలిక వెక్కసముగ.

వ. అట్టియెడ నరాంతకుడు భయానకంబగు శక్త్యాయుధంబొందు ధరించి జవనాశ్వంబుపైనెక్కి సముద్రమధ్యమున సంచరించు తిమింగలము చందంబున సుగ్రీవుని సైన్యమధ్యమున జొచ్చి సప్తశతసంఖ్యగల వానరుల హతంబొనరించె నిట్లు కార్చిచ్చుదహించు చందంబున హింసింపంబడు వలీముఖులు భయశంకితులై పరువులెత్తుచుండుట గనుంగొని సుగ్రీవు డంగదునితో నిట్లనియె.

ఉ. వానరసేనలన్నిటి జవంబున నాశమొనర్చుచుండె నీ
దానవుడ్రుంచి రమ్మన ముదంబున మేఘమునుండివచ్చు స్వ
ర్భానునిబోల్కి నంగదుడు పర్వున సేనలనుండివచ్చి దు
ర్మాను నరాంతకున్ గదిసి మార్కొని యిట్లనిపల్కె నల్కతోన్.

మంజరి :

నిలుపుమురా యోరిదుష్టరాక్షస నిరంకుశోద్యోగమునన్
అలతులతో బోరనేల నాపైకరుకుదెమ్ము సమరమునన్
భయంకరమైన వజ్రతుల్యమగు నీప్రాసాయుధమయ్యెడలన్
ప్రయోగించు మస్మద్వక్షంబున బలముగాంతు వీవేళన్.

వ. అనుటయు

ఉ. అంగదుపల్కులన్ విని నరాంతకుఁడెంతయు రోషమాత్మను
ప్పొంగగ బండ్లుగీటి యహిపోలిక పెన్బుస బెట్టుచున్ సము
త్తుంగ నిశాతశూలమును తోడన గిర్రున త్రిప్పివేయ న
య్యంగదుకొమ్మదాకి పొడియై పడియెన్ పుడమిన్ మహాసడిన్.

తరువోజ :

అతిరోషవశమున నంగదుఁడపుడు హస్తతలంబున నానరాంతకుని
ప్రతిలేని తురగశీర్షంబుపై వేగప్రహరింప నదియును బ్రద్దలై నీల్గి
క్షితిగూలె దానినీక్షించి దైత్యుండు చిత్తమందలిగి ముష్టిప్రహారమున
ధృతినంగదుని తలతిరిగిపోనేయ ద్రిమ్మఱివోయి ధాత్రీస్థలిబడియె.

వ. అంతనంగదుని శిరంబుపగిలి వేడినెత్తురు వెలువడియె నంత క్రొంజొక్కవడికతంబు
మూర్ఛదేరి విస్మయంబంది వెండియు విక్రమంబున

చ. తడబడకంగదుండు కడుదర్పమెలర్పఁగ వజ్రతుల్యమౌ
పిడికిటితో నరాంతకుని పేరురమందు మహాదృఢంబుగం
బొడువ పటిల్లునంబగిలి బోరన నెత్తురు గ్రక్కి ధారుణిం
బడియె నిశాచరుం డశనిపాతమునంబడు శైలమోయనన్.

వ. అంత నరాంతకుండు హతుండగుటయు నంతరిక్షమున దేవతాస్తోత్రంబులతో, భూతలంబున వానరవీరుల సింహనాదంబులతో నిండిపోయె నంత నయ్యంగదుని యుద్ధకౌశలంబు శ్రీరామచంద్రున కాశ్చర్యముగలిగించె. ఇట్లందరిచే శ్లాఘింపంబడి యంగదుండు వెండియు యుద్ధంబునకు సిద్ధంబగుటయు మహోదర దేవాంతక త్రిశిరులు ముగ్గురొక్కుమ్మడి వాలినందను తరుముకొనివచ్చి రయ్యవసరంబున

మంజరి :

మహావృక్షమొండు బెరికి వాలికుమారుడు దేవాంతకునిన్
సహస్రాక్షుడలిగి వజ్రమేసిన చాయనడచె నముచిన్
సర్పసదృశ శరముచేత తద్వృక్షము నరికెన్ త్రిశిరుండు
దర్పంబున హుంకరించి మింటికిదాటె పడినంగదుండు.

సీ. అంబరస్థలినుండి అంగదుండు శిలాప్రవర్షంబు వర్షించె బలము మెరయ
త్రిశిర దేవాంతకుల్ తీక్ష్ణాంబకంబుల తచ్ఛిలల్ ఖండించితిరమెరంత

ద్విరదంబుపై మహోదరుడల్గి తోమరాయుధమున నంగదు యురముభొడిచె
దేవాంతకుండును తీవ్రంబుగానొక్క పరిఘాయుధంబెత్తి ప్లవగవరుని
గట్టిగామోదియును బోర కపివరేణ్యు దానిశాచరవీరత్రయ ప్రహార
ములకు కలతవహింపక చలము మెరయ నాకసంబున కెగసి సాహస మెలర్ప.

వ. మహోదరుని మదగజంబును, నిజకరంబెత్తి బిట్టు ప్రహరింప నది గ్రుడ్లువీడి క్రిందబడి ఘీంకారంబొనరించె నంతనంగదుండు దానికోరపట్టపెకల్చి దానితో దేవాంతకుని గాఢముగాబొడిచిన వాడు తత్ప్రహారమునకు రక్తమును గక్కి దిమ్మరబోయి పడి, కొండొకవడికి ప్రయాసతో తెలివొంది భయంకరంబైన పరిఘాయుధంబెత్తి అంగదునిబొడిచిన నంతనంగదుండు మోకాళ్ళపై నూనిపట్టి ముందుకు మ్రొగ్గి వెంటనే పైకెగురుటయు త్రిశిరుడు త్రిమసాయకంబుల మూడెక్కు పెట్టి అంగదుముఖంబున మోదె నయ్యవసరంబున.

చ. దనుజులు ముప్వురేకముగ దర్పితులై యువరాజుజట్టినం
గనుగొని నీలుడున్ హనుమ గ్రక్కున నయ్యెడకేగుదెంచి పెన్
గనరున నీలుడొక్కగిరి గైకొని తత్రిశిరాఖ్యునేసినన్
గొనకొనివాడు శీఘ్రముగ క్రూరశరంబులద్రుంచె శైలమున్.

స్రగ్ధర :

అంతం దేవాంతకుండాహనుమనుగని హార్ఘాంతరంగంబుతో ని
షాక్రాంతుండై మేటినారాచమువిసర మరుత్సంభవుండంత రోషా
క్రాంతుండై సత్వరంబక్కజముగ దివికిం బ్రాకి వజ్రోపమానా
త్యంత క్రూరోగ్రముష్టిన్ దనుజుని పెనుమూర్ధంబుపై మోదియార్చెన్.

గీ. హనుమ కఠినోగ్ర ముష్టిప్రహారమున సురారితల వ్రీలిపిండియై యక్షియుగము
దంతములు జిహ్వయును రాలిధరణిపైన బడిక్షణంబున నసువులువాసెనంత.

వ. దేవాంతకుండిట్లు హతుండగుటయు త్రిశిరుడు క్రోధవేగంబున మిగుల తీక్ష్ణ శిలీముఖంబుల నీలునివక్షస్థలంబున ననేకవిధంబుల బ్రయోగించె తోడన మహోదరుడును శరపరంపరల గుప్పించిన నీలుని యొడలెల్ల బద్ధలై మూర్ఛాక్రాంతుండైపడియె పిమ్మటకొండొకవడికి తెలివొంది దొడ్డశైలంబొండు పెరికి మిగుల వేగముగా మింటికెగసి మహోదరుని శీర్షంబుపై విసరిన వాడు గజంబుతో చూర్ణంబై నేలంగూలె నదిగని త్రిశిరుండలిగి వాడిశరంబుల

హనుమంతునిపై ప్రయోగించిన నతండవి లక్ష్యపెట్టక ననేకశిలావృక్షంబుల గుప్పించె నిట్లొండొరులు జయేచ్ఛల హోరాహోరి పోరాడుచుండ హనుమంతుం డొడుపున త్రిశిరుని దృఢముగాబట్టి పూర్వమింద్రుడు విశ్వరూపుని శిరంబునరికినటుల కిరీటాలంకృతంబులైన యసురశిరంబుల మూటిని నరికివైచె నంతట వీరులెల్లరు కోలాహలంబుగా సింహనాదంబులొనర్చి రట్టియెడ హతశేషులైన రక్కసులు నలుగెలంకులవిచ్చి పలాయితులగుచుండి రింతలో మత్తోన్మత్తులను రాక్షసుల గవాక్షుండు హతంబొనర్చిననంతరంబ అతికాయుండను వాడత్యంతరోషావేశంబున వానరులవెంటాడి తరుముచు రణోత్సాహంబున విజృంభించె.

—: అతికాయ యుద్ధం :—

మ. అతికాయుండు నిజాభిధాన బలశౌర్యఖ్యాతి బేర్కొంచు ను
ద్ధతి మార్వోనినదంబుసేయుచు సముద్యద్దీప్తితోడాయ న
య్యతిభీతాకృతిగాంచి మర్కటసమూహంబంత శ్రీజానకీ
పతి నర్థిన్ శరణంబువేడిరి భయభ్రాంతాత్ములై చెచ్చెరన్.

గీ. ధనువుదాల్చి పర్వతమువోలె రథమందు ప్రళయకాల జలధరములపోల్కి
గర్జలిడెడు దైత్యుగని దాశరథి విభీషణున కనియెనిట్లు సమ్మదమున.

చ. అతులితభీషణాకృతుడవాఁ డితడెవ్వడొకో విభీషణా!
చతురత వేయిగుర్రముల స్యందనమెక్కి దురాగ్రహంబునం
దతిరభసంబుతోడ సమరాంగణభూమికి నేఁడెంచె న
ప్రతిమ బలాఢ్యుడీతని పరాక్రమమున్ వివరించి తెల్పుమా.

వ. అనియడుగ విభీషణుండిట్లనియె.

సీ. అవధరింపుము శ్రీమదర్కాన్వయ సుధాబ్ధి రాకాశశాంక శ్రీరామచంద్ర
చిత్రంబు వీనిచరితంబు దశకంఠు గాదిలిసుతు డతికాయుడితడు
వివిధాస్త్రనిపుణుండు వేదవిద్వర్యుండు రావణసదృశుండు రణములందు
రథ సైంధవోష్ట్రి వారణ సమారోహణ విజ్ఞాని సంతత వృద్ధసేవి
చతురుపాయజ్ఞు డధికధీశాలి ధాన్యమాలికోమరుండు మహితసమర్థు డుగ్ర
కార్ముక ప్రాస ముద్గర ఖడ్గ కవచ ముఖ్యసాధను డతిరథముఖ్యుడితడు.

గీ. అరయ సీతనిభుజబల మాక్రయించి కాదె దానవవీరులు లంకాపురమున
సౌఖ్యముగ కాపురంబుంట శంకలేక వీనిచరితంబు కలదింక వినుమురామా.

సీ. అతిఘోరతపమున నబ్జజు మెప్పించి దివ్యాస్త్రసమితి సాధించినాఁడు
మరిసురాసురులచే మరణంబు లేనట్టి వరముసంపాదించి వరలినాఁడు
మంజులకవచంబు మహనీయరథమును పరమేష్ఠివలననే బడసినాఁడు
పలుమరు త్రిదశుల భండనంబుల గెల్చి మించి రాక్షసుల రక్షించినాఁడు
వజ్రివజ్రాయుధంబును వరుణదేవు పాశమును సైతమీతఁడు ప్రతిహతంబొ
నర్చె గావున తీక్ష్ణబాణముల కపుల ద్రుంచకయున్న వీనివధించుమనఘా.

వ. అని వచించుచున్నంత మహాబలగరిష్ఠుండైన అతికాయుఁడు వానరసైన్యంబు జొచ్చి ధనుష్టంకారము సేయుచు సింహనాదంబొనర్చుటయు నంత తదీయ సంరంభం బవలోకించి మైంద ద్వివిద కుముద నీల శరభాది ప్రముఖవానరులు కొందరు దొడ్డసాలవృక్షంబుల నున్నతశైలశృంగంబుల ధరించి వానిపైసరవడించి వ్రేయుటయు నయ్యతికాయుండును క్రొవ్వాడి మెఱుంగుటమ్ముల వానినెల్ల ఛేదించుచు మృగేంద్రమల్పమృగంబుల బెదరించునటుల వానరభల్లూక ప్రముఖులనెల్ల ననేకవిధంబుల ప్రహరించుటయు నొచ్చి వానినోడింప శక్తులుగాక చెదరిపఱచిన నంత వాఁడు ధనుష్పాణియై శ్రీరామునిపైకడరి సగర్వంబుగ నిట్లనియె.

మ. శరచాపాదులుదాల్చి తేరున రణోత్సాహుండనై యుంటి ను
ర్వర సామాన్యులతోడ పోరుటకుబోవన్ నేఁడు మీలోన సం
గరవీరుల్ గలరేని రండు కడుశీఘ్రంబింక నాతోడుతన్
సరిగాయుద్ధమొనర్పనంచు బలుకన్ సౌమిత్రియుద్రేకియై.

మంజరి :

కోపముతో సత్వరమున విలసత్కోదండమును ధరించి
మోపెట్టి శరంబుశింజినీధ్వని మొరయించుచు రిపుగాంచి
యామహాధనుష్టంకారము భూమ్యాకాశదిశావళియున్
భీమంబైనిండె దైత్యజన హృద్భేదనకరమైమరియున్.

వ. గొప్పతేజోవంతుండగు అతికాయుఁడాలక్ష్మణుని ధనుష్టంకారమునకు విస్మయచిత్తుండై కోపాటోపమున మిగుల తీక్ష్ణములయిన శిలీముఖంబుల చాపంబున సంధించి లక్ష్మణునితో నిట్లనియె.

సీ. చాల్చాలుడింభక చనుమవ్వాలకు మత్పరాక్రమం బెఱుగవు రణములోన
యమధర్మరాజుతో సముడనౌనాప్రమాల నిలిచిపోరాడ నీకలవియగునె
మత్ప్రియుక్తములయిన మహనీయశస్త్ర పాతముసహించునే
జగత్త్రయము వినుము
కాలసర్పమును నీవేల మేల్కొలుపగా నెంచెదు వాత్మలో నెరిగియెరిగి
సంగరంబేల చాపంబు శరము ధరణిపారవైచి యథేచ్ఛగా పారిపొమ్ము
మచ్ఛరాసన నిర్ముక్త మార్గణాళి కాహుతికి దప్పఁగొనుము పేరాసలేలా.

ఉ. నానికటంబునుండియు జనన్ మనమందున నిచ్చలేనిచో
బూనికనిల్చియుండు మొకపోటునకే జమువాటికేగ దీ
శానుని మేల్త్రిశూల సదృశంబగు హేమవిచిత్రపుంఖ నా
నానిశితాశుగంబులు ఘనంబుగ నీ రుధిరంబు గ్రోలెడున్.

వ. అతికాయుండిట్లు తూలనాడుచు రోషముతో తీక్ష్ణములగు శిలీముఖంబు లెక్కువెట్టిన గర్వోద్రిక్తములయిన తద్వచనంబు లాకర్ణించి లక్ష్మణుడు వానితో నిట్లనియె.

ఉ. గొప్పదనంబువచ్చునొకో కూళ ప్రగల్భములాడినంత నే
నెప్పుడు శుష్కభాషణము లిట్లువచింపను శూరవర్యు లే
నిప్పుడు చాపమందు శరమెక్కిడినిల్చితి యుద్ధకాంక్ష నీ
యొప్పిదమైన సంగరబలోద్ధతి జూపెదుగాక నిల్వుమా.

క. తేరెక్కినంతమాత్రన పౌరుషమానే మహాస్త్రపటిమగల్గినన్
పోరికినిల్వుము నీతలధారుణిబడగూల్తు నిపుడు తాళఫలగతిన్.

ఉ. బాలుడనంచు హాస్యముగ బల్కితి వెక్కసమామదంబునన్
బాలుడనో యథార్థముగ ప్రౌఢవయస్కుడనో నిజంబు నీ
పాలిటిమృత్యువంచు మదిభావనసేయుము తొల్లి విష్ణుడున్
బాలకుడై త్రిలోకముల ప్రాభవమొప్పగ నాక్రమింపడే.

వ. ఇట్లొండొరులు పాలంభనంబొనరించుచు పరస్పరజయేచ్ఛ వివిధాస్త్రప్రయోగ కౌశలంబుల పోరాడుచుండ గంధశింధురంబు మదధారల విడుచుచందంబున నిరువురి శరీరములనుండి రక్తధారలు స్రవింపుచుండ కోపావేశంబులు పెరిగి సూర్యేంద్ర వాయువ్యైషీక యామ్యాగ్నేయ రౌద్రాద్యనేక దివ్యాస్త్రంబుల బ్రయోగించుచు భయంకర సమరంబొనరించుచుండి రట్టియెడ నతికాయుండు

మిగులనై వుణ్యంబు మెరయ మిగులనాశీవిషతుల్యంబైన బాణంబొండు వైచిన నదిమర్మభేదనంబై నాట లక్ష్మణుండు ముహూర్తకాలము స్మృతిదప్పియుండి వెండియు తెలివొంది యాగ్రహాతిశయంబున

ఉ. తోడన నాల్గుబాణములతో ధ్వజమున్ మరిసూతు వాజులన్
బోడిమిదక్కకూల పొలిపోవకగొట్టి ప్రరాక్రమంబునన్
వాడిశరంబులన్ వివిధభంగుల దైత్యవరేణ్యుముంచినన్
వాడుచలింపకున్న గనివాయువు లక్ష్మణుతోడ నిట్లనున్.

శా. సౌమిత్రీ వినుమొక్కసంగతి రహస్యంబొండెరింగింతు ను
ద్దామప్రౌఢిమ నీనిశాటుడు విధాతంబ్రీతుగావించి సం
గ్రామక్షోణి నభేద్యహాకవచమొక్కండర్థి నార్జించుటన్
సామాన్యంబుగ జావడీతనిపయిన్ సంధింపుమాబ్రాహ్మమున్.

మ. అనినన్ నల్లెయటంచు లక్ష్మణుడు బ్రహ్మాస్త్రంబుమంత్రించి గొ
బ్బున చాపంబుననెక్కబెట్టుటయు దిగ్భూమ్యంతరిక్షోదరా
దినతారాగ్రహపంక్తి భీతిలగ దైత్యేంద్రాత్మజున్ వేసినన్
గనితోడ్తో నతికాయుడుగ్రశర వర్గంబెన్ని యేన్ గుప్పినన్.

మ. జ్వలదగ్ని ప్రతిమాన దీధితుల తద్బ్రహ్మాస్త్రమూ సాధనా
వళిదూలించి విచిత్రరత్నమకుట ప్రాంచత్సురారాతి పెం
దలత్రుంచెన్ క్షణమాత్రలో హిమగిరీంద్రశృంగమోనాగ భూ
స్థలిపైగూలె హతావశిష్టులగు దైత్యశ్రేణి వాపోవగన్.

వ. అంత గక్కసులు భయభ్రాంతులై లంకజొచ్చిరి వానరులు భల్లూకనాయకులు లక్షణు ననేకవిధముల గీర్తించిరి. రావణుడీవార్త చారులవలనవిని భయ కంపితుడై కన్నీరువిడిచి మూర్ఛాక్రాంతుండైపడి పరిచారికల శైత్యోపచారముల వలన గొంతవడికి దెప్పిరిలి రాక్షసులతో నిట్లనియె.

సీ. సామాన్యులే పోరజచ్చినయోధులు యెంతటి ఘోర మిదేటివింత
హీనులౌ వానర మానవాధములచే నురుతరంబగు భయంబుప్పతిల్లె
రామసుగ్రీవుల సౌమిత్రి విభీషణాది పీకులద్రుంప నర్హుడెవడు

బుద్ధినూహింప నద్భుతమైదనర్చె నుజ్వలమహాస్త్రవిదుండు శౌర్యశాలి
రాఘవుడు నిక్కమతని పరాక్రమమున నసురులందరు హతులైరి యాత్మలోన
శ్రీమహావిష్ణువని యెంతు జెప్పనేల రాముడై పుట్టె నిజము ధరాస్థలమున.

—: ఇంద్రజిత్తు యుద్ధము :—

వ. అని మిగులఖిన్నుడై వాపోవుచున్న తండ్రితో యింద్రజిత్తు సాంత్వనవచనముల నూరటబుచ్చి యిట్లనియె.

ఉ. ఇంతటి దుఃఖభారమిటు లేటికి మానుము తండ్రి శౌర్యదు
ర్దాంతుని శక్రశాత్రవు శరప్రహతిన్ హతులౌవిరోధులం
గాంతువుగాక పావకశిఖా ప్రతిమోగ్ర శిలీముఖంబులం
ద్రుంతు నిమేషమాత్రమున ధూర్తులరాముని లక్ష్మణున్ నడిన్.

చ. తొలిబలినట్లు వామనుడు దోర్బలిమిన్ ఘనపాశబద్ధుగా
జలిపె నదేప్రకారమున శాత్రవవీరుల సంగరాంగణ
స్థలమున సంహరించి సముద్రగగతిం జరుసెంచుచున్న వి
వ్వాలమతులై నభస్థలి వియచ్చరులచ్చెరువొంది గాంచగన్.

వ. అనిప్రతిజ్ఞబూని సూర్యసన్నిభంబగు రథంబెక్కి ధను
ర్ధారులైన యుద్ధవీరు లతనివెంట పయనంబై.

ఉ. కొందరు తేరులం గరుల కొందరు మేటిగఔష్ట్రివాజులం
గొందరు సింహసర్పముల గొందరు నక్రవరాహహంసలం
గొందరు నీలకంఠముల గొందరు పిల్లుల వృశ్చికంబులం
గొందరు జంబుకంబులను ఘోరమృగావళినెక్కి యార్చుచున్.

వ. బహువిధాయుధ సమేతులై చతురంగ సమూహములు సింహనాదములు సేయుచు

చ. వెడలె రణాంగణస్థలికి వేడ్కసముజ్వలభూషణావళుల్
దొడిగి మహావిభూతి రణధుర్యుడు శక్రవిరోధి పట్టుచేల్
గొడుగులుబట్టి కొందరును కొందరువీవనలూనివెంటరా
పిడుగులుబడ్డ చందమున భేరులుమ్రోయ నుదాత్తరేఖతోన్.

గీ. ఇప్పగిది సర్వసిద్ధమై యింద్రజిత్తు రణసముత్సాహభరితుడై రావణుని ప
దంబులకుమ్రొక్కినంతె నత్తనయునెత్తి కౌగిటగదించి మూర్కొని గారవమున,

వ. పుత్రునితో యిట్లనియె.

మ. తనయా నీసముఁడా మహారథికు డీధాత్రీస్థలిన్ లేఁడు ము
న్ననిలో నింద్రుజయించివచ్చితివి నీకాలంబునన్ రాఘవుం
డనగా నెంతటివాఁడు వానినతిదీప్తాస్త్రావళిన్ ద్రుంచి మిం
చినకీర్తిన్ విజయంబుగాంచుమని యాశీర్వాదముల్ జేసినన్.

గీ. అతివినీతుఁడై తదాజ్ఞానుసారంబు వేడ్కరథము నెక్కి వెడలి తద్ర
ణ స్థలమున జేరి నలుకెలంకుల సైన్యసమితి నిలువబంచి సంభ్రమమున.

సీ. అగ్నికుండమమర్చి యనలంబునందుంచి విధ్యుక్తరీతిగా వివిధదివ్య
గంధపుష్పాక్షత కలితహోమంబు గావించి చుట్టును ఘనకుదళ
ములకునుమారుగా విలసదాయస పరిస్తరణంబుగావించి తాంద్రచెట్ల
కొమ్మలు సమిధలుగూర్చి కార్ష్ణాయస స్రువములతో నంత సురవిరోధి
కేవలసజీవయుక్తమా కృష్ణవర్ణ భాగమునుబట్టి దానిశీర్ష మునునరికి
వ్రేల్చి యొకసారిసమిధల వ్రేల్చినంత విజయసూచకచిహ్నముల్ వెడలెనందు.

వ. అయ్యవసరమున

గీ. తప్తకాంచన భూమణతతులు మెరయ స్రదక్షిణశిఖలు నుజ్వలకబర్వి
పావకుండంత జెచ్చెరపైకివచ్చి హవ్యముపరిగ్రహించె ప్రత్యక్షముగను.

మంజరి :

అంతట నయ్యింద్రజిత్తు వెండియు నమ్మహాగ్నిగుండమునన్
వింతగ బ్రహ్మాస్త్రమును రథంబును విల్లువ్రేల్చె ధైర్యమునన్
యామహనీయాస్త్రహోమమునకు హిమాంశు రవి గ్రహములతో
వ్యోమంబంతయును మిగులకంపం బొందె తారకావళితో.

ఉ. పావకదీప్తతేజమున బాహుబలోద్ధతితోడ నంత త
ద్రావణుసూను డుజ్వల రథధ్వజ నూతహయాస్త్ర చాపఖ
డ్గావళితో సమేతముగ నద్భుత మంత్రమహత్వ మొప్ప కో
ధావహుడై వెలుంగుచు వియత్పథమందు నదృశ్యమూర్తియై.

వ. వానర భల్లూక వాహినిపై వజ్రతుల్యంబులగు నానావిధ శరపరంపరల
వర్షించుచుండె నట్టియెడ తదాజ్ఞానుసారమున రాక్షసయోధులు వానరసేనలపై

బడి విచ్చలవిడిగా ప్రహరించుచుండ నట్టియెడ వానర భల్లూక సేనలు సహింపక వివిధప్రకారముల శిలావృక్షవర్షమును వర్షించుచు ఘోరముగా విజృంభించి పోరుచుండ నిట్లుభయసైన్యంబులకు భయంకరమగు పోరాటము సంఘటించుటయు వజ్రాయుధమున గూలు పర్వతశృంగములకరణి మాయా బలంబున నదృశ్యుండై యింద్రజిత్ప్రయుక్తములైన వివిధాయుధప్రహారణముల రక్తసిక్తాంగులై కర్తవ్యమేమియు తోచక కడుసంతాపితులైన వారలకనుంగొని యింద్రజిత్తు శౌర్యాటోపమున హనుమ దంగద సుషేణ గంధమాదన గవాక్షాది జాంబవత్ప్రముఖులనెల్ల మిగుల నార్తినొందించి పదపడి సువర్ణ పుంఖములుగల తీక్ష్ణనారాచంబుల రామలక్ష్మణులపై నడరించిన ధైర్యముతో శ్రీరాముడు వాటిని లక్ష్యపెట్టక లక్ష్మణునితో లక్ష్మణా! ఇతడు బ్రహ్మాస్త్రప్రక్రియ నాచరించుటకు యత్నించుచున్నవాడు గావున

ఉ. ఈతనిసంహారింప వెరవెయ్యది లక్ష్మణ నిశ్చయంబుగా
భూతలమందు బాహుబలపూర్ణుడు భూరితపోవిభూతిచే
ధాతృదయోపలబ్ధి వరదానమదోద్ధతుడిప్పుడియ్యెడం
గైతనమొప్ప వానర నికాయములన్ దునుమాడి వెండియున్.

గీ. మాయచే బెక్కురీతుల మనలమిగుల పీడనొందించె బ్రహ్మాస్త్రవేదివీడు
తత్ప్రయోగాది సకలబాధలను నీవుసైపుమిక లక్ష్మణా ధైర్యశాలివగుచు.

గీ. రాక్షసేంద్రుని సుతుడు శరప్రవృష్టి నఖిలదిగ్భాగముల గప్పె నర్కతనయు
సైన్యనాయకులెల్లరు క్ష్మాతలమున చేడ్పడుటచేత మరిబ్రకాశింపకుండె

వ. యుద్ధభూమిలో మూర్ఛాక్రాంతులైన సైనికులనెల్లర గనుంగొని యింద్రజిత్తు విజయలక్ష్మినవడసి లంకజేరంగలవాడని శ్రీరాముడు పలుకుచుండ.

మ. గణుతింపంగ వశంబుగాని సముదగ్రక్రోధుడై మించు రా
వణుపుత్ర ప్రయుక్త తీక్ష్ణశర సంపాతంబునన్ రామల
క్ష్మణు లుర్వీస్థలి వ్రాలిరొక్కమొగి మూర్ఛాక్రాంతులై దానవా
గ్రణియున్ హర్షముతోడ నార్చుచును లంకంజొచ్చె శీఘ్రంబునన్.

వ. విమ్మట బుద్ధిమంతుడగు విభీషణుడు మిగుల నాపన్నులై పడియున్న వానరుల గనుంగొని శాంతవచనముల నిట్లనియె.

సీ. వానరోత్తములార వనజసంభవుడు బ్రహ్మాస్త్ర మీదైత్యరాజాత్మజున కొ
సంగె శ్రీరామలక్ష్మణు లిప్పుడీమహాస్త్రముపైనిగల గౌరవమున జేసి

భండన స్థలమున పడియున్న వార లిట్లార్తినొందగ సమయంబుగాదు
ధైర్యంబుబూరగాదగు ననవుడు వాయుతనయు డాతనితోడ ననియెనిట్లు
బలముగల కపిసేనలు బొలియ నిందు ప్రాణములు గల్గియున్న వారలను మనము
తగినవిధమున మరిసమాధానపరచ వలయుననుటయు నతడును వల్లెయనియె.

వ. అనంతరంబ హనుమద్విభీషణులిర్వురు దివ్వెటీల చేకొని తన్నిశాసమయంబున
రణరంగ స్థలంబెల్ల శోధించుచు సంచరించునెడ నందు

చ. విరిగినపాణిపాదములు విచ్ఛినవక్షము లూరువుల్ భయం
కరముగ భిన్నమై తెగిన కంఠము లంగుళముల్ కబంధముల్
దొరగెడు రక్తవాహినులు ద్రుంగినపుచ్ఛములున్ శరాళితో
గిరులవిధంబునన్ బడిన కీశవరేణ్యుల గాంచిరెంతయున్.

వ. మరియును సుగ్రీవాంగద నల నీల సుషేణ శరభ గంధమాదన జ్యోతిర్ముఖ
ప్రముఖవానరు లరువదియేడుకోట్ల వానరులులో, యింద్రజిత్తుచే వధింపంబడి
యుండుసైనికులలో మిగులవృద్ధుండును బ్రహ్మపుత్రుండైన జాంబవంతుడు
చల్లారిపోవు వహ్నిచందంబున పడియుండ నతనినివెదకి సమీపంబునకరిగి
పూజ్యుడా! దైత్యసుతుని కరకుటమ్ములధాటకోర్చి ప్రాణములతో జీవితుండవై
యుంటివాయని విభీషణుడడుగ విని జాంబవంతుడు మిగులప్రయాసతో
యెలుంగెత్తి యతనితోలిట్లనియె.

చ. దనుజకులోత్తమా వినుము తావకకంఠరవంబువిన్కిడిన్
నినుగురుతింపగల్గితిని నేనతిభీషణ సాయకావళిన్
ఘనతర పీడనొంది నిను గన్గొననేరకయుంటి మిత్రమా
మన పవమాననందనుడు మందక జీవముతోడ నుండెనే.

వ. అనవుడు విభీషణుండిట్లనియె మహాత్మా! రామలక్ష్మణులను, సుగ్రీవాంగద
ప్రముఖుల విచారింపక వాయుపుత్రుని విచారించుచుంటివేలయన జాంబవంతుం
డిట్లనియె. దైత్యనాథా వినుము హనుమంతుండు జీవించియున్నచో మనసేన
లెల్ల హతంబయ్యును జీవించినట్లయగు వాయునందనుడు జీవింపడేని మన
సేనలు జీవించియుండియు మృతినొందినట్లెయగు గావున వాయుభట్టారకునితో
సమానుడగు హనుమంతుని విచారించి వెదకుండనుటయు హనుమంతుడు
జాంబవంతుని పాదంబులకెరగి నిజనామంబుగ్గడించిన జాంబవంతుండును
దుఃఖించి మరల మాతృగర్భంబునుండి వెలువడినవిధంబున భావించి
వాయుపుత్రునితో నిట్లనియె.

ఆ. అనిలతనూజ నేఁడుమన కాపద యిట్లుఘటిల్లెఁగాంచితే
వనచరవీరులెల్ల నిలపైబడియుండిరి రామలక్ష్మణుల్
ఒనువగకైరి నేనలతిభీతివహించిరి నీవెమాకుది
క్కనఘ సముద్ధరింప ప్రబలాపదబంధుఁడ వట్లుగావునన్.

చ. శ్రమయనుచున్ దలంపక లసద్గరుడానిల వేగమూర్తివై
హిమగిరిమధ్య హేమరుచులీనెడు పెన్ వృషభాద్రిపొంతకుం
గ్రమమున నేగుమయ్యెడ ధగద్ధగదీప్తుల దిక్తటంబులం
దిమిరము వాయ వెల్గును ధృతింగనిపెట్టుము యోషధీలతన్.

గీ. అమ్మహౌషధిగిరి శిఖరాగ్రసీమ బహువిధమహౌషధుల్ గల్గి వరలునందు
దివ్యకాంతులతో దశదిశలుమిగుల వెలుగఁజేయుచు నోషధులలరుసూవె.

వ. సంజీవకరణి సావర్ణ్యకరణి విశల్యకరణి సంధానకరణి యనుపేర ప్రసిద్ధంబులైన యోషధులనెదకి

క. వానిని గొని తెచ్చివడిన్ వానరసైనికుల నధిక వాత్సల్యమునం
బ్రాణములనొసగి బ్రోవుము దీనతగృశియించు మాకుదిక్కగు మనఘా.

వ. అని ప్రబోధించుటయు హనుమంతుండత్యంతోత్సాహంబున బొంగి యిష్టదేవత యగు శ్రీరాముని మనసాధ్యానించి నమస్కరించి మహాసర్పంబుపగిది నొప్పు వాలంబును ఝుళిపించుచు నభ్రపదంబునకెగసి ధనుర్విముక్త శరంబుచందంబున మహాత్తరధ్వనితోజని

ఉ. కాంచె సమస్తభూధవుఁడు కట్టెదుటన్ ఋషభాద్రిశైలముం
గాంచన రత్నధాతుచయ కాంతిదిశాలము కందరాంతర
ప్రాంచదుదంతనిర్ఝర తటాంతర సంచలితోగ్ర సాలముం
జంచలసత్తిరస్కృత లసల్లతికానతికాలవాలమున్.

వ. అంత హనుమంతుం డప్పర్వతశిఖరమున నగ్నిజ్వాలపగిదినొప్పు జ్యోతిర్లతాదులతో నొప్పియుండుటవలన గనుంగొని విస్మితుండై అందందుసంచరించుచు విశల్యకరణి మొదలగు యోషధుల వెదకిన నమ్మహౌషధులు తమ్మతడు గొంపోవునను భయంబున మఱుఁగుపడి గోచరింపకున్న కోపించి మరున్నందనుండ ప్పర్వతోత్తమంబుతో నిట్లనియె.

ఉ. అద్దిర శ్రీరఘూత్తముని యందుదయారస మింతలేదె నీ
యొద్దకువచ్చి వేడినను యోషధులేమియు జూపవౌర నీ
పెద్దరికంబు జూడనిక బెంకితనంబును మానకుంటివా
గ్రుద్దుకు బ్రద్దలయ్యెదవు గోత్రవరేణ్య యెఱుంగుమామదిన్.

మ అని రోషోద్ధతి బల్కుచుం బవనజుం డయ్యద్రిరాట్ఛృంగమున్
ఘనదోశ్శక్తి పెకల్చి బంతికరణిం గై దండగీలించి యున్
వినువీథిన్ విబుధోత్తముల్ వినుతిగావింపన్ దిశేశద్యుతిన్
జనుదెంచెం బవమానవేగమున నాశ్చర్యంబు సంధిల్లగన్

వ. అంత తత్పర్వతశృంగమందుగల యోషధీపరిమళ మాఘ్రాణించుమాత్రమున వానరులెల్లరు జీవించి నిదురనుండి మేల్కాంచిన విధంబున లేచి వాయునందను నెదుర్కొని సింహనాదంబులొనరించుటయు హనుమంతుండంతయు సంచరించె పిమ్మట త్రికూటశిఖరమున దిగి ప్రముఖులగు వానరులకు నమస్కరించి విభీషణు నాలింగనంబొనరించె నంత శ్రీరామలక్ష్మణులు తక్కినవానరులు తద్దివ్యౌషధీలతల నాఘ్రాణించ యుద్ధరంగమున నెనసిన వ్రణబాధలెల్ల తొలగి సౌఖ్యంబున బొదలిరి. రణప్రారంభమునుండియు హతులగు రాక్షసుల కళేబరంబులెల్ల నిజమానరక్షణార్థము రావణునియాజ్ఞానుసారమున సముద్రంబున బడద్రోయుచుండి రక్కారణంబున రక్షోవీరులు పునర్జీవితులగుట కవకాశము గలుగదయ్యె యనంతరంబ తదీయపర్వతశృంగంబును హనుమంతుండు హిమవంతంబున నెప్పటిచోట నుంచివచ్చి శ్రీరాముని సన్నిధానముననిలిచె నంత సుగ్రీవుడు హనుమంతునితో నిట్లనియె.

—: సుగ్రీవుడు లంకదహింప వానరుల కాజ్ఞ సేయుట :—

ఉ. చచ్చెను కుంభకర్ణుడు నిశాచరనాథునిపుత్రులాజిలో
జచ్చిరి రావణుండెపుడు సంగరభూమికిరాకదక్కె నే
డిచ్చ మెయిం బ్లవంగవరులెల్ల రలాతములూని లంకలో
జొచ్చి పురంబు నల్గడల సూరెలజిచ్చిడి రందుహొండనన్.

వ. తదాజ్ఞానుసారమున సూర్యాస్తమయమగుటయు వానర భల్లూకవీరులు హస్తంబుల కొరవులందాల్చి లంకాపట్టణముపైగవిసి రక్కసమూకల తరిమి తరిమి ప్రహరించుచు మహాశౌర్యోద్రేకమున విజృంభించి

సీ. రాజమందిరముల రమ్యహర్మ్యంబుల ప్రాసాదముల సౌధభాగములను
సూతికాగృహముల శుద్ధాంతసీమల ప్రాకారముల దివ్యభవనములను
పానీయశాలల బహుచిత్రశాలల మదిరాగృహంబుల మంటపముల
పఠనమందిరముల పసులకొట్టంబుల నాట్యరంగముల నానాగృహముల
నాయుధాగారముల వివిధాపణముల సందుగొందుల దేవపూజాగృహముల
యజ్ఞశాలల రచ్చల నన్నిచోట్ల వహ్నిదరికొల్పి రధికదుర్వారలీల.

వ. అమ్మహానలం బంతకంతకు పెచ్చుపెరిగి జాజ్వల్యమానంబుగా నాకసంబంట పెనుమంటలు నగరమున నలుకెలంకులవాపించి

గీ. అధికభీషణముగ నగ్నికీలలుబర్వి దైత్యరాట్పురవతంస మెల్ల
దగ్ధమయ్యె సకలదానవానీక మత్యంతదుఃఖ వీచికాత్ములైరి.

వ. ఇల్లు దహింపంబడు లంకాపట్టణము జ్యోతిర్లతాదులచే ప్రకాశించు హిమగిరీంద్రంబుచాడ్పున చకచకాపూచిన కింశకవనంబట్లు ప్రకాశించె తదీయాగ్నిజ్వాల ప్రతిఫలించుసముద్రము రక్తజలార్ణవమట్లు గన్పట్టుచుండె నట్టిసందర్భమున శ్రీరామలక్ష్మణులు క్రమ్మఱ ధనుర్ధారులై ధనుష్టంకారము లొనర్చుచుండి రాసమయమున

గీ. రామవిభుకోదండీక్షణశరాసనంబు నిజశరాసనమువంచు గూర్చి కైలాసగిరి శి
ఖరివిధంబునఁనొప్పు లంకాపురాగ్ర గోపురము బ్రద్దలై ధాత్రి గూలనేసె.

—: కుంభ నికుంభాది రాక్షసుల యుద్ధము :—

వ. తదనంతరంబ రావణుప్రేరితులై కుంభకర్ణపుత్రులగు కుంభనికుంభులును యూపాక్ష శోణితాక్ష ప్రజంఘు కంపనప్రముఖ రాక్షసవీరులు తలపడిన సంగరమందు మిగుల నుత్సాహముతో కంపనునిపై కురవడించిన

మంజరి :

కంపనుడంగదునిఁజేరి కోపముగదుర బట్టిప్రహరించెం
దెంపున నాప్రేటుకంగదుండును దిమ్మరపోయి చలించెం
దెలివొంది గిరీంద్రశిఖరముంగొని తేజమెసగనంగదుడు
బలిమింబొడుచుటయు నొచ్చి ధరణింబడియెనంత కంపనుడు.

వ. పిమ్మట శోణితాక్షుడు తీక్ష్ణశరంబొండుగొని మోదిన నతండాశోణితాక్షుని ధనువును రథంబును నాశమొందించె నింతలో యూపాక్ష ప్రజంఘు లురవడించి అంగదుబొదివిన మైందద్వివిదులతనికి సహాయులై నిలిచిన వా ముగ్గురు వానరులతో ముగ్గురురక్కసులకు రోమహర్షణంబైన రణంబు ప్రవర్తిల్లె నప్పుడంగదుడు ప్రజంఘుని శిరంబును భయంకరముష్టిఘాతంబున బొడువ వాడుహతుండైపడియె నంతలో మైందుడరచేతితో యూపాక్షుని పతిల్లున బ్రహరించె. వీర్యవంతుండైన ద్వివిదుండు నఖంబుల శోణితాక్షుని ముఖంబును బ్రద్దలుగాజీల్చి భూతలంబున బడవైచె మైందుడు యూపాక్షుని గట్టిగాబట్టి నేలపైబడగొట్టి చంపె నంత నికుంభుడతనిపైకురవడింప అంగదుం డడ్డమువచ్చి కదిసిన నాయిరువురకు ఘోరంబైన రణంబయ్యె నంత కుంభుడు తీక్షణశిలీముఖంబుల నంగదుగట్టిగా మోదిన నంగదుండరచుచు మూర్ఛిల్లె నదిగని యావార్తకొందరువానరులు శ్రీరామునకెరింగింప తదాజ్ఞానుసారమున జాంబవత్ప్రముఖులతనింజుట్టుముట్టిన ఘోరుఘోరంబయ్యె నంతసుగ్రీవు డతని చేతినుండి ధనువులాగి రెండుగావిరచె నంతనాయిర్వురు ద్వంద్వయుద్ధమునకు తలపడి మదపుటేనుగుల విధంబున పోరునెడ సుగ్రీవుడు హఠాత్తుగా వానిన త్తి సముద్రములోవిసరివైచె నంతనాకుంభుడు సముద్రమధ్యమందలి పర్వతంబుపగిది గుభాలునగూలి వాడందుండివెడలి మింటికెగసి రివ్వున నేతెంచి సుగ్రీవుని వజ్రసమానంబగు ముష్టిప్రహారంబున పొడిచిన వానరేంద్రుని శరీరముపై చర్మముబ్రద్దలై రక్తప్రవాహము బయల్వెడలె నయ్యవసరంబున

ఉ. అంతట భానుసూనుడు సహస్రమయూఖు నిభోగ్రముష్టిచే
నెంతయు కోపఘూర్ణిత దురీక్షణుడై రయమార కుంభు బా
హ్వాంతరసీమ గాఢముగ నట్టిపతిల్లున మోద దైత్యుడున్
వింతగగూలిచచ్చె కపివీరులు సంతసమందియార్వగన్.

వ. ఇట్లు సుగ్రీవునిచే కుంభుడు హతుండగుటయు వానిసోదరుడగు నికుంభుడు కోపోద్రేకమున సుగ్రీవుని చురచురంజూచుచు

సీ. పుష్పమాలలచేత బొలుపుజూపెడిదాని నద్రిరాజముభంగి నలరుదాని
సురుచిరబహురత్న శోభితంబగుదాని కనకపట్టంబులు గలుగుదాని
యమదండముటుల భయంకరంబగుదాని పలలాశనులభీతి బాపుదాని
చందనకుంకుమాచ్ఛాదితంబగుదాని నఖిలాయుధోత్తంబైనదాని

నధికభారముగల పరిఘాయుధమును ద్రిప్పుచు నికుంభుడతులిత దివ్యరత్న
హార కేయూర కుండలాద్యఖిల భూషణాంబరాలంకృతులతోడ ననికివచ్చె.

వ. దుస్సహుండైన నికుంభుని గనుంగొని వానరరాక్షసులు నిశ్చలులై నిల్చియుండి
రాసమయంబున శౌర్యవంతుండైన హనుమంతుండు రొమ్ము విరుచుకునివచ్చి
వానిపురోభాగంబుననిల్చె నపుడు

మంజరి :

పరిఘాయుధమెత్తి తన్నికుంభుడు పావనిపృథువక్షమునన్
సరగున గిరుమని ద్రిప్పివైచెన్ చలమున భుజశౌర్యమునన్
పవనజుపృథువక్షసీమబడి తత్పరిఘాయుధ మొకతృటిలో
భువిగూలెన్ విరిగితునకలై నిప్పుకణుకులట్టులనిలోన్.

క. భూకంపంబొదవెఖతరి నాకంపించు గిరిపోల్కి హనుమంతుండా
భీకర పరిఘాయుధహతి నాకంపితుడయ్యె నిమునమత్యధికముగన్.

మత్తకోకిల :

అంతనయ్యనిలాత్మజుం డధికాగ్రహంబున మించి క
ల్పాంతకాకృతితోడ దీప్తమహోశనిప్రతిమానమై
యెంతయున్ దగుముష్టిబంధమునెత్తిబట్టి నికుంభు బా
హ్వాంతరంబున నీడ్చిగుద్దిన నట్టివిహ్వలితాత్ముడై.

వ. అంత నికుంభుండు వక్షస్థలంబుబ్రద్దలై రక్తవాహిని వెడలుటయు వాడెంతయు
సంచలితహృదయుండై యించుకసేపు శ్రమవాపుకుని క్రమ్మఱ హనుమంతునిపై
కురవడించి గట్టిగాపట్టుకొని లంకానగరములోనికి నీడ్చుకొనిపోవుచుండ
రాక్షసులు సింహగర్జనంబులునేయుచుండి రట్టియెడ హనుమ వానిచేతులనుండి
తప్పించుకొని పిడికిటితో గాఢముగా నికుంభువక్షస్థలంబున నొక్కపోటుబొడిచి
నిజబాహుద్వయంబున వానినిగట్టిగాబట్టి

ఉ. నేలకుగొట్టి బిట్టదిమి నిష్ఠురమూ పెనుముష్టిచేత నా
పాలసు కుమ్మికుమ్మి బహుభంగుల పిండియొనర్చి వెండియుక్
వైళమ మింటిపైకెగసి వానిపయింబడి లాఘవంబునన్
కేలశిరంబుబట్టి పెనుకిన్క పటిల్లున ద్రుంచియార్చినన్.

—: మకరాక్షుని యుద్ధము :—

వ. హతశేషులైన రాక్షసులవలన తద్వృత్తాంతంబెరింగి రావణుండు సహింపరాని కోపమున ఖరపుత్రుండైన మకరాక్షుని యుద్ధార్థమాజ్ఞాపింప వాడత్యుత్తమం బగు రథమధిష్టించి చతురంగసైన్యములతో బయల్వెడలి వచ్చుటగనుంగొని వానరవాహిని రణోత్సాహమున పైకెగురుచు నఖదంత శిలాపాదపాద్యాయుధంబులతో గదిసి పరస్పర జయేచ్ఛల విజృంభించి పోరునెడ దేవదానవ యుద్ధము ననుకరించె నాసమయంబున మకరాక్షుఁడు వారల లక్ష్యపెట్టక హుటాహుటి శ్రీరామునిపై కురవడించి యిట్లనియె.

సీ. నిలునిలు రామ నీ బలోన్నతిగాంతు తొలగకు బలిజేతు నిలకునిన్ను
తెలియగల్గుదువు మద్భలశౌర్యసంపద నాయోధన మొనర్పు నరుగుదెమ్ము
భిదురోపమాన మత్ప్రదరసంతతికి నీప్రాణవాయువుల నర్పణమొనర్తు
మునునాజనకు ప్రాణములగొంటివనివింటి సాకంటబడితి విన్నాళ్ళకిపుడు
నినుగనుంగొనినంత నాతనువునుండి నట్టిమంటలువెడలె పేరాకటికిన్ను
గాళిపైనడతెంచు సింహంబుకరణి బేర్చి నీపనినాకసి దీర్చుకొందు.

వ. అంత వానిదుష్ప్రసంగములకు శ్రీరాముఁడు నవ్వుచు మకరాక్షుతో నిట్లనియె.

ఉ. ఎందుకు ప్రేలెదాలమున నిట్టిప్రగల్భదురుక్తులన్ జయం
బందెదవే చతుర్దశసహస్ర నిశాటుల దండకాటవిన్
ద్రుంచగజేసినాడ వినుమా పిశితాశన నీదుమాంస మా
నందముగాభుజించు కదనస్థలి జంబుక కాకగృధ్రముల్.

మంజరి :

అనుచున్ శ్రీరామచంద్రుడన మకరాక్షుండతి రోషమునం
గనుగవ కెంపడర వైచెనమ్ముల కౌసల్యాసుతుమేనన్
శ్రీరఘుపతి వానినెల్ల నడుమన్ ఛేదించెన్ శౌర్యమునన్
వారిరువురు పోరిరిట్లు తమతమ పరాక్రమానుగుణమునన్.

వ. వారిరువురి ధనుర్గుణంబులు మేఘగర్జనంబుల ననుకరించె పరస్పర ప్రయుక్త మార్గణంబు లొండొంటిదాకి ప్రతిహతంబులగుచుండ

గీ. రామచంద్రుండు రోషసంరక్త నయనుడగుచు పదునెనిమిది నిశితాంబకముల
తోడ మకరాక్షు ధనువును దునిమియతని సారథిని జక్కడచె
బాహుశక్తి మెరయ.

99]

కవిరాజవిరాజితము :

విలసదమోఘ శరావళిచే రఘువీరుడుతన్మకరాక్షు హయం
బులనిలగూల్చి రథంబును ముక్కలుముక్కలుగా తెగగొట్టిన నా
వలలభుజుండును నేలకుదాటి జవంబున భీషణశూలము నొ
డల రఘురాముని పైనడరించిన నాతడుద్రుంచె శరత్రయిచేన్.

చ. తళతళలాడుచున్ మెరయుదైత్యునిశీలము తున్గినిప్పుకల్
జలజలరాలె నంత దివిసర్వసుపర్వులు రామచంద్రునిన్
భళిభళి మేలుమేలనుచు బ్రస్తుతిసేయచ దైత్యుడంతటన్
నిలునిలుమంచు పైగవిసె నిష్ఠురముష్టివెలుంగ నుద్ధతిన్.

ఉ. శ్రీరాముండదిగాంచి వేనగవుతో శీఘ్రంబునన్ వింట దు
ర్వారాగ్నేయ మహాస్త్రమున్ దొడిగి వైవన్ దైత్యవీరుం డస్రు
గ్ధారల్ గార యురమ్ముఁ వ్రస్సి హతుడై ధాత్రీస్థలింగూలినం
బారెన్ దానవసేనవిచ్చి భయసంభ్రాంతాత్ములై వీటికిన్.

—: ఇంద్రజిత్తు యుద్ధము :—

వ. ఇట్లు మకరాక్షుడు హతుండయిన వార్తనువిని రావణుండు కటకటంబడి పండ్లు పటపట గొరుకుచు మిగుల క్రోధావేశంబున నింద్రజిత్తునురావించి సమరంబున కాజ్ఞనొసంగి వెండియునిట్లనియె.

మంజరి :

రామలక్ష్మణులను పోరద్రుంచి రాగదవయ్యకుమారా
భీమపరాక్రముడవీవు నీసరివీరులెవరు రణశూరా
వినుమప్రతిమాన కర్ముడగు సురవిభుని జయించినవీవు
మనుజమాత్రుల వధించుట నీకణుమాత్రము నిర్జించుటకున్.

వ. అని శ్లాఘించుటయు తదాజ్ఞానుసారమున నింద్రజిత్తు సముత్సాహంబున తక్షణంబ

సీ. అతులిత రక్తమాల్యాంబరానులదాల్చి యజ్ఞవేదికలో నగ్నినుంచి
శస్త్రముల్ కుశపరి స్తరణంబుగావించి తగవిభీతక సమిధలనమర్చి
శ్యామాయసస్రువంబు గల్పించి విధిపూర్వకముగ నాహుతుల జక్కగనొనర్చి

మిక్కిలినల్లని మేకకుత్తుకఁగోసి శరమమ్మహానల శిఖల వ్రేల్చి
సమిధలొకసారి హోమంబు సలుపనందు ధూమరహితమహార్చులఁ దోఁచెనతని
విజయసూచక చిహ్నముల్ వివిధగతుల స్వయముగఁ పరిగ్రహించె
హవ్యమునువహ్ని.

వ. తదనంతరంబ యింద్రజిత్తు దైత్య దానవ రాక్షసవీరులనెల్ల సంతృప్తులఁగావించి యుద్ధసన్నద్ధుండై

సీ. తగనుగ్రగతుల నంతర్ధానమగుదాని హయచతుష్టయముతో నలరుదాని
శరశరాసనముఖ్య సాధనంబులదాని చిత్రకాంతులతోడ జెలగుదాని
నిరుపమవైడూర్య నిర్మితమగు మేటియుజ్జ్వలధ్వజముతో నొప్పుదాని
నవరత్నఖచితమై నలువుజూపెడుదాని మంజులాలంకార మహిమదాని
దివి భువి దిగంతముల మించితిరుగుదాని ఘంటికాశత సంపూర్తిఁ గ్రాలుదాని
నెక్కెసుందరమగు రథంబింద్రజిత్తు శత్రుహరణమహోత్సాహలీల.

గీ. కపట ఋషివేషములదాల్చి కానదిరుగు రామలక్ష్మణులను రణరంగమందు
జంపి కపులవధించి మజ్జనకునకును విజయమొనగూర్తు ననిబయల్వెడలివచ్చె.

శా. దైత్యేయుండటు లంతరిక్షమున నంతర్ధానుడై ఘోరని
ర్ఘాతధ్వాన మధఃకరించు గుణసంరావంబు గావించుచుం
జాతుర్యంబుగ రామలక్ష్మణులపై శస్త్రాస్త్రవర్షంబు జీ
మూతంబట్లతిభీషణంబుగ వడిన్ మున్నాడి వర్షించినన్.

వ. రామలక్ష్మణులు తదీయ శరపరంపరాసార పీడితులై సూర్యసంకాశంబులైన శరపరంపరల వియత్పథంబున దృశ్యాదృశ్య రూపంబున సంచరించు యింద్రజిత్తుపై ప్రయోగించుచుండి రిట్లుబలదర్పంబుల బెనంగు రామలక్ష్మణుల శరీరంబులు గ క్తసిక్తంబులైన క్రోధమినుమడింప తమపైకగుదెంచు బాణములకు సూటిగా మిగులవాడిగల బాణముల ప్రయోగించిన నవిపక్షములతోనెగురు పక్షులనలె తారాపథంబంటి యదృశ్యరూపుండగు యింద్రజిచ్ఛరీరంబును వ్రణమండలంబొనర్చె నిట్లు చిత్రముగా బోరాడుచుండు సమయమున

మ. ఒకచోఁగన్పడు నొక్కచోనడరు వేరొక్కస్థలంబందు హా
యకవృష్టిం గురిపించు నొక్కయెడ మాయంబన్ను వేరొక్కచోఁ
బ్రకటించున్ నిజశౌర్యవీర్యగరిమప్రాశస్త్య మీతీరునన్
గికురించున్ విమద్విరోధి భుజశక్తిం బెక్కుమార్గంబులన్.

గీ. సజలజీమూతసంఛన్నసమయమందు భానుబింబంబు గానరింపని విధమున
యింద్రజిద్రూప గమవాను లించుకేని గనుగొనగజాలరైరి సంగ్రామభూమి

వ. అంత నయ్యింద్రజిత్తుచే తాడితులైన వేనవేలువనచరులు గతాసులై నేలపై బడియుండి రదిగనుంగొని లక్ష్మణుండత్యంత క్రోధవశంబున రాక్షసవధార్థముగా బ్రహ్మాస్త్రమును ప్రయోగింపబోవ శ్రీరాముండిట్లనియె యొక్కని నిమిత్తముగా లోకమందున్న రాక్షసులవధించుట యుక్తముగాదెట్లన

గీ. యుద్ధవిరహితు ప్రచ్ఛన్ను యోడిపరుగువారు వాని ప్రమత్తుని భయముతోడ నంజలిఘటించువానిని సమరజగతి శరణు వేడినవానిని జంపదగదు.

మంజరి :

అదృశ్యరథు నధికనీచు బహుమాయావిను నీదైతేయుం
బ్రదీప్త సర్పోపమాన దివ్యాంబకముల దునుమగవలయున్.

ఉ. వీడు రసాతలంబునకు వేజనినన్ వినువీధి కేగినన్
పోడిముదక్కి దిక్కులకుబోయిన స్వర్గమునందు దాగినన్
వేడబముల్ వహించినను విశ్వములోన నడంగినన్ గమన్
వాడిమిగల్గు మద్విశిఖ వహ్నిశిఖావళి మ్రగ్గిచావడే.

—: ఇంద్రజిత్తు మాయసీతను గొనివచ్చుట :—

వ. అనినుమవుచు శ్రీరాముడు పాపియగు యింద్రజిత్తును వధింపనిరీక్షించుచుండె నింతలో వాడును శ్రీరామునిబారినుండి తప్పుకొని త్వరితగమనంబున లంక జొచ్చి మాయామయంబైన సీతనొక్కర్తును సృజించి రథమందుంచుకొని పశ్చిమద్వారమందుండి దైత్యచమూసమేతుండై బయల్వెడలివచ్చి రామ లక్ష్మణుల వారిసైన్యముల మోసగించి జయించు కుతూహలంబున వారల కభిముఖుండై యేతెంచుటయు

క. వనచరులు క్రోధవశమున పెనుగిరి శిఖరములబూని పెనగెడుకోర్కెన్
వినువీధికెగసిరంతట హనుమత్కపి ముందుజనె మహాశైలముతోన్.

—: ఇంద్రజిత్తు మాయసీతను నరకుట :—

వ. ఇట్లు యుద్ధసన్నద్ధులైయరిగి పురోభాగంబున

సీ. జానకికెనవచ్చు మానినీమణిని గాంచెమరుత్సుతుం డింద్రజిద్రథమున
వనశనకృశ బహుళాయాసనిశ్శ్వాస స్థిరరజోధ్వస్త కౌశేయవాస
నిరతనిస్సంస్కారనీలకుంతలభార ప్రబలదుఃఖాకుల భాష్పపూర
నత్యంతదీన భయాపన్న సదన నిజప్రాణనాథసంస్మరణవదన
నతిభయాకులితేంద్రియుండై ముహూర్తకాల మటనిల్చిచూచి
మున్నశోకవనంబున గన్నవాడుగాన జానకిగానెంచె మానసమున.

వ. హనుమంతుడు యీమెసీతయేయని నిశ్చయించి కన్నీరువిడుచుచు దుఃఖించి వీడీమెనిందుల కెందునిమిత్తము గొనితెచ్చెనని యోచించుచు వనచరవీరులతో గలసివానినితరిమిన

గీ. ఇంద్రజిత్తు రోషమెనసి తత్కపివరుల్ గాంచుచుండ మేటిఖడ్గధార
రామరామయనుచు ప్రలపించు తద్వధూ కంఠమవుడు నతికె కరుణలేక.

వ. ఇట్లు మాయాసీత శిరోజములుబట్టి నిర్దయుండై దుర్మార్గమున కోడిగట్టిన దైత్యునిగనుంగొని యోర్వక హనుమంతుండిట్లనియె.

సీ. సాధ్వీమతల్లి యూ జనకరాట్సుత గొప్ప పట్టితివేల దుష్పాపశీల
నీనాశనమునకే నెలతనివ్విధమున హత్యజేసితివి దయావిహీన
యిదితగదంచు నీహృదయము దెరుగవే సిగ్గులేదేర ఛీఛీదురాత్మ
పైపెచ్చు ధాత్రిపై బ్రహ్మర్షి కులమున ప్రభవించి నీచునిపగిదిమెలగ
కాల్పనే నీదుజన్మ మూర్ఖా వధార్హుడవు నిముసమాత్రమైన నీవవనిబ్రతుక
తగవు నాకంటబడితివి తప్పదిపుడె ఘోరనరకార్ణవంబున గూలెదసుర.

వ. అనితూలనాడుచు మిగులక్రోధావేశంబున వానరసైన్యసమేతుండై హనుమంతుం డింద్రజిత్తుపై కురవడించిన నతడుమిగుల క్రూరనారాచంబుల వానరులనెల్ల ననేకవిధంబుల గలచి హనుమంతునితో నిట్లనియె.

ఉ. ఏవనితాలలామకొర కీవును రాముడు లక్ష్మణుండు సు
గ్రీవుడు మున్నుగాగలుగు కీశవరేణ్యులు వచ్చియుంటి ర
ద్దేవిని నీవుగన్గొన వధించితి నంతియకాదు రాము సు
గ్రీవు విభీషణుం నినుమజీ కపిసేనలతోడ గూల్చెదన్.

గీ. స్త్రీలవధియింప తగదంచు జెప్పుచుంటి వదియుపరికాదు వినుమేలననగ శాత్రి
వావళికి దుఃఖ మొదవించు నట్టిసర్వ కార్యము లొనర్పదగును లోకమునవింటె.

వ. ఇట్లుపలుక హనుమంతుడువిని దుఃఖంచి క్రోధోద్రేకముచ నొకగండోపలంబెత్తి యింద్రజిత్తు రథంబుపై విసర దానినింగనుంగొని సారధి రథంబును తొలగం ద్రోలె తత్కారణంబున నది నిరర్థకంబై చనియె. పదంపడి యింద్రజిత్తు వానరుల బహుప్రకారముల వధించుచుండె నయ్యవసరంబున హనుమంతుండు వానరులతో నిట్లనియె.

క. జనకజనిమిత్తమై మన మనిసేయుచునుంటి మట్టిజానకి మడిసెన్
కనుక రఘురామునకు నిదివినిపించి తదాజ్ఞ నెరప వెడలెద మటపై.

వ. అనివార్కుచ్చి వానరులెల్లర మరల్చుకొని హనుమంతుడు శ్రీరాముని సన్నిధానమునకరుగుటయు నింతలో నింద్రజిత్తు నికుంభిలా హోమకార్యార్థ ముగా నికుంభిలాక్షేత్రమునకరిగి

సీ. యజ్ఞవేదికలోన ననలంబుదరికొల్పి యెంతయుశ్రద్ధతో నింద్రజిత్తు
మున్నొనర్చినభంగి గ్రన్నన విధివిధానముగ హోమంబు నొనర్చునంత
సంపూర్ణరక్త మాంసములచే దృప్తుడై జ్వాలలతో నిండిపావకుండు
సంధ్యాసమయ సూర్యసదృశుడై వెలుగొందె నసురవర్గమున నయానయజ్ఞు
లైన పెద్దలు చక్కగా నరయుచుండ కడుభయంకరముగ హోమకార్యమివ్వి
ధమున నడచుచునుండె నత్తరుణమందు జాంబవంతున కిటులదాశరథిబలికె.

వ. సౌమ్యుడా! నేడు హనుమంతుడు దుస్సాధ్యంబగు కర్మనాచరించుచున్నవాడు నీవాతనికి సహాయముగా నరుగవలయు ననవు డతండు సైన్యసమేతముగా జన నుంకించునంత పావనియు సైన్యయుక్తముగా విషణ్ణవదనుండై వచ్చుట గనుంగొనుచుండి రంత హనుమంతుడు శ్రీరాముని సముఖమున కేతెంచి యిట్లనియె.

మంజరి :

కదనరంగమందున మేమెల్లన్ గనుగొనుచుండగ రామా
అదయుండై యింద్రజిత్తు సీతను హతమొనర్చె శుభనామా
ఆమెనుగని భ్రాంతితోడ మరిబహుళాశ్రితితోడ మీకడకున్
మేమరుదెంచితిమి యయ్యుదంతము మీకువిన్నవించుటకున్.

చ. అనవిని శ్రీరఘూత్తముడు హాహృదయేశ్వరి యెంతవచ్చెనే
యనివిలపించుచున్ మిగుల నార్తి ధరన్ పెనుమూర్ఛ వ్రాలినం
గనుగొని సర్వవానరులు గ్రక్కున రామునిచెంతజేరి మె
ల్లన వివిధోపచారముల లాలనజేసిరి దీనచిత్తులై.

వ. అట్టియెడ సౌమిత్రియు మిగులవగచి రామచంద్రుని బాహుయుగంబును గట్టిగాపట్టుకొని యిట్లనియె. రామా ధర్మాత్ముడవని లోకమున బ్రసిద్ధిజెందిన నీకిట్టివిపత్తు సంభవించుచుండ ధర్మమువలని ఫలము నిరర్థకంబని తోచుచున్నది యెట్లన అధర్మపరులకు సౌఖ్యమును ధర్మపరులకు దుఃఖమును గలుగుచో ధర్మమువలని లాభముశూన్యమని తలంచెద నందుచే ధర్మమునకంటె పౌరుషమే ప్రధానమని నానిశ్చయము యిప్పుడు మనకిట్టి దుఃఖమును కలిగించిన యింద్రజిత్తును నిముషమాత్రమున వధించి దుఃఖోపశమన మొనరించెద పాపరహితుడా మీకు సర్వవిధముల హితంబొనరింప జనించిన నేను సీతనువధించుట గనుంగొని యూరకుందునే నిఖిల భోగభాగ్యయుక్తంబైన యీలంక యీక్షణంబ నిర్మూలించెదనని వచింపుచుండ విభీషణుండే తెంచి చింతాభారమున గృశించు రామలక్ష్మణుల గనుంగొని యిదియేమని యడుగ కన్నీరువిడుచుచు లక్ష్మణుండిట్లనియె.

గీ. సౌమ్యుడా యింద్రజిత్తు రోషమున జనకతనయనువధించెనని మరుత్తనయుడనగ
విని రఘూత్తము డార్తితో వివశుడగుచు వసుధపై నిట్టుమూర్ఛిల్లి వ్రాలెవింటె.

వ. అనివివరించిన విభీషణుడు లక్ష్మణునితో నిట్లనియె.

సీ. విజ్ఞాపనంబొండు వినుడు మహాశయా సావధానముగ మదాశయమును
భావంబులందిట్లు భ్రమజెందనేటికి యింద్రజిన్మాయా మహిమకృతమున
కల్పించెనిది దశకంఠునితలపు మీరెరుగరు సీతనుహింసజేయ
నిచ్చగింతడు సర్వమేనెరుంగుదు కామమోహియై వర్తించె మూఢబుద్ధి
నేననేకవిధంబుల నీతిబోధ జేసితిని రామవిభునకు సీతనొసగు
మనుచు నాహితవాక్యంబు లాలకింప డాతడొనరించు మోసకృత్యములుసుమ్ము.

శా. ఆకర్ణింపుడు సావధానముగ మోహావిష్టులై మీరలీ
పాకద్వేషి విరోధికృత్రిమ విధుల్ భావంబున నమ్మకా
దోకశ్యాణగుణాఢ్యులార మదిలో నుత్సాహముల్ మానరే
వైకల్యంబును లేక సీతసుఖయై వర్తిల్లె సత్యంబుగన్.

వ. రామచంద్రా సీతకు ప్రాణోపద్రవము గలిగెనను సందేహమువలదు ఆమె సుఖస్థితిగానున్నది ప్రకృతము మనము నిర్వహించివలసిన ముఖ్యమైన విషయ మొకటిగలదు యేమన

సీ. చిత్తగింపుము యింద్రజిత్తు సమస్త మర్కటులకు మోహంబుగలుగజేసి
తివిరి నికుంభిలా దేవాలయంబున హోమకార్య మొనర్ప నుద్యమించె
నిర్విఘ్నముగ నదినెరవేరెనేని శక్రసమేతముగ సురౌఘమునకైన
సమరమందాతని జంపసాధ్యముగాదు కావున నదిపూర్తికాకమున్న
సైన్యయుక్తముగా మేముచని తదీయహోమమును విఘ్నమొనరింతు ముచితరీతి
నీకునిపాకరణముగ జనించియున్న ప్రబలదుఃఖంబు మానుము పార్థివేంద్ర.

—: ఇంద్రజిత్తుచేయు నికుంభిలాహోమభంగము :—

వ. రామచంద్రా లక్ష్మణునితో నేనును సైన్యసమేతుండనై నికుంభిలాయాగ భంగంబొనరించుచుండ యింద్రజిత్తును లక్ష్మణుడు వధింపగలడు వాడు హతుండగునేని రావణుడు స్నేహకోటితో హతుండయ్యెనని తలంపుము అని పలుక శ్రీరాముడు ధైర్యమును వహించి విభీషణునితో నిట్లనియె.

ఉ. ఓయినిశాచరోత్తమ మహోగ్ర భయంకరుడైన శక్రజి
న్మాయలు నాకుసర్వము క్రమంబున గోచరమయ్యె వాయుప్ర
జ్ఞాయుతు డత్యుదగ్రబల శౌర్యగరిష్ఠుడు బ్రాహ్మణాస్త్ర వి
జ్ఞేయుడు పాశహస్త సురసేనల మూర్ఛలముంచు నాజిలోన్.

వ. అనిసంభాషించి లక్ష్మణుని చేరంజీరి యిట్లనియె.

శా. సౌమిత్రీ తడవేలనింక కపిరాట్సంపూర్ణ సైన్యంబుతో
శ్రీమంతుండగు వాయుసూనుని మహాసేనా సమూహంబుతో
సామర్థ్యంబున నొప్పుఋక్షకులరాట్సైన్యంబుతో నేగినీ
వామాయావిదు సంద్రజిత్తు ననిలో నత్యుగ్రతన్ గెల్వుమా.

వ. లక్ష్మణా! యింద్రజిత్తు కావించు యాగప్రదేశమునకు విభీషణుడు మీవెంట నేతెంచు మీకుజయంబగుగాక పోయిరండన తదాజ్ఞాధారుడు లక్ష్మణుడు ఖడ్గకవచ ధనుస్తూణీరాది సర్వసాధన సమేతుండై శ్రీరామచంద్రునకు ప్రణమిల్లి తదాశీర్వచనములనంది హనుమ జ్జాంబవ ద్విభీషణాంగదాది ప్రముఖ నాయకులగూడి నికుంభిలా క్షేత్రమునకరుగ విభీషణుడు లక్ష్మణునితో నిట్లనియె.

సీ. లక్ష్మణా గాంచుమల్లదె నీలజీమూత సంకాశమగు దైత్యసైన్యసమితి
కపిసేనలెల్ల వృక్షశిలాయుధములూని వారలపై కేగి పోరనలయు
యిమ్మహాదైత్య వాహినుల భేదింపుము సేనలన్నియు విచ్చి చెదరిపోవ
నంతట నింద్రజిత్తగపడు గావున నొనర నికుంభిలాహోమకర్మ
పరిసమాప్తము కాకపూర్వమున నళని సదృశ శరజాలముచ శత్రుసైన్యములను
దరిమివేయుము కడుదప్పు దర్పమెసగ దుష్టుడగు యింద్రజిత్తునుదునుముమిపుడు.

వ. అనిదెలుప లక్ష్మణుడు విభీషణు వచనానుసారమున నింద్రజిత్తుపై శరవర్షంబును గురిపించుచుండె నంత వానర భల్లూకసేనలు నఖదంతాయుధంబులతోడను శిలావృక్ష సముదయంబుతోడను రక్కసులపై గవిసిన నాదైత్యవీరులు భీషణంబులైన ముసల ముద్గర తోమర భిండివాల శూలాద్యాయుధములతో వానరులపై నడరిన నిరువాగులవారికి మిగుల భయానకంబగు సంకులసమరం బయ్యె నాసమయంబున రక్కసిమూకలు విచ్చుచు జచ్చుచు పెక్కు తెరంగుల భీభత్సంబగుటగనుంగొనియింద్రజిత్తు మహారోషవశంబున యాగపరిసమాప్తము కాకపూర్వమే నిబిడ నిరంధ్రాంధకార బంధురంబైన వృక్షషండ మధ్యంబున నుండి వెలుపలికేతెంచి యుత్తమ హయ సంయోజితంబగు రథంబారోహించి ప్రళయకాల కృతాంతుండోయన నొప్పి రాక్షససైనికుల బురికొల్పుకొని యుద్ధసన్నద్ధుండగుటయు.

మ. హనుమంతుండొక దొడ్డసాలకుజమున్ హస్తంబునందాల్చి త
ద్దనుజానీకములోన జొచ్చి సుమహద్దావానలజ్వాల కా
నన దేశంబును గాల్చుచందమున నానాభంగులం ద్రుంచుచుం
జెనుమూర్ఛం బడగొట్టె సేనల మహాభీభత్సమై యొప్పగన్.

గీ. శౌర్యమున దైత్యసేనల జక్కడంచుచున్న పవనాత్మజుని గాంచి యొక్కపెట్ట
వేలసంఖ్యల దానవవీరవరులు గవిసి రతిభీషణముగ దత్కపివరేణ్యు.

మంజరి :

అతిభీషణముగను గొట్టిరల పవనాత్మజుని శరీరమునన్
సితశూల గదాసి ముసల ముద్గర శిలీముఖానీకమునన్
గిరిసదృశుండైన వాయుసూనుడు గిన్కతోడ వేగమునం
బరిపరివిధములుగ దైత్యసేనల బారిసమరె శౌర్యమునన్.

వ. హనుమంతుడివ్విధమున వీరవినోదంబు సలుపుచుండ గని యింద్రజిత్తు హనుమంతునిపై ననేకశరంబులు వివిధ సాధనంబులు వర్షించిన వానినెల్ల సహించి మిగుల రోషముతో యింద్రజిత్తునితో హనుమంతుండిట్లనియె.

క. ఓరిదురాత్మా పోరికి రారమ్మిక నీదుబల పరాక్రమమెల్లన్
ధీరతగనుగొని క్షణమున ధారుణిబడగూల్తు బాహుదర్పమెలర్పన్.

వ. అని సంభాషించుచుండునంత విభీషణుడు లక్ష్మణునితో లక్ష్మణా! యింక నీవుపేక్షించవలదీ పరమదుర్మార్గుండగు యింద్రజిత్తును నిశితసాయకానీకంబున శీఘ్రముగా కడతేర్పుమనుటయు లక్ష్మణుండు ధనుష్టంకారమొనర్చుచుండ నంత యింద్రజిత్తు విభీషణునిగనుంగొని క్రోధముతో నిట్లనియె.

సీ. నీతిజాతియుబాసి లాతివారలజేరు కర్కశుండవు దీనఖ్యాతిగలదె
పితృసోదరుండవు పినతండ్రివిట్లు నాకహితంబొనర్ప నీకర్హమగునె
బాంధవ్యమును సహృద్భావంబువిడినాడి పరులకు మేల్సేయ భారపడితె
స్వజనుల నిరసించి కుజనులసేవింప సుజనులుగ్రహించు చొప్పుదగునె
స్వజనవర్గంబు విడనాడి శాత్రవులను వలచితిరిగిన వారికి స్వజననాశ
నాంతమున శాత్రవులచేత హతముగాక తప్పదెరుగుము దుశ్శీల ధరణిలోన.

ఉ. ఏనొనరించు హోమవిధి కిట్లు విఘాతమొనర్చి లక్ష్మణున్
వానరసేనలోడ గొనివచ్చితి వేమనవచ్చు నీదయా
హీనతజూడ ఘోరము మహీస్థలిలో నినుబోలు బంధుడే
గాని మరెవ్వరిట్టు లపకారముసేయగబోరు దుర్మతీ.

వ. ఇట్లుపాలంభనంబొనర్చు యింద్రజిత్తునితో విభీషణుండిట్లనియె.

ఉ. ప్రేలెదవేల దైత్యకులభేదన పితృసముండనైన నా
శీలమెఱుంగ కిప్పగిది చిత్రముగా పరుషోక్తులాడ నీ
కాలముచేరునయ్యె నదిగావుననే విపరీతబుద్ధియున్
బానిసనృత్తియుం జెడుగుభావములుం బొడసూపెనీమెకన్.

క. పరధన భార్యాహరణున్ నిరతదురాచారు సుజననిందితు హింసా
కరు విడువవలయునని బుధవరులుపదేశింపుదురు తగులబడుగృహమ్ము క్రియన్.

సీ. అనఘాత్ములైన మహర్షుల ద్రుంచుట పరకాంతలను జెరబట్టుటయును
దేవతావీరులతో ద్వేషంబుబూనుట యొరులసంపదజూచి యోర్వకుంట

దురభిమానంబును ద్రోహచింతయును క్రోధము దురాచారంబు ధర్మపథ వి
సర్జనంబును సుహృజ్జన దూషణంబును పరులవంచించి సంపదలగొనుట
మొదలుగాగల దుర్గుణములు మదాంధుడైన రావణు సుగుణాళినెల్ల
కప్పివైచెను తెలియుము జ్యోతులమును జలధరము గప్పివైచిన చందమునను.

వ. కావున సహోదరుండైనను పరిత్యజింపవలసె కాలము సన్నిహితంబగుటవలన
నింకను త్తరక్షణముననే నీవును నీజనకుండును సపరివారముగా లంకా
పట్టణముతో నాశమగుట నిశ్చయము అదియునుంగాక

శా. ఓరీరాక్షస దుర్వినీత కటుగర్వోద్రేకివై నన్నిటుల్
కారుల్ ప్రేలుట కుద్యమించితివి మూర్ఖా కాలపాశంబు దు
ర్వారంబై భవదీయకంఠతలమున్ బంధించె ఘోరార్తి చే
కూరెన్ నీవికరామలక్ష్మణులతో క్రోధించి జీవింతువే.

మంజరి :

ఆలంబోనరింపుమా నరోత్తముడైన లక్ష్మణునితోడన్
కాలగతింబొంది పిదప యమలోకమున కడునిష్టతోడన్
యిష్టదేవతా రాధనమును నీవెలమినొనర్చెదు గాక
దుష్టశీల బాహుబలముజూపుము తొలగివెనుకకుంబోక.

వ. అనివచింప విభీషణు వచనములాలించి యింద్రజిత్తు మిగుల నాగ్రహాగ్రస్తుండై
నిష్ఠురవచనంబు లాడుచు యుద్ధాభిముఖుండై చక్కగా నలంకరింపబడి నల్లని
మేటిహాయంబులబూన్చిన గొప్పరథంబధిష్టించి మహాదీర్ఘంబును దృఢతమంబైన
కోదండంబుధరించి ప్రళయకాల యముండునుంబోలె బయల్వెడలిన హనుమ
భుజాస్కంధంబధిష్టించి కోదండధరుండై యుదయభాస్కరుండునుంబోలె
ప్రకాశించు లక్ష్మణునెదుర్కొని విభీషణప్రముఖులెల్ల రు విననిట్లనియె.

మహాస్రగ్ధర :

కనుడస్మద్బాహు దోర్విక్రమమిదె రణరంగంబునన్ దీర్ఘమౌ మ
ద్ధనునిర్ముక్తోగ్ర నానాస్త్రశిఖల వడిగాదగ్ధముం జేతునింకన్
మునుపీలన్ రాత్రియుద్ధంబున మిమువరుసన్ మూర్ఛనొందించితి
నేడనిలో నాప్రమోల నెవ్వండలజడిబడకెట్లాగు ధైర్యంబుతోడన్.

వ. ఇట్లుబలుకు యింద్రజిత్తువాక్యములకు బెదరక లక్ష్మణుండిట్లనియె.

గీ. ఏటికీలాటి టాటోటుమాడలాడ పోటరివయేని నాతోడ బోరొనర్ప
మేటిధృతినిల్వుము నిశాటకోటిబెగడ నేటికనుపుదు నినుయమపీటికసుర.

చ. అనుటయు నింద్రజిత్తు నిశితాశుగముల్ వడివింటబూన్చి పెం
గనరున లక్ష్మణున్ మిగులగాఢముగా బ్రహరింప నాతడుం
దనువున రక్తధార లమితంబుగ గ్రమ్మ విధూమపావకుం
డన జెలువొందె నెంతయు తదద్భుత ఘోరరణాంగణంబునన్.

వ. అంత యింద్రజిత్తు తనకార్యము సఫలమయ్యెనని తలంచి సింహనాదంబొనర్చి లక్ష్మణునితో నిట్లనియె.

శా. సౌమిత్రీ గనుగొన్ము నిక్కముగ మచ్చాపప్రముక్తాశుగ
స్తోమంబుద్ధతి నీశరీరమునుచీల్చున్ నక్కలున్ గ్రద్దలున్
నీమాంసంబు భుజించు భిన్నకవచాన్వితుండవై గూలినన్
రాముండిత్తరి గాంచుగాక కడువిభ్రాంతాత్ముడై యార్తితోన్.

వ. గర్వోద్రిక్తుండై పలుకు యింద్రజిత్తు వచనములకు సౌమిత్రి వెండియు నిట్లనియె దురాత్మా, మదోన్మత్తుండవైన నిన్నీక్షణంబున యమసదనంబున కతిథిగాబనిచెద

మంజరి :

అనివచించి లక్ష్మణుండు చాపంబాకర్ణాంతముదిగిచి
సునిశిత మార్గణమునేసె రావణుసుతు యురమును గురిజూచి
తోడన నయ్యింద్రజిత్తు రోషముతోడ బెరిగి లక్ష్మణునిన్
వాడిములుక్కలెక్కవెట్టి మూటినివైచె సుగుణభాసురునిన్.

వ. అయ్యవసరంబున

సీ. పరమాద్భుతముగ సంగరమొనరించిరా నరరాక్షసోగ్ర కేసరయుగంబు
ధారాధరము వర్ష ధారముంచినభంగి శరవృష్టిచే పరస్పరజయేచ్ఛ
నిరువు రొండొరులపై గురియుచు వెనుదీక కరికరి హరిహరి గిరిగిరిగతి
వివిధాస్త్రశస్త్ర ప్రవీణతమెరయంగ శౌర్య తేజో పౌరుషములుమెరయ
యుద్ధనైపుణ్య మెంతయు నొప్పిదముగ వృషభయుగమట్లు వాసవవృత్రులగతి
నంబరస్థలి దుష్టగ్రహములపోల్కి బలమున బెనంగిరతులిత సరభసమున.

వ. అట్టియెడ లక్ష్మణప్రయుక్త బాణపాతంబున నించుక ముఖకాంతి చెడియున్న యింద్రజిత్తును గనుంగొని విభీషణుడు లక్ష్మణునితోనిట్లనియె.

గీ. కాంతిచెడె నింద్రజిత్తు ముఖంబునందు దుర్నిమిత్తంబులెన్నేని దోచుచుండె
నందుచే గట్టిగాపోరు నవసరముగ శంకవలదితడని పరాజయమునొందు.

మ. అనినన్ వల్లెయటంచు లక్ష్మణుడు ధైర్యస్ఫూర్తితో భీషణా
శని సంకాశ నిశాత సాయకతతిన్ శక్రారిపై నేయ న
ద్దనుజుండొక్క ముహూర్తకాల మతిసంతప్తేంద్రియుండై క్రమం
బున దార్ఢ్యంబు వహించి లక్ష్మణునితో బొల్పొందగానిట్లనున్.

చ. మరచితివో నరాధమ క్రమంబున ఘోరరణాంగణంబునం
బరిభవమొందికుంద మిముబద్ధులజేసితి సంస్మరింపుమా
గరువముతోడ నేడురణకౌతుకమొప్పగ నేగుదెంచు ని
న్నరమర నేయకంపెద క్షణాంతరమందు కృతాంతుపీటికిన్.

శా. ఈరీతిన్ వచియించి రోషమున నయ్యింద్రారి తీక్ష్ణంబులౌ
నారాచంబుల నేసి లక్ష్మణుని మేనంగుప్పి తోడ్తోడ సా
మీరిం గ్రూరదశాశుగమ్ములను బేర్మిన్ మోపి నూరమ్ములన్
వైరంబూని విభీషణున్ మిగులదర్పంబొప్ప గుప్పించినన్.

గీ. అంతలక్ష్మణు డసురకృత్యమును లక్ష్యపెట్టక హాసన్ముఖుడై పేరెలుగున
చెనటి! నీసాయకము లేమిసేయజాలవనుచు నిశితశరావళి నతనిగప్పె.

వ. ఇట్లు అతిభీషణంబుగా బోరునెడ నిరువురి కవచంబులు తునియలై చెదరి
ధరాతలంబున బడిన తెంపులేని పౌరుషంబుల బోరాడునెడ వారిదేహముల
నుండి వెలువడు క్రొన్నెత్తురుచే బుష్పించిన కింశుక శాల్మలీవృక్షంబుల
చెలువున బ్రకాశించుచుండ సర్వాస్త్రలాఘవంబులు చూపుచు మత్తమాతంగం
బుల విధంబున ప్రేక్షకజనంబుల కెంతయు విస్మయావహంబైయొప్పె నట్టియెడ
విభీషణుని మంత్రులు రాక్షససైనికులపై బడితుత్తునియలుగా వధించుచుండిరంత
రక్కసులపై వానరుల బురికొల్పుచు విభీషణుండిట్లనియె.

సీ. వనచరులార రావణున కీతండును, శేషించియున్నట్టి నేనదప్ప
యితరమైన సహాయ మించుకంతయులేదు మీరలిక్కరణి యూర
కుండనేమిటికి వత్స్యగ్రకర్మండగు రావణి హతుడైన రావణుండు
తప్పతక్కిన మేటి దైత్యవరేణ్యులెల్లరు జచ్చినట్లెంచవలయు

కడుభయంకరులైన రక్కసులనెల్ల హతమొనర్చిన మీకుపీడలతిగాదె
బాహువుల వార్ధినీదిన వానికరయ నెంతమాత్రము పల్వలంబెంచిచూడ.

వ. లక్ష్మణుం డితనిని వధింపగలడు గావున మీరీరాక్షస సైనికులనెల్ల హతంబొనరింపుడని పురికొల్పుచుండ హనుమ జ్జాంబవ దంగదాదులు గర్జిల్లుచు మేఘాడంబరమునకు కేకలిడు మయూరంబుల విధంబున సింహనాదంబులొనరించుచు

చ. చలమున జాంబవంతు బలుసైన్యము లున్నతశైల పాదపా
వలిగొని దైత్యవర్గమును బాదుచు దంతనఖాళి జీల్చుచున్
బలమున ఘోరరక్కసులు వాడిపరశ్వధ శూల పట్టిసో
జ్జ్వల కరవాల చక్రముఖ సాధనముల్ గొని మోదిరంతయున్.

మ. నదులై పారదొడంగె శోణితము నానాక్రూర క్రవ్యాదముల్
గొదలంజేయుచు మాంసభక్షణకు పర్వుల్ పెట్టె నల్వంకలం
జదలం దిక్కుల చిమ్మచీకటులు సంఛన్నంబులై యొప్పె నిం
పొదవన్ పయ్యెర వీచదయ్యె మరినప్పుల్ వెల్గలేదయ్యెడన్.

గీ. సర్వలోకములకు స్వస్తిచేకూరుగాక యనివచించిరట మహర్షివరులు
గరుడ యక్ష సిద్ధ గంధర్వులటనుండి వేగుచోటికపుడు వెడలిచనిరి.

వ. అసమయంబున

సీ. కనకభూషణ పరిష్కారంబులై కృష్ణవర్ణంబులగు దైత్యవరుని తేరి
నాల్గువారువముల నాల్గుబాణములచే ప్రహరించి సౌమిత్రి బలముమెరయ
కరలాఘవమున నాకర్ణాంతముగ నారిదిగిచి వజ్రోపము తీక్ష్ణభల్ల
మొండుసంధించి ప్రయోగించుటయు నంత నమ్మహాశరము భయంకరముగ
వహ్నికీలలు గ్రక్కుచు బయలువెడలి క్షణములో నింద్రజిద్రథ సారథి శి
రంబుఖండించె నంతతద్రావణియును రథముగడపుచు నేర్పుమై రణమొనర్చె

సీ. కనుగొన విస్మయకరమై దనర్చె తద్దనుజరాట్తనయు దోర్దర్పగరిమ
ధనువున శరముల తడయక దొడుగుచు ములుకోల తద్ఘాయముల గడపుచు
మొగిసిలక్ష్మణుడేయు ములుకులమనుముచు ననిలోన నెన్నిక నత్యుదగ్ర
పౌరుషంబున నిల్చి బవరంబొనర్చుచు ఘనతర బాహులాఘవము మెరయ

నెంతయును కోపకాలుష్యమినుమడింప పైకురవడించు భల్లూకప్లవగవరుల
ఖండఖండములుగజెండు కౌశలంబు వర్ణనాతీతమై దుర్నివార్యమయ్యె.

వ. సూతుండు హతుండగుటయు తాను సారథ్యము జేయుచు యుద్ధమొనర్చుట మిగులకష్టమగుటచే ఖిన్నుండయ్యె నదిగనుంగొని వానరవీరులు సంతోషముతో లక్ష్మణుని గొనియాడ మొదలిడిరంతలో ప్రమాథియు శరభుండును రభసుండను వారినల్వురొక్కుమ్మడిగి రివ్వున నభోపథంబున కెగసి మహాగిరి శృంగంబులకై వడి గుభాలున నింద్రజిత్తు హయంబులపై దుమికిన నవి రక్తమునుగ్రక్కి భగ్నాంగంబులతో నేలంగూలి తన్నుకొని ప్రాణములు విడిచె నంత నింద్రజిత్తు కపులనెల్లర మోసగించి నిముషమాత్రంబున లంక జొచ్చి చక్కగానలంకృతమై మిగుల నుత్తమాశ్వయోజితంబైన రథంబెక్కి వివిధాయుధసమేతుండై రణరంగస్థలంబున కేతెంచి రోషకలుషితుండై ధనుశ్శ్రేష్ఠంబును మండలాకారముగాలాగి నానావిధ శరపరంపరల వానర సైన్యముల జక్కుచక్కుగా జక్కాడుచుండ వారెల్లరు వెరచి లక్ష్మణుని మరుపు జొచ్చిరంత

గీ సమరరోషంబుతోడ లక్ష్మణుడు మిగుల ప్రజ్వరిల్లుచు నతిలాఘవమున నింద్ర
జిత్తు కరమున జెలువొందు శ్రేష్ఠమైన కార్ముకమును ఖండించె ఖండములుగ.

మంజరి :

ఓడక నయ్యింద్రజిత్తు వెండియు నొండువిల్లునుధరించి
తోడన సంధించె తీక్ష్ణశరముల తొడితొడినారిబిగించి
రామానుజు డింతలోన మూడుశరంబులను ప్రయోగించి
సామర్థ్యమెలర్ప నంతటం దచ్ఛరాసనముఖండించి.

చ. తడయక లక్ష్మణుండధిక దర్పమెలర్పగ సర్పతుల్యమూ
బెడిదపుటమ్ము లేడిటిని వేగధనుస్సున గూర్చి దైత్యునిన్
వెడదయురంబు దూసిచన ప్రేయుటయుం గవచంబు తున్కలై
పడియెధరిత్రి దైత్యకుల వర్యుడురక్తముగ్రక్కె గ్రక్కునన్.

వ. పదంపడి మిగుల దృఢంబగు యల్లెత్రాటిని బిగించి వేరొండు శరాసనంబును గ్రహించి తీవ్రముగా పోరాడుసమయమున

గీ. శక్రవైరి ప్రయోగించు సాయకముల మధ్య భగ్నంబొనర్చి లక్ష్మణుడు మఱల
తీక్ష్ణభల్లాయుధముచు సంధించి వానిసారథి శిరంబుఖండించె సత్వరమున.

గీ. సారథిగతింప త్రిదథాశ్వములు మంచి శిక్షబొందిన వగుట విచిత్రగతుల
మండలాకారముగను తత్సమరతలమునందు తిరుగుట లాశ్చర్యమైవనర్చె.

మంజరి :

స్థిరబలుడగు లక్ష్మణుండు గినుకన్ తీక్ష్ణబాణయుగ్మమునన్
గురిగానయ్యింద్రజిత్తు హయములగొట్టె నధిక వేగమునన్
యదిసైపక నింద్రజిత్తు పదివాలమ్ముల వింటందొడిగి
పదపడి సౌమిత్రిపైనవిడిచెన్ పటుశౌర్యోన్నతి గడగి.

వ ఇవ్విధంబున నొండొరులు తమతమ శస్త్రాస్త్ర లాఘవంబులు ప్రదర్శించుకొను చుండ లక్ష్మణుడింద్రజిత్కవచమును తునియలుగావించుటయు నతండుర్వాక మూడువాడితూపుల లక్ష్మణుని ఫాలతలంబున నాటించిన సౌమిత్రి మూడు శృంగములతోనొప్పు పర్వతంబట్లు ప్రకాశించె. పిమ్మట లక్ష్మణుండైదు శరంబుల నింద్రజిత్ఫాలతలంబున మోదె నిట్లురువురు రణకౌశలంబున బెనగుచునెడ

మ. రణశౌర్యోన్నతు డింద్రజిత్తు భుజశౌర్యంబొప్పగా మూడుమా
ర్గణముల్ బూన్చి విభీష ణాననమునన్ గాఢంబుగా మోది దా
రుణభంగిన్ కపివీరు నొక్కొకని నేర్పుల్ మీర నొక్కొక్క భీ
షణబాణంబున ముంచివైచె గడునాశ్చర్యంబు సంధిల్లగన్.

వ. అంత

మ. అతి తేజస్ఫురణన్ విభీషణుడు దుర్వ్యాపారుడౌ దైత్యరా
ట్సుతు రథ్యంబుల బెన్ గదాయుధమునం జూర్ణంబులైరాల ను
ద్ధతుడై మోదిన భగ్నసూతహయుడై తద్వాసవద్వేషి భూ
గతుడై భీషణశక్తిబూన్చి మదరేఖన్ వైచె బిత్రృవ్యునిన్.

వ. అంత లక్ష్మణుడు విభీషణునిపై కరుడెంచుశక్త్యాయుధమును నిశితశిలీముఖంబుల బ్రయోగించి నడుమన తునియలుగావించె నట్టియెడ విభీషణు డక్కొంతాగ్ర హంబున పవిధారానిభంబులగు నయిదుదివ్యాంబకంబుల ప్రయోగించిన నవి యింద్రజిచ్ఛరీరమును పూర్తిగా వ్రణమండలంబొనర్చిన నతండుర్వాక తొల్లి యమునివలన బడసిన క్రూరశరంబొండెక్కు బెట్టి ప్రేయుంగమునించిన దానిని గ్రహించి లక్ష్మణుడు త్వరితవిక్రమంబున

సీ. సురరాట్ప్రముఖ సురాసురులకేని నజయ్యమైనట్టిదియు స్వప్నమంచుతనకు
ధనదుండొసంగిన సునిశితశరమొండు దిగిచి లక్ష్మణు డతిధృతిదలర్ప
సింజినీనినదంబు సెలఁగ జాపంబున నెక్కుబెట్టుటయు నయ్యిరువురొక్క
మొగి శరంబులనీడ్చి మొనసి ప్రయోగింప నవిప్రకాశించె మహాప్రదీప్తి
నంతనాశరయుగ్మ మత్యంతముగ భీషణా నలశిఖల వియత్తలమున
యొరసి డీకొని పోరాడి యొకముహూర్తకాలమున నూరువ్రయ్యలై కూలెధాత్రి.

మంజరి :

ఆవీరవరేణ్యులిర్వురిటుల నిజాంబకయుగము సమసినన్
భావములం దధికవ్రీడనొందిరి పటురోషావేశమునన్
సైపకలక్ష్మణుడు వారుణాస్త్రము సంధించిననాలోనన్
కోపంబున నింద్రజిత్తు దానింగొట్టెన్ రౌద్రాస్త్రమునన్.

ద్విపద :

అతులతేజస్వియా యసురేంద్రసుతుడు ధృతితోడ నాగ్నేయ దివ్యాస్త్రమేయ
వీరుడాసౌమిత్రి విక్రమంబెసఁగ సౌరాస్త్రమున దానిసమయించె నంత
అలుకమై యింద్రజిత్తుసురాస్త్రమేయ వెలువడె నంబడి వివిధాయుధములు
యేచిసౌమిత్రి మహేశ్వరాస్త్రమును వైచినివారించె వైరులుబెగడ.

వ. ఇట్లువీరవరేణ్యులిర్వు రత్యంత భీషణంబగు రణంబున ప్రవర్తిల్లుటయు సకల
ప్రాణులు మిగులనాశ్చర్యకరంబుగా గనుంగొనుచుండి రట్టియెడ దేవ పితృ
ఋషిగణంబులు దేవేంద్రసహితులై యుద్ధగంగమున లక్ష్మణునకు విజయమును
గోరుచు సర్వవిధముల రక్షించుచుండి రయ్యవసరంబున

సీ. సౌమిత్రిమిగుల రోషస్ఫూర్తితో మహేంద్రాస్త్రంబు సంధించె నద్భుతముగ
చూపరులకు భయోద్దీపకంబగుదాని శత్రువీరులజంప జాలుదాని
రూపింపగారాని రుచులజెల్వగుదాని మేల్మిబంగరుపూలు మెరయుదాని
మునుశక్రుడసురరాఘుమును వధించినదాని నాశీవిషోపమం బైనదాని
మిగులనుత్తమ పర్వంబులొగి వెలుంగ మహిమనొప్పు తదస్త్రంబుమంత్రపూర్వ
కముగ ధ్యానించి శక్రజిత్ కంఠసీమ నూటిగాగురిజూచి త్రిశుద్ధిగాగ.

వ. యముడు జగత్సంహారణార్థము పాశమునుధరించునటుల దీర్ఘమగుకోదండ
మాకర్ణాంతముగా దిగిచిపట్టి దృఢసంకల్పముతో నిట్లనిభావించె.

శా. శ్రీరాముండు విశిష్టధర్మపరుడై జెల్వొందు నేని శుభా
చారంబ ప్రతిమాన పౌరుషము శాస్వత్సత్యసంధత్వ మా
వీరాగ్రేసరు డాయ నేని మహిమన్ వెల్గొందు నీయస్త్ర మిం
ద్రారిన్ దప్పకద్రుంచుగాపుత ప్రదీప్తానల్ప తేజంబునన్.

వ అనిప్రతిజ్ఞాపూర్వకంబుగా ప్రయోగింప

మ. అరినిర్భేదన యోగ్యమైతగు తదీయైంద్రాస్త్ర మప్పట్టునం
బరమాశ్చర్యకరంబుగా వెడలి దీప్తజ్వాలలన్ భూనభో
హరిదంతంబుల నిండిబర్వి భయదంబై గ్రాలుచున్ యింద్రజి
చ్ఛిరమున్ రత్నకిరీటకుండలముతో ఛేదించివైచెన్ వడిన్.

వ. ఇట్లుహతుండై నేలంగూలిన దురాత్ముండైన యింద్రజిత్తును గనుంగొని విభీషణ
ప్రభృతులైనవానరులు పరమోత్సాహభరితులై లక్ష్మణునిగురించి జయజయ
ధ్వానము లొనరించుచు సింహనాదములు సేయుచుండ శేషించిన రక్కసులు
శరాసనముల పారవైచి వెరచిపరచిరంత నంతరిక్షచరులగు దేవ గంధర్వ సిద్ధ
సాధ్యాదులు యింద్రజిన్మరణమునకు పరమానందభరితులై లక్ష్మణుని వేనోళ్ళ
గీర్తించిరంత

సీ. ఎంతయు పాపియౌ యింద్రజిత్తునసింప నిలకష్టంబులు తొలగిపోయె
జగములన్నియు కడుసంతోషమునవొప్పె దినమణి కాంతితో తేజరిల్లె
సకలనిర్జరులతో శక్రుండు హర్షించె దేవదుందుభులంత దివిజెలంగె
గంధర్వవర్యుల గానంబుజెలరేగె నప్సరస్త్రీల నాట్యములు ప్రబలె
నమరులెల్లరు వర్షించిరలరుసోన భయమువిడనాడి రఖిలదిక్పాలవరులు
నిర్మలతజెందె గగనంబు నిఖిలదిశలు ప్రస్తుతించిరి లక్ష్మణు ప్రజలుమిగుల.

గీ. అంతట విభీషణుండును హనుమ జాంబవంతుడాదిగ సకల ప్లవంగవరులు
విజయలక్ష్మీసమేతులై వెలయురామసోదరుని సంస్తుతించిరుత్సుకతమిగుల.

మానినీవృత్తము :

అంత వలీముఖ సైనికులెల్లను హర్షమునన్ గడుచిత్రముగా
గంతులువైచుచు మింటికిబ్రాకుచు గర్వముతో వడిగొప్పుచు న

త్యతహితోక్తుల లక్ష్మణునిం గొనియాడుచు రాముని బొగడుచు ని
శ్చింతయునొప్పిరి తత్సమరస్థలి నేచిమహావిజయోజ్జ్వలులై.

వ. సర్వశుభలక్షణుండైన లక్ష్మణుడు యింద్రజిద్వధానంతరము సైనికులనెల్ల ర
గుమిగూర్చుకొని సంతోష సముల్లాసములతో హనుమద్విభీషణులిర్వురు
నిరుగ్రేవల కైదండలూని సంతోషముతో శ్రీరామసుగ్రీవుల సముఖమున
కేతెంచి శ్రీరామచంద్రుని పాదారవిందములకు ప్రణమిల్లి యింద్రజిద్వధా
విధానంబంతయు వివరించిన శ్రీరామచంద్రుడు లక్ష్మణుని గాఢాలింగన
మొనర్చుకుని యిట్లనియె

గీ. మంచిపని జేసితివినీవు మన్ననమున సంతసించితి యింద్రజిత్సుయుక తన
మనకు విజయంబుచేకూరె ననుచు హృదయమందు దలపుము సందేహమంద నేల.

వ. అని ప్రియపూర్వకంబుగా భాషించుచు

శా. లంకాధీశ్వరు నందనుందునిమ లీలన్ మించు భాస్వద్గుణా
లంకారుండగు లక్ష్మణుం బ్రియముసన్ లాలించి శ్రీరాఘవుం
డంకంబందునజేర్చి హర్షమున మూర్ధాఘ్రాణముంజేసి స్నే
హాంకూరంబున శల్యవీడిత తదీయాంగంబులం దువ్వుచున్.

సీ. తమ్ముడూ! దైత్యరాట్తనయుండు దుస్సాధ్యమగు కృత్యమొనరించె నధికకీర్తి
నంతమహాకీర్తిమంతుడా పుత్రుండు హతుడయ్యెనని వినినంతమాత్ర
నసువులవిడుచు నయ్యసురాధినాథుండు సందేహమేటికి సత్యమంత
పెను పగతుని జయించినవాడవైతి హితంబయ్యె నీ జగత్త్రయమునకును
రావణుని భుజముర్విరాల నడచి స్థిరయశో వైభవంబు నార్జించినావు
దైత్యపతి యిప్పుడరుదెంచు తక్షణంబ సైన్యయుక్తమున నతనినే సంహరింతు.

వ. అని ప్రియవచనముల సోదరు నాదరించి సుషేణుని బిలిచియిట్లనియె

ఉ. ఓయిసుషేణ లక్ష్మణుడు యుద్ధమునం శరశల్యవిద్ధుడై
కాయమునన్ విశేషముగ గాయములై వ్యథనొందుచున్న వా
డీమెడ నీవుశీఘ్రమున నిమ్ములి నౌషధయోగ సేవనో
పాయవిధాన కర్మముల స్వస్థతచేకురునట్లొనర్పుమా.

వ. అనుటయు నతండట్లొనర్చె సుషేణుడొసంగిన దివ్యౌషధరస గంధాఘ్రాణం
బున వ్రణంబులుమాని యెల్లరు యథాస్థితులొంది సంతోషించిరి అంత

రావణుడు చారులవలన నింద్రజిద్వధ నాకర్ణించి మూర్ఛాక్రాంతుండైపడి దీర్ఘ కాలమునకు తెలివొంది మిక్కిలిదీనముగా విలపించు నిట్లనియె.

సీ. ఇంతవిపత్తు నీకేలసంప్రాప్తించె కటకటా నేడునాకన్నతండ్రి బలవైరిని హరించు పటుశౌర్యనిధి నేడని లక్ష్మణునివశంబైతి వయయొ రాక్షసాన్వయ మహారథికశిఖామణి నచ్చెరువుగ మాయమైతివింక నేనెట్లుజీవింతు హృదయభేదన కరంబగు దుఃఖమేరీతి ననుభవింతు మత్కులవివర్ధనా నీవుమరణమొంద విని సర్వసుపర్వులు వివిధగతుల హర్ష భరితాంతరంగులై హాయిగా విచారములుదక్కియుంద్రు నిస్సంశయముగ.

గీ. ఏనుమృతినొంద పితృమేధ మీవుజరపవలసియుండగ దానికీ వైపరీత్య మిట్లు సంప్రాప్తమయ్యె నేనేమిసేయువాడ దైవోపహతుడనై వగచుచుంటి.

వ. ఇట్లు పుత్రమరణ దుఃఖమున బిట్టువాపోవుచు నిసుమడించిన క్రోధోద్రేకంబున కటములదర బొమలుముడిపడ కనుల విస్ఫులింగములుసెదర ప్రళయకాల రుద్రునివగిది నుగ్రవీక్షణుండై రోజుచు మంత్రులరావించి వారితోనిట్లనియె. నాపుత్రుడు మాయాసీతశిరంబును నరకివైచె నేనిదేయిక్షణంబ దుష్టచిత్త యగు సీత శిరమును యథార్థముగా నరికివైచెదనని ఖడ్గపాణియై సింహాసనము నుండి యొక్కపరుగున చివాలున దుమికి హితులగువారెంత వారించినను నిలువక హుటాహుటి యశోకవనిజొచ్చి అంగారకగ్రహము రోహిణిపై కురవడించినవిధంబున సీతపైకురక రాక్షసాంగనలమధ్య దుఃఖార్తయై పరిదేవన మొనర్చుచున్న సీత రావణునిగనుంగొని భయభ్రాంతయై గడగడవడంకుచు మహత్తర శోకాతిరేకంబున నిట్లనియె.

—: రావణుడు సీతనువధింతునని వెడలుట :—

గీ. నాథనతినైన నను పీడవాథవోలె నెంచికాబోలు చంపుటకేగుదెంచు చున్నవాడేమిసేతు నాకొనరనేడు రక్షకుండెవ్వరింకు శ్రీరామచంద్రా.!

వ. దురాత్ముండగు రావణుడు క్రోధోన్మాదుండై నన్నుదృంప నేతెంచుచుండె శ్రీరామలక్ష్మణుల రణరంగంబున వధించి యుండనోపు, నాకిచ్చట దిక్కెవ్వరు! దైవమా కార్యాకార్య విచారణశూన్యురాలనగు నేనీదుర్దవస్త పాలైతి. హనుమానుని సలహానంగీకరించినచో నాజీవితేశ్వరుని యంకతలంబున సుఖముగా జేరియుందునుగదా యని పెక్కుతెరంగుల వగచుచుండనంత

సుపార్శ్వుండనుమంత్రి జనకజ దైన్యమునుగని జాలినొంది రావణున కడ్డముగా నిలిచి యిట్లనియె.

ఉ. ఓదశకంధరా! నిలువు మొక్కనిమేష మదేల నాహితం
బాదర మొప్ప విన్ముజలజాక్షులదృంచుట శూరధర్మమే
వైదుకకర్మధర్మ పరిపాలనశీలివి గాక యక్షరా
ట్సోదరుండవన్న కీర్తిచెడజూతురె రోషమునన్ భవాదృశుల్.

శా. దైతేయాన్వయభూషణా మనవి సీతాసుందరీదేహశో
భాతారుణ్య విలాసవిభ్రమకళా ప్రాశస్త్యముంగాంచి నీ
చేతంబందు భ్రమించి నేడిటుల దాక్షిణ్యంబుబోనాడి దు
ర్నీతిన్ సీతనుజంపితేని పిదపన్ నీకేమి లాభంబగున్.

ఉ. చాతురిమీర నీవఖిలసైన్యసమేతముగా శరించి వి
ఖ్యాతిగ రాము మానవు గతాయుషు సంగరభూమిద్రుంచి త
చ్ఛ్రీతను చెట్టబట్టి తమిదీర సమస్తవిధోపభోగ భా
గ్యాతిశయంబులతో వెలగుటర్హముగాదె నిశాచరోత్తమా.

—: మూలబల యుద్ధము :—

వ. రాక్షసరాజా! కార్యముచెడినపిమ్మట యోచించిన ప్రయోజనములేదు గావున త్వరపడవలదు శాంతింపుము నేడుకృష్ణపక్షచతుర్దశి రేపమావాస్య కావున నీవుసైన్యసహితుండవై బయల్వెడలితివేని అవశ్యము శత్రుసంహారమొనర్చి విజయలక్ష్మిని పొందగలవని సాంత్వనవచనముల బోధింప దురాత్ముండైన రావణుడు మిత్రవచనముల నంగీకరించి క్రమ్మఱ నిజనివాసంబునకరిగి మంత్రివర్గముతో మంత్రాలోచన మొనర్చి యిట్లనియె మీరెల్లరు సకల సాధనసమేతులై చతురంగసైన్యములతో యుద్ధమునకు బయల్వెడలుడని యాజ్ఞాపించిన వారెల్లరు నానావిధ సాధనసమేతులై వానరులపైగవిసిన యిరుతెగలవారికి ఘోరంబైన పోరాటంబయ్యె నంత

ఉ. కూలెడు తేరులేనుగులు కూలములట్లు వెలుంగ నశ్వరా
జాలము దొడ్డమీనములచాడ్పున నొప్పగ కేతనంబులున్

సాలములట్లు గన్పడ నిశాచర వానర నాయకుల్ తరం
గాలియువోలెనొప్పి రుధిరాపగ వెల్లువబారె నేల్లెడన్.

లయవిభాతి :

వానరులు తద్రుధిరవాహినుల నీదుచు నవారితబలోన్నతుల వైరులవధింపం
బూనికడురౌద్రమున బొంగివెస నార్చుచు నభోపథముపైకెగసి బోరన సురద్వి
ట్సైనికులపైనబడి సైంధవ రథ ద్విరద సర్వవిధ శస్త్ర కవచ ధ్వజము లుద్య
ధ్వానములతో విరిగి ధాత్రిబడ గూల్చిరతిధైర్యములెసంగగ నుదాత్తమద రేఖన్.

గీ. మరియునతిభీషణంబుగ మర్కటప్రవరులు వడిరేగి యోడక వాడిగోళ్ళ
పండ్లతో దానవుల కర్ణ వదన కేశ నాశికల జీల్చిరెలమి నానావిధముల.

వ. ఫలవృక్షంబులపైకెగబడు ఖగంబులవిధంబున వేనవేల వలీముఖప్రముఖులు యొక్కొక్కరక్కసునిపైబడి నులిమివైచుచుండి రట్టియెడ పర్వతాకారులైన రక్కసులు గొప్పగొప్ప గదాదండంబులతో ప్రాస కుంత ఖడ్గ శూలాది నానావిధాయుధములతో నురుమాడుచుండ నిలువనోపక వానరులు పరువు లిడుచువచ్చి శ్రీరాముని శరణాగతియొనర్చిరట్టియెడ

మంజరి :

శ్రీరాముడు సత్వరమున చాపముచేతబూని రోషమునన్
దారుణ శరవృష్టి ముంచివైచెన్ దైత్యసైన్యములపైనన్
ఖరకరుకడ కరుగలేని బెడిదపు కొదంబినులట్లసురుల్
శరార్చులంగాల్చు రాముకడకుం జనలేకుండిరి వారల్.

ఉ. కొందరగూల్చి ప్రయ్యలుగ కొందరజీల్చి సితాంబకార్యులం
గొందరగాల్చి ఘోరముగ గొందర బాధలదేల్చి సేనలం
గొందర బిట్టదల్చెడు రఘుప్రవరుం బెనుదైత్యవాహినీ
బృందము గాంచలేక నతిభీతి వితాకునుబొంది రెంతయున్.

వ. ప్రళయవాయువుచే కూకటివ్రేళ్ళతో చాపకట్టుగా గూలిపోవు మహావృక్ష సమూహామట్లు శ్రీరామచంద్రుని భయంకర శరాభిఘాతంబున రక్కసిమూక లెల్లరు నాశమొందుచుండ శ్రీరాముని మహత్తర తేజమెవ్వరు గనుంగొన జాలరైరట్టియెడ శ్రీరామచంద్రుడు గంధర్వాస్త్రమును ప్రయోగించుటయు తదస్త్రమహిమచే మోహితులై రామమయంబై కనుబడు రాక్షససేనలలో

నొకరినొకరు పొడుచుకొని హతులగుచుండిరంత సువర్ణభూషితంబై యలాత చక్రంబుభాతి పరిభ్రమించు శ్రీరాముని కోదండాగ్రముకు మాత్రమే కనుంగొనగల్గిరట్టి మహత్తర ఘోరసంగ్రామ రంగస్థలంబున పగటిపూట మూడుముప్పావుగడియల కాలములో యేడుకోట్ల యిరువదిలొమ్మిదిలక్షల రథంబుల, మిగులబలిష్టులైన యిరువదివేలకోట్లతో హయంబుల నూటనలుబది యైదుకోట్ల యెనుబదిలక్షల రాక్షసయోధుల శ్రీరాముడగ్నిజ్వాలలగ్రక్కు సితశిలీముఖంబుల ప్రయోగించి నాశమొందించె. హతావసిష్టులగు రాక్షసులు భ్రాంతులై లంకజొచ్చి నంత తద్రణరంగస్థలంబు ప్రళయకాలమున బయల్వెడలు రుద్రుని క్రీడాస్థానంబుగానొప్పె నట్టియెడ దేవ గంధర్వ సిద్ధ సాధ్యాది నభశ్చరులు శ్రీరాముని ప్రభావమును బహుప్రకారముల గీర్తించు చుండిరాసమయంబున శ్రీరాముడు తానొనర్చిన సంగ్రామసంరంభంబునకు విస్మయచిత్తుండై సుగ్రీవ హనుమ జాంబవదంగదాదులగనుంగొని యిమ్మహాస్త్ర బలము నాదేనా లేక ప్రళయకాలరుద్రునిదాయని ప్రశ్నించె. తదనంతరంబ లంకలో రాక్షసబలంబుల వినాశమును గనుంగొని రాక్షసస్త్రీలెల్లరు భయ కంపితులై పెక్కువిధంబుల పరస్పరము జెప్పుకొని యిట్లు వాపోవజొచ్చిరి.

—: లంకలో రాక్షసస్త్రీలు దుఃఖించుట :—

ఉ. రామునిభార్యనిచ్చోటకు రావణుడేటికిదెచ్చె మోహియై
తామసమూని దాశరథి దానవవీరులనెల్ల ఘోరసం
గ్రామములోన ద్రుంచె నికకాంతలకెల్లర కేదిదిక్కు యిం
కేమియొనర్పగల్గుదుము యేలమహావ్యధగల్గె దైవమా!

క. పాపియగు శూర్పనఖ సంతాపమునకు మూలమయ్యె దైవముచే ని
ట్లాపదకునిటిల్లె మనకిపుడీపట్టున బ్రోచువార లెవరు ధరిత్రిన్.

గీ. తనయులను సోదరులను బాంధవుల హితుల దండ్రులను గోలుపోతిమి తరుణులెల్ల
విధవలై దుర్వ్యధలచేత వివిధగతుల కడుకృశింపగ వలసె నిష్కారణముగ.

వ. రాక్షసకుల నాశనమునకే రావణుడు సీతనుగొనివచ్చె మహాబల పరాక్రమశాలి యగు శ్రీరామునితో బద్ధద్వేషమును దెచ్చుకొనిన రావణుడు జీవించుట దుర్లభము మెట్లన

సీ. సీతనుగొనిచని శ్రీరామవిభునిచే మ్రుంగగాడే విరాధుండు మున్ను
ఖరవిరాధాది రాక్షసయోధులల రామచంద్రునిచేతనే జచ్చెగాదె
ఘోరకబంధాది వైరులనెదురించి రణమునజంపడే రాఘవుండు
బలియుడౌ వాలినిబట్టి చంపినవార్త చాలదే తన్నిదర్శనము మనకు
దానవహితార్థమై కడుధర్మసహితమైన నుడులవిభీషణుం డాదరమున
జెప్పినవి రావణునకు రుచింపవయ్యె గావున స్మశానమయ్యె లంకాపురంబు.

వ. అనియిట్లు పెక్కుతెరంగుల రాక్షసకాంతలు విలాపంబులతో

శా. ఆలంకాపురిలో ప్రతిగృహమునం దత్యంతదుఃఖార్తులై
యీలీలన్ దనుజాంగనావితతి పేరెల్గెత్తి వాపోవుటల్
పౌలస్త్యాన్వయ వల్లభుండువిని రోషంబుత్కటంబై క్షణం
బాలోచించి సమీపవర్తులగు దైత్యశ్రేణితోనిట్లనున్.

క. దనుజవరులార గనుగొను డనిలోగన్నరతు గాంచుడస్మద్బలముం
దునిమెద రఘువీరులను రణమున సునిశిత ఘోరబాణములవిముషమునన్.

గీ. కుటిలమతులైన మర్కటకులమునెల్ల సంశయముమాను డిప్పుడే సంహరింతు
పటుభుజాశక్తి జచ్చినభటులకెల్ల నెంతయును దృప్తిగావింతు హితమెలర్ప.

—: రావణుడు యుద్ధమునకు వెడలుట :—

వ. అనివచించి రావణుడు రథమాయత్తపరచి తెండని యాజ్ఞాపింప తదాజ్ఞాను సారము సైనికులు సర్వసాధన సమేతులై సింహనాదము లొనర్చుచు ముందు నడువ అత్యుత్తమంబులైన సైంధవాష్టక యోజితంబైన రథంబధిష్టించి ధనుర్ధారియై ప్రళయకాల యముని చందంబున శ్రీరామలక్ష్మణులుండు స్తలంబున కేతెంచుటయు తత్సమయంబున

మ. కమలాప్తద్యుతిమాసె భూమి మిగులంగంపించె దిగ్భాగముల్
తిమిరచ్ఛన్నములయ్యె వాయువు మహాతీవ్రంబుగావీచె మే
ఘములుగ్రంబుగ రక్తముంగురిసె నిర్ఘాతధ్వనుల్మించె ఘో
రముగా నొక్కమహోల్క ధారుణిపయిన్ వ్రాలెన్ విచిత్రంబుగన్.

సీ. తెరువునజను వేళ తేరివారువముల పాదముల్ కడుతొట్రుపాటుజెందె
ఘోరవిహంగమ క్రోష్టు సమూహంబు లతివికారముగ గూయుంగదొడగె
మిసిమి బంగరుచాయ మెరయు సిడంబుపై గ్రన్నన నొకపెనుగ్రద్దవాలె

వామబాహులతయు వామవిలోచనం బత్యంతముగ కంపమందజొచ్చె
కంఠరవంబు వికారంబుగా రహించె ముఖవికాసంబు చెడె దశగ ఖునకపుడు
దుర్నిమిత్తంబు లెన్నేని దోచుచున్ననైన నవిలెక్కసేయక ననికివెడలె.

వ. రావణుండిట్లు సమరస్థలంబున రాక్షసయోధుల సమరసంరంభంబవలోకించి మహోత్సాహంబున తానును పసిడికట్ల కోదండంబున నారిబిగించి క్రూర శరపరంపరల వానరవీరులపై ప్రయోగించి విజృంభించుటయు

ఉ. కొందరు కంఠముల్ తెగిన కొందరు రొమ్ములు విచ్చిపోయినం
గొందరు శీర్షముల్ ప్రిదుల కొందరు చక్షువులుర్విరాలినన్
గొందరు ప్రక్కలుంబగుల కొందరుశ్వాసములాగిపోయినం
బ్రమంది రనేకమార్గముల మర్కటసైనికు లప్పుడొయ్యనన్.

గీ. సైచుటకుసాధ్యపడని రాక్షసకులేంద్రు బాణవృష్టినొర్వక ప్లవగవరులు
కూతలిడుచు ననేకదిక్కులకు బారి రనలశిఖబారుబర్వ గజాళులట్లు.

వ. రావణుడు వానరసేనలపైబడి చెండాడుచు శ్రీరామచంద్రుని సమీపంబున కేతెంచుట గనుంగొని సుగ్రీవుడు సేనామధ్యమున దొడ్డగండోపలంబొండు ధరించి రాక్షసవీరులపై కురవడించిన భీషణపాదప శిలాప్రహరణంబుల నురుమాడుచుండె నట్టియెడ రాక్షసమూకలు నలుగెలంకుల క్షీణగతిం బొంది భగ్నాంగులై గూలుచుండ విరూపాక్షుడు దనపేరుగ్గడించుచు ధనుర్ధారియై గజారోహణుండై మిగులవాడితూపులను సుగ్రీవునిపై ప్రయోగించుచుండ

—: విరూపాక్షుని యుద్ధము :—

ఉ. తత్క్షణమే ప్లవంగపతి దర్పమెలర్పగ హుంకరించి పెన్
వృక్షమునొండు వేపెరికి వేగమె మింటికిదాటి తద్విరూ
పాక్షుని వారణేంద్రుశిరమందు పటిల్లున మోద నగ్గజం
బాక్షణమందు ఘీంకనుచు నార్చుచు వెనుకకుబోయి కూలినన్.

గీ. భగ్నమై నేలగూలిన వారణమునుదిగి విరూపాక్షుకోరనుండిదిగిచి ఖడ్గ
మొండుచేబూని సుగ్రీవునోర్చువాడ పోలె మెదిరించిధృతితోడ పోరదొడగె.

మానినీవృత్తము :

అంతకపిప్రభుడోర్వక పెండియు నాగ్రహమూని మహాభ్రనిభా
త్యంతసమున్నత శైలమునొండు రయంబున గేలధరించికమున్

పంతముతోడగ ద్రిప్పుచు రాక్షసుపై విసరంగ గనుంగొని వా
డెంతయు లాఘవమొప్పగ నవ్వలికేగ తొలంగి పలుటాపలుటిగన్.

వ. ఇట్లు వ్రేటుతప్పించుకొని విరూపాక్షుడు ఖడ్గంబెత్తి సుగ్రీవునిపై విసరి నట్టియెడ సుగ్రీవుడు ముహూర్తకాలము దిమ్మరవోయి తోడన దెప్పిరిలి

మంజరి :

సుగ్రీవుడు మింటికెగసి తద్దనుజుని విశాలవక్షమునన్
యాగ్రహమున బొడిచె దొడ్డపిడుగట్లపుడు ముష్టిఘాతమునన్
యావ్రేటున కలిగి దైత్యవీరు డపార్వతి సుతుని కవచమును
దీవ్రముగా నరికితన్నినన్ ధాత్రీస్థలిబడె తత్క్షణమున్.

ఉ. తోడన లేచిభాస్కరసుతుండును బెన్పిడుగట్లు మ్రోయుచే
వాడితనంబునన్ దనుజవక్షమునం బొడువంగ బోవుచో
వాడల వ్రేటుదప్పుకొని వానరనాథుని పేరురమ్మునం
బోడిమివాయగా బొడిచె ముష్టితలంబున నత్యుదగ్రుడై.

ద్విపద :

అంతట సుగ్రీవుడసురకృత్యమున కెంతయునుది రోషమెసని శౌర్యమున
బలువజ్రతుల్యమా పాణితలమున నలవిరూపాక్షు యాస్యముపైనిబొడువ
వరదలుగా నవద్వారంబులందు దొరగెడునెత్తుటితోటి ధరిత్రి
కూలిపైకెగుసుచు గూయుచు గ్రుడ్లురాలి నీలిగె వికారముగ నాక్షణమ.

—: మహోదరు యుద్ధము :—

వ. హతుండైన విరూపాక్షుని వీక్షించి వానరసైన్యంబులు మిగుల సంతోషమున నుప్పొంగ నిట్లుక్షీణించిపోవు సైన్యంబుల గనుంగొని రావణుడు కటకటంబడి సమీపవర్తియగు మహోదరునితో నిట్లనియె.

మానినీవృత్తము :

ఓయి మహోదర మద్విజయుం బిపుడొప్పగ యుష్మదధీనము నే
డీయరివీరుల ద్రుంచుము విక్రమమెల్ల ను జూపుము పూర్వము నా
చే యుపకారము బొందితి వెంతయు చిత్తమునన్ గమనించి యథా
న్యాయమునన్ మరిప్రత్యుపకార మొనర్ప నిదే సమయుంబుసుమా!

వ. అనియాజ్ఞాపించుటయు మహోదరుడు సైన్యసమేతుండై వానరవీరులపై విజృంభించి పెక్కువిధంబుల జించి చెండాడుచుండ వానరవీరులు మిగుల నున్నతములైన శైలశృంగముల వృక్షరాజముల పెరికి దైత్యవీరులపై ప్రహరించు చుండి రంతమహోదరుండు మహోదగ్రుండై

ఉ. హాటకభూషణాంచిత శరావళిచే కపిసైన్యకాయముల్
తూటులబారి రక్తమున దోగుచు బాణిపదోరు శీర్షముల్
వ్రేటుకు వ్రయ్యగొట్టుటయు విచ్చి పలాయితులైరి కొందరా
ఘాటికి నిల్వనోడి త్వరితంబుగ డాసిరి వానరేంద్రునిన్.

వ. ఇత్తెరంగెరిగి సుగ్రీవుడు దొడ్డగంగోపలంబెత్తి మహోదరు తరుముచు విసరి కొట్టిన నతడతికౌశలంబున వానిని వ్రక్కలించె నప్పుడు సుగ్రీవుడు వెండియు సాలవృక్షంబును పెరికి విసరివైచిన నతండద్దానిని తీక్ష్ణనారాచంబుల చీల్చివైచె నంత గినిసి పరిఘాయుధంబెత్తి హస్తలాఘవంబుమెరయ ద్రిప్పుచు రక్కసు తేరిగుర్రంబులపై విసరిన నవియొక్కక్షణంబున ధరాతలంబునంగూలె నంత వాడయ్యరదంబుడిగి గదాయుధంబొంది కేలంగీలించి పైకురవడించె నట్ల య్యిరువురు మదించిన వృషభంబులకై వడి పోరాడుచుండి రయ్యవసరంబున

మ. గదచేబూని మహోదరుండు గడుగిన్కం ద్రిప్పి సుగ్రీవుపై
మదమేపారగ వ్రేయ నతడధికామర్షంబుతో లోహపుం
గుదియంజేకొని ద్రిప్పి తద్గదపయిం గొట్టంగ నొండొంటితో
గదియన్ మేటితదాయుధద్వయము వేగందునకై రాలినన్.

గీ. అంత సుగ్రీవుడొక ముసలాయుధమును గొని నిశాచరుపై వ్రేయ గ్రోధమూని
వాడు వేరొండు గదబూని వైచనప్పుడవియు నొండింటిదాకియు నవనిబడియె.

వ. పడంపడి సుగ్రీవుండును మహోదరుండును సాధనవిరహితులై ద్వంద్వయుద్ధము నకు తలపడి

కవిరాజవిరాజితము అష్టపది :

కడురభసంబున బోరిరి తత్ప్లవగప్రభు డల్ల మహోదరుడున్
పిడుగులమాడ్కి పరస్పరముం గడుభీషణ ముష్టితలప్రహతిన్
వెడవెడ సందిడకుగ్రత గ్రుద్దుచు బిట్టుగ నేలకుగొట్టుచు వే
కడగి ఘుజంబులతో విడిపోవగ గట్టిగధీరత బట్టుచు ని

ట్లడరి మహాభయదంబుగ నెంతయునార్చుచు జేతులుగట్టుచు వే
విడివడి వెనక్కుఁబోయి మదంబున వేగమె పైకొని నేట్టుచు రే
మడిసెదవిప్పుడు గ్రుద్దునకే క్షణమాత్రన బ్రేలకుమా యనుచున్.

కవిరాజవిరాజితము అష్టపది :

కరముకరంబున బట్టుతలంపున కౌశలమొప్పగ బైకొనుచుం
దరుణముకై యటవేచి పొరింబొరి తద్దయు వైరినదల్చుచు చె
ట్లురవడిజేయుచు బాహుయుగంబుల నొండొరులుద్ధతిబట్టిపడిన్
గిరగిరచక్రగతిన్ వెసనిద్దరు గేరుచునుబ్బున బంతముతో
జరజర వెనుకకు ద్రోయుచుముందుకు శౌర్యమెలర్పగ నీడ్చుచు ని
ద్ధరణిపయింబడ నెట్టి పయింబడి బాదుచు హస్తతలంబులతో
చరణయుగంబులతో తెగదన్నుచు జానుయుగంబుల మ్రోదుచు మేల్
కరికరి కేసరికేసరి ఢీకొని క్రౌర్యమెలర్పగ బోరుగతిన్.

వ. ఇట్లుభయంకరంబైన ద్వంద్వయుద్ధంబొనరించి మిగులశ్రమజెంది రయ్యవసరంబున మహోదరుండుపట్టుదప్పించుకుని చెంగటపడియున్న ఖడ్గాయుధముచుబరిగ్రహించి యొండొరులు మాత్సర్యమున తిరుముచు నొడిసిపట్ట నుంకించుచు మహోదరుం డొడిసి సుగ్రీవుని చర్మమున దిగబడునట్లు ఖడ్గధారతో మోదెనంత

గీ. చర్మమున నాటియున్న నిశాతఖడ్గ మిప్పలకుదీయునంతలో నినజు డమ్మ
హోదరు కిరీటకుండలాత్యుజ్జ్వల శిరంబు ఖండించె బాహువిక్రమము మెరయ.

—: మహాపార్శ్వుని యుద్ధము :—

వ. అంత తత్సైన్యంబులు నిలువక పలాయితులగుచుండ నదిగనిరావణుడు మిగుల నాగ్రహాగ్రస్తుండయ్యె. సుగ్రీవుడు విజయమున కుప్పొంగి వానరులగూడుకొని సింహనాదములొనర్చిరంత మహాపార్శ్వుడు క్రోధమున నంగదుని సైన్యములపై గవిసి వానరమూక మధ్యమున నిలిచి తచ్ఛరంబులనరికివేయుచుండ దుఃఖించి కొందరు మూర్ఛిలియు కొందరు నికృత్త సర్వావయవులై పడిపోవుచుండి రాసమయమున

ఉ. అంతటనంగదుండు పరిఘాయుధమొండు పరిగ్రహించి దు
ర్దాంతపరాక్రమస్ఫురణ తద్దనుజాగ్రణిపై నిగుడ్ప వా
డెంతయు మూర్ఛమున్గిపడియెన్ రథమధ్యమునుండి సాదితోన్
సంతసమందిరంత కపిసైన్యములుద్ధతితోడ నార్చుచున్.

గీ. సైన్యమధ్యమునుండి జాంబవంతుడును గవాక్షుడిద్దరివల కరుగుదెంచి
గొప్పగండశిలలనుగొని మహాపార్శ్వ రథ్యములతోడ గూల్చిరరదమిలను.

వ. అంత నొకముహూర్తకాలమున మహాపార్శ్వుడు లబ్ధసంజ్ఞుండై జాంబవదంగద
గవాక్షుల బెక్కువాడిములుకుల ముంచితేల్చిన సహింపక నయ్యంగదుండు
త్వరితగమనంబున

మంజరి :

అంగదుండు రోషమునన్నట్టి పరిఘాయుధమును వడిద్రిప్పి
పొంగుచు రక్కసునిపైకివిసరెం బొడవడంగుమనిచెప్పి
యాపరిఘాయుధపు వ్రేటునను నయ్యసురుశిరస్త్రాణంబుం
జాపంబుంద్రోచి క్రిందవైచెన్ సప్రయోగవిశిఖంబున్.

గీ. వాలిసుతుడు మరల వైళంబునన్ మహాపార్శ్వకడకు నేగి పాణితలము
జేత నట్టిమోదె చిత్రరత్నోజ్జ్వల కుండలప్రదీప్త గండసీమ.

ద్విపద :

అంతమహాపార్శ్వ డతిరోషమునను కాంతితోజెలువొందు గండ్రగొడ్డలిని
గ్రక్కునవిసరి యంగదునిపై వ్రేయ మిక్కుటమగునేర్పు మెరయనా వ్రేటు
తప్పించుకొని సముద్ధతితోడ మణుల రొప్పుచు దైతేయుకొమ్ముపైనొక్క
పిడుగునకెనవచ్చు పిడికిటబొడువ బడిద్రెళ్ళి వసుంబుపగిలి వాపుర్వి.

—: రామరావణుల యుద్ధము :—

వ. మహాపార్శ్వుడు హతుండైన రావణుం డక్షికాగ్రహంబున మండుచు
యుద్ధమున కభిముఖుండై సారథితో బ్రగల్భోక్తులాడుచు శ్రీరాముని
సమీపమునకేతెంచి బ్రహ్మచే నిర్మితంబైన తామసాస్త్రమును బ్రయోగించి
వానరులనందర దహించుచుండ వారెల్లరు గుంపులుగుంపులుగా పడిపోవుచుండి
రట్టియెడ

ఉ. రామవిభుండు తత్సమర రంగమునన్ హతులైన వానర
స్తోమము గాంచి తానధిక ఘోరతతో దనపైకివచ్చు దు
స్తామసుడైన రావణుని తద్దయుగన్గొని చాపహస్తుడై
భూమినిద్రచ్చునట్లొనర భూరిగుణధ్వనిజేసె నయ్యెడన్.

గీ. లక్ష్మణుడు ముందు దైత్యవల్లభునితోడ తానుభండన మొనరింపదలచి నిశిత
బాణములనుంచినైన రావణుడు వానినన్నిటిని స్వీయశరముల నడ్డగించె.

గీ. తొడరి సౌమిత్రి నిగుడించు తూపులొకటికొకటి మూటికిమూడు నిట్లొనరబదికి
పదినిగుప్పుచు గరిలాఘవమున రావణాసురుడు దృంచివైచె నత్యద్భుతముగ.

వ. ఇట్లొరంగున విక్రమించి రావణుడు లక్ష్మణు నతిక్రమించి రామునిడాసి కనుల నిప్పుకణములురల శరవర్షంబున ముంచిన శ్రీరాముడు భల్లాయుధమున వానిని నివారించె. ఇట్లు పరస్పరము తీక్ష్ణశరంబుల ప్రయోగించుకొనుచు సవ్యాపసవ్య గతుల నతిక్రమించుచు బాణవేగంబుల నొండొరులు దప్పించుకొనుచు ఘోరముగా బోరాడునెడ సకలభూతభయావహంబై వెలింగె.

సీ. రామరావణుల ఘోరంబైనసంగ్రామ మత్యంత భీషణంబై దనర్చె
శౌర్యతేజోబలోత్సాహసంపదలచే బలవైరి వృత్రులపగిది నడరి
ప్రావృణ్ణీలాభ్ర పటలపరిచ్ఛన్న సమయాంధకారంబు చందమునను
దారుణఘన శరాసారంబు భూమ్యంతరిక్షముల్ గ్రమ్మ వర్షించిరధిక
సమరనైపుణ్యు లుత్తమ చాపధరులు వాయుహతి పైకెగయు మేటివారినిధి త
రంగములపోల్కి తీక్ష్ణశరప్రకరము గుప్పుచు సమానశౌర్యంబు లొప్పుచుండ.

మ. బలశౌర్యోన్నతి రావణుండు విశిఖవ్రాతంబు తద్రామ చం
ద్రు మ లలాటంబున గుప్ప తెప్పలుగ తోడ్తో గుప్పుచుండంగ వే
గిలుకం దద్రఘువంశపావనుడు రౌద్రాస్త్రంబు సంధించి నే
ర్పలరన్ దానవభర్తపైవిడిచె నత్యంతత్వరాయత్తుడై

వ. శ్రీరామప్రయుక్తంబైన రౌద్రాస్త్ర మారావణుని యభేద్యకవచమునకు సోకి నాశనినొందింపజాలదయ్యె. పదంపడి వివిధాస్త్ర విశారదుండగు శ్రీరాముడు ముకులనుత్తమోత్తమములైన శరములెన్నియో రావణుని ఫాలభాగంబునకు లక్షించి ప్రయోగింప నవియెల్ల రావణుండు నవుమన ఖండించుచుండుటయు నవి దీప్తాస్యలువిడుచుచు పంచశీర్షములుగల మహానాగముల విధంబున నిరాశలంబాసం బడియె నట్టియెడ

సీ. తదనంతరక్రోధ మూర్ఛితుడై దశాననుం డసురాస్త్రమనెడు ఘోరాస్త్రమేయు
నదియుం జనిజెడలె సింహ వ్యాఘ్ర కంబుక ఖర వరాహోరగ కంక గృధ్ర
కాక కుక్కుట భుజంగ శ్వాన వృక మకరాద్యనేక భయంకరాననముల
గలిగినమహా నిశితాస్త్ర సందోహ మన్నిదిక్కుల రామునాక్రమింప

తెలిసి రఘురామచంద్రుండు తేజములర నతిసముత్సాహమున పావకాస్త్రమపుడు
చిత్తశుద్ధిగ జపియించి శీఘ్రమునను సంచలింపక వడిప్రయోగించెనంత.

సీ. వెలువడె నందుండి విస్మయకరముగా బహురకముల శరప్రకతి వెలుచ
తరుణార్క పావక తారకా విద్యు దుల్కా ధూమకేతు ముఖంబులలరు
బహువిధ భీషణ ప్రదరంబు లత్యంత వేగవంతంబులై వెల్లివిరిసి
దైత్యరాట్బాణ సంతతినెల్ల ఖండించి విరజిమ్మె దెసలకు వేవిధముల
నంత శ్రీరాముని తదద్భుతప్రభావ పటిమ నెల్లను గాంచి తత్ప్లవగవరులు
జయజయధ్వానములు జేసి సంభ్రమమున నుల్ల సిల్లిరి భూరిబలోగ్రులగుచు.

మ. తనదివ్యాస్త్రము వ్యర్థమైచనగ సంతాపంబునన్ రావణుం
డొనరన్ వేరొక యస్త్రమేయుటయు నత్యుగ్రంబులౌ పట్టసా
శని శూలాంకుశ పాశ ముద్గర గదా చక్రాద్యసంఖేయ సా
ధనముల్ సంభవమంది చుట్టుకొనియెం దద్రామభూకాంతునిన్.

వ. అంత శ్రీరామచంద్రుడు గాంధర్వాస్త్రముచే వానినెల్ల నాశం మొనరించిన క్రోధారుణిత లోచనుండై రావణుడు వెండియు సౌరాస్త్రంబును ప్రయోగించె నందుండి దేదీప్యమానంబులైన చక్రంబు లనేకంబు లుత్పన్నంబులై దశదిశలు నిండిన శ్రీరాముడు వానినెల్ల నానావిధాస్త్ర విశేషంబుల నివారించె నిట్లు కొండొకవడి ఘోరముగా బోరాడుచుండ నింతలో లక్ష్మణుడు క్రోధావేశమున బయల్వెడలి

చ. ఘనవిశిఖేషు సప్తకముగైకొని గ్రక్కున నొక్కదానితో
ననుజకులేంద్రు మేటియరదంబున మానవశీర్ష లక్ష్మతో
దనరు శిరంబుద్రుంచి కడుదర్పమెలర్పగ నూతునొక్కటం
దునిమియు బాణపంచకముతో ధనువుం దునిమెన్ బలోన్నతిన్.

మంజరి .

అంత విభీషణుడుం బైకెగసి దశాననుని రథాశ్వములన్
వింతగ గదద్రిప్పివైవ నిలబడి విడిచెనవియు ప్రాణములన్
యరదము పైనుండి దుమికి రావణుడట్టె మహారోషమునన్
బిరబిర శక్త్యాయుధంబువైచె విభీషణునిన్ శౌర్యమునన్.

మ. కడువేగంబునవచ్చు శక్తిని మహోగ్రంబైన బాణత్రయిన్
విడువన్ మూడుగద్రుంచె లక్ష్మణుడు గిన్కన్ వానరానీక మ

ప్పడు హర్షంబున బొంగియార్చిరి రుచిస్ఫూర్తిన్ మహోల్కాగతిం
బడియెన్ ధాత్రి సువర్ణహారకలిత ప్రస్ఫీతమౌ శక్తియున్.

వ. అంత రావణుండోర్వక

సీ. రావణుండంతట రత్నకాంచన భూషితంబైన దానిని దండధరున
కైన దురాసదంబైన దానిని లసద్ఘంటాష్టకంబుచే గ్రాలుదాని
మునుమాయతో మయుండనువానిచే నిర్మితమై ప్రసిద్ధిగా మెరయుదాని
భిదురోపమధ్వాన భీషణంబగుదాని నధిక ప్రతిభతోడ నలరుదాని
తేరిచూడగరాని ప్రదీప్త వహ్నిశిఖల గ్రక్కుచు వైరుల చెండుదాని
నొక్కశక్త్యాయుధమును నత్యుగ్రమూర్తియై ప్రయోగింప సంసిద్ధమై రయమున.

—: రావణుడు శక్త్యాయుధమును లక్ష్మణునిపై ప్రయోగించుట :—

వ. రావణుడా శక్త్యాయుధమును విభీషణునిపై ప్రయోగింప సమకట్టుటయు ప్రాణాపాయభయంబున శంకించు విభీషణునకు లక్ష్మణుడడ్డముగావచ్చి నిలిచి తదీయప్రహారమును దప్పింప ననేక శరపరంపరల గుప్పించుచుండ రావణుడు విభీషణునిపై ప్రయోగింపవలనుపడక లక్ష్మణునితో నిట్లనియె.

పంచచామరము :

సమరశూర నీబలంబు శ్లాఘనీయ మీతనిన్
సమయకుండ గాచితీవు చక్కనిల్వుమింక ని
న్నమితదీప్తిశొప్ప యిమ్మహాప్రసిద్ధశక్తితో
శమనుపీటి కంపువాడ చండవిక్రమంబునన్.

గీ. దొడ్డ పరిఘాయుధముతోడ తుల్యమైన యిమ్మహాశక్తి నీపేరురమ్ముజీల్చి
రక్తవాహినిదోగి నీప్రాణములను వేగమెహరించి కొనిపోవు వినుముకుమతీ!

వ. అని వచించుచు నత్యంత భీషణంబై వెలుంగు శక్త్యాయుధమును లక్ష్మణునిపై ప్రయోగించె. దానింగాంచి శ్రీరామచంద్రుడు లక్ష్మణునకు క్షేమంబగుగాక యని మంగళాశీర్వాదమొనర్చి యిట్లనియె ఓభీషణంబైన శక్త్యాయుధమా! నీయొద్ధత్యముతో గూడిన ప్రయత్నంబెల్ల నిరర్థకంబైచనుగాక యనివచించు చుండె నింతలో

మ. ఫణిరాడ్భీషణ జిహ్వతోసదృశమై భాసిల్లు తచ్ఛక్తి ల
క్ష్మణు వక్షంబుననాటి తత్క్షణమునన్ క్ష్మామండలిన్ వ్రాలి దా

దుఃఖమూర్ఛాన్వితుడయ్యె నంత రఘువీరుండెంతయున్ మంజుదాభ
మణుఁడౌ సోదరు దుర్దశంగని నిజస్వాంతంబునం గుందుచున్

వ. రావణప్రయుక్తంబగు శక్త్యాయుధముచే మూర్ఛమునింగియున్న లక్ష్మణుని గురించి శ్రీరాముడించుక చింతించి బాష్పపూరిత లోచనుండై ప్రళయకాల వహ్నికీలచందంబున నాగ్రహంబున మండిపడుచు దుఃఖమున కిదిసమయము కాదని ధైర్యమువహించి లక్ష్మణుని రక్షణార్థము తగువారల నియమించి రావణునిపైకురవడించి భయంకరముగా యుద్ధంబొనరించుచుండె నాసమయమున సౌమిత్రి వక్షస్థలమున నాటిన శక్త్యాయుధమును పెరుక వానరులు ప్రయత్నించి తమకు సాధ్యముకాకయున్న శ్రీరాముండద్దానిని పెరికి విరిచి పారవైచె నింతలో రావణుడు మర్మభేదన కరములగు బాణముల శ్రీరాముని పీడింప వానినెల్ల లెక్కసేయక లక్ష్మణుని కౌగలించుకొని దుఃఖముతో హనుమత్సుగ్రీవాదులతో నిట్లనియె.

ఉ. వానరవర్యులార కడుభద్రముగా మరిమీరలెంతయుం
బూనికతోడ లక్ష్మణుని బ్రోచుచు నిచ్చటగాచియుండు డిం
కేనతిపాపశీలుడగు యీదశకంఠుని వేగమే రణ
స్థానమునన్ వధింతున్ భుజశౌర్యము జూపగకాలమిత్తరిన్.

గీ. ప్లవగవరులార సత్యంబు పలుకుచుంటి నీముహూర్తంబులో దనుజేంద్రుడేని
రాముడేనియు లేని ధరాతలమును గాంచెదరుగాక మీరు శీఘ్రమున నేడు.

మత్తకోకిల అష్టపది :

వానరోత్తములార యేమనవచ్చు దుర్నరకోపమం
బైన ఘోరవిపత్తు సంభవమూటచే నిటులెంతయున్
దీనతం గృశియించుచుంటి విధిందొలంగగ శక్యమే
మాననీయ సమస్తరాజ్య రమాధిపత్య వివాశముం
గాననాంతర వాసముంగులకాంత నన్యుడుగొంటయున్
దానవాళితో విరోధము దమ్ముడీగతి గూలుటన్
మానసంబు దహించుచుండె సుమారణస్థలి రావణుం
బూనివేగ వధించి దుఃఖంబుబూర్తిగా విడనాడెదన్.

సీ. ఎవ్వానివథకుగా నీమహావానర వాహిని యిటకు రావలసివచ్చె
యెవ్వానివధకుగా నింద్రసూనునిద్రుంచి యినసుతునకు రాజమివ్వవలసె
యెవ్వానివధకుగా నిమ్మహోదధిపైన సేతునిర్మాణంబు సేయవలసె
యెవ్వానివధకుగా నీకపీంద్రులు తమప్రాణవాయువుల నర్పణ మొనర్చి
రట్టిదుష్టాత్ముడగు రావణాసురుండు బవరమున సేమనాకంట బడియెగాన
బ్రతుకడిక పీడు విషమునేత్రములగల్గు పన్నగముచే కరువబడినవాడవోలె

వ. మీరింక స్వస్థచిత్తులై పర్వతశిఖరమున నిల్చి మాకిర్వురకు జరుగు సమర సన్నాహ మవలోకింపుచుండుడు.

ఉ. రాజకులాభిరాముడగు రాముచియుద్ధ విశారదత్వ మా
రా జగదేకవీరు డితడంచు మహర్షులు సిద్ధసాధ్యులున్
భూజనముల్ జగత్త్రితయ భూతములుర్వరగల్గునంతదా
కాజివిశేషముల్ పొగడునట్టుల ఘోరరణంబొనర్చెదన్.

మంజరి :

అనివచించి త ప్తకాంచనాంచితమైన నిశితబాణములన్
దనుజాధీశ్వరునిపైనవైచెన్ దశరథతనయుడు మిగులన్
రావణు డత్యుగ్రబాణముల త్రద్ఘునలేశు దేహమునన్
వావిరిగాగురసె భీషణంబున వారిదములచందమునన్.

ఉ. అప్పుడు రామరావణు లహంకృతులుల్ల శిలంగ గినక్కమై
గుప్పెడుభూరితీక్ష్ణ శరకోటి పరస్పరమట్లె రాయుచున్
గొప్పరవంబుతో దునిసికూలె ధరిత్రి మహాద్భుతంబుగా
నొప్పె సమస్తభూతభయదోగ్రములై బలుసింజినీధ్వనుల్.

చ. ప్రవిమలదీప్తచాపుడగు బాచుకులేశు శరప్రవృష్టి కా
హవమున నిల్వనోపక రయంబున రావణుండంత లంకకున్
జవమునబారిపోయె భయసంభ్రమముల్ మనముంగలంపగ
పవనహతిన్ చూటాచూటి నభస్థలిబారెడు మేఘమాయనన్.

వ. అట్టియెడ శ్రీరామచంద్రుడు రక్తసిక్తాంగుడై ధరాతలంబున బడియుండు లక్ష్మణునింగాంచి పట్టరానిశోకమూతో దుఃఖించి కొండొకపడికి సుషేణునితో నిట్లనియె.

సీ. ఓయిసుషేణ దైత్యునిచేత నేడిట్లు నాసహోదరుడు ప్రాణములువాసె
ఇట్టిదుస్సహా విపత్తేల సంప్రాప్తించె ప్రబలవిజ్ఞాని మత్ప్రాణసముడు
నాసోదరుడు మరణంబొంద నేనింక బ్రతుకనేటికి సుఖపమటలేల
నుల్లంబుమిక్కిలి తల్లడబడజొచ్చె బలమెల్ల సిగ్గుల తొలగిపోయె
చేతిలోనుండి చాపమిమాత్రికిజారె కనులునశ్రుకణంబులు గ్రమ్మిదృష్టి
చెడె బ్రతుకజాల నికనేమిసేతు స్వప్నయానుగతి పాదములు నేలనానవయ్యె

వ. అని మిక్కిలిదీనముగా వగచుచు

సీ. అత్యంతమర్మాభిహతు మహాదుఃఖార్తుప్రబలమూర్ఛాక్రాంతు పాంసులిప్త
రక్తసిక్తాంగు శూరవరేణ్యు బ్రియతము నిరుపమసద్గుణాన్వితు దయాళు
నిర్గతపరిపూర్ణ నిశ్వాసు నిజబహిఃప్రాణు నితాంతసేవాధురీణు
గాదిలిసోదరు గాంచి శ్రీరాఘవుం డత్యంత చింతాకులాత్ముడగుచు
సారెసారెకు మిక్కిలిజాలిపుట్ట భూతలంబునబడి పడి పొరలిపొరలి
వావిడిచియేడ్చె నాకింకభార్యయేల రాజ్యసుఖమేల రణమేల ప్రాణమేల.

వ. అనిబిట్టూర్పులు సెలంగ బెలుచవిలపించు శ్రీరామునితో సుషేణుండిట్లనియె.

సీ. శ్రీరఘువర విన్ము చింతిల్ల నేల నీయనుగుతమ్మునకు భయంబులేదు
కరతలంబులు మరిచరణయుగ్మంబును పల్లవద్యుతులతో నుల్లసిల్లె
ముఖపంకజము లేశమును కళదప్పలే లబ్ధపత్రములట్లు లక్షులొప్పె
తనుకాంతి మిగులనుత్తమమై ప్రకాశించె మృతులగు వారికీస్థితి వెలయదు
గానునత్కటముగుమూర్ఛ గ్రందుకొనిన లక్ష్మణున కౌమధోపాయ లక్షణముల
జీవితుండగు ధైర్యంబుజెందుమిపుడ మరియు దీర్ఘాయువొందు సుమాయితండు.

గీ. అవయవంబులుజారి యుట్లవనియందు పడికదలకున్న సౌమిత్రి ప్రాణయుక్తు
డనుట కీతనిహృత్పుటం బదరియదరి శ్వాసయాడుచునుండె నిస్సంశయముగ.

వ. సుషేణుండిట్లు శ్రీరాముని ధైర్యోక్తుల నూరడించి సత్వరంబున హనుమంతుని
చేరంజీరి యిట్లనియె వాయునందనా! జాంబవంతుండు మున్ను నీకెరింగించిన
యోషధీపర్వతమునకు శీఘ్రముగాజని యంగుగల సంజీవకరణి సంధానకరణి
సావర్ణకరణి విశల్యకరణి యనుయోషధుల సంగ్రహించుకొని రమ్ము
తదీయోషధీ లతలప్రభావంబున లక్ష్మణుండును తదితర వానర భల్లూక
ప్రముఖులు జీవింపగలుగుదురు యీకార్యనిర్వహణమునకు నీవేసమర్థుండవని
పలుక వల్లెయని తదాదేశానుసారము హనుమంతుండు బయల్వెడలి యంత

రిక్షంబునకు లంఘించి వాయువేగంబున యోషధీపర్వతంబునకరిగి యచ్చటచ్చట
సంచరించి తదీయోషధు లెరుంగజాలక మిగులవగచి యించుక యోచించి

మ. గిరిశృంగంబు నుబట్టి యాడ్చి భుజశక్తిన్ లాఘవంబొప్ప నే
డ్తెర వైళంబ పెకల్చి హస్తమున బంతింబోలె గీలించి ఖే
చరమార్గంబున వాయువేగమున భాస్వద్దీప్తి నేతెంచి వా
నర యూధంబులమధ్యలో దిగియె సైన్యవ్రాతమగ్గింపగన్.

గీ. శైలమును దింపి యించుక శ్రమమువావుకొని సుషేణునితో నిట్టులనియె ననఘ
యోషధుల గుర్తెరుంగలేకొనర నిమ్మహౌషధీశృంగమును దెచ్చియుంటి గంటే

మంజరి :

అనుడు సుషేణుండు సంతసంబున హనుమంతుని శ్లాఘించి
కొనియెన్ దివ్యౌషధీలతాతతి కొండనెల్ల శోధించి
తదనంతర మౌషధులను మృదువుగదంపి చూర్ణ మొనరించి
గదియగ నేతెంచి లక్ష్మణున కాఘ్రాణింపించెన్ మించి.

వ. దేవతాప్రముఖులకేని సాధ్యపడని హనుమంతుని మహత్తర కార్యనిర్వహణము
నకు వానరరాక్షసులు మిగుల నాశ్చర్యచకితులై రనంతరంబ

శా. ఆదివ్యౌషధ చూర్ణమున్ రఘువరుండాఘ్రాణముంజేసి ని
ష్ఖేదుండై శరశల్యబాధల విముక్తింజెంది కూర్చున్న స
మ్మోదంబంది సుషేణునిన్ కపిచమూముఖ్యుల్ ప్రశంసించి పెన్
న్నాదంబుల్ దివిముట్టనార్చిరి కమున్ నానాప్రకారంబులన్.

గీ. అంత శ్రీరాము డశ్రుపూర్ణాక్షుడగుచు ననుగుదమ్ముని సోదరాయని ముదమ్మొ
గదుర లక్ష్మణు గట్టగాగౌగలించి యెలుగురాపడ మెల్లన పలికెనిట్లు.

ఉ. గాదిలిసోదరా నిను సుఖస్థితితో జెలువొంద వెండియున్
మోదముతోడ గాంచితిని మున్నొనరించిన పుణ్యముల్ ఫలో
త్పాదకమయ్యె తండ్రి యము బారికి దప్పితి పెట్టిభాగ్యమో
ఖేదము బాయగంటి నికగీటడగించెద నీదశాననున్.

క. నీవు మృతింగనుచో నేజీవించిన ఫలముగలదె సీతకుగా త
ద్రావణుని ఖంపనేటికి ప్రావీణ్యమెలర్ప జయముబడయగనేలా!

వ. ఇట్లెంతయు దీనముగా భాషించు శ్రీరామునితో లక్ష్మణుడు ధైర్యోత్సాహము
లతో నిట్లనియె.

మ. అనఘా! నీకుశశించి తెల్పుటకు నేనర్హుండనే మున్ను వా
గొసియున్నట్టి ప్రతిజ్ఞదీర్పనలదే క్షోణీస్థలంబందు స
జ్జనవర్గం బెటువంటి సంకటములున్ సంప్రాప్తమైయున్న దా
మనియున్నట్టి ప్రతిజ్ఞ తీర్చుటకుగా యత్నింతు రత్యంతమున్.

ఉ. మానవనాథ నీకొక ప్రమాదమటంచు నెపంబుతో రణ
స్థానములోన నివ్విధి విచారమునన్ ధృతిదూలుటొప్పునే
భానుడు పశ్చిమాబ్ధి జొరబారకమున్నె పరాక్రమోన్నతిం
బూనికదీర్చి సద్యశము బొందుము శత్రునిబర్హణంబునన్.

చ. సమరమునన్ దశాననుని జంపి మహావిభవం బెలర్ప
ప్రమదమునన్ విభీషణుని పట్టముగట్టెదనంచు నీకపి
ప్రముఖులమధ్య వాకొనినభంగి ప్రతిజ్ఞ సమాప్తిజేయు లె
మ్మమలచరిత్ర రావణుని నాలమునం బరిమార్పుమిత్తరిన్.

—: రామరావణుల యుద్ధము :—

ఉ. నావిని రామచంద్రుడు మనంబున ధైర్యమూనూని లేచి పెం
జేవదలిర్ప జాపమున చెచ్చెర బాణములెక్కుపెట్టి త
ద్రావణు మేనగుప్పుటయు రాహువు సూర్యునెదుర్చుకై వడిన్
రావణుడార్చుచున్ గదిసె రాముని వేకొక తేరుపైపడిన్.

వ. రామరావణు లిర్వురు తలపడి భీషణాశని సదృశంబులైన శరపరంపరల నొండొరులు దీవ్రంబుగా ప్రయోగించుచుండుటయు రణస్థుండగు రావణునితో భూగతుండైన శ్రీరాముడు పోరాడుట సమంజసముకాదని యోచించి దేవతా ప్రముఖులు దేవేంద్రునితో విన్నవింప నతడు తనదివ్యకాంచన రథంబును శ్రీరాముని సహాయార్థము గొనిపొమ్మని మాతలి కాజ్ఞాపింప తదాజ్ఞానుసారమున మాతలి రథమాయత్తపరచుకొని శ్రీరాముని సాన్నిధ్యమునకు పయనంబగుటయు

సీ. అరదంబరుగుచుంచె నంతరిక్షమునుండి త్వరితగతిం జగత్త్రయమునందు
జరియింపగల మేటిశక్తి గల్గినదియుచు దశుణార్కరుచుల దిక్తటములెల్ల
వ్యాపించునదియు దివ్యవిభూషణాళిచే నత్యంత శోభతో నలరునదియు

పరిపూర్ణ శిల్పకల్పనములతో నిండి వరకింకిణీగణ ధ్వనులు శ్రవణ
పర్వ మొనరింప సురుచిర ధ్వజము మెరయ ఛత్రచామరములు
గ్రాల చతురగమున
భాసురాలంకృతుల హరిద్వర్ణ పూర్ణసైంధవ చతుష్టయముతో డసముచితముగ.

వ. అట్లలరారు రథమునుగొనివచ్చి మాతలి శ్రీరాముని సన్నిధానమున నిలిపి
కృతాంజలిబంధురుడై శ్రీరామునితో నిట్లని విన్నవించె.

ఉ. వీరరఘురామచంద్ర పురుహూతుడు మీవిజయంబుగోరి నే
డీరథమంపె దివ్యమగు యిమ్మహనీయ ధనుర్వరేణ్యమున్
దారుణమైనశక్తియు సితప్రదరంబులు వర్మమున్ మహో
దారతబంచె గావుత ముదంబునదాల్చి రిపున్ వధింపు మా!

గీ. ఏను సారథ్య మొనరింతు నిమ్మహారథంబుపైన నధిష్టించి డంబుమీర
రావణుని ద్రుంచుమిప్పుడ రణమునందు దేవపతి దైత్యవరుల వధించినటుల.

వ. అనివిన్నవించు మాతలి ప్రియోక్తుల కియ్యకొని శ్రీరామచంద్రుడు ప్రదక్షిణ
నమస్కార పూర్వకముగా రథావరోహణంబొనర్చె ననంతరంబ రామరావణుల
కిద్దరకు రోమహర్షణంబైన సంగ్రామంబు ప్రవర్తిల్లె నప్పుడు పరమాస్త్రవేది
యైన శ్రీరామచంద్రుడు రావణప్రయుక్తంబులైన గాంధర్వాస్త్రంబునకు
గాంధర్వాస్త్రంబును దైవాస్త్రమునకు దైవాస్త్రంబును ప్రయోగించి ప్రతి
హతంబుగావించె నంత

సీ. కాంచనభూషణ కలితంబులై భయంకర విషజ్వాలలు గ్రక్కు-ఘోర
సర్పబాణముల రాక్షసవల్లభుడు రామచంద్రునిపై నేయ సత్వరమున
గాకుత్స్థతిలకుండు గారుడాస్త్రంబున నాశ మొందించె తన్నాగములను
దానినెరింగి దైత్యవిభుండు కోపించి శరవృష్టినంత దాశరధి దివ్య
కేతనంబును పడగూల్చి మాతలిని భయంకర శరాళి మోది తదశ్వములను
బిట్టుప్రహరించుటయు వినువీధి దేవముఖ్యులు విషాదజలనిధి మునిగిరంత.

గీ. ఆలమున నప్పుడపరిమితార్తి గుందు శ్రీరఘూత్తముగని సురసిద్ధసాధ్య
వర్యులు విభీషణుడు కపిప్రముఖులెల్ల పరితపించిరి దుర్వ్యథాభారమునను.

గీ. రావణుండను రాహువు, రాముడనెడు చంద్రుని గ్రసించుటయును
తత్సమయమందు
ప్రజలకు శుభావహంబుగా వరగబుధుడు మించి రోహిణిననుడాక్రమించెపొంచి.

వ. అయ్యవసరంబున

సీ. ప్రబలధూమావృత భంగసంగములతో నాదిత్యుని గ్రసించె నంబురాశి
రవి కాంతిచెడి మందరశ్మలతో దివిధూమకేతువు తోడ తోచుచుండె
నైఋత్యకులకు ముఖ్యమైన విశాఖనక్షత్ర మంగారకు గదిసెనంత
పదిశిరంబుల నిరువదిబాహువుల దశాననుడు గన్పట్టె మైనాకుకరణి
సమరరంగంబునందు దాశరధి రావణాసురునిచే దిరస్కృతుండై శరాళి
నెక్కు బెట్టంగజాలక మిక్కుటముగ గోపసంరక్త నయనుడై యేపుమీరె.

ఉ. ఆ రఘురాము భీషణముఖాంబుజముం గని సర్వభూతముల్
భూరిభయంబునం జెదరె భూమిచలించె వడంకె శైలముల్
వారినిధుల్ గలంగె ఖగవర్గము గూసె కఠోరవాక్కులన్
వారిదపంక్తు లెంతయు నభస్థలి గర్జలొనర్చె పేరిమిన్.

వ. ఇట్లు పెక్కుమహోత్పాతంబులు బయల్వెడలుటయు గనుంగొని సకల ప్రాణులును రావణుండును భయకంపితులై రట్టియెడ విమానారూఢులగు దేవ గంధర్వ సిద్ధసాధ్యాది వియచ్చరులు రామరావణయుద్ధ సంరంభంబున ప్రళయ కాల సన్నివేశంబుకరణి నొప్పుటగనుంగొని శ్రీరామచంద్రా! నీకుజయం బగుగాక యని మరిమరి యరచుచుండగా దానవులు రావణునకు జయంబగు గాక యని జయజయధ్వానముల గావించుచుండి రాసమయంబున

గీ. అతిపరాక్రమాఢ్యుడగు రావణుండు శూలాయుధమును కేలనమరదాల్చి
సింహనాదమట్లు జేసి శ్రీరాముని గాంచి పలికె నిట్లుకర్కశముగ.

చ. నిలునిలు మెందుబోయెదవు నిన్ బరిమార్చెద రాఘవా సము
జ్జ్వలిత మహాగ్నికీలగతి శాత్రవవీరుల గాల్చివేయు ని
స్తులమహిమం బ్రకాశిలెడు శూలమిదే చనుదెంచె గాచి
కొమ్మలఘు పరాక్రమస్ఫురణ నాగుము నేటిరణాంగణంబునన్.

వ. రావణుండిట్లు రౌద్రంబుగా నార్చుచు శూలాయుధమును శ్రీరామునిపై ప్రయోగింప ఘంటాష్టక సమలంకృతంబైన శూలము విద్యున్మాలికపోలిక మెరయుచు భీషణధ్వనితో బయల్వెడలి వచ్చుటగనుంగొని శ్రీరామచంద్రుడు బహువిధాస్త్రముల ప్రయోగించిన వాటినెల్ల నగ్ని మిడుతలగాల్చిన విధంబున దోదాయుధముల దహించె నిట్లుశూలాయుధ స్పర్శంబున శరవర్గంబెల్ల భస్మీ పటలంబై చనుటెరింగి

శా. శ్రీరాముం డథిశాగ్రహంబున సునాశీరుండు బుత్తెంచె నే
ఘోరంబౌ బలుశక్తి దానినివడిన్ గొంచుం బ్రయోగించినం
దారామండలమంట మంటలెగయం దమ్మ్యాలముం జీల్చినన్
భూరిధ్వానముతోడ నిప్పురిభలతో భూమీస్థలిం గూలినన్.

మంజరి :

పదపడి శ్రీరాముడుగ్రుడై బహుబాణములను సంధించి
పొదలుచు రా·ణుని వారురంబుల పొడవడంచె లక్షించి
వాడియైన మూడుబాణముల రావణుని వక్షమునగొట్టి
తోడన మాడమ్ములసురవిభు నుమటమోదె సంతంజలపట్ట.

గీ. రాము శరవిద్ధగాత్రుడై రావణుండు నిజసమస్తాంగకముల శోణితము పార
ముగ స్రవింపగ బూచినమోదుగట్లు తగ బ్రకాశించె దైత్యయూథములమధ్య.

వ. ఇట్లు రామబాణపీడితుండై రావణుండు విరుతివియక తటాకముచు వర్ష జలముచే నిండించు జలధరమ్ముల్లు వేనవేల సాయకానీకంబుచు శ్రీరాముని గుప్పింప వర్ష ధారలకు జలింపని మహాశైలంబుకరణి శ్రీరాముడు జలింపక నిజశరాసారంబున వానినడ్డగించుచు ధైర్యముతో పోరాడుచుండె ఇత్తెరంగున వారలిద్దరకు మహాభయంకరంబైన పోరాటంబు జరుగుచుండ శ్రీరాముని శరీరము పుష్పించిన యశోకంబుగానొప్పె. రామరావణ ప్రయుక్త శరవృష్టిచే భూమ్యంతరిక్షంబులు గ్రమ్మి గాఢాంధకార బంధురంబైయొప్పె నట్టియెడ శ్రీరాముడు హాసన్ముఖుండై రావణునితో నిట్లనియె.

సీ. శూరుడననుచు సంస్తుతిజేసుకొనెదు ఛీ! నీపౌరుషంబతినీచతమము
కానలో నేసమక్షమమున లేకున్నతరి పరదారను తస్కరించి
పారిపోయిన నీచ వర్తనుడవు లజ్జవిడిచి నేనొక మహావీరుడనని
గర్వించెదేల రాక్షసకులపాంసన మృత్యువిప్పుడె నిన్ను మ్రింగివైచు
నీతివిరహిత! వనములో నేను గాంచుచుండ సీతను గొనిచను చుండితేని
మచ్ఛరాసన నిర్ముక్తమార్గణముల శావాహుతియొనర్చి ఖరుచెంత కనిపియుందు.

సీ. దైత్యకులాధమా దైవయోగమున నాకగపడితివి కాన నతినిశాత
సాయకముల నిను జముపీటికనిపెద జ్వలితకుండలముతో సమరభూమి
పాంసుదూషితమైన భవదీయశీర్షముల్ క్రవ్యాదగణము చక్కగభుజించు

కంకగృధ్రము లతికాకూహాలంబున నీపేరురముజీల్చి నెత్తురాను
గరుడపక్షులు పెనుపన్నగముల నొడిసిపట్టుకొని పోవుపగిది మద్బాణశిఖల
హతుడవై పడియుండు నీయాంత్రములను యీడ్చుకొని తిను
గృధ్రాదులీక్షణంబ.

వ. ఇట్లుపాలంభనంబొనర్చుచు శ్రీరాముడు క్రూరనారాచంబుల ననేకవిధంబుల తొడిగి రావణునిపై గుప్పించుచుండుటయు

ఉ. రావణు డ్రుంపగాదలచు రాముని విక్రమ మస్త్రసారముల్
చేవయు హర్ష మున్ ధృతియు జేవడియున్ ద్విగుణీకృతంబులై
దావలమయ్యె నట్టియెడ తద్రఘువర్యుని మ్రోల నప్పుడ
స్త్రావళులెల్ల నెంతయు ప్రియంబుననిల్చె ప్రసన్నమూర్తులై.

వ. శ్రీరామచంద్రుడందుల కెంతయుసంతసించి ధైర్యోత్సాహములతో వెలుగొందె తత్సమయంబున

గీ. దశరథాత్మజుడంత నిజాత్మలోన ప్రబల శుభచిహ్నములగాంచి భండనమున
జయము చేకూరుననుబుద్ధి సత్వరమున దశముఖుని మీన
బహువిధాస్త్రములమొంచె.

మంజరి :

ఇంచుకసందీక దశరథాత్మజు డెంతయు శరవర్షమునన్
ముంచె శిలావర్షమున దశాననుమోదిరి కపులాలోనన్
అతులభీషణాకృతి నలువొందు మహాహవసంరంభమునం
దటకాపడిపోయె గుండెలవియగ దైత్యేంద్రుండు భయాన.

మ. శరసంధానము సేయ లేదు విలసచ్చాపంబు దోశ్శక్తిమై
సరిగా నీడిచికట్టలేదు వివిధాస్త్రంబుల్ రఘూత్తంసునం
దరయన్ భేదన భేదనక్రియల జేయన్ లేక విభ్రాంతుడౌ
సురవిద్వేషి యవస్థజూచి రథమున్ సూతుండు ద్రిప్పెన్ వడిన్.

వ. సూతుడు రావణుని రథమును మరల్చుకొని యుద్ధరంగస్థలమునుండి తొలంగ దోలుకొనిపోవుటను సహించక రావణుడు క్రోధోద్రేకముతో సారధితో నిట్లనియె.

మ. బలశౌర్య ప్రతిభావిహీనుగతి మద్భావంబు గుర్తింపలే
కిలపై నాకపకీర్తిహేతువగు నట్లిభ్భంగి సంగ్రామ మం
దెలమిన్ శత్రుసమక్షమంబున మహాహీనస్థితిం దేరుని
వ్వలకుం ద్రిప్పి పరాభవించితివి కాపట్యంబునన్ దుర్మతీ!

వ. అనికోపింప వాశిట్లనియె ప్రభూ! గొప్పయుద్ధరంగస్థలమున నీవుపరిశ్రాంతుండవై యుండినట్లు గ్రహించి నీకొకింత విశ్రాంతిగలిగించు తలంపున నిట్లుతోలంగ ద్రోలితి. అదియునుంగాక రథవాహములు మిగులశ్రమచే ఖిన్నములై ధైర్యముచెడి యున్నవి అదియట్లుండ మనకు బెక్కుదుర్నిమిత్తములు పొడసూపుచుండె తత్కారణమున వివేకియగు సారథి దేశకాల శుభాశుభ నిమిత్తంబులనరసి రథికుని బలాబలంబులను శత్రువీరుల శక్తిసామర్థ్యంబులను గుర్తెరింగి రథమును నడుపవలయును గాన సమయానుకూలమున బ్రవర్తించితిని యీవిషయమున నాగ్రహింపక క్షమించవలయుననిన రావణుడు సంతసించి యిట్లనియె సారథీ! రావణుడు యుద్ధరంగమున శత్రువుల వధింపక వెనుకకు మగలడు గావున మనరథమును రామునివైపునకు మరల్పుమని పల్కి తనచేత నున్న యుత్తమాభరణమొండు సారథికి బహూకరించె ననంతరంబ సారథి రథ్యముల శ్రీరాముని సమ్ముఖమునకు తోలినిలిపె నాసమయమున రామ రావణుల యుద్ధావలోకన తత్పరులై యేతెంచు దేవతాప్రవరులతో నరుదెంచిన అగస్త్యమహర్షి యుద్ధపరిశ్రాంతుండైయున్న శ్రీరాముని సమీపమున కేతెంచి యిట్లనియె.

సీ. వినుము శ్రీరఘురామ వివరింతు నొకసనాతన రహస్యము నీవు నని పగతుని
హతమొనర్పంగల వాదిత్యహృదయాఖ్య నలరు యిమ్మంత్రంబు ననవరతము
భక్తిపూర్వకముగా పఠనంబొనర్చిన పరిపూర్ణ సౌఖ్య సౌభాగ్యకరము
ఘనతరాయుర్వృద్ధి కరము మహాపుణ్య ఫలదంబు విజయ సంపత్కరంబు
సకలపాప ప్రణాశంబు సర్వవిబుధ వరసురర్షి ప్రముఖ జనోపాస్యమఖిల
దుఃఖనాశంబు సకలసంతోషకరము నీవనుష్టింపు మిపుడతినిష్ఠతోడ.

వ. అని తన్మంత్రప్రభావంబెరింగించి శ్రీరామునకాదిత్యహృదయమను మంత్ర రాజమునుపదేశించి శ్రీరామచంద్రా! యీమంత్రప్రభావంబున యీక్షణంబున రావణుని సంహరింపగలవని యాదేశించి అగస్త్యమహర్షి వెడలిపోయె. అనంతరంబ శ్రీరామచంద్రుడు శుచియై ముమ్మారు ఆచమనంబొనర్చి

సూర్యాంతర్వర్తియైన శ్రీమన్నారాయణుని వీక్షించుచు ఆదిత్యహృదయ స్తోత్రమును జపించి మిగులసంతోషముతో కోదండధరుండై రావణునిపైకురవడించె పిమ్మట శ్రీరాముని స్తోత్రమునకు పరమప్రీతుండై ప్రభాకరుడు రావణుని వినాశకాలము సన్నిహితమయ్యెగావున సత్వరంబ వధింపవలయునని సర్వ దేవతాసంఘమందుండి వచించె నంత మిగుల నందముగానొప్పు రావణుని రథ మవలోకించి శ్రీరాముడు మాతలితో నిట్లనియె.

చ. కనుగొను మప్రదక్షిణముగా నదె వైరిరథంబువచ్చె వీ
డని నిజనాశనార్థముగ నా-యితమయ్యె గిజంబుమాతలీ
మనరథ మిప్పుడాతని సమక్షమం దతిజాగరూకతం
జనదగు, గాడ్పుమేఘమును జయ్యనద్రోచిన భంగితోలెడన్.

వ. అని యాజ్ఞాపింప మాతలి రథమును రావణున కభిముఖముగా నడపె నంత రామరావణు లిద్దరు జయాభిలాషులై మహోద్రేకముతో బోరాడుచు సింహములవగిది భయంకరముగా యుద్ధంబొనరించుచుండి రయ్యవసరంబున

సీ. రావణాసురుని తద్రథముపై వర్షించె రక్తవర్షమును పర్జన్యుడంత
నప్రదక్షిణముగా నఖిలదిక్కులనుండి వేడిగాడ్పులు బయల్వెడలె బెలుచ
నెందెందు రథమేగె నందందు వినువీథి గద్దలగుంపు వేగముగ ముసరె
భీషణధ్వనులతో పిడుగులు తొడితొడి నుల్కాతతులతోడ నుర్విరాలె
పగలు లంకాపురంబు జపాప్రసూన సన్నిభంబై కడుంగడు సాంధ్యరాగ
రుచిదనర్చె దశాననుప్రోల మిగుల భూమికంపించె రాక్షసస్తోమమదర

గీ. రామరావణులల్ల ఘుపోరాటమప్పు డిరు తెగల సేనలును గాంచుచెలమి విస్మి
తాత్ములై యోధులును పోరాటదక్కి చిత్తరువులట్లు నిలిచిరి చేష్టలుడిగి.

మంజరి :

రావణుండు క్రోధంబుగదుర నారాచంబును సంధించి
చేవాడితనంబు మెరయ రాముని సిడమునవిడిచెన్ మించి
ఆశర మయ్యెందుసిడముతగులక నవనింగూలె రయమునన్
దాశరథియు రోషమున బ్రతిక్రియదలచె నంతహృదయమునన్.

ఉ. అంతట రామచంద్రుడు భయంకర సర్పసమాన బాణమున
త్యంత దురాగ్రహంబున రయంబెసగం గడిమిన్ నిగుడ్చినన్
వింతగ నమ్మహాశరము వేగమునన్ దశకంఠు తేరునం
గాంతులుజిమ్ము కేతనము గ్రక్కునద్రుంచె ధరాస్థలింబడన్.

ద్విపద :

అయ్యెడరావణుం డధిశాగ్రహమున చయ్యన కడువాడి శరములదొడిగి
రాముని తేరి గుర్రములపై విడువ తామరతూండ్ల మాత్రమునదలంచి
చలియింపకున్న నా సైంధవములను పలు తెరంగుల తీక్ష్ణ బాణముల్ బఱపి
వీడించె వెండియు భీషణమైన వాడిములుకుల జడివాన గురిపించె.

ఉ. పిమ్మట శ్రీరఘూత్తముడు భీషణమైన మహాసిదూసి
చాపమ్మునగూర్చి రావణుని భాసుర కుండల మండితోత్తమాం
గమ్మునుద్రుంచె ద్రుంచుటయు గ్రక్కున నయ్యెడ నొక్కగ్రొత్త శీ
రమ్ముదయించె దానినొక శాతశరంబునద్రుంచె వెండియున్.

మంజరి :

అచ్చోటనె మరలనొకశిరముదయంబయ్యెన్ చిత్రముగన్.
గ్రచ్చర వజ్రోపమానశరమున ఖండించెన్ కడువడిగన్
యీవిధమున రావణాసురుని తలలేకోత్తరశరమవుడు
ప్రావీణ్యమెలర్ప నరికివైచెన్ బాహుశక్తి రాఘవుడు.

గీ. శ్రీరఘూత్తముడటుల తచ్ఛీర్షములను నరికివైచినకొలది పునఃపునప్ర
వర్ధమానములగుచు రావణుడు చావకునికి యోచించె నిట్లునెమ్మనములోన.

సీ. ఏమికారణమొ నేడీరావణుడు చావడేమని బుద్ధినూహింపనగును
సామాన్యములె మదస్త్రములు శస్త్రంబులు ఖరదూషణాది రాక్షసులనెల్ల
హతమార్చలేదె మహాహవంబుల నిప్పుడేమయ్యె తద్బలంబితనిపట్ల
పరమేష్ఠియొసగిన వరదానమహిమయో దనుజేంద్రు మాయావిధానమేమొ
కానిచో ఘోరసర్పోపమాన తీక్ష్ణశరసమూహం బితనియందు శక్తిహీన
మగుచు శిరములనేకంబులద్భుతముగ నుద్భవంబగుచున్న విట్లుక్కటముగ.

వ. అనివితర్కించుచు శ్రీరాముడు కడుంగడు కౌశలమున పెక్కు తెరంగుల
విసువక శరవర్షమున రావణుని ముంచి తేల్చుచుండ నతండేమాత్రము వీసరబోక
పోరాడుచుండుటయు వియచ్చరు లాశ్చర్యంబుగా గనుగొనుచుండిరిట్లు క్షణ
కాలంబైన విశ్రాంతిలేక రణంబొనరించుచున్న శ్రీరామునియందు జయం
బేమాత్రము వికాసపడకున్న గనుంగొని మహామేధావియగు మాతలి
శ్రీరామునకు స్మృతికిదెచ్చుచు నిట్లనియె.

ఉ. అస్త్రమహత్వముం దెలియనట్టి నరేంద్రునిఁబోలిక దైత్యుఁడున్
శస్త్రములేయ వానిపయి శస్త్రములే నిగుడించె దేల బ్ర
హ్మాస్త్రము నెక్కుబెట్టి దనుజాధిపునిం బరిమార్పు మీవు స
ర్వాస్త్రవిదుండ వెంతయు మహారథ కాలవిలంబ మేటికిన్.

గీ. దనుజపతి నరునిచే జచ్చునను చు దేవసమితి వ్రాకుచ్చియున్నట్టి సమయమిపుడు
సన్నిహితమయ్యెగావున సంశయింపవలదు తగిన ప్రయత్నంబు సలుపుమనఘ.

వ. అని ప్రబోధించుటయు తత్క్షణంబ

శా. అంతన్ శ్రీరఘురామచంద్రుడు డల్ బ్రహ్మాస్త్రంబు మంత్రించి దు
ర్దాంతక్రోధ దురీక్షణుండగుచు కోదండంబు కర్ణాంతప
ర్యంతంబుద్ధతిసేద్చి వైచుటయు నయ్యస్త్రోత్తమంబట్టి క
ల్పాంతాగ్నిద్యుతి నద్దశాస్యుయుర మత్యంతత్వరం జీల్చుచున్.

ఉ. రావణుజీవముల్ దిగిచి రక్తముతో శరముర్వి జొచ్చి త
ద్భూవివరంబునుండి రఘుపుంగవు మేల్ పొదిజేరె నంతద
ద్రావణుడాక్షణంబున ధరాస్థలిగూలె శరాసనంబుతో
వావిరివృత్రు డాలమున వాసవుచే హతుడైనచాడ్పునన్.

వ. రావణుండిట్లు హతుడగుటయు హతశేషులైన రక్కసులు హాహాకారంబులు సేయుచు ననాథలై సకలసాధనంబులువిడిచి నలుదిక్కులకు విచ్చిపారిపోవుటయు విజయలక్ష్మీసమేతులై వానరులు సింహనాదంబులుసేయుచు కోలాహలంబుగా గంతువేయుచు సంతోషముతో పొంగిపోవుచుండి రట్టియెడ

సీ. అంతరిక్షమునుండి యమృతాంధసులు దివ్యకుసుమవర్షంబును గురిసిరంత
బృందారకశ్రేణి దుందుభుల్ మ్రోయించి రభినుతించిరి రామునమరవరులు
ప్రాణతర్పణములై గాడ్పులు వీతెంచె దిక్తటంబులు మహాదీప్తిబొప్పె
గ్రహతారకలతోడ గగనంబుభ్రాజిల్లె భానుమండలము సుప్రభలనలరె
విశ్వకంటకుడగు దైత్యవిభుడు మ్రగ్గ జయజయధ్వానములతోడ సకలసిద్ధ
సాధ్యచారణగంధర్వసమితి మిగులహర్షమును బొందిరవని సౌఖ్యమునబొదలె.

గీ. అంత శ్రీరఘువరు విజయమున కఖిలకపులును
విభీషణుండు లక్ష్మణుండు మొదలు
గాగల సుహృజ్జనంబులు గడుముదమున జేరిపూజించి రత్యంత గౌరవమున.

గీ. శత్రుహరుడైన శ్రీరామచంద్రుడపుడు స్వజనపరివృతుడై సముత్సాహమున బ్ర
కాశిలె సమస్తగీర్వాణగణముతోడ బరివృతుండైన సుమనస్ప్రభుడువోలె.

వ. తదనంతరంబ మృతుండై ధరాతలంబున బడియున్న రావణుని సమీపంబునకరిగి
విభీషణుడు చింతాభరంబున నిట్లని విలపింపందొడంగె.

మ. హతిమైపోయితివే సహోదర సుతాప్తామాత్యవర్గంబుతో
నతులాత్యుత్తమతల్పమందు కడుసౌఖ్యంబొప్ప నిద్రించు నీ
వతిహీనస్థితి ధూళిధూసరిత సర్వాంగుండవై ధాత్రి నీ
గతి నాపన్నత బొందుచుంటి వకటా గర్వాతిరేకంబునన్.

సీ. రాక్షసప్రభుడను వృక్షరాజమును రఘుప్రభుడను గాడ్పుగూల్చివైచె
దానవేశ్వర మదదంతావళమును రాఘవఘోరసింహంబు గదిసిచంపె
దానవాధీశ్వర దావానలమును సీతాధిపాంబుదము చల్లార్చివైచె
నసురకులేశ మహావృషభంబును శ్రీరాముడను పులి చీల్చెనకట
దైవయోగంబెవరికేని దప్పనశమె సకలభువనాతిభీషణ శౌర్య వీర్య
ధుర్యుడగు రావణాసురు తుదకు రామవిభునిచే హతుడగునంచు విధివిధించె.

వ. అని యివ్విధంబున విషాదహృదయుండై పలవించు విభీషణునకు శ్రీరామ
చంద్రుడు హితపూర్వకముగా నిట్లనియె విభీషణా! త్రిలోకదుర్జయుండగు
రావణుడు రణస్థానమున హతుండయ్యె. పరలోకమున మేలుగలుగవలయునని
కోరుపురుషులు యుద్ధరంగమున హతులగుదురు. క్షత్రియధర్మము నాశ్రయించి
మృతులగువారి విషయమున దుఃఖింపదగదు కావున నీవింక నాలసింపక నితనికి
సంస్కారవిధుల నిర్వహించుటనుగురించి ప్రయత్నింపుమనుటయు విభీషణుం
డిట్లనియె శ్రీరామచంద్రా!

ఉ. ఇంతికుపూర్వమీతడు సురేంద్రముఖామర పాళితోడ న
త్యంత భయంకరాహవములందు పరాజయమొందడయ్యె నే
డింతకు నీపయిందొడరి యిట్లు బరాజితుడయ్యె సాగరం
బెంతెయుపొంగి తీరమ నతిక్రమింపక వైసంజెడిపోయినట్లులన్.

ఉ. ఈతఁడొనర్చె దానములనెన్నిటినో గురుదైవతంబులన్
ఖ్యాతిగ బూజలందనిచె స్వాశ్రితకోటిని బ్రోచె సర్వభో
గాతిశయా ప్తితో దనరె నాప్తుల కర్థములిచ్చె శత్రుసం
ఘాతమునెల్ల నోర్చె మదగర్వమునన్ విహరించె నెల్లెడన్.

గీ. ఆహితాగ్ని మరిమహాతపశ్శాలి వేదాంతతత్త్వవేది యఖలకర్మ
నిష్ఠుడితని కిపుడు సేజేయదగు పితృకర్మ కాజ్ఞనిమ్ము నిర్మలాత్మ.

వ. అని ప్రసంగించుచుండ నంత రావణుని మరణవార్తవిని రావణుని పట్టమహిషి
యగు మండోదరి పట్టరాని శోకమున వాపోవుచు రావణుని సమీపమునకేతెంచి
యతనిపైబడి యిట్లనివిలపింపం దొడంగె.

సీ. ననువిడనాడి పోనాయ్యయంబె ప్రాణేశ కనువిచ్చిచూడవా కనికరమున
కనలిన నేత్రమోల ఘనబలుల్ సకలదిక్పతు లతిభీతితో భారుచుం ద్రు
దనుజరాట్సింహమా తద్దయు నీత్రిభువన భోగభాగ్యానుభావివైన
నినునేడు సామాన్య వనగోచరుండగు నిరుపేదమనుజుడనిన్ వధించె
ననుటకెంతయి వైపరీత్యంబుగాదె జీవితేశ్వర నినుబాసి క్షితితలమున
బ్రతునజాలను నీతోడ స్వర్గపురికివత్తు నీకంటె నన్ను బ్రోచు వారలెవరు.

వ. నాథా! దేవేంద్రాదులకుసైతము నిన్నునిర్జింప సాధ్యపడకున్న శ్రీమహా
విష్ణువే నిన్నువధింప మనుష్యాకారముతో శ్రీరామచంద్రుడై భూమియం
దవతరించి లోకకంటకుండవగుటచే సీతాపహరణనెపంబున రణాంగణంబున
నిన్నుహతంబొనరించె ననిదలంచెద నిందుకుసందియములేదు గావున

సీ. అగ్యయనితంబు మహాయోగి శాశ్వతుం డవ్యయుండాదిమధ్యాంతరహితు
డఖిలేశ్వరుడు పరమాత్ముండు శ్రీవత్సకౌస్తుభోజ్వలిత వక్షస్థలుండు
శంఖ చక్రగదాది సాధనోపేతుండు శ్రీమహావిష్ణుండ క్షితిమనుష్య
భావుడై రామాఖ్య బ్రభవించి వానరాకారులౌ దేవతాగణముతోడ
పరివృతుండై జగద్ధిత వాంఛజేసి నిఖిల భీషణ రాక్షసానీక సైన్య
యుతుడవగు నిన్ను నత్యుగ్ర యుద్ధమందు సంహరించె నిజంబు సంశయములేదు.

వ. ప్రాణప్రియా! శ్రీరామునితో సంధిజేసుకొనుమని నేనెంత బోధించినను
నాహితాలాపముల నాకర్ణింపక నేడింతటి దుస్థితి ననుభవించుచుంటివి సకల
సుహృద్బంధు సుత సహోదరాదులతో సర్వజన నాశనమునకే సీతను

కామించితివి అరుంధతి మొదలగు పతివ్రతామతల్లులలో మిగుల నుత్తము రాలగు సీతను పతికెడబాపి ఆ మెతపఃప్రభావమున తుదకిట్లయితివి. మహా సౌందర్యరాశివగు నాధా! మృదుల మనోహర హంసతూలికా తల్పంబున శయనించి పరిచారికాజనంబు లనేకవిధంబుల నూడిగంబులు సేయుచుండ సుఖనిద్రం జెందుసీవు నేడీరాముబాణ నిర్భిన్న సకలాంగుడవై ధూళిధూసరితంబై రక్తసిక్తంబులైన నెమ్మొగంబులు కళాహీనంబులై యొప్ప ప్రాణేశ్వరా! నీతో గూడి సమస్త యిష్టోపభోగంబుల ననుభవించుచు మహానందగర్వితనై యున్న నేను నేడు భవద్వియోగ విపత్సాగరంబున మునింగి వైధవ్యవ్యధా భరం బనుభవించుచు జీవింపనేర్తునే! నీవులేని నాజీవితంబేల! నేనును నీతోడ సహగమనంబొనరించెద. దైవమా నీ వెంతటి ఘోరకృత్యమునకు దలపెట్టితివని విలపించుచు

గీ. దానవకులేశ్వరుండు నాతండ్రి సర్వరాక్షసాధీశ్వరుండు నా ప్రాణవిభుడు శతమఖుని నోర్వగల్గె నస్మత్సుతుండటంచు గర్వించుచుంటి మదాత్మలోన.

సీ. రాక్షసేశ్వర నిన్ను రాముండెటులజంపె నిదిస్వప్నమా లేకహృద్వికలమ మృత్యుదేవతకీవు మృతిఘటింపగ నేర్తువిదియేమిమాయయో యెుగరాదు నీపేరు వినినంత నిఖలలోకప్రజా వర్గంబు గడగడ వణకుచుండ్రు లోకపాలుల గెల్చి లోకస్తులగలంచి బహుభోగభాగ్య సంపదలబొదలి పటుభుజాశౌర్య విక్రమప్రౌఢి మెరయ రాత్రిచర యూథములకెల్ల రాజువగుచు యీశ్వరునిసైత మొక్కపుడెగురవైచి తరయనీసాటి వీరులెండైనగలరె.

వ. అనిపెక్కుభంగుల పరిదేవనంబు సేయుచు ప్రాణేశ్వరు నాలింగనంబు జేసుకొని విహ్వల విలపించుచున్న శ్రీరాముడు విభీషణుఁ బిలిచి విభీషణా! నీవింక కాలహరణ మొనర్పక నెల్ల రనవ్వలకుబనిచి నీయన్నకు విద్యుక్తమైన సంస్కారము నపక్రమింపుమనుటయు నతండు దురాత్ముండైన రావణున కగ్ని సంస్కారము లొనర్ప నంగీకరింపకున్న శ్రీరాముడు కొంత హితవచనముల సమాధానపరచిన పిమ్మట విభీషణుం డట్లే కంగీకరించి

సీ చందనదారువుల్ చక్కగాచితి బేర్చి పద్మకోశీరముల్ పరచిపైన రాంకవాస్తరణ మేర్పరచి ఋత్విగ్వరుల్ వేదసమ్మతముగా పితృమేధ సంస్కారమంత్రముల్ శ్రద్ధతో జపియుంచి యాగ్నేయదిశ వేదికాంతరమున యగ్నిప్రతిష్టించి యాజ్యప్రపూర్ణ స్రువనంబుంచి మేధ్యమా పశువునొంటు

జంపి హోమంబొనర్చి రాక్షసులతో విభీషణుడు గడుదుఃఖించి వివిధపుష్ప గంధమాల్యా ద్యలంకారగరిమ దనరజేసి రావణు జితిమీాద జేర్చిరంత.

ఉ. స్నానమొనర్చి యార్ద్రవసనంబులతోడ విభీషణుండు త
ద్దానవభర్త కగ్నిని యథావిధిగా దరికొల్పి పిమ్మటం
బూనికతోడ కార్యముల పూర్తియొనర్చి నమస్కరించి పెన్
కినత నేడ్చు యుగ్మలుల దేర్చి గృహంబులజేర్చె నూర్చుచున్.

వ. రావణవధానంతరము శ్రీరామచంద్రుడు సుగ్రీవ విభీషణ లక్ష్మణ హనుమ జ్జాంబవదంగదాది ప్రముఖులతో గూడిమిగులసంతోషించె. తదనంతరంబ దేవతాముఖ్యులు శ్రీరాముని బహుప్రకారముల స్తుతించి తదనుమతంబున స్వస్థానములకరిగిరి. అంత శ్రీరామచంద్రుడు సుగ్రీవునిగాఢాలింగనమొనరించు కొని సంతోషముతో యుద్ధవిషయ ప్రసంగముల ముచ్చటించుకొనుచు శిబిరంబులకరిగి లక్ష్మణునితోనిట్లనియె.

చ. మనకనురక్తుడై మిగుల మన్ననతోడ మహోపకారమున్
బొనరిచె నీవిభీషణుడు పూజ్యతముం డటుగాన లంకకీ
తని నభిషిక్తుజేయుము ముదంబున రాక్షసరాజ్యలక్ష్మి చే
కొని జెలువొంద గాంచుటకు కోరికలీరికలెత్తె తమ్ముడా!

మంజరి :

అనియాదేశించు మాత్రమున రామానుజుండు హర్ష మునం
గనకకుంభములతో సముద్రోదకము కపులం దెమ్మనినన్
తదాజ్ఞానుసారమున వానరులు తద్దయునుద్ధతితోడన్
ముదంబునం బోయితోయనిధి జలముంగొని తెచ్చిరి మగుడన్.

వ. తదనంతరంబ సుగ్రీవ హనుమ జ్జాంబవంతాది కపులతో గూడి శ్రీరాముని సన్నిధానంబున

—: విభీషణునకు పట్టాభిషేకము సేయుట :—

మ. అభిషేకించిరి తద్విభీషణుని దైత్యాధీశు సామ్రాజ్యమం
దభిషిల్లగ్నమునన్ సమస్తవిధ వాద్యధ్వానముల్ మీార త

త్సభికుల్ హర్షహృదంతరంగులగుచున్ జైయంచుగీర్తింపగా
నభిరామంబగుచున్ వెలింగె నపుడత్యంతోత్సవ శ్రీదగన్.

గీ. రమణులిరుగడలం జామరములు వీవ చేరివిబుధులు ప్రీతి నాశీర్వదింప
వందులుస్తుతింప బాంధవ వరసుహృత్సచివ సమాజంబు సేవింప చెలువమలర.

వ. ఇట్లతివైభవంబున సకలరాక్షస సామ్రాజ్య పట్టభద్రుండైన విభీషణుని గనుంగొని, సకలమంత్రి ప్రధాన ప్రముఖులతో రక్కసిమూకలు సంతోషించి రట్టియెడ, పౌరజనులు వివిధమంగళద్రవ్యంబుల కానుకలర్పించిన విభీషణుడు గ్రహించి, పదపడి రామలక్ష్మణుల యథాన్యాయంబున బహువిధోపాయనంబుల సమర్పించి పూజించిన నతనికి సంతోషముగలుగ సంగీకరించి తదనంతరంబ కృతాంజలిబంధురుడై నిలిచియున్న సమీరకుమారునింగని శ్రీరాముండిట్లనియె.

చ వినుముహరీశ నీవిక విభీషణుచేత ననుజ్ఞబొంది చ
య్యన నగరంబుజొచ్చి జనకాత్మజతో ప్రియమార రావణుం
డని హతుడౌటయున్ మనజయంబును సేమములన్వచించి త
జ్జనకజపల్కులన్ మరల చయ్యన నాకెరింపుమి త్తరిన్.

మాలినీవృత్తము :

అంత తదానుమతంబున నప్పవనాత్మజుడేగి దశాస్యవనా
భ్యంతరసీమ వనస్పతిమూలమునందు భయంకర రాక్షసను
షాకంతలమధ్య దపించెడు సీతనుగన్గొని తన్నెరిగించియు న
త్యంతప్రమోదమునన్ ప్రణమిల్లి కృతాంజలిబంధురుడై నిలిచెన్.

వ. వినయ వినమితోత్తమాంగుడై నిలిచిన హనుమంతుని గనుంగొని సీత యతం డొనరించిన మహోపకారంబును స్మరించి హర్షావేశమున మైమరచి పలుకనేర కున్న ప్రకాశమానంబైయున్న వైదేహిముఖ మవలోకించి వాయునందనుడు శ్రీరాముని సందేశమును విన్నవింపందొడంగె జననీ!

సీ. శ్రీరామలక్ష్మణుల్ క్షేమంబుగానున్నవారు నీకుశలం బవస్యమిపుడు
తెలియగోరికతోడ దేవినీచెంతకు బంపించె శ్రీరఘుస్వామి నన్ను
రణరంగమున దుష్టరావణు ఖండించి సంప్రీతితో విభీషణుని దనుజ
సామ్రాజ్యపదమందు స్థాపించె తచ్ఛుభసందేశమును భవత్సముఖమందు
విశదపరుపుమటంచు నీ విభుడు దెల్ప విన్నవింపగ నేతెంచియున్నవాడ
సకలవానరులును విభీషణుడు ప్లవగసత్తములు లక్ష్మణుండును సాయపడిరి.

జనకపుత్రీ! శ్రీరామచంద్రుని వచనముల నవధరింపుము.

ప్రేయసీ! నీకతిప్రియతమంబైన వాక్యమొకండు దెలిపెద నాలకింపు
మేలమిసాధ్వీధర్మ మెరిగిననీవు దైవవశంబువలనను బ్రతికియుంటి
వస్మదీయ పరాక్రమాతిశయంబున ననిలోన మనకు జయంబుగలిగె
పగతుడౌ దుష్టరావణుడీల్గె నావశంబయ్యె లంకారాజ్య మఖిలమిపుడు
నీనిమిత్తము యాహారనిద్రలుడిగి కడలిలోపల సేతువుగట్టి రిపువ
ధింతునని పూనియున్న ప్రతిజ్ఞ నేడు దీర్చితిని చింతబాయుము దేవినీవు.

ఇపుడీలంకా రాజ్యమంతయు విభీషణునకు వశంబగుటచే స్వగృహమందున్నట్లే భావించి భయమునువర్జించి యించుక శ్రమనపనయించుకొనుము విభీషణుడు నీసముఖమున కిప్పుడే సంతోషముతో నేతేరగలడు అని హనుమంతుడు వచింప చంద్రబింబ సదృశాననయగు సీత పరమానంద పరవశయై లేచి ప్రతివచనము వచింపలేక డగ్గుత్తికపడి నిలిచియున్న హనుమంతుండామెతో వెండియునిట్లనియె.

తల్లీ! మాటాడవు నీయుల్లంబున నిట్టులేమి యోచించెదు సం
ఫుల్లాబ్జనయన నీప్రియవల్లభు సేవింతువిపుడె వగవకుమింకన్.

వ. అనవుడు సీత ప్రహర్షవదనయై గద్గదకంఠముతో నిట్లనియె.

ర. అనఘ! మదీయభర్తృ విజయప్రతిపాదితమా ప్రియోక్తులన్
విని పరమప్రహృష్ట పదవిన్ వివశీకృతనై క్షణంబు నె
మ్మనమున నేమితోచకిటు మారువచింపక నూరకుంటి పా
వనమగు నీశుభోక్తులకు ప్రత్యభినందన మేమిదెల్పుదున్.

ఉ. చింతదొలంగ మంచిగ వచించితివీవు సమీరపుత్ర నీ
వెంతయు నాప్తబంధువుడ విట్లువచింపగ నేర్తురేయొరుల్
సంతసమయ్యె నీవచనచాతురికిన్ విలసచ్ఛతుస్సము
ద్రాంత వసుంధరాతల మహావిభవంబది సాటివచ్చునే.

వ. సీత యివ్విధమున భాషించుచుండుటయు మరున్నందనుండు కృతాంజలి బంధుకుండై యిట్లనియె.

గీ. భర్తృహితమును గాంక్షించు పరమసాధ్వి వగుటకతమున దేవి మహావిశిష్ట
మైన నుడులు వచింప నీకర్హమయ్యె సంశయములేదు వేయేల సత్యముగను.

వ. జననీ నీవచనములయందొక గొప్పయదార్థము గానవచ్చుచున్నది మరియు శ్రీరామచంద్రుడు దుర్జయుండైన శత్రువును వధించి విజయమును బొంది స్వస్థచిత్తుండై యుండుటచే గొప్పస్వర్గాధిపత్యమును బొందగలిగితిమని తలంతు ననిపలుకు హనుమంతునితో సీతయిట్లనియె.

సీ. గణుతింప మాధుర్యగుణ భూషితంబును యష్టాంగవిద్యా విశిష్ట శేము
షీవిశేషమున భాషింపనీవర్హుండ వనిలునకత్యు త్తమాత్మజుడవు
పరమధార్మికుడవు బహుశాస్త్రవేదివి బలశౌర్యవీర్య సంపద్యుతుడవు
ధైర్య తేజఃక్షమా దాక్షిణ్య వినయాద్యనేక శోభన గుణానీకమాశ్ర
యించి నీయందుగడు ప్రకాశించుచున్నవిందులకు సంశయంబించుకేనిలేదు
నీవొనర్చిన మేలు వర్ణింపవశమె సజ్జనాధార దుష్టరాక్షసవిదారా.

వ. అనిశ్లాఘించుచున్న సీతతో సంతోషపూర్వకముగా హనుమంతుండిట్లనియె.

క. నాకాజ్ఞనిమ్ముతల్లీ నీకార్తి ఘటిల్ల జేయు నిష్ఠురులగు యీ
రాకాసిమూకనెల్లం బోకార్చెద నిముషమునను భుజశౌర్యమునన్.

చ కనుగొనుమిప్పుడీ దనుజకాంతల మత్పదతాడనంబులన్
ఘనతరముష్టిఘాతముల గాఢముగా బ్రహరించి కేశముల్
గొనకొని త్రెంచి వాడిపెరుగోరుల కోరల కర్ణనాసముల్
పనిపడజీల్చి పైనబడి బాది వధించెద పెక్కుభంగులన్.

వ. హనుమంతుండివ్విధమున వచించుటయు యశోవతియగు జానకి ధర్మయుక్తముగా నతనితోనిట్లనియె.

గీ. రాజసంశ్రయ వశ్యకారణముచేత నాజ్ఞ నెరవేర్చు దాసజనాళిపైన
గోపపడనేల సుజనులు కూడదంద్రు వానరోత్తమ స్త్రీహత్య వలదువలదు.

గీ. పూర్వజన్మకృతంబగు భూరికలుష హేతువుననో దురాదృష్ట హేతువుననో
ప్రాప్తమయ్యెను దుఃఖమిప్పగిదినాకు స్వకృత మనుభవయోగ్యమై జనునుగాదె.

గీ. పాపకృత్యములకు తలపడిన ఘోరశత్రువునకైన ప్రాజ్ఞులౌ సత్పురుషులు
కినిసి వెండియు ప్రత్యపకృతి నొనర్పదలపరెయ్యెడ మారుతీ ధర్మనిరతి.

క. అపరాధియైనగాని నిరపరాధియెగాని తగశరణమని వేడన్
కృపచే రక్షింపందగు నపరాధులుగాని వారలవనిగలరే.

వ. అనవుడు మారుతి సంతోషపూర్వకముగా సీతతో నిట్లనియె.

గీ. రామవిభునకు తగినభార్యవు గదమ్మ సాపరాధులనైన కృపాంతరంగ
మునను రక్షించుతల్లి సమ్మోదమయ్యె నరిగెదను రామునన్నిధి కాజ్ఞ నిమ్ము.

మ. హనుమంతుండిటులన్ వచింపగ ప్రమోదాయత్తచిత్తంబునన్
జనకక్ష్మావిభుపుత్రి యిట్లనియె నోసామీరి నాప్రాణ నా
థుని సేవింపగ గోరుదాననన సంతోషాంతరంగంబుతో
ననియెన్ వెండియు మారుతాత్మజుడు సౌహార్ద్రింబునన్ సీతతోన్.

క. శ్రీమంతులగు విభీషణ సౌమిత్రీ రవితనూజ సహితుండై సు
త్రామవిభవమున తగుశ్రీరాముని సేవించెదిపుడు రాకేందుముఖీ.

గీ. దేవనాథునిగని శచీదేవి హర్ష పారవశ్యంబు నొందినపగిది రామ
విభుని గనుగొని పరమసంప్రీతి నొందెదమ్మ నేపోయివచ్చెద నాజ్ఞ నిమ్ము.

వ. సాధ్వీమణిన్మానాన్పొప్పు సీతసన్నిధానమునుండి బయల్వెడలి హనుమంతుడు
సత్వరంబ శ్రీరాముని సన్నిధానమున కేతెంచి వినయవినమితోత్తమాంగుడై
శ్రీరాముని సమక్షమమున నిట్లనియె.

ఉ. సేతువుగట్టి రావణుని జెండిన మీప్రబలప్రయత్నమే
సీతనిమిత్తమట్టిశుభశీలను శోకసమాకులేక్షణం
బ్రీతిగనుంగొనందగు వివేకవివర్ధన మీజయంబు వి
ఖ్యాతిని సర్వమున్ విని మహాప్రమదంబున బొంగెసీతయున్.

గీ. సాధ్వి నామీది పూర్వవిశ్వాసమునకు పలికెనిట్లని మారుతీ! భండనమున
నెంతయు కృతార్థుడైన ప్రాణేశ్వరుని సహోదరసమేతముగ గాంచనుత్సహింతు.

వ. అని సీతవిన్నవించెనని విన్నవింప నంత శ్రీరామచంద్రుడు కన్నుదామరల
బాష్పకణంబులు వెడలుచుండ నాత్మలో నిట్లనియోచించె రావణుని గృహమున
నున్న వైదేహిని పరిగ్రహించిన లోకాపవాదము ఘటిల్లు నిర్దోషియగు సీతను
పరిత్యజించిన ధర్మహానియేనగు గావునవిందులకు కర్తవ్యమేమని యించుక
యోచించి దీర్ఘమగు నిట్టూర్పువిడిచి క్రిందజూచుచు నికటస్థుండైన విభీషణునితో
నిట్లనియె.

గీ. దానవవరేణ్య నీవు సత్వరమ నిటకు జనకరాజాత్మజను శిరస్నాత నమల
భూషణానర్ఘ్య కౌశేయ భూషితాంగి నవసరంబుగ దోడ్కొని యరుగుదెమ్ము.

మానినీవృత్తము :

అంత విభీషణు డా రఘువర్యుని యానతిచొప్పున శీఘ్రముగా
నంతిపుర ప్రియకాంతిలతో జనకాత్మజ పాలికిబోయిన వా
రెంతయు భక్తివిధేయతతో నపుడిట్లనిపల్కిరి తల్లి భవ
త్కాంతుడు నిన్నుకనుంగొన గోరెనుగావున విన్నపమేమనినన్.

గీ. దివ్యగంధానులేపన దివ్యరత్న భూషితాంశుక సుమదామ భూషితాంగి
వై ప్రియంబున చతురంతయానమునను చెలువుమీరంగ నిక సమాసీనవగుము.

వ. అనివిన్నవింప సీతాదేవి భర్తృసమీపమునకలంకారయుక్తముగాజనసంగీకరింపక రాక్షసరాజా! స్నానాలంకార రహితనై నాప్రాణేశ్వరుని సందర్శింపగోరు చున్నదాన ననిపలుక నతండిట్లనియె. తల్లీ! శ్రీరామచంద్రుడు నిన్నలంకార యుక్తముగా తోడుకొని రమ్మని సెలవొసంగె గావున తదాజ్ఞానుసారముగా నాచరించుట ముఖ్యమనుటయు భర్తృభక్తివ్రతయగుసీత దానికొడంబడుటయు

మ. దనుజాంతఃపుర కాంతలంతట సుగంధస్నిగ్ధ తోయంబులన్
జనకక్ష్మావిభు కూర్మిపట్టికి శిరస్స్నానంబు గావించి కాం
చన రత్నాభరణాంశుకాభినవ పుష్పస్రక్సుగంధాది లే
పన హారాళి నలంకరించి చెలువొప్పన్ సుందరాందోళికన్.

వ. సుఖాసీనంగావించి పరిజనులెల్లరు బలసికొలువ చతురంతయానమున తోడ్కొని వచ్చునెడ మార్గమున సీతావలోకన తత్పరులై మూగిన మహాజనులెల్లర విభీషణుని యాజ్ఞాప్రకారము వేత్రహస్తులు కొందరు యిరుకెలంకుల వదల్చుచు శ్రీరాముని సన్నిధికి గొనితెచ్చి సిబికదింపుటయు శ్రీరామచంద్రుడు ప్రియా సమాగమనంబెరింగి అంతరంగమున యోచించుచుండ నలునంకల ముసరుకొను చుండు ప్రజల దూరముగా తరుముచున్న విభీషణునితో శ్రీరాముండిట్లనియె విభీషణా! ఈప్రజలెల్లరు మనస్వజనులే గావున వీరల దూరముగా తరుమతగదు యేలనన ఈసీత మిగులకష్టములనుండితప్పుకొని యుద్ధరంగమున నాసమక్షమము నకు వచ్చియున్నది తత్కారణమున వీరెల్లరు గనుగొన తగియున్నది అదియుగాక

గీ. కమప్రసిద్ధంబులైన ప్రాకారములును భవనరాజంబులును కాండపటములరయ
నేవి యావరణములును గావెంచిచూడ, నతివలకు సత్ప్రవర్తన మావరణము.

వ. మరియొకవిశేషమేమనగా

గీ. వ్యసనకాలంబులందు స్వయంవరముల యజ్ఞకార్యంబుల భయంకరాహవముల
పరిణయములందును మహోత్సవములలోన సతినలను గాంచుచుంట
దూష్యంబుగాను.

వ. కావున నిప్పట్ల ప్రజలు సీతను కనుంగొనుట దూష్యంబుగాదు నీవింక సీతను మత్సమీపమునకు బిల్చుకొని రమ్ము సకల సుహృజ్జనులతో గూడియుండు నన్ను సీత కనుంగొనియెడుగాక యని శ్రీరామచంద్రుం డాజ్ఞాపింప విభీషణుడు సంశయించుచు వినయపూర్వకముగా సీతను రాముని సముఖమునకు బిలుచుకొనిబోవ నింతలో హనుమత్సుగ్రీవసౌమిత్రిప్రభృతులు శ్రీరాముని యాకారముఖ వైలక్షణ్యాదుల గనుంగొని యాయనకు భార్యయెడ ప్రీతిలేనట్లు గుర్తించి మిగుల విషణ్ణవదనులై విచారముతో నిలిచి గనుంగొనుచుండిరంత

ఉ. ఆయెడ లజ్జచేత జనకాత్మజ సంకుచితామలాంగియై
శ్రీయుతమైన నెమ్మొగము చేలచెరంగున గప్పి నాథునిన్
డాయగబోయి మధ్యమువడంకగ దుఃఖముబెంప నార్యపు
త్రాయని పిల్చుచున్ బెలుచ తత్సభలో విలపించె దీనతన్.

గీ. అతిపిపాసార్దితుండు జలాశయమును గనిమహోహర్షమున బొంగుకరణి రామ
విభుని ముఖచంద్రబింబంబు విస్మయముగగాంచె నెంతయు కన్నులకరువుదీర.

వ. ఇట్లు సీత బహుకాలమునకుగా విలోకింపబడకయున్న ప్రాణేశ్వరుని మనోహరమగు ముఖపద్మమును గనుంగొని హృదయతాపమును విడిచె, నంత లజ్జావనతయై ప్రక్కనిలిచియున్న భూపుత్రిని గనుంగొని శ్రీరాముడు హృదయాంతర్గతమగు లోకాపవాద భయపరవశమున సీతతో యిట్లనియె.

చ. వినుముశుభాంగి బాహుబలవిక్రమ సంపదలొప్ప మద్విరో
ధిని విధియించి నిన్నును మదధీనను గాగొనియుంటి పౌరుషం
బున నొనరింపతగ్గపని బూర్తియొనర్చితి మత్ప్రితాపముల్
గనుగొనిరెల్ల రున్ శ్రమకుగల్గె ఫలంబు ప్రతిజ్ఞదీర్చితిన్.

గీ. నన్ను వనమున నెడబాసియున్న నిన్ను దానవవిభుండు గొనిచనె దైవకృత ప
రాభవమును ప్రయత్నపూర్వకముగా నివారణంబొనరించితి పౌరుషమున.

వ. లోకమందెవ్వడేని తనకు సంప్రాప్తించిన పరాభవమును సామర్థ్యముచే పోగొట్టుకొనజాలనట్టి యల్పతేజోవంతుడగు వానికి పురుషార్థములు సిద్ధించవు

నానిమిత్తము హనుమంతుండొనర్చిన సముద్రలంఘనము, లంకాదహనము మొదలైన అమానుష కృత్యంబులు సార్థకములయినవి మరియు యుద్ధ సమయమున గొప్పసైన్యములతో పోరాడి తగుసమయముల నాకు హితా లాపముల బోధించుచు సహాయపడిన సుగ్రీవుని శ్రమమంతయు సఫలమైనది గుణహీనుండైన సోదరుని పరిత్యజించి నన్ను శరణాగతిబొందిన విభీషణుని ప్రయాస సార్థకమైనది అనివచించుచున్న శ్రీరాముని భాషణంబులకు భీత మృగాక్షియగు సీతకంటతడిపెట్టి నట్టియెడ సీతనుకనుంగొనినగొలది యాజ్యాహుతిచే పెంపొందు వహ్నికీలచందంబున శ్రీరామునకు క్రోధమతిశ యించి బొమలుముడివడ సీతవంకజూడక యచటిప్రజలెల్లరు విస్మయచకితులై వినుచుండ సీతతో నిట్లనియె.

సీ. సమరరంగంబున శ్రమమెల్ల మిత్రుల బాహువిక్రమమున బాపుకొంటి
సీనిమిత్తంబుగా నేపోరలేదని తగప్రజాళికి విశదపడవలయు
మొలమి ప్రసిద్ధమా కులగౌరవమును రక్షింపగల్గితి నపకీర్తిగడచి
సకలలోకములకు సంశయాస్పదమైన చారిత్రవగుసీవు సంభ్రమమున
నాయెదుటనిల్చి మఱిమఱి నాకుమిగుల శత్రువుగ దోచుచుంటివి జనకతనయ
నేత్రరోగాతురుని మ్రోలనిలిచియున్న కమనీయమనోహరమగు దీపకళికవోలె.

మంజరి :

నేననుమతి నొసగినాడ గావున సీకనువగు నెలవునకున్
పైనంబగు మింక నాకు సీతోపనిలేదు గ్రహించుటకున్
పౌరుషవంతుడగు సత్కులీనుడు పరగృహవాసినిమైన
దార నతిస్నేహమున గ్రహింపగ దలపడుసుమి లోకమున.

గీ. రావణాంక పరిభ్రష్టురాలవగుచు సతనిచే జూడబడిన నిన్నాభిజాత్య
కులజుడనటంచు దగజెప్పుకొనెడు నేను యెవ్విధంబున నిన్ పరిగ్రహింపగలను.

చ. జనకనృపాలపుత్రి మదిసంశయమందగనేల నానుడుల్
వినుమిక నాకుసీయెడల ప్రీతియొకింతయులేదు కాన సీ
కనువగు బంధుమిత్రుల గృహంబుల స్వేచ్ఛమెయిన్ వసింపగా
జనుము మదీప్సితంబిది నిజంబుగ యోచనజేసి జెప్పితిన్.

చ. సరసిజనేత్రి రావణుని సౌధములోపల నెంతయున్ మనో
హర సుకుమార సుందర శుభాకృతితో గడుదీర్ఘకాల మి

శక్రరణి జరించుచున్న నిను గాంచి దురాశయుడైన తన్నిశా
చరవరు డూరకుండునె ప్రజల్ హృదయంబుల విశ్వసింతురే.

వ. ఇట్లు క్రోధపరవశుండైన శ్రీరామచంద్రుడు కర్ణకఠోరముగా వచింప ప్రియ
వచన శరణార్థయగు జనకరాజనందన చిరకాలమునకు మహాసభామధ్యమున
ప్రియునివలన తదీయ పరుషవాక్యముల నాకర్ణించి లజ్జావనత వదనయై
శరీరము కృశించి క్రుంగిపోవుచుండ మదగజ తాడితంబగు సల్లకీతరు శాఖ
చందంబున గడగడవణంకుచు కనుదామరల వెలువడు బాష్పపూరమును
జేలచెరంగున నద్దుచు నిజేశ్వరుని యాననంబవలోకించి గద్గదభిన్నకంఠియై
యిట్లనియె.

సీ. వీరవరేణ్య! యీవినవ్వాక్యములుగాని కఠినోక్తులిట్లు పల్కంగదగునె
ప్రాణవల్లభ నీవుభావించినట్లు దుశ్చరితనుగాను నాసచ్చరిత్ర
మం దొట్టుసూనె మహాత్మ! స్త్రీజాతినందరి నొక్కవిధమున దలపదగునె
దుశ్చరిత్రల ప్రాకృతుల బల్కుపోల్కినస్మద్విషయంబున సంశయింప
దగునె పరవశనై యుండు తరుణమందు పొంచి దైత్యుండు నన్నుగొంపోవునపుడు
స్పర్శసోకినమాట వాస్తవము దీన దైవమపరాధి, నాయందు తప్పులేదు

గీ. అస్మదీయమనంబు నీయందె నిల్చియున్న దన్యంబెరుంగ నన్యునివశమున
జిక్కబడె దేహమేనేమి జేయుదాన జీవితేశ్వర నిజము వచించుచుంటి.

వ. హృదయేశ్వరా! నా స్వభావమును మీరు బాగుగా పరీక్షించి యుండినందున
నావిషయమై మీకుగలిగిన సంశయమును వీడవలయు బాల్యాత్ప్రభృతి
మనమిర్వురము సంశ్లేషగల్గి వర్తించిన కారణమున నాస్వభావమును బాగుగా
గుర్తించియుండనిచో నేనింక చెప్పవలసినదేమున్నది నాస్వరూపమే నాశన
మగుచున్నది లంకలోనున్న నన్ను గనుంగొనిరమ్మని హనుమంతుని పంపించితిరి
అప్పుడే నన్ను నేల పరిత్యజించలేదు.

ఉ. మీవచనంబులన్ వినినమీదట నీపెనుకొల్వులోన సు
గ్రీవ ముఖాఖిల ప్రముఖ కీశవరేణ్యులముందు నన్నిటుల్
నీవుపరిత్యజింప నికనేబ్రతుకం దగదార్యపుత్ర మ
జ్జీవనశంకచే నిపుడు చేసిన మీశ్రమ వ్యర్థమైచనేన్.

ద్విపద :

కోపవశంబున కోసలాధీశ యీపట్ల సామాన్యు డెంచినపగిది
స్త్రీస్వభావమును యోచించితివిశాని నాస్వభావమునురి నమ్మకున్నావు
జనకరాజాప దేశంబున ధాత్రి జననమందిన దాదిసద్వృత్తమెల్ల
నీవెఱుంగుదుగాదె నినుగూడియుంటి భావజ్ఞ నేనింక బల్కెడిదేమి.

వ. బాల్యమందు నీవుసర్వలోక సమ్మతముగా నాచరించిన పాణిగ్రహణమును నా భక్తిని నాసచ్చరిత్రమును ప్రమాణముగా నుంచుకొనక త్రోసిపుచ్చుటచేత నేచేయుందగు కర్తవ్యమేమున్నది ప్రాణేశ్వరా నా జీవితమును నేటితో మీ సమీపమందు తుదముట్టించెద నని గద్గదస్వరమున వాపోవుచు, చింతాకులిత చిత్తుండై శ్రీరామునిసముఖమున నిలిచియున్న లక్ష్మణునితోనిట్లనియె.

గీ. ఏలనిక లక్ష్మణా! తడవీనురంత చింతకౌషధముగనుండు చితినమర్చు
మిథ్యాపవాదు వహించినేను పృథ్విపై క్షణమైన జీవింపజాల.

మంజరి :

విభునకు మత్సుగుణజాలమందున విశ్వాసముచెడెగాన
సభలోనన్ విడువబడితి యికనాజన్మమేల నిలకోన
యేనేపని నాచరింప నమ్ముకు రెల్ల జనులు హృదయములన్
మానుగ నిపుడట్లు వహ్నికీలల మరిజొచ్చెద ధృతివరలన్.

వ. సీత యిట్లుభాషించుచుండుటయు సీతారాముల సంభాషణంబుల నాకర్ణించుచుండు లక్ష్మణుడు పట్టరాని శోకభారమున భీషణాకారంబైన శ్రీరాముని ముఖమవలోకించి తదాకారేంగిత లక్షణాభిప్రాయముల గ్రహించి శుష్కము లయిన యింధనములతో చితినమర్చె నంత వైదేహి లజ్జావనత వదనయై ప్రాణేశ్వరునకు ప్రదక్షిణపూర్వకముగా వచ్చి నమస్కరించి జాజ్వల్యమానముగా శిఖాపరంపరలతో వెలుంగు తచ్చితిసమీపమున కరిగి సకల దేవతాప్రముఖులకు బ్రాహ్మణోత్తములకు నమస్కరించి అగ్నిభట్టారకున కభిముఖముగా కృతాంజలిబంధురయై నిలిచి యిట్లనియె.

చ అనవరతంబు నాహృదయ మారఘురామునియందుదప్ప న
న్యుని విషయంబునన్ జనకనుంట నిజంబగునేని నావిభుం
డనకొనినట్లు దోషమెపుడంటని మేటిసుశీలనేని న
న్ననువుగ లోకసాక్షియగు హవ్యవహుండు గృహస్థిప్రోచుతన్,

గీ. సర్వధర్మజ్ఞుడగు రామచంద్రుడనెపుడు వాఙ్మనఃకాయముల విడివడనిభక్తి
భావమున గొల్చుచుండెడు పరమసాధ్వినేని నను పావకుడు-దయనేలుగాత.

వ. అనివెండియు నిట్లనియె.

చ. పవనుడు చంద్రసూర్యులు నభంబును దిక్కులు భూతధాత్రియుం
బవలునురేలు సంధ్యలును పావకుడున్ గ్రహతారకాదులున్
వివిధసురౌఘమున్ నను పవిత్రచరిత్రనుగా నెరుంగుచున్
నవితథ సత్కృపాగరిమ హవ్యవహుండిట నన్ను బ్రోచుతన్.

కవిరాజవిరాజితము :

అనుచు వచించుచు తప్తసువర్ణమయాభరణాంచిత సుందర కాం
చన లతికోపమ విగ్రహ మొప్పెడు జానకి సంగము బాసి హుతా
శనునకు భక్తి ప్రదక్షిణమున్ం దగసల్పి సమస్తజనుల్ వగతో
గనుగొన దీప్తహుతాశనకీలల గ్రక్కున జొచ్చె నుదారమతిన్.

వ. శాపవశంబున స్వర్గమునుండి పడిపోవుచున్న దేవకన్నియవోలె చితాగ్నిహోత్రమున ప్రవేశించు మహాభాగ్యవతి సీతను ముల్లోకవాసులును హోమ వేదికాంతర్భాగమున సమంత్రకముగా పడుచున్న యాజ్యధారవలె గనుంగొని స్త్రీలెల్లరు మిగుల దీనవదనలై విలపించుచుండిరి. తత్సమయంబున నచ్చటిజనులెల్లరు హాహాకారములు . భూనభోంతరాళములు నిండిపోవుచుండె తదీయప్రజల వాక్యములు వినుచుండిన శ్రీరామచంద్రుడు బాష్పపర్యాకుల లోచనుండై చింతాభరంబున వివశీకృతుండయ్యె తత్సమయంబున

శా. యక్షేశుండు కృతాంతు డప్పతి వివూపాక్షుం డజుండున్ సహ
స్రాక్షుండాదిగ సర్వనిర్జర కులాద్యత ప్రముఖ్యుల్ జగ
చ్చక్షు శ్రీ నిరసించు యానములపై సమ్యక్సమారూఢులై
సాక్షాత్కారము జెందిరంత రఘువంశశ్రేష్ఠు మ్రోలన్ వడిన్.

వ. అంత వారలనెల్లర సందర్శించి దీర్ఘంబులగు బాహుదండంబులు పైకెత్తి కృతాంజలిబంధురుండైయున్న శ్రీరామచంద్రునితో సర్వదేవతాసముకమున చతురాననుండిట్లనియె.

సీ. ఇనకులాభరణ నీవిటులుపేక్షింప వచ్చునె ధరాసుత వహ్ని జొచ్చుచుండ
ఘనుడవు సకలలోకములకు కర్తవు పరిపూర్ణ విజ్ఞాన భాసురుడవు

నిను దేవదేవుండని దలంపవదేమి ప్రాకృత పురుషునివగిది రామ!
పరమాత్ముడవు స్వయంభుడవు మరిసనాతనుడవీశుడవు శ్రీధరుడవరయ
చంద్రసూర్యులు నీకులోచనము లష్టవసువులును ఋషిధామాఖ్య వఱలుచుండు
వాదిమధ్యాంతరహితుండ వక్షరుడవు రమ్యగుణసాంద్ర శ్రీరఘురామచంద్రా!

వ. అనిస్తుతించు బ్రహ్మాదులతో శ్రీరామచంద్రుడు తనమహిమ బ్రహ్మాదులవలన లోకములయందు ప్రసిద్ధిపరచుటకు దేవతాప్రముఖులతో నిట్లనియె.

గీ. రాఘవుండన దశరథరాట్సుతుండ నంచనఘ మానవుడనైనని తలంతు
నెనడ నెవ్వనివాడ నేనే ప్రయోజ నార్థమరుదెంచితినొ దెల్పుమమరనాథా!

వ. అనివచింప శ్రీరామునితో చతుర్ముఖుండు వెండియునిట్లనియె.

సీ. వినుము శ్రీరామ మద్విజ్ఞాపనము నీవునారాయణుండ వనంతశక్తి
వక్షరుండవు జగద్వ్యాపివి శార్ఙ్గివి చక్రాయుధుడవు విశ్వంభరుడవు
పురుషోత్తముడవు విభుండవు సర్వలోకేశ్వరుండవు హృషీకేశుడవు చ
తుర్భుజుండవు మహేంద్రుడవు విష్ణుండవు మధుసూదనుడవు రమావిభుడవు
కృష్ణుడవు జిష్ణుడవు నీవు కేశవుడవు నీవుబ్రహ్మవు సత్యుండ వీవుహరివి
శాశ్వతుడ వక్షరుండవు సర్వలోకరక్షకుడవీవె గాదె శ్రీరామచంద్రా!

సీ. నీవుసేనానివి నీవుపేంద్రుండవు నీవుశరణ్యుండ వీవుశత్రు
సంహారకుండవు శమదమ యజ్ఞ వషట్కారములు నీవు సత్యమీవు
శతజిహ్వుడవు సహస్రశృంగుడవునీవు నీవువేదాత్ముండ వీవుబుద్ధి
వఖిలభూతగణాంతరాత్ముండ ఓంకారవాచ్యుండవీవు తపంబునీవు
నిత్యముక్తుండ వాశ్రయణీయుడవు త్వదీయప్రభవంబు నిధనంబు నెఱుగరెవ్వ
రాదికర్తవు లోకత్రయంబునకును దేవదేవేశ నిన్నుస్తుతింపవశమె.

వ. మరియు నీవు సహస్రశీర్షుండవు సహస్రాక్షుండవు సహస్రపాదుండవు ప్రళయ కాలమున నీవు పయోధిచుండు శేషభోగిపర్యంకమున శయనించి సకల చరాచరాత్మకమగు బ్రహ్మాండమెల్ల కుక్షినిడుకొని యోగనిద్రాసక్తుండవై మార్కండేయాది మహర్షులకుమాత్రము గోచరింతువు శ్రీరామచంద్రా! పరబ్రహ్మమూర్తివగు నీకు నేను హృదయమును సరస్వతినీజిహ్వ సకలదేవతలున్ నీరోమములు నీరెప్పపాటు రాత్రి నీనేత్రోన్మేషము పగలు, వేదములు నీయుచ్ఛ్వాస నిశ్వాసములు విశ్వమంతయు నీశరీరము నీకోపమగ్ని

శ్రీవత్సచిహ్నమను చంద్రునిలోని శీతము నీప్రసాదము తొల్లి నీవు త్రివిక్రమావతారమున నవతరించి బలినినిర్జించి త్రిలోకములనాక్రమించి దేవేంద్రునకు స్వర్గలోకాధిపత్య మొసంగితివి అదియునుంగాక

శా. శ్రీవిష్ణుండవు నీవు లక్ష్మియెసుమా సీతామహాదేవి నీ
పీవిశ్వంబున రావణాద్యసురులన్ హింసింప రామాఖ్యచే
నావిర్భావము జెందినాడవు మనుష్యాకారమున్ దాల్చి యో
దేవా నీవుమదీయ కృత్యమును పూర్తింజేసినా వింతయున్.

క. శ్రీరామ నీకోస్తవంబిది ఘోరాఘనికృంతనంబు గురుతర భయని
స్తారకము విబుధసేవ్యము సూరిజనానందకరము శుభదాయకమున్

వ. సభామధ్యంబున శ్రీరామచంద్రునిపరతత్వంబును నిర్ధారణజేయుచు చతుర్ముఖుం డిట్లుపన్యసించుటయు సభ్యులెల్లరు జోహారులర్పించి శ్రీరామచంద్రుడు భగవదంశసంభూతుండని గ్రహించి యీజన్మమున భవన్మూర్తిని సేవించుటచే జీవితములు సార్థకమయ్యెనని పరమానంద పరమాశ్చర్య భరితులైరి.

సీ. అనలశిఖావళిమధ్య మందుండి దేదీప్యమాన సుప్రభల వైశ్వానరుండు
సభ్యులెల్లరును విస్మయచిత్తులై కనుంగొనుచుండ రత్నకాంచన విచిత్ర
భూషణాలంకార భూషితయై దేవకన్నియగతి తప్తకాంచన ప్ర
తిమ సౌమ్యమునను కుసుమకోమలాంగియౌ ధరణీతనయ నంకతలమునందు
నుంచుకొని వచ్చి శ్రీమద్రఘూత్తమునకు ప్రీతిపూర్వకముగ సమర్పించె జనకు
డాత్మజను సంతసమున నిజాంకతలమునందు నిడుకొనివచ్చిన చందమునను.

వ. జగత్సాక్షియగు పావకుడు సర్వాంగసుందరియగు సీతామహీదేవినింగొనివచ్చి శ్రీరామచంద్రుని సముఖమున దింపి యిట్లనియె.

ఉ. ఈమెపతివ్రతాతిలక మీమహిళామణియందు కల్మషం
బేమియులేదు శ్రీరఘుకులేశ్వర సంతతసచ్చరిత్రయౌ
భూమిజ సత్స్వభావమున భూరిభయంకర రాక్షసాంగనా
స్తోమనివేద్యమయ్యును త్రిశుద్ధిగనీవయినిల్పె ప్రాణముల్.

వ. శ్రీరామచంద్రా! సాధ్వీమతల్లుల యందగ్రగణ్యురాలగు సీతామహాదేవి ప్రభావంబెరుంగక లోకకంటకుడగు రావణుండు నిజనాశనార్థము మాయా

మృగ వేషంబున వంచించి మదోన్మత్తుండై గొనివచ్చి లంకయందు రాక్షసస్త్రీల రక్షణమునసుంచి వెక్కుగతుల బాధించుచున్నను నీయందు చిత్తముంచి రావణుని తృణప్రాయముగానెంచి నిజపాతివ్రత్య మహిమావిశేషముతో రక్షింపబడెను. ఇట్టిసౌశీల్య శుభస్వభావియు నిర్దోషియగు సీతను న్యాయముగా పరిగ్రహింపుము ఇందులకేమాత్ర మభ్యంతరము చెప్పకుము.

చ. అనవిని సంప్రహృష్ట హృదయాంబుజుడై రఘురాముడంతటన్
కనుగవ బాష్పబిందువులు గ్రమ్మగ నొక్కముహూర్తకాల మె
య్యన దలపోసి వెండియు బ్రియంబున దేవవరేణ్యుడైన య
య్యనలునితోడ నిట్లనియె నచ్చటనుండు మహాజనుల్ వినన్.

మంజరి :

చిరకాలము రావణాసురుని గృహసీమవసించినదైనన్
పరమసాధ్వియైన సీతసుమహాత్మావని జగత్రయమునన్
పరిశోధింపకయె రాఘవుడు నిజభార్యను కామవశమునన్
పరిగ్రహించెనని ముజ్జగంబుల బ్రజదూరెదరదిగానన్
జనులకు నమ్మకముగల్గుటకు నీచందంబున సభలోనన్
జనకజ నిట్లుపేక్షజేసితి సముచితమగు ధర్మమునన్

చ. అనవరతం బనన్య హృదయంబున నాకనుకూల వర్తియౌ
జనకజ సుస్వభావమును సంతతభక్తియు నేనెరుంగుదున్
తనమహిమా విశేషమున తద్దయు రక్షితయైన మైథిలిం
జెనకగ లేడు రావణుడు సింధువు తీరమునిూరనట్టులన్.

గీ. దీప్తవహ్ని మహాజ్వాల ధిక్కరింప సాధ్యపడని తెరంగున జనకసుతను
పాపియగు రావణుడు నిజభావమందునైనను తిరస్కరింపలేడరసిచూడ

వ. ఆత్మజ్ఞానముగల పురుషుడు కీర్తిని విడజాలనివిధంబున జగత్పావనియగు సీతను నేనువిడనాడను జగత్పూజ్యుండవగు నీయాదేశానుసారము నడచుకొందు వాడనని వచించి బ్రహ్మాదిదేవతా ప్రార్థితుండగు శ్రీరామచంద్రుడు సతీ సమేతుండై సంతసించె తదనంతరంబ తదీయ మంగళప్రదంబులైన వాక్యముల నాకర్ణించి శంకరుడు శ్రీరామునితో నిట్లనియె.

శా. శ్రీమద్భానుకులాబ్ధిసోమ కరుణాసింధో జగద్బాంధవా
సామాన్యంబె భవత్ప్రభావము ప్రశంసాపాత్రమో రామ సం
గ్రామక్షోణి దశాననాద్యసురులన్ ఖండించి లోకాళికిన్
క్షేమంబుం గలిగించితెంతయును మచ్చిత్తంబు లుప్పొంగగన్.

గీ. శ్రీరఘూత్తమ విజ్ఞప్తి చిత్తగింపు మఖిలలోకంబులకు ముదంబావహిల్ల
జనకపుత్రికతో వనచర సమూహములును సేవింప సాకేతమునకు నరిగి.

సీ. దీనుడౌ భరతుని దేర్చి తల్లులకు నమస్కృతుల్ జేసి సామ్రాజ్యలక్ష్మి
చేకొని తద్దయు స్నేహవర్గంబును సంతోషపరచి యిక్ష్వాకువంశ
మభివృద్ధినొందించి యశ్వమేధమొనర్చి శాశ్వతమైన యశంబువడసి
బ్రాహ్మణోత్తములకు బహుధనాదులొసంగి దుష్టులఖండించి శిష్టజనుల
జక్కగా బ్రోచి ధర్మసంస్థాపనంబు సల్పిపిమ్మట వైకుంఠసదనమునకు
శ్రీకరంబుగ నీవు వేంచేయదగుదు వఖిలలోకేశ దుష్టదైత్యప్రణాశ!

వ. శ్రీరామచంద్రా! మానవలోకమున నీకుజనకుండైన దశరథుడు సుస్థిరుండైన స్వర్గస్థాన మలంకరించె నేడు నిన్నుకనుంగొన వాంఛించి మాతో నేతెంచె గాన నీవు లక్ష్మణసహితుండవై యమ్మహాత్మునకు నమస్కరింపుమన రామలక్ష్మణు లిర్వురు విమానస్థుండైన దశరథునకు నమస్కరించిన దశరథుండు ప్రాణ సమానుండగు శ్రీరాముని చేరందిగిచి నిజాంకతలంబున నిడుకొని గాఢా లింగనమొనర్చి యిట్లనియె.

శా. రామా నిన్ను భవద్వియోగమున స్వర్గస్థానభోగంబు నా
కేమాత్రంబు రుచింపలేదిది ధ్రువం బీదుష్టదైత్యావలిన్
సామర్థ్యంబున సంహరించి వనవాసంబెల్ల పూరించి పూ
ర్ణామోదంబున నొప్పునిన్నుగని హర్షాంభోనిధిం దేలితిన్.

వ. నిన్నరణ్యమునకు జనుమని వచించిన వచనములన్నియు నాహృదయమున నాటి బాధించుచున్నవి నేటికి క్షేమముగానున్న నిమ్ముగనుంగొంటి హిమపరంపర నుండి వెలుపలికేతెంచిన సూర్యునిభంగి నేతెంచిన నిన్నుగాంచి సంతోషించు చున్నవాడ తొల్లి యష్టావక్రునిచే తండ్రిరక్షింపబడినటుల సకలకళ్యాణ గుణగరిష్ఠుండవగు నీచేరక్షింపబడితి రావణాది దుష్టరాక్షససంహారార్థమే మహర్షులెల్లరు నీపట్టాభిషేకవిఘాతమొనర్చిరని గ్రహింపగలిగితి వనవాస

దీక్ష ముగించి యయోధ్యకరిగి సౌఖ్యముగానున్న నిన్ను గనుంగొను కౌసల్య ధన్యురాలు నీవయోధ్యానగరమున పట్టాభిషిక్తుండవై మహావైభవమున నలరు చుండ గనుంగొను ప్రజలెల్లరు పరమానందభరితులయ్యెదరు మరియు

మ. అనురాగంబు శుచిత్వమున్ బలము ధర్మాసక్తియున్ మున్నుగా
ననవద్యవ్రతుఁడౌటచే భరతునత్యంతప్రియంబార గ
న్గొని నీవాతనితోడఁగూడి కడుననోన్యానురాగంబుతో
ననువర్తింపగ జూడఁగోరెద మదీయాత్మన్ రఘూత్తంసమా.

సీ. జనకజ లక్ష్మణ సహితుండవై నీవువనముల పదునాల్గువత్సరములు
గడపి రావణ కుంభకర్ణాదుల వధించి వేల్పులపని నెరవేర్చి మఱియు
సకలలోకములకు సంతోష మొనరించి మించి సద్యశము గడించినావు
పాయక పితృవాక్యపరిపాలనారూప ప్రబలప్రతిజ్ఞ కాపాడినావు
యికనయోధ్యాపురంబునకేగి ప్రియసహోదరులతోడఁగూడి మహోత్సవమున
సకలసామ్రాజ్య మొంది దీర్ఘాయురంచింతాభ్యుదయవృద్ధితో నొప్పుమమలచరిత.

వ. అనివచించు దశరథుని సంభాషణంబులాలించి శ్రీరాముడంజలిబద్ధుండై యిట్లనియె ప్రభో! మున్ను కైకేయితో సపుత్రకముగా నిన్నుత్యజించితినని పలికితివి అభావము వారిర్వుర కంటకుండునటుల ప్రసన్నుండవగుమని ప్రార్థించిన దశరథుండట్లగుంగాకయని యొడంబడి కృతాంజలిబంధురుండగు లక్ష్మణునాలింగన మొనర్చుకొని యతనితోనిట్లనియె లక్ష్మణా!

గీ. జనకజసమేతుడగు రామచంద్రునకును నిరతము సపర్యలొనరించు నీవు నాకు మిగుల సంతోష మొనరించి మించినావు పరమధర్మఫలంబును బడసిధాత్రి.

సీ. సౌమిత్రి నీవిట్లు సౌహార్ద్రబుద్ధితో శ్రీరామచంద్రుని సేవజేసి
యుత్తమోత్తమ యశమొందితి వదిగాక కడుమహాత్మ్యంబును బడయగల్గి
తనుపమధర్మంబు నాశ్రయించితి వమృతాంధస పదవికి సర్వమైన
యోగ్యత సాధించి యొప్పితివెంకయు శ్రీరామశుశ్రూష జేయుమెలమి
శుభములొందు దఖలసురసిద్ధసాధ్యులు పరమభక్తి రామభద్రునిగొల్చు
చుందురితడు విష్ణువుర్విపాలింప రామాఖ్య నవతరించెననిరి సురలు.

వ. పదంపడి దశరధుడు సీతతో నిట్లనియె.

చ. పరమహితాఖిలాఘుడగు భానుకులేశుడు నీపతివ్రతా
గరిమ జగత్రయస్తుతునుం గన్గొనకోరికె నీపరీక్షకున్

దొరకొని నందుచేనతని దూషణ సేయగరాదు జీవితే
శ్వరు పరిచర్య సేయుటయె సాధ్వికి నుత్తమధర్మ మైథిలీ.

వ. దశరథుం డిత్తెరంగున రామలక్ష్మణులను సీతను హితవచనంబుల ననునయించి మిగులదీప్తివంతంబగు విమానంబున స్వర్గస్థానంబునకరిగె నంత దేవేంద్రుం డంజలిబద్ధుండై నిలిచియున్న శ్రీరామునితో నిట్లనియె రామభద్రా!

గీ. దశరథుని యజ్ఞమందు భవద్దర్శనంబు మాకగుట సార్థకముగ దుర్మార్గుడైన
రావణుండీల్గె పరమహర్షంబుగల్గె వాంఛితంబేమొ దెల్పు మిక్ష్వాకుతిలక.

వ. అనుటయు శ్రీరాముండిట్లనియె.

సీ. ద్వివిమద్వరేణ్యా మద్విజ్ఞప్తినొందు నీవధరింపుము భీషణాహవమున
నస్మదర్థంబుగా నసువులర్పించిన భల్లూకవనచర ప్రముఖగణము
జీవితులై మహాశ్రేయంబు నొందగావలయు నీసకల ప్లవంగవీరు
లెందెందు వసియింతు రందందు సర్వకాలముల నానా వృక్షలతలు దివ్య
ఫలరసాదులు మూలముల్ పానయోగ్యమైన వారిపరిపూర్ణ పద్మాకరముల
తోడజెలువొంద వలయు సంతోషకరముగా ప్రసాదింప నర్థింతు గాననముల.

వ. మహాత్ముండైన శ్రీరాముడు రాక్షససంహారార్థము దేవాంశ సంభూతులైన వానరభల్లూక ప్రముఖుల పరిరక్షణార్థముగా నర్థించు వాంఛితమును సఫలమొనర్పనెంచి దేవేంద్రుండు శ్రీరామునిపై గలసంప్రీతిచిహ్నముగా నుండు నట్లాక వాక్యంబిట్లనియె.

ఉ. గొప్పవరంబు లిప్పగిది గోరితి వెంతయు సంతసించితిం
దప్పక నేడు నీయభిమతంబు ఫలింపగజేతు పోరిలో
నిప్పిశితాశనాధముల హేతువునన్ హతులైన వానరుల్
యిప్పుడలేచి సౌఖ్యముగ నెప్పటియట్ల రహింతురెంతయున్.

గీ. ఫల కుసుమ మూలములతోడ పాదపము లకాలములయందును ఫలింపగలవు మఱియు
విమలతోయ సమృద్ధితో వెలయునదులు వ్రణములునుమాని సైనికుల్ పరలు చంద్రు

వ. అనివచించుచుండుటయు సైనికులు నిదురనుండి లేచినవారిపోలిక సమరస్థలము నుండి లేచి పరమాశ్చర్యభరితులై శ్రీరామచంద్రునకు సాష్టాంగ నమస్కృతు లాచరించి రంత బర్హిర్ముఖులెల్ల పరిపూర్ణమనోరథులై శ్రీరాముని గీర్తించుచు యిట్లనిరి

సీ. శ్రీరఘువర కపిసేనలనెల్ల విసర్జించి నీవిష్ట సంతసమున
జనుమయోధ్యకు మహాసాధ్వీమతల్లియా సీతను తల్లుల శిష్టజనుల
పరమభక్తుండగు భరతుడాదిగ గలతమ్ములనందర తగినరీతి
సంతోషపరపుము సర్వసామ్రాజ్య పట్టాభిషిక్తుండవై యఖిలజనుల
జక్కగాబ్రోచి ధర్మసంస్థాపనంబు జేయుముయశంబు సకలదిక్కులందు
నింపుమనిపల్కి సకలనిలింపులంతి తదనుమతమున జనిరిస్వస్థానములకు.

వ. తదనంతరంబారాత్రి శిబిరముల సుఖనిద్రంజెంది ప్రాతఃకాలమున శ్రీరామునితో విభీషణుండంజలి బద్ధుండై యిట్లనియె.

శా. నానాలంకరణైక విజ్ఞలగు యీనారీమణుల్ మంగళ
స్నానార్థంబుగ తోయముం గలపముల్ నవ్యాంబరానర్ఘ్యభూ
షానీకంబమరించియుంచిరి హితంబారంగ నాచేయు స
న్మానంబుల్ గృపతోడ జేకొనగదే మార్తాండవంశాగ్రణీ.

వ. ఇట్లుప్రార్థించిన విభీషణునితో శ్రీరాముండిట్లనియె విభీషణా నీవు సుగ్రీవ ప్రముఖ వానరులకు మాత్రము యభ్యంగనాది సపర్యలొనరింపుము యీ సమయమున నేనుమాత్రము అభ్యంగనాది సంస్కారముల పరిగ్రహింప నేలనన.

సీ. పరమసుఖార్హుండు బాలుండు సుకుమార దేహుండు సత్యప్రతిజ్ఞు డధిక
ధర్మశీలుండు నాతమ్ముడౌ భరతుడస్మన్నిమిత్తముగ దుస్తరతపమున
గడుకృశించుచునుండె గావున నాతనివిడచి స్నానంబును విమలభూష
ణాంబర సుమచందనాద్యలంకారంబు గైకొననిష్టంబుగాదు మదికి
మరియయోధ్యకు జనియెడు మార్గమధిక దుర్గమ మిక్కుటంబగు
దూరమున్న
దింకసత్వరమున పురికేగుటకు ప్రయాణమొనరింపవలయు నోయసురనాథా.

వ. అనపుడు విభీషణుండిట్లయియె.

మంజరి :

భయమేటికి రామచంద్ర నిన్నొక పగటిలోన శీఘ్రముగన్
వియన్మార్గ గామియైన పుష్పకవిమానరాజములోనన్
అయోధ్యలోడించివత్తు సందేహంబువలదు రఘురామా
ప్రియంబార దీనిచరిత మెల్లను వినుపింతును గుణధామా.

మ. తొలియుద్ధంబున రావణుండు ధననాథున్ గెల్చి సూర్యప్రభ
నలువౌ దివ్యవిచిత్రపుష్పక విమానశ్రేష్ఠమున్ బల్మిమై
యలఘుప్రజ్ఞ హరించితెచ్చె నదిదేవార్హంబు నేడింపు మి
మ్ముల సాకేతపురంబు జేర్చుటకుగా ముఖ్యంబుగానిల్పితిన్.

వ. గావున రఘూత్తమా బహుయోజనములయోధ్య కరుగవలయునను సందేహ
మందకుడు రామగమనమున నతివేగముగా శీఘ్రకాలమునసే నీరాజధానికి
చేరంగలరు గావున నావిన్నప మవధరింపుము.

మానినీవృత్తము :

నాయెడ మీకు ననుగ్రహముండిన నాగుణవర్గమునచ్చిన న
త్యాయత సౌహృద్భావమతోడుత నార్యమదర్పిత పూజనముల్
న్యాయముగా నిజమిత్ర కళత్ర హితానుజ సైన్యసమేతముగా
బాయక గైకొని పిమ్మటబోవగ ప్రార్థనజేసితి భక్తి మెయిన్.

వ. మీకనన్య సేవకుండనగు నన్నుపలావించి కటాక్షించితిరి గావున నాసపర్యల
సంగీకరింపుమని వేడ నెల్లరు వినుచుండ శ్రీరాముండిట్లనియె.

సీ. అనఘ నీహృదయమం దన్యథా తలపకు నవహితమతితోడ నాలకింపు
మనుపమాన భవత్సహాయ సంపదచేత నెనలేని మేటి సౌహృదముచేత
వినుతింపదగిన నీవిక్రమోన్నతిచేత ననుపరిపూర్ణ మన్ననలచేత
దనిపినాడవు ప్రమోదంబయ్యె నేకొరంతయులేదు కలకజెందంగ నేల
విడుమ యర నీపలుకు నేనువినకపోను కాని నాహృదయంబు ముఖ్యముగ భరతు
నవసరముగా విలోకింప నార్తిజెందెగావున ముహూర్తమిందుండ గాదుసుమ్ము.

వ. విభీషణా చిరకాల వనవాసాయాస కృశీభూతులమగు మేము మాతల్లులను
వసిష్ఠప్రభృతులైన యాచార్య సుహృత్సోదర పౌరజానపదులనెల్లర కనుంగొన

నామనంబెంతయు త్వరజెందుచున్నది గాన నింక పుష్పకవిమానమును రప్పించి నా ప్రయాణమును సాగింపుమనవుడు తదాజ్ఞానుసారము పుష్పకమును రావించె.

సీ. నలువకైనను వేయితలల చిల్వకునైన నల విమానముసెన్న నలవియగునె
బలురత్నకాంచన ప్రతిమాభిరామంబు పరిపూర్ణ శృంగార భాసురంబు
మిసిమించు మేల్పట్టు మృదుదుకూలా స్తరణాలంకృత సుఖాసనాంచితంబు
సలలిత మౌక్తిక స్తబకమాలా సముజ్వలితోన్నత గవాక్ష విలసితంబు
శ్రవణసుఖదాయక స్వనకృత సహస్రఘంటికా ఘోషితం బింకుకాంతరచిత
మంటప వితర్ధికా కుడ్య మందిరంబు సుప్రసిద్ధధ్వజ పతాక శోభితంబు.

వ. ఇట్లు విశిష్టాలంకార విరాజితంబై మేరుశిఖరంబు కైవడి ప్రకాశించుచుండు నదియు వియన్మార్గమున మనోవేగమున నడుగ సమర్ధతగల పుష్పకవిమానమును సిద్ధపరచి శ్రీరామునకు నివేదించి వినయవినమిత శీర్షుండై శ్రీరామచంద్రా! నాకుకర్తవ్యమును నిర్దేశింపుడని విన్నవింప శ్రీరామచంద్రుడు స్నేహపూర్వకముగా విభీషణునితో నిట్లనియె

ఉ. ఓయివిభీషణా వినుము యుద్ధములోన వనాటసేన ల
త్యాయత బాహుశౌర్యముల నద్భుతకార్యము లాచరించినా
రీయెడ వీరికిందగిన హేమవిభూషణ వస్త్రజాలమున్
న్యాయముగా నొసంగి హితమూరగ చక్కగసత్కరింపుమా.

వ. అని యాజ్ఞాపింప విభీషణుడు ప్రహర్షచిత్తుండై యథార్హంబుగా వివిధవిచిత్ర రత్నభూషణాంబరాదుల నెల్లర సత్కరించె ననంతరంబ శ్రీరామచంద్రుడు యథేనిసత్కృతుల కెంతయు సంతసించి ఋక్ష వానర గోలాంగూల వీరుల నెల్లర నవలోకించి యందర బహువిధంబుల నభినందించి సుగ్రీవ విభీషణ ప్రభృతులతో నిట్లనియె

సీ. అనఘాత్ములార మహాసాహసము జూపి మిత్రకార్యంబును మీరలెల్ల
బూర్తిచేసితి రేనుపూని కృతార్థుండనైతిని మీరు మదాజ్ఞవలన
జనుడు సౌఖ్యముగ స్వస్థానసీమలకు యథేచ్ఛగా తడవేల నింకమీరు
సుగ్రీవ నీవును సుహృదయుండగు మిత్రుడొనరింపదగిన మహోపకార
మొనర సంపూర్ణ మొనరించి యుంటివిపుడు సర్వసేనలతోగూడి సత్వరమున
చేరదగుదింక నీవుకిష్కింధకనుచు వాకొని విభీషణునితోడ బలికెనిట్లు.

మంజరి :

విభీషణా! స్వీయరాజ్య లక్ష్మీవిభూతితో సంప్రీతిన్
శుభోన్నతిన్ సౌఖ్యమొందగలవిక సురలకజేయఖ్యాతిన్
నాతండ్రికి రాజధానియగుచున్ నలువొందు యయోధ్యకుం
జేతోమోదమున జనెదనాకన్ సెలవొసగుము ప్రియ మొదవన్.

వ. శ్రీరామచంద్రుం డిట్లాజ్ఞాపించుటయు వానరులెల్లరు కృతాంజలిబంధులై శ్రీరామునియందుగల భక్త్యనురాగ పూర్వకమైన రామవియోగముచు సహింపజాలక మిగుల దుఃఖించుచుండ వారల యభిప్రాయంబెరింగి సుగ్రీవ విభీషణు లేకగ్రీవముగా యిట్లు విన్నవించిరి.

సీ. శ్రీరామచంద్ర సుస్నిగ్ధ దయాసాంద్ర మాప్రార్థనము వినుమా మహాత్మ
మేమెల్లరము వేడ్కమీవెంట శ్రీమదయోధ్యాపురమున కత్యుత్సుకమున
జేరి మీ పట్టాభిషేక వైభవమును గాంచి మీజనముల గారవమున
సేవించి పత్తుము సెలవొసంగుము మాకు పురజనంబుల కెగ్గుబొరయకుండ
సత్స్వభావంబుతో కడుసంతసమున సంచరించెద మదిగాన సంశయంబు
మాని మీ సేవకులమైన మమ్ము సుప్రసన్నతితోడ గొనిపొమ్ము సమ్మతముగ.

వ. ఇట్లు విన్నవించు మిగులప్రీతిపాత్రులగు హనుమదంగద సుగ్రీవ విభీషణ ప్రభృతులైన మిత్రవర్గముతో నయోధ్యా నగరంబున కరుగుటయే ముఖ్యమని దలంచి శ్రీరామచంద్రుడు వారలకెల్లరకు సంతోషప్రదములైన వచనముల నిట్లనియె.

మ. పరమానందము గల్గెనాకును సుహృద్వర్గంబుతో సంపదా
కరమై యొప్పు యయోధ్యకేగుట సముత్కర్షన్ ప్లవంగేశ వా
నరవర్గంబులతో విభీషణ విమానశ్రేష్ఠమందెల్లరుం
ద్వరగానెక్కుడు సంప్రహర్షమతులై తర్కింపగా నేటికిన్.

వ. అని వారలకాజ్ఞాపించి సీతాలక్ష్మణ సహితుండై శ్రీరామచంద్రుడు పుష్పక విమానారూఢుండై మృదుల దుకూలాస్తరణ శోభిత సుఖాసనంబుల నధిష్ఠింప నంత క్రమంబున సుగ్రీవుడు సకలవానర భల్లూక సైనిక వర్గంబుతో విమానారూఢుండైన వారలెల్లరు తత్తదుచిత పీఠంబుల నుపవిష్టులైరంత

విభీషణుండును సచివసహితుండై పుష్పకమారోహించె ప్రబల బలిష్ఠులగు వానర భల్లూక రాక్షస సముదాయం బొకరినొకరు మొరసుకొనక సుఖప్రదముగా విశ్రమించి పరమసంతోష పారవశ్యమున పొంగిపోవుచు దాని ప్రభావమును అనేకవిధంబుల నొండొరులు ప్రసంగించుకొనుచుండ శ్రీరాముని యాజ్ఞ ప్రకారము పుష్పకమంతరిక్షంబున కెగసి నప్పుడు

చ. అగణిత రత్నరోచుల సహస్రమయూఖుని ధిక్కరించుచున్
గగనతలంబునం గడుథగద్ధగవెల్గు విమానమందు నిం
పుగ జెలువొందె రామనృప పుంగవుడాదివిమర్త్యసేవ్యుడై
పొగడితగన్న దేవవిభుపోల్కి మహావిభవాభిరాముడై.

గీ. కనుము వైదేహి యదె విశ్వకర్మ నిర్మితంబల త్రికూట శైలాగ్రతలమునందు
వెలుగుచున్నది కైలాసశిఖరమటుల కడుమనోహరమగుచు లంకాపురంబు.

సీ. జనకరాజతనూజ గనుగొనుమియ్యెడ సమరభూస్థలి విశేషముల నెల్ల
దుర్జయులైన దైత్యులతో వనౌకస సైనికుల్ పోరిన స్థలములివియె
రక్షోవిభుండైన రావణాసురుని వధింపగల్గిన చోటిదే లతాంగి
కుంభకర్ణుండను ఘోరరాక్షసు బడగూల్చిన నేలవిది కువలయాక్షి
చెలగి లక్ష్మణు డింద్రజిచ్ఛిరము నరికివైచిన స్థలమిది వనజగంధి
పతివియోగార్తి రావణుభార్యలెల్ల మిగులవగనొందు చోటిది మించుబోణి.

సీ. నీనిమిత్తముగ మున్నీటిపై సేతువు నిర్మించితిమి యిదే నెలతమిన్న
నలసేతువనుపేర నలరారునిది దుష్కరంబిట్టి కార్యనిర్వాహణమతివ
గగనతలంబంట నెగయు సాంద్రతరంగ సంఘముతో నొప్పు సాగరమును
గాంచుమిచ్చోటనే కపిసైన్యములు శ్రమ వాయగా నిలిచిరి వనజగంధి
అదియెసుమి మారుతికి విశ్రమార్థ మబ్ధిపైకి తేలివమైనాక పర్వతంబు
సేతువనుపేర త్రైలోక్యసేవ్యమిమ్మహాకలుషనాశకంబు శుభాంగివింటె.

గీ. ఇచ్చటనే దొల్లి జలధి మాయెడ ప్రసన్నుడగుచు నతులిత భక్తి ప్రియంబొనర్చె
అసురపతి యావిభీషణుం డరుగుదెంచి శరణమర్థించె నన్ను సుస్వాంతుడగుచు.

గీ. చూడుమిది చిత్రకానన శోభితంబు గడపితిమి వాలినిచట సుగ్రీవ పురవ
రంబు కిష్కింధయనుపేర డంబుమీరు మాకు నెలవయ్యె నీఋష్యమూకశిఖరి.

వ. ఇట్లు ప్రసంగించుకొనుచు కిష్కింధాపుర ప్రాంతమున కేతెంచుటయు సీత ప్రియవినయ సంభ్రమంబుల శ్రీరామచంద్రునితో నిట్లనియె.

మంజరి:

రాజపుత్రి తారాదిసకల మర్కటకుల పత్నులతోడన్
రాజధానియైన మనయయోధ్యకు రాదగుననుచున్ వేడన్
సమ్మతించి కిష్కింధచెంత పుష్పకమునిల్పి దాశరథి
పిమ్మట సుగ్రీవుగాంచి యిట్లను ప్రియమున కరుణాశరధి

గీ. వానరేశ్వర సర్వప్లవంగవరుల సతులతోఁగూడి చనఁగోరె జనకతనయ
కాన తమతమ ప్రియురాండ్ర గలసి పయన మగుడని వచించుటయు నంత
హర్ష మెసఁగ.

వ. సుగ్రీవాది వానరులు కొందరు పుష్పకమునుండిదిగి తమతమ ప్రియురాండ్ర పయన మొనర్పు చుండిరంత సుగ్రీవుడు నిజాంతఃపురమునకరిగి తారతో ప్రేయసీ సకలవానర పత్నులతో నయోధ్యాపురమునకు రావలయునని సీతకోరుచున్నది గావున శ్రీరాముని యాజ్ఞాప్రకారము మనమెల్లరము యయోధ్యాపురంబున కరుగవలయు గాన నీవువానరస్త్రీలనెల్లర రావించి ప్రయాణమును సాగింపుమనుటయు తారాదేవి పరమప్రహర్షవదనయై వానరస్త్రీలనెల్లర రావించి యిట్లనియె.

ఉ. ఓవనజాతులార మన మొప్పఁగ నాథులతో నయోధ్యకున్
రావలెనంచు గోరెనట రామునిపత్ని తదాజ్ఞ చేత సు
గ్రీవుడు మున్నుగా సకలకీశవరుల్ మనతోఁ జనంగ మో
దావహులైరి గావున వెసం బయనంబొనర్పు డిమ్ములన్.

గీ. దశరథుని భామినుల నయోధ్యాపురమును శ్రీరఘూత్తము పట్టాభిషేక
మచటివింతల విశేషముల ను సంప్రీతితోడ గాంచివత్తము రారమ్మ కాంతలారా!

వ. అని తారాదేవి యాజ్ఞాపించుటయు వానరస్త్రీలెల్లరు సంతోషభరితులై చక్కఁగా దివ్యదుకూల దివ్యమాల్యాంబరాభరణాలంకృతులై వచ్చి పుష్పకమునకు ప్రదక్షిణపూర్వకముగా సీతాసందర్శన కుతూహలులై విమానారూఢులై సీతారాములకు నమస్కృతు లాచరింప సీతాదేవి వారినెల్ల సగౌరవముగా నాదరించి నిట్లుపరస్పర సౌహార్ద్ర సల్లాపములతో పరమానంద భరితులై రంత విమానము రామాజ్ఞ చొప్పున క్రమ్మఱ విహాయసంబున కెగసి మహావేగముతో జనుచుండ శ్రీరామచంద్రుడు మార్గంబున విశేషంబులెల్ల సీతకిట్లని చెప్పందొడంగె.

ఉ. కాంచుమదే ధరాతనయ కాంచనధాతువిరాజమానమై
మంచులచే ప్రకాశిలెడు మేఘమువడికై నొప్పు ఋష్యమూ
కాంచిత శైలరాజము ప్రియంబేసగన్ ప్లవగేంద్రునిందు సం
ధించిత వాలినొక్కటి వధించెదనంచు ప్రతిజ్ఞ జేసితిన్.

వృషభగతిరగడ

కాంచు మిందు నిభాస్య మానుయికాననాంతరసీమనెల్లెడ
సంచరించితి సీవియోగ విషాదమగ్నుడనై బడల్పడ
పానతోదక పూర్ణమగు పంపాసరోవర మల్లదేగను
మీావనంబున గంటితాపసి నెంతయున్ శబరిని గుణాఢ్యను
ఘోరదైత్యు కబంధునియ్యెడ గూల్చివైచితి విక్రమంబున
పీరుడైన జటాయు వీవటవృక్షమందె వసించెనల్లన
రావణుండు జటాయువందు దురంబొనర్చిరి సీనిమిత్తమై
నేవధించితి దూషణున్ ఖరునిన్ త్రిశీర్షునిటన్ మొఱుంగుము
పావనాంగి యిదేసుమా మనపర్ణశాల దురాగతంబున
రావణుండు హరించెనిన్ను కురంగలోచన యివ్వనంబున
దాపునం గనుపట్టె గాంచుము తన్వి మరిగోదావరీనది
తాపసోత్తము డయ్యగస్త్యుని ధన్యమైన శుభాశ్రమంబిది
దేవినీవిటు గాంచుమల్ల సుతీక్ష్ణు చక్కని యాశ్రమంబును
భావితాత్మకుడైన తచ్ఛరభంగ యోగిశుభాశ్రమంబుడు
ఇందు మేము విరాధునిన్ వధియించినారముగాదె పేరిమి
సుందరాంగి యివేమహర్షుల శోభనాశ్రమ దేశముల్సుమీ
చూచినావుగదా యదే యనసూయతో నిటనత్రిమానిని
దోచెనల్లదె చిత్రకూటము తోరమై చెలువొందె మానిని
పూనినన్ను నయోధ్యకుం గొనిపోవగా భరతుండు మెల్లన
సేనతో జనుదెంచె నీవనసీమకుం బరికింపుమల్లన
నాతిగన్గొను మల్లదే యమునాతరంగిణి దూరమందున
ఖ్యాతిమీార యదేసుమా గంగాభవాని జగత్త్రయంబున
నామహావనమే భరద్వాజాశ్రమ స్థల మారయున్ చెలి
రామగన్గొది శృంగబేర పురంబటన్ గుహుడుండునర్మిలి
యోసతీమణి గంటివే సరయూతరంగిణి చిత్రకానన

భాసురంబు ప్రదీప్తితో గనుపట్టె యూప స్తంభముల్ మన
రాజధానియిదె ప్రియంబొనరంగ వందు మాదరింపుము
తేజమొప్ప సుఖంబుగా జనుదెంచినామునుమీ విశేషము.

ము. అని శ్రీరామవిభుండు దెల్పుచు నయోధ్యాపట్టణంబల్ల జే
గనుమన్నన్ వినివానరోత్తములు వేడ్కన్ యేదియేదంచు జ
య్యన శీర్షంబులనెత్తి సిక్కికమహార్హావేశులై గాంచ న
య్యనిమేషాలయ తుల్యమై మిగుల హృద్యంబై ప్రకాశిల్లగన్.

గీ. రఘుకులాధీశ్వరుడు చతుర్దశ శరత్ప్రవాసము పూర్ణమొనరించి పంచమితిథి
ముదముగదుర భరద్వాజ మునిశుభాశ్రమంబు ప్రాపించి ఋషికి నమస్కరించె.

వ. ఇట్లు మార్గమధ్యమునగల విశేషముల సీతకు వానరులకెల్లర కెఱింగించుచు శ్రీరామచంద్రుడు భరద్వాజాశ్రమ స్థానమున పుష్పకముచు నిలిపిన వారెల్లరు దిగిన శ్రీరామచంద్రుడు డమ్మహర్షి సన్నిధానమున కరిగి ప్రణామమస్పించిన మహర్షివర్యుం డెంతయు సంతసించి వారల యథాన్యాయముగా సత్కరించి శ్రీరామచంద్రా చిరకాలమునకు గ్రమ్మఱ సుఖముగా జనుదెంచుచున్న మిమ్ముల గనుంగొను భాగ్యము మాకులభ్యమగుటయెంతయు మదానవహమయ్యె ననశ్రీరాముడుం డిట్లనియె మహాత్మా! సాకేతపురవాసుల కెల్లరకు కుశలమా భరతుడు ప్రజానురంజకముగా రాజ్యపాలన మొనర్చుచుండెనే మాజనను లెల్లరు క్షేమముగా నుండిరేగదా యని ప్రశ్నింప మహర్షి యిట్లనియె శ్రీరామచంద్రా! యయోధ్యాపురవాసులందరకు కుశలమే మరియు

గీ. జడలు ధరియించి ధూళిధూసరిత గాత్రుడగుచుండు భరతుండు మరిభవదాగమనము
కాంక్షజేయుచు నీపాదుకలను భక్తియుక్తి గొల్చుచు కుశలియై యున్నవాడు

ఉ. ఓరఘువంశవర్ధన ప్రసిద్ధిగ ఘోరవనప్రదేశ సం
చారమొనర్చు మిమ్ముగని చాలవిచారము నొందియుంటి చే
డారకు దుర్మదోద్ధతి భయంకర రాక్షసులన్ వధించి నిం
డారు ముదంబునన్ జయమునొందు నినున్ గని సంతసించితిన్.

గీ. కైక కారణమున కాంతారములలోన కాంతతోడ ప్రబల కష్టదశల
ననుభవించితివి మహైశ్వర్యమును బాసి నేటికొదవె శాంతి నిర్మలాత్మ.

గీ. మానుల కభయంబొసగియు బూనిజనస్థానమందు భుజశౌర్యమునన్
దానవులనెల్ల దునుముట మానసమునగంటి యోగమహిమముచలనన్.

వ. నీయరణ్యసంచారక్రమంబెల్ల నాకుగోచరమగుచుండె దురాత్ముండగురావణుడు నీసతీలలామ నపహరించి చనుటయు నీవు మారీచుని వధించి సీతాన్వేషణకు బయల్వెడలి సంచరించుట మొదలగు వృత్తాంతమంతయు యోగబలంబున గ్రహించితి. నీవునేడిందు నాయాతిథ్యమును బరిగ్రహించి రేపకడ సైన్య సమేతుండవై యయోధ్యాపురంబున కరిగెదవుగాక యన శ్రీరాముండందుల కంగీకరించె నంతమునివరుండు వెండియు శ్రీరామునితో శ్రీరామచంద్రా! నీకొకవరంబివ్వదలంచితి కోరుమనుటయు శ్రీరామచంద్రుం డెంతయు సంతోషముతో నిట్లనియె.

ఉ. ఓమునివర్య మేమిపుడయోధ్యకు బోయెడుమార్గమందు మేల్
భూమిరుహంబులెల్ల పరిపూర్ణ మధుద్రవ యుక్తమౌ ఫల
స్తోమముచే విరాజిలెడుచొప్పున నొప్పవరంబునిమ్ము చాల్
మామది సంతసించు నన మౌనికులోత్తము డాదరంబునన్.

మంజరి :

అటుల నగుంగాకయంచు బ్రీతి మహర్షి వరేణ్యుడు నుడువన్
అటకపియూధములు యోజనత్రయ మాక్రమించుకొని నిలువన్
పథమున నలరారుచున్న బహువిధ పాదపములు నలుగడలన్
మధురములగు దివ్యఫల రసాదులు మనోహరముగా బొదలన్.

గీ. ఫలకుసుమ పత్రవిరహిత పాదపములు బహుళ ఫలపుష్ప పత్రసంపన్నమగుచు
కల్పవృక్షములకు నెనగల్గి సర్వకాలముల యందును సమృద్ధిగా రహించె.

వ. అంత వానర భల్లూక సైన్యంబులు మిగుల ప్రహృష్టహృదయులై యథేచ్ఛ సంచరించిరంత శ్రీరాముడయోధ్యా నగర ప్రవేశమును గురించి యించుక యోచించి హనుమంతుని జేరియిట్లనియె.

సీ. హనుమత్కపీంద్ర నీవరిగి మజ్జనకుని సౌధాంతరముల నస్మజ్జనుల
కుశలమారసి రమ్ము గుహుడనుపేర కిరాతరాజుమదంతరంగసఖుడు
కలడు నీవరుగు మార్గములోన శృంగిబేరంబననొప్పు పురంబునందు

యతనికి నాక్షేమ మంతయు నెరిగింపు మాతడు పరమ ప్రహర్ష మెసగ
తెలిపి నీకునయోధ్యకు తెరువుజూపు నెలుగు భరతుని వృత్తాంతమెల్ల దెలుపు
పిదప భరతుని కడకేగి ప్రియ మెసంగ క్షేమమునవచ్చితిమటంచు జెప్పుమయ్య.

వ నీవు నాప్రవాసవృత్తాంతమంతయు విశదముగానెరింగించి సుగ్రీవ విభీషణ ప్రభృతులతో నేతెంచుచుంటిమని దెలుపుము పదపడి భరతుని ముఖ దృక్సంభాషణాదుల విముఖ సుముఖముల ద్వారా యతని యభిప్రాయమును గ్రహించి నేనయోధ్యకు బయల్వెడలక మున్నె నీవునాకడ కేతేరవలయు నేలనన

గీ. రధ మదేభ తురంగ పూర్ణంబు మహిత సర్వకామసమృద్ధంబు జనులకెందు పితృపైతామహంబైన విపులరాజ్య మెవ్వరికి నాశగలిగింపకెట్టులుండు.

వ. అదియునుంగాక

గీ. భరతుడు సామ్రాజ్యమునం జిరపరిచితుడగుటజేసి చిత్తమున వసుం
ధర నేలనుత్సహించిన పరిపాలన మతడొనర్చు ప్రమదమెసంగన్.

వ. మదీయాగమనమునకు భరతుండెంతయు ప్రీతుండగుచో క్రమ్మర నీవురానలదు లేనిచో త్వరితగమనంబున నాకడకరుదేరవలయునని యాదేశింప తదాజ్ఞాను సారముగా హనుమంతుడు మనుష్యాకారముతో బయల్వెడలి మింటికెగసి గరుడుని విధంబున రివ్వున వాయువేగముతో జని గంగాయమునల సంగమ స్థానమును నిర్గమించి శృంగిబేరపురంబుజేరి గుహునిగాంచి శ్రీరామాగమనం బెరింగించిన నతడు హర్ష పులకితాంగుండై చెంగునఁనెగసి హనుమంతుని కౌగలించుకొని కుశలంబారసి భరతుని కుశలవృత్తాంతంబెరిగింప నాకర్ణించి తదనుమతంబున నటనుండి బయల్వెడలిమార్గమధ్యమున పరశురామతీర్థంబును వాలుకీనది నుత్తరించి గోమతిందాటి భయంకరసాలవనంబును బహుజన పూర్ణంబై సకలైశ్వర్యశోభితంబులైన దేశముల గనుంగొనుచు బహు దూరముగా జని స్త్రీబాల వృద్ధజన సేవ్యంబై రమణీయ పుష్పోపవనంబులతో నలంకృతమగు నందిగ్రామంబును జేరియందు

సీ భరతుని సుగుణసంభరితుని సామిత్రి కనులార ముదమున గాంచెనంత
ననశనకృశ దేహు నాశ్రమవాసుని మునివేషధరు ఫలమూలభక్షు
సత్యసంభాషణు సద్యశఃపరిపూర్ణు వరమృగాజినజటా వల్కలధరు

మలదిగ్ధదేహు నిర్మత్సరు సాధు సజ్జనబుధ సంసేవ్యు శాంతు దాంతు
పరమధర్మపరాయణు భాతృవిప్రయోగ కర్శితు భోగభాగ్యోపకరణ
వర్జితుని రామపాదుకాద్వయ సమర్పితాఖిల ప్రాజ్య పూజ్య రాజ్యాధికారు.

వ. మరియును మహర్షి విధమున నొప్పు భరతునితో సమానధర్మాచరణ పరాయణు
లగు సకల మంత్రిపురోహిత పౌరజానపద సైన్యంబులును దివ్యవస్త్ర రత్న
భూషణాద్యలంకారవర్జితులై కాషాయాంబర ధారులై తత్తత్కార్యనిర్వాహణ
శీలులగుచు సేవించు ప్రజలతో మూర్తీభవించిన దేవతనానొప్పు భరతుని
విలోకించి నమస్కరించి ముకుళిత కరకమలుండై నిలిచి హనుమంతుండిట్లనియె
మహాశయా!

సీ. శుభవార్త దెలిపెద శోకంబుడుగుమింక శ్రీరామవిభుని గాంచెదవు యిపుడ
చెలువొప్ప వల్కలాజిన జటామండలధారివై ఘోరకాంతారసీమ
చరియించు శ్రీరామచంద్రుని విషయమై పెనువిషాదమున తపించుచుంటి
వట్టి శ్రీరామక్షమాధీశు డిపుడు మీక్షేమమారయ బంచె శిష్టచరిత
రావణాసురు బరిమార్చి రామవిభుడు సీతతో లక్ష్మణునితోడ స్నేహకోటి
కొలువ నిష్టార్థ పూర్తితో నెలమి నేడు వచ్చుచున్నాడు నినుగాంచు వాంఛ జేసి.

మంజరి :

హనుమత్కపివీరుడిట్లు దెల్పగ నన్నపైని గలకూర్మిన్
మనమలరగ భరతుడంత మోహనిమగ్నత బడియెం బేర్మిన్
ముహూర్త మాత్రమున నాతడల్లన మూర్ఛదెలిసి వేగమునన్
మహాత్ముడగు వాయుపుత్రునన్ సంభ్రమమునగని ప్రేమమునన్.

క. మానసము పొంగ భరతక్ష్మానాధుడు లేచి బిగ్గగాగిటిలో త
ద్వానరవీరు గదించుచు నానందాశ్రువుల నతని నభిషేకించెన్.

వ. తదనంతరంబ భరతుడు సంతోషముతో

సీ. నేడెంత సుదినమో నేనుధన్యుడనైతి మీదర్శనము మాకు మేలుగలిగె
మీరెవ్వరొక్కొ స్వామీ వచింపుడు భాగ్యవశమున నిచటికి వచ్చినారు
భావింపజాలను దేవుడవో లేక మనుజమాత్రుడవో నిర్మలగుణాఢ్య
శ్రీరామచంద్రుని క్షేమంబు దెలిపి మదాత్మీయ సంతాపమార్పినావు
నీఋణము దీర్పగాలేను కోరుమిష్టవాంఛితార్థంబులిచ్చెద నలయునన్ని
గ్రామముల గోగణంబుల గన్నియలను హితవొలర్పగ నీవు గ్రహింపుమనఘా.

వ. రామాగమన కాంక్షితుండగు భరతుడిట్లు మహానందకందళిత హృదయార విందుండై భాషించుచు శ్రీరామచంద్రు దర్శనాభిలాష మనంబున జెంగలింప నిట్లనియె.

గీ. శ్రీరఘువరుండు కాననసీమలకును బోయిబహువత్సరములయ్యె బోగుల నింత
కాలమునకు గదా వినగలిగె విభుని నామసంకీర్తనంబు మన్మనమునిండె

గీ. కడుశుభస్కరమైయొప్పు గాథనేడు కర్ణపేయంబుగా వినగల్గెనౌరా
బ్రతికియుండినచో శతవర్షములకు నైన నానందమొందు భాగ్యములభించు

వ. అనివచించుచు సంప్రమోదభరితుండై హనుమంతుని యొకచిత్రాసనమున సుఖాసీనుంగావించి తానతని కభిముఖముగా నాసీనుండై యిట్లనియె ఆర్యోత్తమా! శ్రీరాముడు యెవ్వరిస్నేహమున రావణప్రముఖ రాక్షసుల వధించె శ్రీరాముని వనవాసదీక్ష యెవ్విధమున గడచె తద్వృత్తాంతం బెరింగింపు మనెను.

భరతుడు చిత్రకూటమునుండి రామాజ్ఞ చొప్పున పాదుకాద్వయముతో పురప్రవేశ మొనర్చిన పిమ్మట శ్రీరామచంద్రుడు సీతాలక్ష్మణసహితుండై మహర్షుల యాశ్రమముల నివసించుట మొదలుకొని రాక్షససంహారము, సీతాపహరణము, సుగ్రీవాదులతో మైత్రి సేతుబంధనము రావణవధ మొదలగు చరిత్రనంతయు నెరింగించె. "ప్రకృతము శ్రీరామచంద్రుడు సకలవానర సముదయంబుతో సీతాలక్ష్మణ సహితుండై విమానయానమున భరద్వాజాశ్రమమునకేతెంచి ముందుగా మీకెరింగింపబంచె. రేపు పుష్యమీ నక్షత్రమున మీఅన్నగారిని సందర్శింపగలవని" విన్నవింప భరతుడు పరిపూర్ణానంద భరితుండై నామనోరథంబు బహుకాలమునకు సఫలమయ్యెనని తలంచుచు నతని ననేకవిధముల మృదుమధుర వచనపూర్వకముగా సత్కృతుల సన్మానించి శత్రుఘ్నునితో నిట్లనియె.

శా. శత్రుఘ్నా! తడవేటికింక పురిలో చాటింపగా బంచి మేల్
చిత్రాలంకరణాది కార్యవిధులం జేయించి వైతాళిక
స్తోత్రంబుల్ బహుతూర్య ఘోషణములున్ శోభిల్ల పౌరాళితో
నేత్రాలంకరణంబుగా రఘువరున్ వీక్షింప నేగందగున్.

వ. అని యాజ్ఞాపింప నంత శత్రుఘ్నుడు రామాగమన విశేషమును పురంబెల్లెడల జాటింప ననుమతిజేసి వేనవేల పనివాండ్ల రావించి తత్తదుచిత కార్య నిర్వాహణంబుల కిట్లాజ్ఞాపించె.

సీ. ఇచటినుండియయోధ్య కేగుమార్గము మిట్టపల్లములను చక్కపరుపవలయు
నగరమందెల్లెడ నానావిచిత్ర ధ్వజాద్యలంకృతుల నేయంగవలయు
బహువిధ సౌరభ ప్రసవ స్తబక మాలికలు గృహాంగణముల గట్టవలయు
నతిపరిమళ సీతలాంబువుల్ వీథులనెల్లెడ చల్లగా జల్లవలయు
కర్పూరపు రంగవల్లులు దీర్పవలయు లాజలును పుష్పములును చల్లంగవలయు
ప్రజ్వలద్దీపమాలికా ప్రచయకాంతి దీటుకొన చల్వపందిళ్ళు దీర్పవలయు

గీ. రాజపత్నులు మంత్రులు రాజసులు బ్రాహ్మణాది సమస్త వర్ణముల ప్రజలు
సర్వసైన్యములును శ్రీరామచంద్రమూర్తి కభిముఖంబుగ నతివేడ్క-
నరుగవలయు.

వ. అనియాజ్ఞాపింప మంత్రిప్రముఖులును, కార్యకర్తలును త్వరలో నయోధ్యా నగరంబును నంది గ్రామంబును సర్వవిధాలంకారముల జేయించిరనంతరంబ యయోధ్యానగరమందుండి కౌసల్యాప్రభృతి రాజపత్నులును సమస్తప్రజలును సముచితాలంకార శోభితులై యుచిత వాహనారూఢులై శ్రీరామాదుల సందర్శించు కుతూహలంబున నంది గ్రామంబునకేతెంచి రంతరాత్రిగతించుటయు ప్రభాతంబున ప్రజలెల్లరు సత్వరంబున కాలోచిత కృత్యంబుల నిర్వర్తించుకొని సర్వాలంకార శోభితులై శ్రీరామచంద్రుడేతెంచు మార్గమున కభిముఖముగా జన ప్రయాణ సన్నాహులై రట్టియెడ

సీ. భరతుడు శ్రీరాము పాదుకాద్వయమును దనశీర్షమున భక్తిదాల్చి వెడల
సకలసైన్యములు జనులు మంత్రులు బౌరులు ప్రీతితో బలసిగొలువ
ధారుణీసురులు వేదములు బఠింపంగ సకలవాద్యముల ఘోషణములెసగ
నందిమాగధుల కైవారముల్ చెలువొంద వేత్రహస్తులు వెడవెడజనంగ
రాచయువకులు తగచామరములువీవ ఛత్రమునుబట్టి తమ్ముడు సంతసమున
నడువ వారవధూమణుల్ నాట్యమాడ వైభవంబున జెలంగ సత్వరమెకదలె.

వ. వసిష్ఠాది మహర్షులు కుశాక్షత ఫల పుష్ప పాత్రాలంకృత హస్తులై నడువ జనులాబాలము శ్రీరామచంద్రుని దర్శనోత్సాహంబున జయజయధ్వానములతో నంది గ్రామము నిర్గమించి కొంతదవ్వరిగి శ్రీరామాదుల యాగమనంబు నిరీక్షించుచు నింకనుంగానక దశదిశల బరికించుచుండ భరతుడు సంశయ చిత్తుండై హనుమంతునితో నిట్లనియె

గీ. పూజ్యుడైన రాముబోడగాన మెచ్చోట కామరూపులైన కపులలోన
గానరాకొంతు కాపేయ చాపల్య మొనరనీకులేక యుందునొక్కొ.

వ. అని భరతుండిట్లు పలుకుటయు శ్రీరామాదుల యాగమనము తడవగుటకు కారణము తెలుపుచు హనుమంతుండిట్లనియె భరతమహీపాలా! అవధరింపుము

మంజరి :

భరద్వాజమునివరు కృపచే సంప్రాప్త ఫలప్రసవములన్
మరందరసపాన లాలసోన్మద మధుకరకులఝంకృతులన్
సమంచితానేక ఫలభక్షణ కుతూహలాత్మకులై
ప్రమోదమునన్ మెలగుచుండ నెల్లెడ ప్లవగోత్తములున్మగులై

వ. ప్రభూ! సర్వకాలములయందును వృక్షలతాదులు ఫలకుసుమ భరితంబులై యుండునట్లింద్రుడు శ్రీరామునకు వరంబొసంగె. తత్కారణమున భరద్వాజ మహర్షి సైన్యసమేతులైన శ్రీరామునకు అతిథ్యంబొసంగె. తదాతిథ్య సంతృప్తులగు వానరుల కోలాహల ధ్వనులవిగో వినవచ్చుచున్నవి వానరసేనలు గోమతీనదిందాటి వచ్చుచున్నట్లు గోచరించెడి యనిపలికి పరికించిచూచి మరియు నిట్లనియె

ఉ. అల్లదిగో పరాగము విహాయసమంటగ లేచె సైన్యముల్
మెల్లన వాలుకీనది సమీపము చేరగవచ్చుచుండె నం
చుల్లమునం దలంచెద నహో! దవుదవ్వుల నంతరిక్షమం
దెల్లరు వేడ్కగన్గొనుడు యిందునిభోజ్వలమౌ విమానమున్.

శా. పంకేజప్రభవుండు పూర్వము మహాప్రజ్ఞావిశేషంబునన్
సంకల్పంబున సృష్టిజేసె పిదపన్ సంగ్రామరంగస్థలిన్
లంకాధిపు సబంధుమిత్రముగ లీలన్ద్రుంచి శ్రీరాముడే
శంకాంతకములేక గైకొనియె భాస్వత్పుష్పకంబిమ్ములన్.

సీ. బాలసూర్యప్రభా భాసమానద్యుతిన్ సకలదిక్సీమల నిండివెలుగ
దేవతార్హముగ వాగ్దేవవిభుండు యోచించి యోగ్యముగ సృజించినదియు
మునసి మనోజవమున గామగమనయై గగనవీధి జరింపగలుగునదియు
చతురాననుని సుప్రసాదంబువలనన పౌలస్త్యుడతివేడ్క బడసినదియు

నగువిమానమునందు మహాత్ములైన రామలక్ష్మణులును సీత రాక్షసాధి
పతియగు విభీషణుమును ప్లవంగనాథు డాదిగాగల కపులెక్కి రరయుడదిగో.

వ. అని హనుమంతు డెరిగించుచుండ నతిత్వరిత గమనంబున నేతెంచు పుష్పక
విమానమున నున్న శ్రీరామాదుల గనుంగొని మహాజనులెల్లరు పరమా
హర్షంబున జయజయధ్వానములు సేయుచు వాహనంబులదిగి గగనపథంబున
చంద్రప్రతీకాశమై ప్రకాశించు పుష్పకంబున దేవనాథుని విధంబున నొప్పు
శ్రీరామచంద్రుని సేవించి కరకమలంబులు మొగిచి నమస్కరించుచుండె
రంత భరతుండంజలిబద్ధుండై శ్రీరామచంద్రుమ గమప్రకాలముచ కే
యేతెంచెనని సంతసించె నింతలో శ్రీరామానుమతంబున విమానరాజము
ధరాతలంబునకుదిగివచ్చినిలిచె.

మంజరి :

భరతుడంత పుష్పకమునెక్కి రఘుపతిచరణంబులవ్రాలి
త్వరితగతి ప్రణామమాచరించెం దత్పరమతిగుణశాలి
బహుకాలంబునకు నక్షిగతుడగు భరతునిలేవగదిగిచి
మహాదరముతోడ గౌగలించెన్ మనముకలంగగ వగచి.

వ. పదంపడి శ్రీరామచంద్రుడు భరతుని యంకతలంబున నిడుకొని మూర్ధా
ఘ్రాణంబొనరించి యాదరించె పిమ్మట భరతుడు లక్ష్మణుని సమీపమునకరిగి
కౌగలించుకొని ప్రియోక్తుల నాదరించె సీతాదేవిచరణంబులవ్రాలి నమస్కరించె
ననంతరంబ

చ. భరతుడు సుస్వభావమున భానుతనూభవు జాంబవంతు ని
ర్జరపతిపౌత్రునిం బనసు రంభు గవాక్షుని గంధమాదనున్
శరభు సుషేణు నీలుని ప్రజంఘు దరీముఖు మైందునిన్ సమా
దరముప కౌగలించె ప్రమదంబున వారలుపొంగ నయ్యెడన్.

వ. కామరూప ధరులైన వానరులు మనుష్యాకారముతో భరతుని కుశల
ప్రశ్నాదికంబుల గౌరవించి రనంతరంబ భరతుడు సుగ్రీవుని గాఢముగా
కౌగలించుకొని యిట్లనియె

గీ. నావచనమొండువిన్ము సుగ్రీవ మత్సహోదరులు నల్వురందు నీవొనరనిప్పు
డైదవ సహోదరుడవైతి, వాపుడగును సౌహృదంబున, దుర్వృత్తి శత్రుడగును.

కవిరాజవిరాజితము :

అనుచునచించి విభీషణునిం గనియాదరభావముతోఁ డుత ని
ట్లనియె విభీషణ భాగ్యవశంబున నబ్బిననీకు సహాయమునన్
జనులకు చేరికి తీర్పగరాని యసాధ్యపు కృత్యములెల్ల రణన్
మనములలో బ్రమదం బెసగంగ సమర్థత బూ_ర్తియొనర్చితివే.

వ. అంత శత్రుఘ్నుడు శ్రీరామలక్ష్మణులకును సీతాదేవికిని నమస్కృతు లాచరించె నప్పుడు దుఃఖవశమున కృశాంగియగు కౌసల్యాదేవి పాదంబులకు సీతాలక్ష్మణసహితుండై శ్రీరామచంద్రుడు నమస్కృతులాచరించి క్రమంబున తల్లులందరికి వసిష్టాది మహర్షులకును ప్రణామంబులర్పించి రనంతరంబ

ఉ. నాగరులెల్ల రాదరమునన్ ముకుళీకృత హ_స్తపద్ములై
స్వాగతమర్కవంశ కలశాంబుధిచంద్ర యటంచుబల్కుచున్
మూగిన తత్ప్రజాళి కరముల్ ముకుళించిన దమ్మిమొగ్గలో
నాగ బ్రకాశిలంగ రఘునందను డల్లనగాంచె నవ్వుచున్.

వ. పదంపడి ధర్మవిదుడైన భరతుడు తాను చిత్రకూటశైలమునుండి గొనితెచ్చిన పాదుకాద్వయమును శ్రీరామచంద్రుని పాదారవిందములకడ సమర్పించి కృతాంజలిపుటుండై నిలిచియిట్లనియె.

సీ. నేకృతార్థుడనైతి నీవయోధ్యకురాగ కనుపండువుగ మిమ్ముగాంచుకతన
నాకోర్కసిద్ధించె నానోములుఫలించె రఘువంశవర్ధనా రామచంద్ర
నీరాజ్యలక్ష్మిని నీవెభరింపుము నీయాజ్ఞ తలదాల్చి నేటివరకు
కాపాడితిని నీయఖండతేజంబున సంపద పదిరెట్లు పెంపునొందె
రథగజతురంగభట చతురంగములును బహుళ ధనధాన్య వస్తు సంపదలుబొదవె
హేమమయమైన కోశంబులివియె వేడ్కనవధరింపుము నీవుసమాదరమున.

గీ. భ్రాతృవాత్సల్యమున నిట్లుబలుకుచున్న భరతునివీక్షించి ప్లవగరాట్ప్రభృతిసకల
కపులును విభీషణాదులు కడుముదమున విడచిరానందబాష్పంబు వితతినెలమి.

వ. అంత శ్రీరామచంద్రుడు భరతుని సౌహార్ద్రభావమున కెంతయు బ్రహర్ష చిత్తుండై నతనినిజాంకపీఠంబున నిడుకొని సకలసైన్యంబులతో విమానంబున సుఖాసీనుండై నందిగ్రామంబునుండి యయోధ్యాపురంబున కరుగుదెంచి ధరా

తలంబునకు దిగివచ్చినిలుచుటయు వారెల్లరు విమానముచుండిదిగి వచ్చినంత
శ్రీరామచంద్రుఁడు విమానముతో నిట్లనియె విమానరాజమా! నీయమోఘ
ప్రభావమున నింతదూరదేశమున నత్యంతశీఘ్రకాలమున వచ్చిచేరగలిగితిమి
నీవింక నీయజమానియగు కుబేరుని నిలయంబున కరుగుమని సెలవొసంగిన
తక్షణంబ నాయుత్తమ విమానరాజ మాకసంబునకెగసి యుత్తరాభిముఖంబుగా
ధనేశ్వరుమందిరంబుసొచ్చె ననంతరంబ

మ. కతమన్యుండు బృహస్పతింగని నమస్కారంబు గావించుప
ద్ధతి శ్రీరాముఁడు తద్వసిష్ఠముని పాదద్వంద్వముల్ బట్టి యం
చితభక్తిం బ్రణమిల్లి తానునుగురుశ్రేష్ఠుండు వీరంబులం
దతులోత్కర్ష శుభప్రసంగములతో నాసీనులై రంతటన్.

గీ. శిరమునం దంజలిఘటించి భరతుఁడప్పుడు జ్యేష్ఠుఁడధికపరాక్రమ శ్రేష్ఠుఁడైన
రామచంద్రునితో ననురాగమొలయ నెల్లరువినంగ వాక్రుచ్చె నివ్విధమున.

సీ. విజ్ఞాపనంబొందు వినుము శ్రీరఘువర యిమ్మహాసామ్రాజ్య మెల్ల నీవు
నావశపరచి కాననసీమలఁజరించి కైకకోరిక దీర్పఁగల్గినావు
ఈసర్వసామ్రాజ్య మెట్లు నావశమందు నిల్పితివాంత నేనుమరల
నీకుసమర్పింతు నిశ్చయముగ దీనినేలుకొమ్మిమ్మహాభార మేలనాకు
భారసహనార్హమగు వృషభంబు మోవదగిన పెనుభార మల్పవత్సంబు మోవ
జాలని తెరంగు నీసమస్తప్రపూజ్య రాజ్యమేనేలనోప శ్రీరామచంద్రా!

మ. బలవంతంబగు సేతుబంధనమునన్ వారిప్రవాహంబు ని
శ్చలమైనిల్చినభంగి పూజ్యమగు యీసామ్రాజ్యభాగంబునం
గలఛిద్రంబుల మంత్రిగుప్తి మొదలౌ గాఢక్రియాసంవృతో
జ్వల సామర్థ్యము లేనిరక్షణము దుస్సాధ్యంబటంచెంచెదన్.

గీ. అశ్వగమనంబును ఖరంబు హంసనడల నధికయత్నంబుతో కాకమనుసరింప
లేనివిధమున శ్రీరామ లేశమైన నేను నీసామ్యమెట్లు రాలేనుగాదే.

వ. అనియిట్లు విన్నవించి వెండియు నిట్లనియె మహాత్మా!

సీ. పట్టాభిషేకంబు వడసి మధ్యాహ్నసూర్యగతి వెల్గునిను ప్రజల్ గాంచవలయు
మంగళతూర్యముల్ మధురగానంబు లాలించుచు నిదుర మేల్గాంచవలయు
సకలజ్యోతిశ్చక్ర సర్వంసహాచక్ర మెంతకాలంబుండు నంతదనుక

మహనీయ సర్వసామ్రాజ్యమునకు నీవె యేలికగానుండి యేలవలయు
ననిన భరతుని బ్రియభాషలాలకించి రామభూమీశ్వరుం డనురాగమునను
సమ్మతించిన నటనున్న సభ్యులెల్ల హర్ష సాగరమున నోలలాడిరంత.

వ. తత్సమయంబున శత్రుఘ్నుని యనుమతంబున సమర్థులగు క్షురకులరావించి భరతునితో సహా శ్రీరామలక్ష్మణులు క్షురకర్మల నివర్తించిరనంతరంబ

చ. భరతుడు స్నానమాడె కడుపావనతోయములందు ముందుగా
పరుసన లక్ష్మణుండు కపివల్లభుడంత విభీషణాదులున్
సరగున స్నానముల్ సలిపి చాదువిచిత్రమణీవిభూషణాం
బర ధరులై యథావిధిగ భాస్వదలంకృతులన్ దనర్చినన్.

వ. పదపడి పరిచారికాజనంబులు సర్వవిధోపచారపూర్వకముగా సేవించుచుండ

గీ. జడలుశోధింప మంగళస్నానమాడి దివ్యగంధానులేపనదివ్యరత్న
భూషణ మహార్ష కౌశేయ పుష్పమాల్య ధారియైరామచంద్రు డెంతేయువెలింగె.

వ. అట్టియెడ సీతను పరిచారికాజనంబులు మంగళతోయంబుల స్నానమాడించిరి. దివ్యమాల్యాంబరాభరణాలంకృతియై కౌసల్యాదేవిని సేవింప నంత కౌసల్యా ప్రభృతి రాజపత్నులు ప్రహృష్టహృదయులైరి. వానరభామినులకెల్ల రకత్యంత గౌరవంబున సుగంధతోయంబుల నభ్యంగనాదుల జేయించి వివిధవిచిత్ర వస్త్రభూషణ మాల్యచందన విలేపనాద్యలంకారములగావించి రంత శ్రీరామానుమతంబున సుగ్రీవాది వానరసముదాయంబున కెల్లరకు తత్తదుచిత భవనాంతరంబుల విడిదలల వసింపజేసి మనోహర చిత్రరత్న శిల్పచాతుర్యా లంకృతంబైన రాజసౌధంబులగల విశేషంబులెల్ల సుగ్రీవ విభీషణాదులకు జూపవలయునని భరతున కాజ్ఞాపించుటయు

చ. భరతుడు సంప్రమోదమున భానుతినూభవు హస్తపద్మమా
దరమున కేలనూని మదితద్దయు స్నేహము బెంప తంత్రిమం
దిరమున నన్నిభాగముల దివ్యమణిస్రగితాద్భుతాసనా
స్తరణ విచిత్రవస్తు సముదాయములన్నిటి జూపె నేర్పడన్.

వ. తదీయసౌధాంతరాళమున

సీ. కలహంస శుకశారికా మయూరానేక బహుళఖగౌఘ విభాజితంబు
జంత్రగాత్రవిశిష్ట సంగీతసాహిత్య చతురయోషిద్గాన సంభృతంబు
రజతదాంత సువర్ణరత్న చిత్రిత మహార్హాసన శయనపీఠాంచితంబు

చంపక పూగ వాసంతికా కురవక ప్రముఖలతాతరు భాసురంబు
నవనవోన్మేష బహువిధానల్ప శిల్పకల్పనానేక భోగోపకరణకలిత
మతుల సౌందర్యయౌవనాంచిత వధూసహస్రశోభితమై యొప్పెనంతిపురము.

వ. వానినెల్ల పరిశీలించి కనుంగొనుచు సంతుష్టాంతరంగులై రంత నెల్లరకు నపూర్వములగు భక్ష్యభోజ్య చోష్య లేహ్య పానీయాది యుష్టమృష్టాంబులతో ప్రచ్ఛదన తాంబూల శయనాసనాది సత్కారంబులతో బహువిధ క్రీడా వినోదంబులతో నందనోద్యాన తుల్యంబులగు దివ్యోద్యాన వనవిహారంబులతో మహానందపరవశ్యులై రంత శ్రీరామచంద్రుని పట్టాభిషేకమునకు వసిష్ఠాది మహర్షులు చక్కగాయోచించి శుభముహూర్తమును నిర్ణయింప తత్తత్కార్య కర్తలు పురంబునెల్లెడల సర్వశోభనాలంకార నిమగ్నులగుచుండిరంత శత్రుఘ్నుడు సుగ్రీవునితో హితపూర్వకముగా నిట్లనియె.

సీ అవధరింపుము ప్లవంగాధీశ తడవేల శ్రీరాముపట్టాభిషేక మెలమి
జరిగించుటకు చతుస్సాగరాంభఃపూర్ణ సౌవర్ణమయ కలశముల వేడ్క
గైకొనిరాదగు కపిముఖ్యులకు నాజ్ఞనిమ్మన సుగ్రీవుడిచ్చ మెచ్చి
శౌర్యసంపన్నులౌ శాఖామృగ ప్రముఖులను కొందర జీరిపలికెనిట్లు
త్వరితగతితో చతుస్సముద్రముల తీర్థములను కొనిరంచు పొందన మోదమలర
వానరులు శాతకుంభ కుంభములబూని వెడలిరాకసమున వాయువేగమునను.

వ. హనుమదాది ప్రముఖవానరులు కొందరు బయల్వెడలి పంచశత మహానదీ తీర్థపాత్రలు గొనివచ్చిరి

మంజరి :

పూర్వసముద్రంబు పూర్ణకలశము బూనిసుషేణుడు నచ్చెన్
గర్వోన్నతి దక్షిణాంబునిధి జలకలశము గయుండు దెచ్చెన్
పశ్చిమాబ్ధినుండి పూర్ణజలకుంభము గవయుడు గొని తెచ్చెన్
నిశ్చలుడైనీలుడుదీచిదిగ్జలనిధి తోయముగొని తెచ్చెన్.

గీ. వానరశ్రేష్ఠులట గొని తెచ్చియున్న తత్పయఃపూర్ణ కనకరత్నమయ కుంభ
ములను శత్రుఘ్నడఖల మంత్రులును తాముగని వేదించిరి వసిష్ఠతపసిమణికి.

వ. అంత కార్యకర్తలెల్లరు బయల్వెడలి సత్వరంబున

సీ. పురరాజవీథు లద్భుతముగ చలువపందిళ్ళు మేల్కట్లతో దీర్చిరెలమి
వివిధవర్ణ విచిత్రవిద్యుద్రుచిర దీలు చక్క సహస్రశాపిగనమర్చిము

ఆణిముత్తెపుకుచ్చు లతిదీప్తివెలుఁగొంద పచ్చతోరణము లేర్పడవెలార్చి
లీలరంభానారికేళ పూగమహీజ పత్రవృంతముల స్తంభములఁగూర్చి
చొక్కపు జవాజి పునుఁగు కస్తూరి మిళిత సారభామల శీతలజలముఁజల్లి
కప్పురపురంగవల్లు లక్కజముగా ప్రకాశిలఁగ దీర్చి కెల్లెడ కౌతుకమున.

సీ. సకలవిదేశస్థ సామంతనృపతులు ప్రబలధనాధికుల్ పండితులును
వేదాంతవేత్తలు వివిధశాస్త్రజ్ఞులు బహుధోద్యోగులు బ్రహ్మవిదులు
సంగీతపాఠకుల్ సత్కవిశ్రేష్ఠులు పౌరాణికులు మేటివర్తకులును
నాటకపాత్రాభినయ కోవిదులు కడుమేటి వేశ్యాంగనా మేళములును
బహుకళోపాసకులు సుహృద్బాంధవాప్త వర్గములు తాపసోత్తముల్ బ్రాహ్మణాది
సర్వవర్ణస్థులతులితోత్సాహులగుచు వచ్చి చేరిరి సముచిత వాహనముల.

వ. ఇట్లు శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్సవాలోకన తత్పరులై యేతెంచిన నానావిధ స్త్రీపురుష జనానీకమున కర్హవిధాసన పంక్తులతో సభాభవన మెంతయు నయనానందకరంబై సర్వవిధాలంకార భూయిష్ఠంబై సర్వతోముఖ ద్వారశోభితంబై యనేక రక్షకభటరక్షితంబై చెలువొందె నప్పుడు

సీ. అవనీధవులు ప్రసిద్ధార్థాధికులు వేడ్కనారామవిభునియందధికభక్తి
నభినవమణిమయ హారాద్యమూల్య భూషణములు గోవులు ధనము దివ్య
రత్నకంబళములు రమణీయ నవ్యాంబరములు జాత్యశ్వముల్ రత్నచయము
వ్యాఘ్రాజినములు కృష్ణాజినంబులు కనత్కనక రౌప్య వినిర్మితప్రతిమలు
చందనాగురు కాశ్మీరజ న్మమును సుగంధబంధురమైన చొక్కపుజవాజి
పునుగు మృగనాభి పచ్చకర్పూరము లాదిగాఁగల్గు వస్తుసంతతుల్ కాన్కలొసఁగ.

వ. భరత శత్రుఘ్నప్రభృతు లాయావిశిష్ట వస్తుసముదాయంబెల్ల పరిగ్రహించి వారివారికిఁదగిన విడిదలల నేర్పరించి వివిధసత్కారముల గౌరవించిరంత వసిష్ఠ వామదేవ జాబాలి కణ్వ కాత్యాయన విశ్వామిత్ర మార్కండేయ గౌతమాగస్త్య భరద్వాజాది మహర్షులును సాంగపదక్రమ స్వాధ్యాయపరులైన బ్రాహ్మణోత్తములెల్లరు తత్తత్కాలోచిత కార్యముల నిమగ్నులై సుముహూర్తమునకై నిరీక్షించుచుండిరి.

సీ. సకలమహానదీ సాగరాంభఃపూర్ణ కుంభముల్ తగసమకూర్చి పిదప
నభిషేక కార్యార్థ మౌదుంబర వినిర్మితాసన మమరించి రతిముదమున
నవధాన్యములు ప్రసిద్ధానర్ఘ్య రత్నముల్ పరిమళద్రవ్యముల్ పాలుపెరుగు
పుష్పముల్ కుశలును బొసగు లాజ్యంబునూ మధువు ఖడ్గము హిరణ్మయవిచిత్ర
పాత్రములు మేటిచాపంబు భద్రగజము చతురసౌందర్య కన్యకాష్టకము మరియు
సైంధవచతుష్టయాంచిత స్యందనంబు సిద్ధ మొనరింపబడియె విచిత్రముగను.

వ. మఱియును

సీ. చామరంబులు సితచ్ఛత్రంబు పల్లకి వ్యాఘ్రాజినంబు సింహాసనంబు
కనకదామనిబద్ధ ఘనవృషభంబును రమ్యకేసర చతుర్దంష్ట్రిలొప్పు
యుత్తమాశ్వంబు సముజ్జ్వలవహ్నియు వివిధవాద్యములును వేశ్యలన్య
దేశసమాగత స్త్రీపురుషాళియు నాచార్య గోభూసురావళియును
సిద్ధమైయుండె ఖగమృగశ్రేణులెలమి తమతమ ధరాధి నాయకోత్తములతోడ
శ్రీరఘూత్తము పట్టాభిషేక వైభవోత్సవాలోకనాపేక్ష నొప్పియుండె.

కవిరాజవిరాజితము

బహువిధ వాద్యవిశేషములున్ స్తుతిపారక గీతమహాస్వనముల్
సహజపరాక్రమ శోభితులౌ భటసంచయ సింహనినాదములున్
వివిధగతిన్ పురవీధుల సజ్జనవిశ్రుత భవ్యజయధ్వనులున్
రహినెసగెం గమపర్వమునన్ జలరాశి సముద్ధతి పొంగుగతిన్.

వ. అంత సుముహూర్తము సన్నిహితంబగుటయు సర్వాలంకార శోభితులగు
స్త్రీపురుషాది మహాజనులచే సభాభవనంబెల్ల క్రిక్కిరిసి తత్తదుచిత స్థలంబుల
నెల్లరు నిశ్శబ్దముగా సుఖాసీనులై తమత్సవ సందర్శన సంతోష పారవశ్యమున
నుప్పొంగుచుండి రట్టియెడ శ్రీసీతారాములు పుష్పరథంబున నధిష్ఠించిన
భరతుడు స్వేతచ్ఛత్రధారియై నిలువ లక్ష్మణశత్రుఘ్ను లిరుగడల
వింజామరములు వీచుచుండ బ్రాహ్మణపుంగవులు వేదపఠనంబొనర్చుచుండ
వేత్రపాణులు బరాబరులుచెప్ప వందిమాగధులుస్తుతి పాఠంబులు జదువుచుండ
సభాభవనమున కేతెంచి రథావతరణంబొనర్చినచ్చు సీతారాముల వసిష్ఠాది
మహర్షు లెదుర్కొని

గీ. బ్రహ్మవిద్వర్యులైనట్టి బ్రాహ్మణప్రవరులతోడ ప్రయత్న పూర్వకముగా వ
సిష్టముని రామచంద్రుని సీతతో ప్రసిద్ధమణిమయ పీఠినాసీనుజేసె.

సీ. పటహ కాహళ శంఖ పణవ వీణా వేణు ముఖ్యవాద్యంబులు మ్రోయుచుండ
నృత్యగీతాదుల నేర్పరులగు వారవారిశిరోమణుల్ నాట్యమాడ
వేదపారగులైన విప్రవరేణ్యులు వేదప్రవచనంబు వేడ్కసలుప
వందిమాగధ సూతవైతాళికబృంద పద్యసంస్తుతుల ఘోషలు చెలంగ
పూర్వపు ధరాధినాథులపోల్కి శాస్త్రపద్ధతిగ మంత్రవిదులైన బ్రాహ్మణాగ్ర
ముఖులతోనంతట వసిష్ఠమునివరేణ్యుఁ డాచరించె సభాపూజనాదికంబు.

వ. తదనంతరంబు ఋత్విక్ప్రముఖులతో వశిష్ఠమహర్షి పవిత్రపాణులై కుశాక్షత
ఫలపుష్పదక్షిణాతాంబూలాది మంగళద్రవ్యపూర్ణ పాత్రలధరించి మంత్రపఠనం
బొనరించుచు సభాపూజనపూర్వకంబుగా నంకురారోపణంబొనరించి వేదికాంత
రంబున సకలనదీసముద్రోదకపూర్ణ కుంభముల బ్రతిష్ఠించి విష్వక్సేన
పూజనంబును సర్వదేవతాహ్వానపూర్వకంబుగా పుణ్యాహవాచనంబులు
గావించి తదీయపూర్ణకుంభంబులు నవరత్నంబులును సువర్ణంబును
నవధాన్యంబులును సర్వౌషధీలతలును కాశ్మీరమలయజ కర్పూర మృగమద
ప్రముఖ సుగంధద్రవ్యంబులును లాజాక్షత సుమంబులతో విధ్యుక్తవిధానముగ
పూజించి దేవతాసామ్రాజ్యమందు దేవేంద్రుని వసువులభిషేకించినవిధంబున
దివ్యరత్నపీఠంబుల సుఖాసీనులైయున్న సీతారాముల బ్రథమమున వసిష్ఠ
వామదేవ జాబాలి కాశ్యప కాత్యాయన సుయజ్ఞ గౌతమ విజయులను
మహర్షులును పురుషసూక్తాది ప్రోక్షణమంత్రంబుల పఠించుచు సర్వనదీ
సముద్రోదకంబుల నభిషేకించిన నవంతరంబ క్రమంబున వేదవేత్తలగు
బ్రాహ్మణోత్తములును మహారాజపుంగవులును మంత్రిప్రముఖులును కన్యకా
రత్నములును శంఖపాత్రంబులతో నభిషేకించి రనంతరంబ

సీ. తోయజప్రభవుండు తొల్త గన్నసువర్ణ చిత్రరత్నములతో సృష్టిచేసి
మనువున కలమి సామ్రాజ్యాభిషేకంబు గావించినద్దాన ఘనతవెలయు
నది మొదలుగ తదీయాన్వయులగు మహీపాలులెద్దానినే ప్రాజ్యపూజ్య
రాజ్యాభిషిక్తులై రాజిల్లిరట్టి ప్రభావంబుతో రవిప్రభలనొప్పు
దివ్యరత్నకిరీటంబు త్రిభువనజనుల ప్రజలు సంతోషభరితులై భక్తిప్రపత్తు
లాదరింపుచు సేవింప వంశమణిమహాసనమునందు నుంచి రయ్యార్యవర్యులు.

గీ. వేడ్కదరుణోత్త కల్పోక్తవిధిగ మంత్రపూతమైయొప్పు తత్సభాంబుజుల తలకి
రీటరాజంబు నటమహర్షిప్రముఖ్యులంత నభిషేకమొనరించి రతిముదమున.

వ. తత్సమయంబున సభికులెల్లరు జయజయధ్వానములొనర్చుచుండ దేవదుందుభుల ఘోషణంబులు భూమ్యంతరిక్షంబులనిండి భోరుకొల్ప వియచ్చర భామినుల లాస్యంబులు సెలంగ నంతరిక్షంబునుండి నందనోద్యాన సంభవంబులగు మందార పారిజాత కల్పప్రసూనంబుల సోనవానలు గురిపించుచుండ మంత్రవిదులు మంత్రపఠనంబు సేయుచుండ నభిషేకించి దివ్యాంబరాభరణ సుగంధగంధ పుష్పాద్యలంకృతులాచరించి సింహాసనాసీనులగావించుటయు నంత

సీ. శ్రీరమామణితోడ జెలువొందు శ్రీవిష్ణుదేవుని విధమున త్రిభువనైక
మోహనాకారుడై ముదమున నలువొందు సీతాసమేతుడౌ శ్రీరఘుపతి
సంపూజ్య సామ్రాజ్య సార్వభౌమపదంబు నంది మేల్ రత్నసింహాసనమున
నలర వసిష్ఠమహర్షి రత్నకిరీట మంతరాముని శీర్షమందునుంచె
తోడరి ఛత్రంబుబట్టె శత్రుఘ్నుడెలమి చంద్రసంకాశ వాలవ్యజనము లర్క-
తనయుడు విభీషణుండు మోదము ననుభయ పార్శ్వముల నిల్చివీవ వైభవ
మెసంగ.

క. శతమఖుడు తప్తకాంచన శతపుష్కరమాలికయును సలలిత నానా
ద్భుత రత్నఖచిత ముక్తాంచిత హారమునంపె ననిలుని చే రామునకున్.

వ. అంత సదస్యంబున విప్రోత్తములు శుభాశీర్వచనంబులొనర్చుటయు సువాసినీ జనంబులు మంగళహారతులిచ్చుటయు తత్పట్టాభిషేకసమయమున

సీ. అభినవరాజ్యరమాభిరాముండైన శ్రీరామచంద్రుడాశ్రితులకెల్ల
నభిమతార్థముల నత్యంతహర్షంబున నొదవలేకనొసంగె కోట్లధనము
బ్రాహ్మణోత్తములకు పాడియావుల నూరువేలను శతమదవృషభములను
నానావిచిత్ర రత్నసువర్ణ భూషణాంబర ధనాదులొసంగె భక్తితోడ
సకలవిద్యావినోద ప్రశస్తులైన కవివరేణ్యుల నటకుల గాయకులను
వేణువీణామృదంగాది వివిధవాద్యకోవిదుల దన్పెబహుమతుల్ కోర్కెలలర.

వ. తదనంతరంబ భరతశత్రుఘ్నులును సుగ్రీవవిభీషణులును మంత్రివర్యులును సభాసదులెల్ల రత్యంతవినీతులతో స్రక్చందన తాంబూల మధుపర్కంబులతో సంపూర్ణ దక్షిణ ఫలప్రదానంబులతో గౌరవించి రనంతరంబ శ్రీరామచంద్రుడు సింహాసనంబునుండి దిగివచ్చి సభ్యులయెదుట కృతాంజలిబంధురుడై నమస్కారపూర్వకముగా నిట్లనియె మహాశయులారా! నాయందాదరాభిమానములతో మీరందరు పితృపితామహంబైన సామ్రాజ్యమునకు నన్ను పట్ట

భద్రుని గావించితిరిగాన మీకెల్లరకు కృతజ్ఞతాపూర్వక వందనము లర్పించుచున్నాను మరియు యీసర్వసామ్రాజ్య రక్షణదురంధరతకు సంపూర్ణ బాధ్యుడనై ధర్మయుక్తముగను ప్రజానురంజకముగను రాజ్యపాలన మొనర్ప గలనని మీయందరిసమక్షమున భగవత్సాక్షిగా ప్రమాణ మొనర్చుచున్నాడ నని విన్నవింప ప్రజలెల్ల రేకగ్రీవముగా శ్రీరామచంద్రసార్వభౌమునకుజై యని నినాదంబులొనరించిరనంతరంబ చాతుర్వర్ణ ప్రజలకు యిష్టమృష్టాన్నములతో సమారాధనంబులు ప్రారంభించిరంత

సీ. చంద్రికాధవళిత శాల్యోదనంబులు మిసిమిబంగరుచాయ మించుసూప
మమృతోపమాన దివ్యరసాయనంబులు కమ్మని శాకపాకములు తియ్య
చారులు భక్ష్యభోజ్యములు చిత్రాన్నముల్ వడలప్పడములును వడియములును
పాయసాన్నంబులు బహువిధ పూపముల్ పాల్పెరుగులు మేటిఫలరసంబు
లాదిగాగల వివిధపదార్థయుక్త షడ్రసోపేతమైన భోజనములెలమి
బ్రాహ్మణాది సమస్తవర్ణముల ప్రజల కధికసంతృప్తిగా నిడిరద్భుతముగ.

వ. ఇట్లు శ్రీరామచంద్రుని పట్టాభిషేక మహోత్స వాలోకనతత్పరులై యేతెంచిన వివిధ దేశ నగర జానపద పౌర జనంబులకెల్లర తగుమర్యాదలతో నిష్ట మృష్టాన్న స్రక్చందన తాంబూల వస్త్రభూషణాద్యమూల్య సత్కారంబుల సంతృప్తులగావించి రాసమయంబున

గీ. అర్కరస్మిప్రతీకాశమైన హేమరత్నభూషిత దివ్యహారము రామ
భూవిభుం డాదరమున సుగ్రీవుకంఠసీమన నలంకరించె దాక్షిణ్యబుద్ధి.

మంజరి :

అనర్ఘవైఢూర్య వజ్ర కనకమయాంగదముల సభలోనన్
మనమున యోచించి యంగదున కభిమతముగ నొసగె ప్రియమునం
బ్రవిమల మణిఖచిత ముక్తాహారము నవనిజ చేనిడినం
బవనజున కొసంగనామె విభునిం బరికించుచు హర్షమునన్.

వ. తదనంతరంబ

సీ. అవనిజ నిజకంఠ హారంబుదిగిచి తత్సభలోన కపులనందరిని గనుచు
సారెసారెకు నిజేశ్వరువంక గనునంత మదిరఘుపతి తదింగితమెఱింగి
జనకనృపాలాత్మజనుగాంచి యిట్లను సాధ్వి నీవెవ్వరి శౌర్యవీర్య
సాహాయసంపద సంతోషమందితి వమ్మహాత్మునకిమ్ము హారమనిన
నంతవైదేహి తద్రత్నహారమప్పు డనిలసుతు కంఠమునవైవ నాతడొప్పె
శశికిరణ గౌరవర్ణ భాస్వచ్ఛితాభ్ర పటల సంపన్నమగు శైలపతియువోలె.

వ. మరియు శ్రీరామచంద్రుడు తనకెంతయు సహాయకారులైన వానర భల్లూక వీరులగు మైందద్వివిద నల నీల గజగవయ గవాక్ష సుషేణ జాంబవత్ప్రముఖుల కెల్లరకును విభీషణప్రభృతులైన రాక్షసవర్గంబునకును యథాన్యాయమున బహువిధ దివ్య వస్త్ర భూషణాది బహుమతుల గౌరవముగా సంతోష పూర్వకముగా బహూకరించె. ఇట్లు వానరులెల్లరు వివిధసత్కారముల సంతృప్తులై యయోధ్యాపుర వైభవంబును శ్రీరామచంద్రుని రాజ్యపరిపాలనా విధానంబున కెంతయు పరమానందభరితులై కొన్నిదినములు నివసించి శ్రీరాముల విప్రయోగమున కెంతయు చింతిల్లుచు యెట్టకేలకు వానర సైన్యంబులతో సుగ్రీవాదులు తమతమపత్నులతో కౌసల్యాదిరాజమాతలకును శ్రీరామాదిసోదరులకును వారిధర్మపత్నులకును నమస్కృతులాచరించి వారల యనుమతంబున శ్రీరామనామ సంస్మరణ పారవశ్యంబున నుప్పొంగుచు పునర్దర్శనమర్థించుచు కిష్కింధానగరంబునకరిగి రనంతరంబ

ఉ. శ్రీరఘురామభూవిభునిచే పరిపూర్ణ మనోరథార్థముల్
గౌరవపూర్వకంబుగ జగన్నుతుడైన విభీషణుండు స
త్కారములెల్ల నొంది ప్రమదంబున తత్కులదైవతంబు దా
గోరి పరిగ్రహించి రఘుకుంజరు నానతినేగె లంకకున్.

గీ. అరిజనవిమర్దనుండు మహాయశస్వి ప్రకటితౌదార్యనిధియైన రామవిభుడు
పరమసంతోషమున నిజభ్రాతృవర్గమెల్ల గొలుచంగ సామ్రాజ్యమేలుచుండె.

వ. ఇట్లు శ్రీరామచంద్రుడు ప్రియసోదరులైన భరతలక్ష్మణ శత్రుఘ్నులు తన కనుసన్నల సర్వకార్యనిర్వహణ దురంధరులై సేవించుచుండ పూర్వపు చక్రవర్తుల కంటెన నేకరెట్లు ప్రజానుకూల్యోచిత ధర్మమార్గంబున, దుష్ట శిక్షణంబును శిష్టరక్షణంబును జేయుచు స్మృత్యనుకూల దండన విధానంబున మంత్రుల సాహచర్యంబుతో జారచోరాదుల వలనను మారీదుర్భిక్షాది

యీతిబాధలవలనను ప్రజలకెట్టి యుపద్రవములు గలుగనీయక రామరాజ్యమే యాచంద్రార్కస్థాయిగా నుండవలయునని ప్రజలు వేనోళ్ళ పొగడుచుండ పాలించుచు కైంకర్యలక్ష్మిని పెంపొందించు లక్ష్మణుని గనుంగొని యిట్లనియె.

మ. మనపూర్వార్జితమైన యీసుతల సామ్రాజ్యంబునందీవు నా కును జేదోడుగ యౌవరాజ్య పదముక్ గొన్మంచు శ్రీరాము డ ల్లన సౌమిత్రిని జీరిపెక్కుగతులం లాలించి బోధించినన్ వినకున్నన్ నియమించె నంత భరతున్ వేయౌవరాజ్యంబునన్.

వ. తదనంతరంబ

గీ. పార్థివశ్రేష్ఠుడగు రామభద్రుడౌనర పౌండరీ కశ్వమేధాది బహువిధముల యజ్ఞముల నేకము లొనర్చి యమరవరుల బ్రాహ్మణుల దృప్తినొందించె ప్రమద మెసగ.

గీ. దశసహస్రవర్షంబులు దాశరథియు పూజ్యరాజ్యంబు ప్రాపించి భూరిదక్షి ణల సదస్యుల పూజించి న్యాయమున శతాశ్వమేధంబులొనరించె నతులదీప్తి.

వ. ఇట్లు మహావైభవోపేతంబై జెలువొందు రామరాజ్యంబునందు

సీ. వైధవ్యదుఃఖ దుర్వ్యథితకాంతలు లేరు సర్పభయార్తులౌ జనులు లేరు
బహుళ రోగగ్రస్త ప్రజలెందు గనరారు దస్యులవలన బాధలును లేవు
బాలపైతృక కర్మపరులు లేరెయ్యెడ దారిద్ర్య పీడితాత్ముకులు లేరు
దనరవెయ్యెడ ననర్థకములు ప్రజలలో నన్యోన్యవైరంబు లరయరాదు
పుత్ర పౌత్రాయురారోగ్య భోగభాగ్య భరితులై ప్రజలెల్లరు పరమధర్మ
తత్పరత రామచంద్రుకథా సుధారసాప్తి సుఖయింతు రతులితోత్సాహలీల.

ఉ. రామవిభుండు సౌఖ్యముగ రాజ్యము నేలెడు వేళ తత్ప్రజా
స్తోమము హృష్టపుష్ట పరిశోభిత హృత్పరిపుల్ల పద్మమై
రామకథాప్రసంగము పరస్పరముత్సుకతన్ వచించుచున్
రామమయంబుగా కడువిరాజిలె నెంతయు లోకమెల్లెడన్.

సీ. నిత్యపుష్పఫలాళి నెనసె వృక్షలతాళి వర్షించును సువృష్టి వారిదములు
కడుసుఖస్పర్శ లేగాడ్పులు వీతెంచె వివిధసస్యాళిచే వెలసెధాత్రి
బ్రాహ్మణాది సమస్తవర్ణ ప్రజాతతి స్వస్వధర్మానురూపమున లోభ
వర్జితులై యనవరతం బనృతంబాడుటెరుగక సకలకళ్యాణగుణ వి

రాజితుండైన శ్రీరఘురామునందు నిరుపమాన మహాభక్తి నిష్ఠ సర్వ
సౌఖ్యమున నుల్లసిల్ల భాస్వద్విభూతి రామచంద్రుండు సర్వసామ్రాజ్యమేలె.

గీ. దశవర్ష సహస్రంబులు దశవర్ష శతంబు ధర్మతత్పరుడగుచున్
దశదిశల యశస్స్ఫూర్తిన్ దశరథరాట్తనయుడేలె తమ్ములుగొలువన్.

గీ. ధన్యము యశస్కరము శుభదాయకంబు పరమపావన మాయు ప్రవర్ధనంబు
విజయసంప్రాప్త మఖిలభూభుజులకెందు మించివాల్మీకి దీనిరచించె దొలుత—

క. ఏ మానవవరులీ శ్రీరామునిచారిత్ర మధిక రక్తిన్ వినినన్
ప్రాముఖ్యముగ పఠించిన భీమకలుషజాలమడగి మేలుఘటిల్లున్.

సీ. పుత్రకాంక్షితులు సత్పుత్రులగాంతురు ధనవాంఛితులకబ్బు ధనచయంబు
వైరివర్గంబును వధియించి రాజ్యంబు వడయగల్గుదురు భూపాలవరులు
రాముని శివలభరతునిగన్నతల్లుల కరణిని సతులు దీర్ఘాయులైన
సత్పుత్రకుల గాంచి సంతోషభరితులై చెలువొందుదురు గాత క్షితితలమున
శ్రీరఘూత్తము పట్టాభిషేక చరిత మధికశ్రద్ధా సమన్వితులై పఠింప
నెంత దుర్ఘటకార్యంబులేనిగడచి భూరిసౌఖ్యానుభూతితో బొదలుచుంద్రు.

క. పరమపవిత్రంబగు రఘువరుల చరిత్రమును వేడ్కపఠియించినచో
సురసిద్ధసాధ్య విద్యాధరముఖ్యులు హర్షమునను బొదలుదు రెలమిన్.

సీ. సద్భక్తి శ్రీరామచరితంబు వినిన రజస్వలాస్త్రీ గాంచు సత్సుతులను
మునసి ప్రవాస విముక్తులై శ్రేయంబు వడయుదురానంద భరితులగుచు
గృహరాజములలోన గ్రహపీడలునులేక చెలువొందుదురు ప్రజల్ క్షేమముగను
సకలసంపదలతో సత్పుత్రకులతోడ నారోగ్యభాగ్యంబు లందగలరు
పరమవిజ్ఞాన పూర్ణులౌ బ్రాహ్మణప్రవరులచే రామచరితంబు భక్తిపూర్వ
కముగ శ్రవణంబుచేసిన కలుషమెల్ల బాసి ధన్యాత్ములగుదురు ప్రజలుధాత్రి.

శా. శ్రీమద్రామనృపాల కాంచనకనచ్చేలా కృపాశీల ని
స్సీమానంతయశోవిశాల కలుషశ్రేణీవిపాలా రిరా
ట్సీమారణ్యదవానలా బుధజనస్తుత్య ప్రభాజాల సం
గ్రామాభీల వినీలనీరద నిభాంగాశ్యామలా కోమలా.

## గద్యము

ఇయ్యది శ్రీసీతారామచంద్రప్రభు కృపాలబ్ధ కవితాకౌశల కౌండిన్యసగోత్ర
పవిత్ర శేషభట్టరన్వయ సంజనిత శ్రీ వేంకటాచార్యపౌత్ర నృసింహాచార్యపుత్ర,
కృష్ణమాచార్యదత్తపుత్ర, వేంకట శ్రీనివాసాచార్యప్రణీతంబైన
శ్రీ మదాంధ్ర శ్రీనివాస రామాయణ ప్రబంధమున

యుద్ధకాండము సంపూర్ణము

సర్వేజనాః సుఖినోభవంతు

